# తెలుగు సాహిత్యంలో పేరడీ

ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖనుంచి
1990 లో పిహెచ్.డి. పట్టం పొందిన సిద్ధాంత గ్రంథం

డా॥ వెలుదండ నిత్యానందరావు

**TELUGU SAHITHYAM LO PARODY**

by Dr. V Nithyananda Rao
Lecturer, Dept of Telugu, University College
for Women, Koti, Hyderabad-500 195.



First Edition : 1994

Copies : 1000

Rs 75-00

for Libraries : 125-00

For Copies :

Smt G Shyamala Ramchander Rao
3/C, Old Santosh Nagar Colony,
Saidabad, Hyd - 500 659.
Phone 249850

Cover Design by :

Finishing Point
Advertising & Designing
H No 308, Sri Datta Sai Complex,
1-1074, R T C X Road, Hyd-20.
Phone : 611488

Printed at :

Padmavathi Art Printers
1-1-517/B/1, New Bakaram,
Gandhinagar, Hyd - 380
Phones . 611413, 600547.

---

Published with the financial Assistance of Telugu University
Hyderabad

# అంకితం



**Dr. G. GOVERDHAN**
M.A., Ph.D., L.L.B.
Municipal Commissioner
NALGONDA.

అంతుపట్టని అనారోగ్యంతో అలుపెరుగని
పోరాటంలో త్వరగా విజయం పొందాలనీ
నిత్యానందంగా జీవించాలనీ ఆకాంక్షిస్తూ
మంచిమనసున్న మిత్రునకు సాహిత్యానురక్తునకు

## గోవర్ధనునకు

ఆచార్య ఎస్వీ. రామారావు
తెలుగు విభాగం,
ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

6-3-23/2, న్యూ బోయిగూడ,
సికింద్రాబాదు-500 380.
ఫోను : 822728
తేది : 26-3-1994

# పరిశోధన పాటవం

"పేరడీ అంటే వికటానుకరణం"

"ఒక మాతృకకు అధిక్షేపాత్మకమైన, హేళనాత్మకమైన, హాస్యాత్మకమైన విషయాంతరంతో కూడిన అనుకరణమే పేరడీ."

"మాతృకలోని వస్తువుకూ రచనా పద్ధతికీ మధ్య ఉండే సమన్వయాన్ని సమతౌల్యాన్ని భగ్నం చేయడమే ప్రధానంగా పేరడీలో జరిగే పని "

ఇంత సుస్పష్టంగా సుబోధకంగా పేరడీ తత్త్వాన్ని విశదీకరిస్తూ కొనసాగిన సిద్ధాంతగ్రంథం "తెలుగు సాహిత్యంలో పేరడీ " నిర్దిష్టత, నిర్దుష్టత ఈ గ్రంథం ప్రామాణికతకు నిదర్శనాలు. డిగ్రీల కోసమైన పాండిత్యం మాత్రమే వన్నెకు వచ్చే ఈ కాలంలో అభిరుచీ పరిశోధన పాటవం నిండివున్న సిద్ధాంతగ్రంథాలు క్వాచిత్కం అభిరుచి ఉన్నా అవగాహనారాహిత్యంతో వాక్యలయ, ప్రతీకలు, సంకేతాలు మొ॥ వాటికి అర్థాలు తెలియకుండానే వాటిపై సిద్ధాంతవ్యాసాలు వెలువరిస్తున్నారు నేటి పరిశోధక విద్యార్థులు.

డా॥ వెలుదండ నిత్యానందరావు అందుకు అపవాదంగా సమగ్రమైన అవగాహనతో స్పష్టమైన అవలోకనతో తెలుగు పేరడీలను సంవీక్షించాడు ప్రాచీన అధునాతన సాహితీ ప్రక్రియల్లో ఉన్న పేరడీలను, పేరడీ రచయితలను సునిశితంగా పరామర్శించాడు

ఇంతకుముందు పేరడీ గురించి ఒకటి రెండు గ్రంథాలు వెలువడినా అవి దాని సమగ్ర లక్షణాలను నిరూపించలేదు [illegible]రావు నూత్న గవేషణంతో వివేచనాత్మక విశ్లేషణ కావించాడు

మొదటి అధ్యాయంలో పేరడీ స్వరూప స్వభావాలతో పాటు ఇతర ప్రక్రియలతో నున్న సంబంధం పరామర్శింపబడింది. వివిధ రకాల పేరడీలను వర్గీకరించి వాటిని నామ్నీకరించటంలో పరిశోధకుని ప్రత్యేకత ద్యోతక మవుతుంది. ప్రాచీన యుగంలోని క్రీడాభిరామం, తెనాలి రామకృష్ణుని చాటు పద్యాలలోని పేరడీ లక్షణాలను పేర్కొని, చంద్రరేఖా విలాపంలోని విక టత్వంలో ఆకృతి దిద్దుకున్న 'పేరడీ'తనాన్ని సుస్పష్టం చేశాడు

ఆధునిక యుగంలో అభాగ్యోపాఖ్యానం మొదలుకొని అత్యాధునికమైన దండకాలు, సుప్రభాతాలవరకూ నవల, కథ, నాటకం మొదలైన ప్రక్రియల లోనూ వెలువడిన పేరడీలు ఆమూలాగ్రం సమాలోచితమైనాయి. "ఇవి కూడా పేరడీలే" నంటూ ప్రేమలేఖలు, వ్యాపార ప్రకటనలు, సమీక్షలు, సన్మాన పత్రాలు పేర్కొనటం ఎంత సముచితంగా వుందో శుక్లపక్షాది రచనలను "ఇవి కావు పేరడీలు" అంటూ నిరూపించటం అంత సమయోచితంగానూ వుంది.

పేరడీ కర్తలకు నిశితపరిశీలనాశక్తి, రచనా ప్రావీణ్యం, ధారణ అత్యవ సరం. "పారడీ వ్రాయడమంటె ఏమీ తేలికైన పనికాదు దానికి, శబ్దశక్తి యొక్క రహస్యములు, పద్యరచనలో వున్నటువంటి మెళుకువలు బాగా తెలిస్తే కాని పారడీ వ్రాయడం సాధ్యపడ" దని విశ్వనాథవారి అభిప్రాయం. ఏదో ఒక ప్రత్యేకమైన శైలీ విన్యాసం వున్నవారి రచనలే పేరడీకి గురవుతాయి. అందుకే కాళోజు శ్రీశ్రీ విశ్వనాథ ప్రభృతుల రచనలకు పేరడీలు ఎక్కువగా గోచరిస్తాయి శ్రీశ్రీ శైలిలో వచన కవితల్లో సంప్రదాయ భావాలు, విశ్వనాథ మార్గంలో పద్యాల్లో విప్లవ భావాలు ప్రకటిస్తూ ఎవరైన పేరడీ చేస్తే బావుండేది. (పుట 37) అన్న పరిశోధకుని సూచన గమనార్హమైనది.

విద్యార్థి దశలో నిత్యానందరావులో చిగురెత్తిన పరిశోధన ప్రవృత్తి "విశ్వ విద్యాలయాల్లో తెలుగు పరిశోధన" సంకలన గ్రంథంలోను, "చంద్రరేఖా విలాపం-తొాలి వికట ప్రబంధం" అన్న ఎంఫిల్ సిద్ధాంత వ్యాసంలోను వికసనం చెందింది ప్రస్తుత పరిశోధన నా పర్యవేక్షణలో కొనసాగటం వల్ల అతనిలోని చిత్తశుద్ధిని, పరిశోధన శీలాన్ని నేను సన్నిహితంగా ఎరుగుదును. సిద్ధాంత గ్రంథ రచన తర్వాత లభ్యమైన చిలకమర్తి పేరడీలను కూడా ఇందులో

చేర్చడం అతని నిరంతర జిజ్ఞాసకు నిదర్శనం ఎం.ఫిల్ సిద్ధాంత వ్యాసానికి కూర్చిన అభిప్రాయంలో నేను ఆకాక్షించినట్లుగానే ఈ పరిశోధన గ్రంథంలో వెలుదండ విమర్శనాపాటవం ప్రస్ఫుటంగా గోచరిస్తున్నందుకు అతణ్ణి మనసారా అభినందిస్తున్నాను అయితే, ఇటువంటి గ్రంథంలో అచ్చు తప్పులు దొరలకుండా జాగ్రత్తపడివుంటే బాగుండేది

సహృదయులు, సాహితీరసజ్ఞులు అయిన డా॥ జి. గోవర్ధన్ గారికి ఈ కృతిని సమర్పిస్తున్నందుకు నిత్యానందరావును మరింతగా అభినందిస్తున్నాను. డా॥ గోవర్ధన్ అమృతహృదయులు స్నేహశీలి. గురువర్యులు డా॥ సి నారాయణరెడ్డి కృతులలోని సంప్రదాయ ప్రయోగాల గురించి పరిశోధన చేసి తెలుగు శాఖ నుంచి డాక్టరేట్ పట్టం పొందారు ఆయన ఈనాడు అనుకోని అనారోగ్యానికి గురి కావడం సాహితీమిత్రులందరికీ బాధాకరమైన విషయం. అహ్లాదకరమైన ఈ కృతిని అందుకొని డా॥ గోవర్ధన్ త్వరలో అనారోగ్యం నుంచి విముక్తిపొంది స్వస్థత చెందాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను

డా॥ అక్కిరాజు రమాపతిరావు
డిప్యూటి డైరెక్టర్
తెలుగు అకాడమి
హిమాయత్‌నగర్
హైదరాబాదు

140/B ఓల్డ్ సంతోష్‌నగర్ కాలనీ
సైదాబాదు
హైదరాబాదు 500659
ఫోను : 239776
తేదీ : 10-3-1994

# నిత్యానందీయం

మా ఇంట్లో 'సత్యానందీయం' అని ఒక పుస్తకం ఉంది. బహుశా అది మా నాన్నగారి సేకరణ అయి ఉంటుంది. సత్యానందస్వామి రచించినందువల్ల సత్యానందీయమైంది అది అద్వైతాన్ని గూర్చిన గ్రంథం అది ఎప్పుడు నా కంట పడ్డా చదువుదామని ప్రయత్నిస్తాను కాని ఒక పేజీ కూడా పూర్తిగా చదవటం కుదరదు అధ్యాస, మాయ, రజ్జుసర్పం, జీవాత్మ పరమాత్మలు అర్ధం కావడం అంత సులభం కాదు కాదా! అంతా ఒక్కటే అంటే ఏం తెలుస్తుంది? పోలిక వుంటే కొంత అర్ధం చేసుకోవచ్చు. 'అద్వైతమేవాఽభయం' అంటే కొంత భయంగానే ఉంటుంది. అర్థం కావడం కష్టం.

ఇప్పుడీ పుస్తకం 'నిత్యానందీయం' అర్థం చేసుకోవడం సులభం. ఇది ద్వైతం రెండు ఉంటే కాని ఒకదానితో ఒకటికి ఏమి సంబంధమో తెలుసుకోలేం. అదీకాక అప్పుడు కాని హాస్యం ఉప్పతిలదు. అనుకార్యుడు - అనుకర్త ఉంటే కాని అందం తెలియదు.

తెలుగు సాహిత్యంలో 'పేరడీ'ని గురించిన ఆలోచన ఈ గ్రంథంలోని వస్తువు పేరడీ అనే పేరు మాత్రం ఇంగ్లీషు కాని 'పేరడీ' తెలుగులో చాటువుల కాలం నుంచీ ఉండనేఉంది అని డా॥ నిత్యానందరావు సిద్ధాంతీకరించడం ముచ్చటగా ఉంది అసలు మానవ స్వభావంలోనే పేరడీ అంతర్గతంగా ఉంది. చిన్న పిల్లల వినోద ప్రస్తావనలలో ఒక ఆభాస కథను పెద్దవాళ్ళందరూ గమనించే ఉంటారు. "పాపం, ఒక ముసలి అవ్వ ఉంది ఆమెకు కళ్ళు సరిగా కనపడవు.

ఎలాగో కష్టపడి దారాన్ని సూది బెజ్జంలోకి ఎక్కించి తన పాతచీర మాసికలు కుట్టుకోవడానికి పూనుకొంటె అ సూది కాస్తా దారం నుంచి జారి ఎక్కడో పడి పోయింది!" ఇదే కథ ఇక్కడికి ఆగిపోతుంది చెప్పేపిల్లడో పిల్లదో ఈ కథ నిక్కడికి ఆపేస్తారు ఆ వినే పిల్లాడో పిల్లదో ఊఁ ఊఁ తర్వాత అంటారు. అప్పుడు కథ చెప్పేవాడు ఊ ఊ అంటే వస్తుందా అంటాడు ఇక తర్వాత శ్రోత ఏ మాట అంటే ఆ మాటే అంటుంటాడు 'నా కోపంవస్తున్నది, నిన్ను తంతాను' అని శ్రోత అంటే, మళ్ళీ ఈ వాక్యాన్నే పూర్తిగా తాను కూడ పునరుక్తం చేసి, అంటే వస్తుందా అని కలుపుతాడు ఇదొక వినోదం వక్తకు చిలిపితనం, 'శ్రోతకు ఉడుకుమోత్తనం. అంటే ఆ శైశవం మానవ చైతన్యంలోనే పేరడీ ఉందన్న మాట!

అవతలవాడు చేసిన పనిలో 'సొడ్డు' పెట్టడంలో ఏదో ఆత్మానందం. కొంటెతనం చూపడంలో కొంతంత సంబరం. మాటస్థాయిలోనైతే 'మిమిక్రి' అంటారనీ, రాతస్థాయిలోనైతే 'పేరడీ' అంటారనీ నిత్యానందరావు లక్షణ నిర్దేశం చేయడం బాగుంది అవతల వ్యక్తిని వెక్కిరించడానికి అతడిలో అవలక్షణాలేవీ ఉండనక్కరలేదు ఇవతల వ్యక్తిలో హాస్య ప్రవృత్తి ఉంటేచాలు - పేరడీ రెడీ అవుతుంది.

అమూలకం పేరడీ కాదు మూలం ఏదో ఒకటి తప్పక ఉండి, దాన్ని హాస్యస్ఫోరకంగా అనుకరించడమే పేరడీ అని ఎన్నో ఉదాహరణోదంతాలతో ఈ గ్రంథంలో పెద్ద సాహిత్య తార్కిక చర్చ చేశాడు నిత్యానందరావు. రూప విక్రియ, భావ విక్రియలనే రెండందాలా స్థూలంగా పేరడీ రూపొందుతుందని రకరకాల ఉదాహరణల ద్వారా నిష్కర్ష చేశాడు.

ఏ ప్రక్రియకు ఆ ప్రక్రియలోనే పేరడీ వెలువడుతుందని చక్కగా చెప్పాడు నిత్యానందరావు కవిత్వానికి పేరడీ విషయంలో పెద్ద పీట వేశాడు. అది సబబే. ఏమంటే, వచన ప్రక్రియలను భావ సంబంధిగా హాస్యానుకరణం చేయవలసిందే కాని, రూప సంబంధిగా చేయడానికి వీల్లేదు. నాటకానికి పూర్తిగా పేరడీ నాటకం రాయడం కష్టం నాటక రచనలోని తత్కాలీనమైన అపహాస్య ధోరణులను, మేధో దారిద్ర్యాన్ని, సృజనాత్మక ప్రతిభా రాహిత్యాన్ని, ఉపజ్ఞా

రహితను, మూసకట్టు పాత్ర, సంభాషణ, సన్నివేశ సందేశ నినాద అనౌచిత్యాల్ని వెటకారం చేయాల్సిందే తప్ప పద్యానికి పద్యంగా పేరడీకరించినట్లు రూపకానికి పేరడీగా రూపకం నిర్మించడం సాధ్యం కాదుకదా! అట్లాగే కథకు కథ, నవలకు నవల రావడం కూడ కష్టమే. కవితకు 'ఆకృతి లాఘవం' సౌకర్యం కాగా వచన ప్రక్రియలకు 'నిడివి' సమస్యగా కూర్చుంటుంది.

ఏమైనా ఈ థీసిసులో సృజనాత్మకమైన సమన్వయం, ఆలోచన లోచనాలు కనపడతాయి. అయితే, ఎక్కడన్నా ఆరిందాతనం కూడా చూపుతుంటాడు నిత్యానందరావు. అనుభవం మీద అవన్నీ సర్దుకొనిపోతాయి ముందుతరాలలో తనదైన కృషికి తగిన గుర్తింపు తెచ్చుకుంటాడని ఇతడి విషయమై ఆశించవచ్చు

తెలుగు సాహిత్యంలో శతాధికంగా పేరడీ లక్షణాలున్న రచనలు సేకరించడం, విశ్లేషించడం సామాన్యమైన పని ఏమీకాదు. అన్ని ప్రక్రియలకు సంబంధించిన పేరడీ స్ఫోరక రచనలన్నీ సేకరించాడు. ఇప్పటివరకు తజ్ఞలోకం పేరడీలుగా సంభావిస్తున్న కొన్ని రచనలను పేరడీలు కావని నిత్యానందరావు సోపపత్తికంగా నిరూపించడం బాగుంది అధిక్షేపానికి విప్రతీపానికి వ్యాజధోరణికి పేరడీకి ఉండే సాదృశ్య భేదాలను చూపి, ఏవి పేరడీలో ఏవి కావో నిరూపించాడు నిత్యానందరావు. లబ్ధ ప్రతిష్ఠుల దగ్గర నుంచి కౌమార వర్ధిష్ణువుల వరకూ వారి పేరడీ రచనలు సేకరించి గుణ దోష నిర్ణయం చెయ్యడం ఇతడు చేసిన పేరడీతత్త్వ నిరూపణ పరిశ్రమలోని ఆర్జవాన్ని ఆవిష్కరిస్తున్నది

ముగింపుగా ఒక మాట. ఈతడి రచన చదివించే గుణం కలది హాయిగా సాగుతుంది మొదటినుంచి చివరి వరకూ. చదవడం పూర్తి చేశామా హసన్ముఖులమవుతాం ఒక రచన చదవడంవల్ల అంతకంటే మనం కోరుకొనేదీ సాధించవలసిందీ మరేముంది? సత్యానందీయంతో మొదలుపెట్టి నిత్యానందీయంతో ముగించడం పేరడాక్సికల్ కావచ్చు కానీ పేరడీమాత్రం కాదు. డా॥ నిత్యానందరావు కివే నా శుభాకాంక్షలు త్రీచీర్స్!

# ప్రస్తావన

ఆబాలగోపాలానికి ఎంతో ప్రీతిపాత్రమైంది హాస్యం ఈతిబాధలు, కష్టనష్టాలు, కలహాలు, కన్నీళ్ళు కాసేపు మరచిపోయి ఉత్సాహం నింపుకొని తిరిగి జీవన సమరంలోకి దూకేందుకు శక్తినిచ్చే దివ్యౌషధం అది చమత్కారం, అధిక్షేపం, వినోదం, హేళన మొ॥ రకరకాల రూపభేదాలను 'హాస్యం' అనే పేర విస్తృతార్థంలో వ్యవహరిస్తున్నాం దానిలోని మరో ప్రముఖ విభాగమే 'పేరడీ.' మాతృకను తలపింపచేస్తూ చేసే అధిక్షేప వినోదానుకరణం పేరడీ.

పేరడీని గురించి పరిశ్రమించాలనే తలంపు ఇప్పటిది కాదు. డిగ్రీ రెండో ఏడు (1982) చదువుతున్నప్పుడే కలిగింది జరుక్‌శాస్త్రి వర్ధంతినాడు ఆయన పేరడీల గురించి 18 జూలై 1982 ఆంధ్రప్రభ దినపత్రిక సారస్వతానుబంధంలో ఒక వ్యాసాన్ని రాశాను. అప్పటికి ఆయన పేరడీలు కానీ, కథలు గానీ గ్రంథరూపంగా రానేలేదు. తెలుగు సాహిత్యంలో 'పేరడీ'పై సమగ్రమైన గ్రంథం రాయాలన్న సంకల్పానికి ఆనాడు బీజావాపం జరిగింది. 'రాజకీయ భాగోతం' పేర భాగవతం పద్యాలకు నా కార్టూన్ పేరడీలు 1983 డిసెంబర్‌లో 15 రోజులపాటు ఆంధ్రప్రభలో ప్రచురితమై ఎందరి ప్రశంసలనో పొందాయి. ఇది పేరడీపట్ల నాకున్న ఆసక్తిని పట్టుదలగా మార్చింది పై చదువులు చదువుకొంటూనే ఒక వంక పేరడీ ఎక్కడ కనిపించినా, తత్సంబంధమైన వ్యాసం కనిపించినా సేకరిస్తూ వచ్చాను ఆ ముడిసరుకంతా ఇప్పుడు బాగా ఉపకరించింది.

తెలుగులోని వివిధ సాహిత్య ప్రక్రియల్లో పేరడీ ఏ విధంగా కొనసాగిందో పరిశోధించడమే ఈ పరిశోధన లక్ష్యం. దాని కనువుగా మొదట 'పేరడీ లక్షణ పరామర్శ' చేశాను ఎలాంటి అనుకరణలు పేరడీలు అవుతాయో, ఎలాంటివి కావో సోపపత్తికంగా చర్చించాను పేరడీకి ఉండే ఇతర లక్షణాలు కూడ పరిశీలించాను. పాశ్చాత్య విమర్శకులు పేరడీని మూడు విభాగాలు చేశారు నేను వాటిని కలుపుకొని మరింత విస్తృత ప్రాతిపదికతో తొమ్మిది అంతర్వి

భాగాలు చేశాను. ఈ పరిశోధన గ్రంథం ద్వారా చేస్తున్న కొత్తప్రతిపాదనగా దీన్ని భావిస్తున్నాను.

సాధారణంగా ఏ తెలుగు సాహితీ ప్రక్రియను పరిశోధించినా అది ఆంగ్ల సారస్వత ప్రభావ జనితం అనుకోవడానికి అవకాశం ఉన్న పక్షంలో దాని పరిణామ వికాసాలను చెప్పడం తెలుగు పరిశోధకులకు అలవాటు. ఆంగ్ల సాహిత్యంలోని పేరడీ పరిణామ వికాసాల సమగ్ర సమాచారం సేకరించినప్పటికీ దీనిలో చేర్చలేదు. మనకు కావల్సింది ఆంగ్ల సాహిత్యంలో చెప్పిన ప్రక్రియా లక్షణాలు తప్ప ఆ సాహిత్యంలో వాటి పరిణామ వికాసాలు కావని నా భావం అంతేగాక వాటిని కుమారి సూరంపూడి సుధగారు 'జరుక్ శాస్త్రి పేరడీలు - ఒక పరిశీలన' అనే ఎం ఫిల్ పరిశోధన వ్యాసంలో పొందుపరిచారు.

ఇక ప్రాచీన సాహిత్యం, ఆధునిక కవిత్వం, నవల, కథ, నాటకం, జానపద సాహిత్యంలో పేరడీలను పరిశీలించాను చాలామంది అనుకొనేట్టుగా శుక్లపక్షాది ఖండ కావ్యాలు పేరడీలు కావని ఒక ప్రత్యేక ప్రకరణంలో సహేతుకంగా నిరూపించాను.

భావి పరిశోధకుల సౌకర్యార్థం నేను సేకరించిన పేరడీల వివరాలన్నీ కలిపి 'పేరడీ వాఙ్మయ సూచిక' తయారు చేశాను దీనిలో ఉన్న వాటికన్నా రెట్టింపు మిగిలిపోయి ఉండవచ్చునని, ఇది సమగ్రంకాదనీ సవినయంగా మనవి చేస్తున్నాను హాస్యవర్ధని (1875), హాస్య సంజీవని (1876), నవ్వుల మూట (1921), వినోదిని (1924), చిత్రగుప్త (1932), ఢంకా (1934), నవ్వులతోట (1934), ఆనందవాణి (1939), హాస్యప్రియ, హాస్యజ్యోతి లాంటి పత్రికలు చూడ్డానికి కూడ నేడు దొరకవు వాటిలో మరెన్ని పేరడీలు ఉన్నాయో?!

గ్రంథంలో ప్రస్తావింపబడిన విద్వాంసులందరి పట్ల రచనాశైలిలో భాగంగా ఏకవచన ప్రయోగం చేయడమైంది అంతేకాని, వారి పట్ల నాకు గౌరవం, వినయం లేవని కాదు సుమా!

నా ఈ చిన్న పరిశ్రమ విజ్ఞులకే మాత్రం సంతృప్తి కలిగించినా ధన్యుణ్ణి. ఇందులో ఎన్నో అసమగ్రతలు చోటు చేసుకొని ఉండవచ్చు ఎంత జాగ్రత్త పడినా అచ్చుతప్పులు దొర్లనే దొర్లాయి సహృదయుల విమర్శలే నా భావి పురోభివృద్ధికి చేయూతలుగా భావిస్తూ వినమ్రంగా వాటిని స్వీకరించి నా లోపాలు సరిదిద్దుకోగలనని మనవి చేస్తున్నాను

# అంజలి

పరిశోధనకు అవకాశం కల్పించిన గురువర్యులు ఆచార్య ఎం. కులశేఖర రావు గారికి—

సందేహాలను, సమస్యలను సముచితంగా పరిష్కరిస్తూ నిర్విఘ్నంగా ముగియడానికి దోహదం చేయడమేకాక పీఠికా రూపంలో ఆశీర్వదించిన సహృదయ పర్యవేక్షకులు ఆచార్య ఎస్వీ రామారావుగారికి—

ఈ గ్రంథం డాక్టరేటు పట్టానికి అర్హమైందిగా గుర్తించిన పరీక్షకులు ఆచార్య ఎస్. గంగప్ప (నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు) గారికి, ఆచార్య కె. మలయవాసిని (ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్నం) గారికి—

ముద్రణకు అనుమతించిన తెలుగుశాఖ అధ్యక్షులు ఆచార్య వి. సీతా కళ్యాణిగారికి, బోర్డ్ఆఫ్ స్టడీస్ చైర్మన్ ఆచార్య ఎన్. గోపిగారికి, ఆర్ట్స్ ఫ్యాకల్టీ డీన్ ఆచార్య చేకూరి రామారావు గారికి—

ఉస్మానియా తెలుగుశాఖలో పనిచేస్తున్న గురువులకూ గురుకల్పులకూ మిత్రులకూ సహచరులకూ అందరికీ—

ముద్రణకు కొంతలో కొంతైన ఆర్థిక సహకారం అందించి ప్రేరణ కలిగించిన తెలుగు విశ్వవిద్యాలయానికి, ముఖ్యంగా ఉపాధ్యక్షులు ఆచార్య పేర్వారం జగన్నాథం గారికి—

రాతప్రతిని శ్రద్ధగా చదివి సవరణలు సూచించడమే కాకుండా ఆత్మీయమైన పీఠికను కూడ అందించిన ప్రఖ్యాత రచయిత డా॥ అక్కిరాజు రమాపతి రావు గారికి—

వినమ్రపూర్వక ప్రణామాంజలి

సుదీర్ఘమైన లేఖల ద్వారా ఎన్నో కొత్త ఆలోచనలకు తావు కల్పించడమే కాకుండా నా పరిశోధనాంశానికి సన్నిహిత సంబంధమున్న 'అధిక్షేపం' పై డాక్టరేటు పట్టం గ్రహించిన ఆత్మీయ పరిశోధక మిత్రులు డా॥ రెంటాల శ్రీ వేంకటేశ్వరరావు గారికీ—

ఈ గ్రంథంలోని కొన్ని అధ్యాయాలను వ్యాసాల రూపంలో ప్రచురించిన ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, ఉదయం, తెలుగు, స్రవంతి, వివేచన మొ॥ పత్రికల సంపాదకులకూ—

మార్పులతో చేర్పులతో పలుసవరణలతో నిండిన నా రాతప్రతి ఎంత విసుగు తెప్పించినా భరిస్తూ ఎంతో అందంగా ముద్రించిన పద్మావతి ప్రింటర్స్ అధినేత శ్రీనివాస్‌గారికి, నిశితంగా ప్రూఫులు చూసిన కె. పి. బాబుగారికీ—

కవర్ పేజీని ఆకర్షణీయంగా తీర్చిదిద్దిన 'ఫినిషింగ్ పాయింట్' నరేందర్ దంపతులకూ—

మరో మంచిమిత్రుడు శ్రీ జనువాడ రామస్వామిగారికీ—

## సాదర కృతజ్ఞతాభివందనలు

నా జీ(వి)త భాగస్వామి, 'ముప్పావంగి' చి॥ గీతారాణికి శుభకామనలు

# ముఖ్య సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 3 | 5 | శ్రేష్టః | శ్రేష్ఠః |
| 13 | 9 | (విదూషకుడు) | విదూషకుడు |
| 14 | 1 | వీటిలో | వ్యాసాల్లోనూ |
| 19 | 15 | పట్టుకోగల గలిగే సామర్థం | పట్టుకోగలిగే సామర్థ్యం |
| 22 | 13 | అన్నారు | అన్నాడు |
| 63 | 18 | రాసిన | రాసినవానిలో |
| 64 | 2 | లక్షణాలన్నింటినీ | లక్షణాలన్నీ |
| 64 | 3 | పోచ్చు | పోవచ్చు |
| 87 | 12 | పదాలు | పాదాలు |
| 87 | 13 | పదంలో | పాదంలో |
| 87 | 25 | మూతని | మూతిని |
| 95 | 6 | చిత్రంలో | చిత్రంలోని |
| 95 | 7 | అని | అని సాగే |
| 97 | 11 | దగ్న | దఘ్న |
| 144 | 14 | ఇతిశ్రీ మతిశ్రీ | మతిశ్రీ ఇతిశ్రీ |
| 188 | 11 | బ్రాకెట్లో | బ్రాకెట్లు, |
| 193 | 15 | పెద్దపురం | పెద్దాపురం |
| 207 | 3 | వారే | మరే |
| 225 | 14 | ఎవరో | ఏదో |
| 226 | 19 | మార్పులు | మాటలు |
| 229 | 9 | ఈ పాత్రకే | ఈ పాత్రకూ |
| 239 | 18 | పిట | పీట |
| 240 | 7 | రాచిబ్బల | రాచిప్పల |
| 248 | 1 | .భోగ | చేయడాన్ని భోగ |
| 254 | 2, 3 | పేరడీకరించాలో | పేరడీకరించాడో |
| 266 | 14 | గోమాయువు | గోషయము |
| 302 | 1 | బెనిలక్స్ | బెనిలక్స్ దేశ |
| 307 | 26 | పేరడీలు | పేరడీ కథలు |

# ఇదీ వరుస....

# 1. పేరడీ – అనుకరణం

మానవ జీవన గమనం అనుకరణ శీలం. శిశువు పుట్టింది మొదలు, తప్పటడుగులు వేస్తూ తత్తరపడుతూ అమ్మనూ, నాన్ననూ, అన్ననూ, అక్కనూ అనుకరిస్తూ అనుభవపరంగా ఎదుగుతూ ముందుకు సాగుతాడు సభ్యతా సభ్యతలూ మంచి చెడ్డలూ చేయవలసినవీ చేయకూడనివీ మొదలైన విషయాలను పరిసరాల నుండి గ్రహిస్తాడు. "యద్యదాచరతి శ్రేష్ఠః" కూడ ప్రసిద్ధమే గదా! అంటే మొత్తం పైన ప్రకృతినీ సమాజాన్నీ గమనించి అనుకరిస్తూ తన జీవన ప్రస్థానానికి కావలసిన మెళకువలను నేర్చుకుంటాడన్న మాట! తల్లిదండ్రుల నుండి నేర్చుకోవడం, తల్లిదండ్రులు కావడం, పెద్దలను అనుకరించడం, పిన్నలకు అనుకార్యులు కావడం అనేది ఎల్లప్పుడూ కొనసాగే చక్రం. అయితే ఈ అనుకరణాన్ని 'యథాతథ ప్రతిబింబం'గా చెప్పకూడదు. 'అనుసృష్టి' లేదా 'పునఃసృష్టి' అనవచ్చు ముందు తరాల అభిప్రాయాలను జీవన సరళిని వర్తమాన స్థితిగతులకు సమన్వయించుకొని మార్పులు కూర్పులు చేసుకోవడం విజ్ఞత.

ఇట్లా సిద్ధించిన అనుభవాల పరంపరనే సమకాలికుల కోసం ఆగామి తరాలకోసం సాహిత్యాది కళల రూపాన మానవుడు వ్యక్తీకరిస్తాడు. కళ ప్రకృతిని అనుకరిస్తుందని [1] అరిస్టాటిల్ చెప్పినా ప్రకృతి కళలను బోధిస్తుందని [2] మిల్టన్ అన్నా ఇద్దరి భావం ఒక్కటే. ఒకరు 'కళ' నుండి మరొకరు ప్రకృతి వైపు నుండి తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. కావ్యం ఎంత 'లోకవృత్తానుకరణ' [3] మైనా, ఎంత 'అవస్థానుకృత' [4] మైనా, కవి ఉన్న

---

1. Art imitates Nature - Aristotle.
2. Nature taught Arts - Milton.
3. లోకవృత్తానుకరణమ్ నాట్యమ్ - భరతుడు
4. అవస్థానుకృతిర్నాట్యమ్ రూపందృశ్యతయోచ్యతే - ధనంజయుడు

దున్నట్లు స్వీకరించక తన మనోయవనిక మీద అంతరింద్రియాలకు దర్శన మిచ్చిన తీరుగా భావనాబలం చేత చిత్రిస్తాడు [1,2]

జీవితంలో మనిషి, సాహిత్యంలో కవి కేవలం అనుకర్తలు కారు. 'నూత్నత'ను దర్శించగలిగిన సృజనశీలురు.

అపార కావ్య సంసారానికి ప్రజాపతులయిన మహా కవులు తమ కవితా శక్తిచేత తదనంతర కవులను సమ్మోహితులను చేశారు ప్రభావితులను చేశారు ప్రతిభామూర్తులయిన అర్వాచీన కవులు తమకన్నా ముందు వెలసిన కవుల భావనా నైశిత్యానికి పద్యరచనా వైశిష్ట్యానికి ముగ్ధులై పొంగిపోయి వాటిని అనుకరిస్తూనే తమదైన ముద్ర ఉండేలా చూసుకొన్నారు. పూర్వకవులను అనుకరించడం అవమానంగా కాక నిజమైన నివాళిగా భావించారు.

ఇతివృత్త సామ్యం, సన్నివేశ సాదృశ్యం ఉన్నపుడు కవులు పూర్వీకుల భావాలకు స్వల్పమైన మార్పులతో తమవైన చేర్పులతో రాయడం కూడా గమనించవచ్చు ఒకానొక తాత్త్విక దృక్పథానికి చెందిన కవి రచనల బాణీలు ప్రసిద్ధమైతే ఆ బాణీలను తద్భిన్నమైన సిద్ధాంతాల వారు కూడా వాడుకోవడం చూడవచ్చు.[3] చలనచిత్ర గీతాల బాణీలో భక్తి పాటలు రాయడం కూడా ఈ కోవలోకే వస్తుంది వీటిలో కొంటెతనపు హాసదృష్టి లేదు కదా! ఇవి ఒక

---

1 A work of art reproduces its original not as it is itself but as it appears to the Senses - Aristotle.

2 He must represent things such as they were or are or such as they are said to be and believed to be or such as they should be.

పైన పేర్కొన్న ఉల్లేఖనలన్నీ ఎస్ వి. రామారావు తెలుగులో సాహిత్య విమర్శ (1989) పుటలు 50, 56 నుండి గ్రహించినవి.

3. శ్రీశ్రీ మహాప్రస్థానం గీతాల శైలిని అనుకరిస్తూ, యెల్దండ రఘుమారెడ్డి అకాల జ్ఞానతత్త్వాలు, సీలా జంగయ్య మహాప్రపంచం తమ దృక్కోణాల కనుగుణంగా రచించారు.

రకం ఆదర్శానుకరణలు (Ideal imitations) కాగా దీనికి సమాంతరమైన మరొక అనుకరణ ముంది అది రచయిత శైలీవిన్యాసాలను, అభిరుచులను విలోమ మార్గంలో హేళనాత్మకంగా అనుకరించడం. ఈ రకం వికటానుకరణాన్నే (Ridiculous imitation) సాహిత్యంలో పేరడీ (Parody) అని స్థూలంగా పిలుస్తున్నారు.

పేరడీ మినహా మిగిలిన సాహిత్య ప్రక్రియల్లో అనుకరణం పూర్వకవి చూపిన ప్రభావానికి నిదర్శనం మాత్రమే 'పేరడీ అచ్చంగా స్వతంత్ర రచన కాదు అది ఆభాస స్వతంత్ర రచన అంటే, ఒక స్వతంత్ర రచనను (అది కవిత్వం కావచ్చు, వచన రచన కావచ్చు) ఆధారంగా చేసుకుని పుట్టే అనుకరణ రచన. మాతృకకు పుత్రిక లాంటిది'[1] అనుకరణమే ప్రధానంగా కలిగిన ఏకైక సాహితీ ప్రక్రియ పేరడీ. ఈ అనుకరణం కాకతాళీయం కాదు, సంకల్పపూర్వకమే.

ఒక మాతృకకు అధిక్షేపాత్మకమైన, హేళనాత్మకమైన, హాస్యాత్మకమైన విషయాంతరంతో కూడిన అనుకరణమే పేరడీ కవి కూడా అలాంటి దృష్టితో రాసినపుడే పేరడీ అవుతుంది. అంతేతప్ప ఒక కవి రచనాశైలినికానీ, ఒక పద్యాన్ని కానీ, ఒక ఖండికను కానీ అనుకరించినంత మాత్రాన పేరడీ అని తొందరపాటుతో తలపోయరాదు పరిహాస దృష్టి ప్రధానం. ఇంకా స్పష్టత కోసం ఎలాంటి అనుకరణలు పేరడీలు కావో, ఎలాంటివి అవుతాయో స్థాలీ పులాక న్యాయంగా పరిశీలిద్దాం.

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
          యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రం బని
          కవివృషభులు మహాకావ్య మనియు

---

1 కేతు విశ్వనాథరెడ్డి, సార్వత్రిక విశ్వవిద్యాలయం బి.ఎ పాఠ్యగ్రంథం, పుటలు 134-152.

లాక్షణికులు సర్వ లక్ష్య సంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియు
పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యం బని మహిఁగొనియాడుచుండ
వివిధ వేదత త్త్వ వేది వేదవ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరుగుచుండఁ జేసె భారతంబు

ఇది నన్నయ భారత అవతారిక(1.31)లోనిదని అందరికీ తెలిసిందే.

వైదికులిది శుద్ధ వైదికంబని యెన్న
శాస్త్రజ్ఞు లిది ధర్మశాస్త్ర మనగ
తార్కికులిది మహాతర్కం బనంగ పౌ
రాణికు లిదియె పురాణమనగ
ఆగమ విదులు దివ్యాగమం బిదియన
తంత్రజ్ఞు లిది వీరతంత్రమనగ
భక్తవారం బిది భక్తిమార్గంబన
ముక్త్యర్థు లిది మహాముక్తిద మన
కవులు భువిని నిదియె కావ్యంబనంగను
సజ్జనులకు మిగుల సంతసముగ
నిర్వికల్పరతి చతుర్వేదసారమన్
పద్యముల్ రచింతు బసవలింగ!

పాల్కురికి సోమన తన చతుర్వేదసారం (పద్య సంఖ్య 22) గొప్ప తనాన్ని వర్ణిస్తూ చెప్పిన ఈ పద్యం నన్నయ పద్యానికి అక్షరాలా అనుసరణ మని చెప్పడానికి శ్రమపడ నక్కరలేదు ప్రతి వర్గానికి చెందినవారు భారతం తమదేనని భావిస్తారని నన్నయ చెప్పినట్లే సోమన చెప్పాడు - అంతే. నన్నయ పద్యం పాఠకునిలో కలిగించే అనుభూతికి భిన్నంగా సోమన పద్యం హాస్యాను భూతి కానీ వేళాకోళంకానీ కలిగించడం లేదు. మొదటి పద్యం ఛాయలో రచన

సాగిందే తప్ప హేళన చేయాలన్న భావంతో వెలువడింది కాదు పాఠకుడు గంభీరంగా చదువుకొంటూ వెళ్ళిపోతాడు. కవికి మొదటి పద్యాన్ని వికృతంగా అనుకరించాలన్న ఆలోచనే లేదు. అందువల్ల ఒకే తీరుగా ఉన్నా పై పద్యానికి కింది పద్యం పేరడీ కాలేదు ఇంకో దృష్టాంతం కూడా చూద్దాం —

నల్లనివాడు, పద్మనయనంబులవాడు, మహాశుగంబుల
న్విల్లును దాల్చువాడు, కడువిప్పగు వక్షమువాడు, మేలుపై
జల్లెడువాడు నిక్కినభుజంబులవాడు, యశంబు దిక్కులం
జల్లెడు వాడునైన రఘుసత్తము డీవుత మాకభీష్టముల్[1]

శ్రీరాముని పరంగా పోతన చెప్పిన ఈ పద్యం అంతగా ప్రసిద్ధి కాలేదు. కాని దీని ధోరణిలోనే పోతన కృష్ణుని పరంగా చెప్పిన పద్యానికి ఎనలేని పేరు ప్రఖ్యాతులు వచ్చాయి.

నల్లనివాడు, పద్మనయనంబుల వాడు, కృపారసంబుపై
జల్లెడువాడు, మౌళి పరిసర్పితపింఛమువాడు, నవ్వురా
జిల్లెడు మోము వాడొకడు చెల్వలమాన ధనంబు దెచ్చెనో
మల్లియలార! మీ పొదలమాటున లేడు గదమ్మ చెప్పరే.

ఈ పద్యాన్ని అనుకరిస్తూ రాయప్రోలు సుబ్బారావు, ఉత్పల సత్యనారాయణాచార్య, వెలుదండ రామేశ్వరరావు[2] కృష్ణుని కీర్తించారు

---

1 పోతన శ్రీమద్భాగవతము 9-60.

2. నల్లనిమేనువాడు, చిరునవ్వులు కన్నుల జిమ్మువాడు, రం
జిల్లు గళంబు నందు తులసీవనమాలిక వ్రేలువాడు; గల్
గల్లను గజ్జెలందియలు కాళ్ళకు దాల్చినవాడు, చల్లగా
బిల్లనగ్రోవి పాడి వలపించెడి వాడెటుబోయె గంటిరే.
— రాయప్రోలు సుబ్బారావు 'మహాకవి పోతన' (శీర్షిక) మిత్రమంజరి పుట 44.

కృష్ణస్తుత్యాత్మకమైన ఈ పద్యాలకు ఆలంబన పోతన శ్రీరాముని పరంగా చెప్పిందే, ఒక అవతార పురుషుని స్థానంలో మరొక అవతార పురుషుని కీర్తనం ఉంది. అంతే తప్ప కలిగే అనుభూతిలో మార్పు లేదు గాంభీర్యానికి లోటు లేదు. కనుక పేరడీలు కావు.

మరో పద్యం చూడండి :

నల్లనివాడు, రక్తనయనమ్ములవాడు, భయంకర స్వరూ
పోల్లసనమ్ము వాడు, గదనూని మహామహిషమ్ముపై ప్రవ
ర్తిల్లెడి వాడు, నా ప్రణయదేవుని జీవధనమ్ము తెచ్చెనో
భిల్లపురంధ్రులార! కనిపింపదుగా దయచేసి చెప్పరే 1

---

నల్లనివాడు నిల్వు తిరునామమువాడు, ప్రఫుల్ల పుండరీ
కోల్లసితాయతాక్షముల నొప్పెడు వాడు, వెడందయైన పే
రుల్లము వాడుదగ్ర భుజయుగ్మము వాడు, ధనుశ్శరాది సం
పల్లలితోపశోభిత శుభప్రదమూర్తి ప్రసన్నుడయ్యెడున్.
—ఉత్పల సత్యనారాయణాచార్య, విభీషణ శరణాగతి. 52 వ పద్యం.

నల్లని రూపువాడు, భువనంబుల నన్నిటి నేలువాడు తా
నెల్లెడ నున్నవాడు, జగదేక విమోహనుడైనవాడు, సీ
తోల్లసి తాయతాంబర వియోగుల భక్తుల నెల్లవేళలన్
చల్లగ జూచువాడు నను సంతతమున్ గృపతోడ బ్రోచునే
—వెలుదండ రామేశ్వరరావు, అముద్రిత చాటువు.

నల్లనివాడ, జ్ఞాన నయనమ్ములవాడ! మనస్సు లోపలన్
తెల్లనివాడ, హింసను వధించిన నల్లనివాడ! శాంతిపై
జల్లినవాడ, తెల్లని విషమ్మునకు విరుగైనవాడ! నా
ఉల్లము లోనివాడ! పదవోయి విశాల విభాపథాలపై

అని మిసిసిపి విశ్వవిద్యాలయంలోని తొలి నీగ్రో పట్టభద్రుడు జేమ్స్ మెరిడిత్‌ను ప్రశంసిస్తూ దాశరథి రాసిన పద్యాన్ని కూడ ఇక్కడ చెప్పుకోవచ్చు. ఇది కూడ గంభీరమైన పద్యమే తప్ప పేరడీ కాదని ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు - 'నీలరవ్వ' దాశరథి కవిత (1977) పుట 436

1. జంధ్యాల పాపయ్య శాస్త్రి, సతీ సావిత్రి (ఖండిక) ఆరంభ పద్యం ఉదయశ్రీ, (1975) పుట. 84

కరుణశ్రీ రచించిన ఈ పద్యంలో నల్లనివాడైన శ్రీకృష్ణుని స్థానంలో మరో నల్లనివాడయిన 'యమధర్మరాజు' ప్రవేశించాడు. మహామహిషం వచ్చింది. సత్యవంతుని ప్రాణాలు తీసుకొనిపోతున్న కాలుని వారించడానికి 'వదన శ్రీవసి వాడిపోయి', 'దీనత్వము రూపుగైకొనిన ప్రేమోన్మాదిని' ఆ సుమంగళి సావిత్రి చేస్తున్న ప్రయత్నాలు అభివర్ణితమయ్యాయి మూల పద్యానికి భిన్నమైన విషయమే ఉంది హాస్యం కానీ అధిక్షేపం కానీ లేవు - రచయితకాదృష్టి కూడా లేదు. కనుక ఇది పేరడీ కాదు. ఒక కవిపట్ల భక్తి గౌరవాభిమానాలతో ఆయన పోకడలను అనుకరిస్తే అది పేరడీ కాదు. పరిహాసం దృష్టితో అనుకరిస్తేనే పేరడీ అవుతుంది జంధ్యాల వారు పోతనను అనవసరంగా ఇక్కడ అనుకరించి సన్నివేశాన్ని చెడగొట్టారు ఆయన పద్ధతిలోనే ఆయన స్వతంత్రంగా రాసుకొని ఉంటే ఉదాత్తంగా ఉండేది

ఇంకొక్క ఉదాహరణ చూసి ముందుకు వెళ్దాం.

హాయను! ధర్మరాజ తనయాయను! నన్నొడ బాయనీకు జ
న్నే యను! దల్లినేపజనునే యను! కృష్ణుడ పీడెవచ్చెరా
వేయను! నొంటివోకదగవేయను! నేగతి బోవువాడనే
నో యభిమన్యుడాయను! ప్రియోక్తుల నుత్తరదేర్పవేయనున్[1]

కవిబ్రహ్మ తిక్కన రచించిన ఈ పద్యం కరుణ రసావిష్కరణకు ఉత్కృష్టమైన లక్ష్యం. ఈ విషాదోత్పల ప్రభావం అర్వాచీనులపైన బాగా ప్రసరించింది

హాయను నో కుమారయను! నక్కట పల్కవదేమిపుత్రపు
త్రాయను! దల్లిఁ జూడమను! దమ్ముఁడ తూరగనాడెనే యమో
ఘాయత సాయకంబను నృపాధముఁ డేటికి నేసెఁ బట్టి ప
ట్టీయను నీకు నీగతి ఘటించెఁ గదే యను దైవమాయనున్ [2]

---

1 కవిత్రయం (తిక్కన భాగం) ఆంధ్రమహాభారతము, ద్రోణపర్వము 2 - 242.

2 భాస్కరుడు (కుమార రుద్రదేవుని భాగం), భాస్కర రామాయణము. అయోధ్యకాండ, 218 వ పద్యం.

దశరథ బాణహతుడైన కుమారుని చూచి మునులు విలపిస్తున్న సన్ని వేశంలో కుమార రుద్రదేవుడు తిక్కన పద్యాన్ని ఉపయోగించుకున్నాడు. అట్లాగే భాస్కరుడు, అయ్యలరాజు రామభద్రుడు, కూచిమంచి తిమ్మకవి, ముద్దు పళని, లింగకవి - గంగకవి, రాపాక లక్ష్మీపతి[1] వంటి వారెందరో తిక్కన పద్యాన్ని మనోజ్ఞ అనుకరణీయంగా స్వీకరించారు

---

17. హాయను, నోనరేంద్రయను, హా రఘుకుంజర నీవు వేగ రా
వేయను నెంత దూరమున కేగితి వోయను నా యెలుంగు విం
టేయను, విన్న నీ శరము లీ తలలింతకు ద్రుంచివై వకు
న్నేయను, కైక కోర్కెఫలియించె బళీయను దైవమాయనున్
—భాస్కరుడు, భాస్కర రామాయణము, అరణ్యకాండ, 2 - 112

హాయను గాధినందన మఖారి నిశాట మదాపహారి దా
హాయను! గ్రావజీవదపదాంబురుహాయను! రాజలోక సిం
హాయను! ప్రోషితార్య దివహాయనుఁ గానలకేగితే నిరీ
హాయను! నిర్వహింపగలనా నిను బాసి రఘూద్వహాయనున్.
—అయ్యలరాజు రామభద్రుడు రామాభ్యుదయము 5-101.

హా ప్రభావ ప్రఫుల్లాంభోజలోచన - హా శరద్రాకాసుధాంశువదన
హా సమదద్విరేఫాలక జాలక - హా తప్త చామీకరాభగాత్రి
హా దిశా కుంభికుంభాంచితకుచకుంభ - హా పరిపక్వ బింబాధరోష్ఠి
హా హీరశకలమనోహర రదనాళి - హా నవదర్పణోద్యత్కపోల
హా జగన్మాన్య గంధర్వ రాజన్య
యహహ మారున కిటుల నన్నప్పగించి
గొడవఁ జెందించి కుందించి జుడిఁగిచనితె
యంచు నిన్నెంచు నతఁడు క్రొమ్మించుబోడి
—కూచిమంచి తిమ్మకవి, రసికజనమనోభిరామము. 5-82.

తిమ్మకవి రాసిన అచ్చతెనుగురామాయణము అయోధ్యాకాండ లోని 89, 90 పద్యాలు కూడ ఇట్లాంటివే అయితే అవి అచ్చతెనుగులో ఉండడం వల్ల చెవికింపుగా ఉండవు.

ఈ పద్యాలన్నీ ఇష్టజనవియోగాన్ని గంభీరమైన వాతావరణంలో కరుణ రసోపేతంగా చిత్రించినవే ఎక్కడా నవ్వుకోవడానికి కానీ నవ్వుకోవాలనే తలంపు రావడానికి కానీ ఆస్కారాన్ని కలిగించవు. అందువల్ల అవన్నీ తిక్కన పద్యానికి కేవలానుకరణలు లేదా ఆదర్శానుకరణలు (Ideal imitations) అయ్యాయి తప్ప పేరడీలు కాలేదు

తిక్కన పద్యం మూసలోనే కూచిమంచి జగ్గకవి రాసిన పద్యం కూడా ఒకటుంది

హాయను! చంచరీక నిచయాంచిత కుంచిత రోమకామగే
హాయను! దానమానిత మహాద్విప మేహన మోహనైక బా
హాయను! కాకమూక చరణాయుధ కుర్కుర దూషితాత్మగే
హాయను! చంద్రితాళ నహహాయనుఁ బీత శిరోరుహాయనున్

చంద్రరేఖ విలాపం (2 - 121) లోని ఈ పద్యంలో గాంభీర్యం ముసుగులో హాస్యం దాగి వుంది. తిక్కన పద్యం వింటే పాఠకులు ఆర్ద్రభావ మనస్కు లవుతారు ద్రవిస్తారు పుత్రుని కోల్పోయిన ఆ తండ్రి వేదనతో

---

రాయను వింతపుట్టినది రాయనుఁ - జూతువుగాని వేడ్కలే
రాయను ...

—ముద్దుపళని, రాధికాస్వాంతనము 3-60.

రాయను గాయనుం దొగల రాయనిగేరు నిగారుపుంగొటా
రాయను మేటినాడెపు దొరాయనుఁ గిన్క యొనర్చెదేమిమే
రాయను నింతనీకుఁగనరాయను, దయ్యము పాడిదప్పె నా
రాయను, గన్నవారు నగరాయను నిప్పని మానురాయనున్

లింగకవి - గంగకవి, సీతావిజయము, 4-171.

(ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం XII, పుట 325)

హాయను మన్మనోరథ సుధార్ణవపూర్ణ శశాంకరుచ్యదే
హాయను..

—రాపాక లక్ష్మీపతి భద్రాయురభ్యుదయము, 2-6.

తాదాత్మ్యం చెందుతారు జగ్గకవి పద్యం వింటే సానుభూతి కలగదు కలగ డానికక్కడ ఏమీ లేదు కూడా. పద్యంలోని అర్థాన్ని గమనించి పకాలున నవ్వేస్తారు. కొంతసేపటికి వెక్కసమై వెగటు కలిగిస్తుంది కూడా. తిక్కన పద్యంలోని విషాదానికి విషయాంతరం సిద్ధించింది అశ్లీల ప్రసక్తి వచ్చింది. గాంభీర్యం తొలగిపోయింది. తిక్కన పద్యానికి వికృతానుకరణం జరిగింది. అందువల్ల జగ్గకవి పద్యం పేరడీ అయింది తిక్కన వారి పద్యాలు పేరడీలు కాలేదు. ఉత్తమ స్థాయిలో ఉన్నత దిశగా జరిగే ఆదర్శానుకరణం ప్రసక్తి లేకుండా హాస్యస్ఫోరకంగా, అధిక్షేపాత్మకంగా, అవహేళనాత్మకంగా, అపహాస్య స్థాయికంగా అవరోహణ క్రమంలో అనుసరించినవే పేరడీలన్నది పిండితార్థం

## పేరడీ గ్రంథ చౌర్యమా? :

పేరడీలో అనుకరణకున్న స్థానాన్ని గమనించి పేరడీని 'గ్రంథ చౌర్యంగా' కొందరు అనుకోవచ్చు.

పేరడీస్టు మూలంలోని పదాలను, పాదాలను ఇష్టం వచ్చినట్లు మార్చడు. సాధ్యమైనంతవరకు మార్చకుండానే అర్థాంతరాన్ని, విషయాంత రాన్ని సృష్టించడానికి యత్నిస్తాడు ప్రతి పద్యంలో ఒకటి రెండు ఆయువుపట్టు వంటి ముఖ్యమైన పదాలు (Key words) ఉంటాయి. వాటి మీదే పద్యం నిర్మాణమవుతుంది అవి కర్తృవాచకాలో కర్మార్థకాలో క్రియావాచకాలో పునరావృత శబ్దాలో ఏవైనా కావచ్చు అటువంటి కీలక పదాల్ని గుర్తించి పేరడీకారుడు మార్చివేస్తాడు దాంతో ఆ పద్యం స్వరూప స్వభావాలు తల కిందు లవుతాయి పాతవేషం పోయి సరికొత్త రూపం వస్తుంది పేరడీ రచయిత పద్యంలో నాలుగు పాదాలు అలాగే ఉంచుతూ కేవలం ఎక్కడో ఒక చిన్నపదం మాత్రమే మార్చి స్వీయ రచనగా ప్రకటించుకోవడం భావ్యం కాదు. ఇది గ్రంథ చౌర్యం అవుతుందని అనిపించడం సహజమే.

పేరడీ మూల రచనకు పేరు తెస్తుందే కానీ చౌర్యం కాదు

భూషణములు చెవులకు బుధ
తోషణము లనేక జన్మ దురితౌఘవిని
శ్శోషణములు మంగళ తర
ఘోషణములురా విదూషకుని భాషణముల్.

ఈ పద్యమంతా పోతన్న పోతయే పేరడీకర్త 'గరుడగమను' అన్న పదం స్థానంలో 'విదూషకు' అని ఒక్క పదాన్ని మాత్రమే చేర్చాడు. దీంతో పద్యమే పూర్తిగా మారిపోయింది. మాతృకలో కృష్ణునిది కర్తృ స్థానం తక్కిన వన్నీ అతనికి విశేషణాలు. పేరడీలో కర్త (విదూషకుడు). సర్వలోకైక రక్షకుడైన భగవంతునికి చెందాల్సిన విశేషణాలన్నీ ఒక భోజనప్రియుడు, అతి సాధారణుడు అయిన విదూషకునికి అన్వయించాయి ఇది హాస్యరస సంపాద నేచ్ఛతో చేసిన చిలిపిచేష్ట తప్ప వేరుకాదు పేరడీ రచయితకు ఇతరత్ర కలిగే ప్రయోజనం అసలేలేదు

పేరడీస్టు గ్రంథచౌర్యానికే పూనుకొంటే అప్రసిద్ధ కావ్యాలు కానీ, భారత భాగవతాల్లో ఎవరికీ తెలియని మారుమూల పద్యాలు కానీ ఎన్ని ఉండవు? వాటినే తీసుకొని తన పేరు పెట్టుకోవచ్చు. పేరడీ చదివినపుడు మాతృక గుర్తు రాలేదంటే పాఠకునిది దోషం కాదు. పేరడీస్టుది దోషం. మాతృకతో సరిపోల్చుకుంటూ తన పేరడీ చదవాలన్నదే పేరడీస్టు ఆశయం. అందరికీ తెలిసిన వాటినే పేరడీకి ఎన్నుకోవడంలోని ఆంతర్యం ఇది.

ఇంతవరకూ పేరడీలో అనుకరణకున్న ప్రాముఖ్యాన్ని సవివరంగా పరిశీలించాం. ఇక తక్కిన లక్షణాలను గురించి తర్వాతి అధ్యాయంలో చూద్దాం.

**

# 2. పేరడీ – స్వభావం

## నిర్వచనాలు :

ఆంధ్రాంగ్ల నిఘంటువుల్లోనూ, విజ్ఞాన సర్వస్వాల్లోనూ [illegible] ఇంచు మించు ఒకే తీరుగా పేరడీ నిర్వచింపబడింది. వీటిలో A writing in which the language and style of an author or poem, or other work is closely imitated or mimicked, literary imitation especially. The reproduction of stylistic peculiarities of an author or work for comic effect or in ridicule[1] అనీ A composition in which the characteristics of manner and spirit of an author or class of author are imitated so as to make them appear ridiculous[2] అనీ చెప్పారు. మాతృకలోని ఉదాత్తమైన గంభీరమైన శైలినీ, భావాలనూ, తత్వాన్ని కొట్టవచ్చినట్లు కనిపించే విశేష గుణాలనూ (mannerisms) హాస్యపూరితంగా అధిక్షేపాత్మకంగా విషయాంతరంతో అనుకరిస్తే పేరడీ అవుతుందని ఆ నిర్వచనాల సారాంశం [3]

"హాస్య రచయితకి కావలసిందల్లా క్రిందుపరచడం లేదా త్రోసిపుచ్చడం. వెరపడానికి చేట పెయ్య చాలునన్నట్లు రామాయణం వంటి కావ్యాన్ని కూడా

---

1 websters New International Dictionary of the English language Vol II (2nd Edition) Page 1779

2 Dictionary of world literary terms. Joseph T Shipley (Ed).

3. సూరంపూడి సుధ 'జరుక్ శాస్త్రి పేరడీలు - ఒక పరిశీలన' (1987 పుటలు 3 - 7, 39 - 32)లో నిర్వచనాలు, వాటి అనువాదాలు క్రోడీకరింపబడ్డాయి. కాబట్టి నేను వాటిని తిరిగి పేర్కొనడం లేదు. ఇక్కడ అవసరం కూడ లేదు.

వికారంగా చదివి అసహ్యమైనదనిపించవచ్చును. గాంభీర్యం కావ్యానికి; లేకితనం హాస్యానికి స్వాభావికమైన గుణాలు. అణుమాత్రం అసందర్భమో పటిష్ఠతా భంగమో ఐక్యతా విచ్ఛిత్తియో ఏర్పడితేచాలు గంభీరత చస్తుంది. వెంటనే లేకితనం తలెత్తుతుంది. ఈ సుళువైన హాస్య నిర్మాణ సూత్రం హాస్యానుకృతుల్లో అనుసరించబడుతుంది."[1]

యాదృచ్ఛికంగా రచయితల్లో కనిపించే పడికట్టు పద్ధతిని సంస్కారణ పూర్వకంగా పరిహాసాస్పదంగా అతిశయించి చూపే ప్రతిస్పందనయే పేరడీ. ఈ ప్రతిస్పందనవల్ల పేరడీ చేయబడిన వ్యక్తి మనస్సు గాయపడకూడదు. గిల్లడం కాదు- పేరడీ గిలిగింతలు పెట్టడం చేయాలి.

## దేనిని పేరడీ చేస్తారు? :

కనపడ్డ ప్రతిదానిని పేరడీ చేయరు. పేరడీ చేయడానికి మూల వస్తువులో 'సత్తా' ఉండాలి అది ఒక ఉత్తమ / ఉదాత్త రీతిలో ఉండాలి. ప్రసిద్ధిచెంది అందరికీ తెలిసి ఉండాలి గంభీరమైన వస్తువయి ఉండాలి. పేరడీకి లక్ష్యంకావడం, గురికావడం గౌరవహేతువు. వివిధ పత్రికల్లో ఎందరో కవితలు, కథలు రాస్తున్నారు. కానీ అవన్నీ పేరడీకి పాత్రం కావడంలేదు. కొన్ని మాత్రమే పేరడీకి అర్హం కావడానికి కారణం ఇదే.

ఇప్పుడు రచయితలోని ఎలాంటి గుణాల్ని పేరడీ చేస్తారో చూద్దాం. ప్రిన్స్‌టన్ విజ్ఞాన సర్వస్వం ఆరు అంశాలు పేర్కొంది.[2]

1. వ్యక్తిగత వైపరీత్యం - Eccentricity.
2. అహేతుక విశ్వాసం - Sentimentalism
3 శబ్దలౌల్యం - Pedantry.
4. నిస్తేజత - Dullness

---

1. ముట్నూరి సంగమేశం - తెలుగు హాస్యం (1953) పుటలు 29, 30.
2. Princeton Encyclopeadia of Poetry & Poetess (1975) Page. 60

5. పటాటోపం - Pompourness
6. స్వీయోత్కర్ష - Self importance

విశ్వనాథలో స్వీయోత్కర్ష (Self importance) సాక్షాత్కరిస్తుంది. జి.వి సుబ్రహ్మణ్యం, ఎస్. వి. జోగారావు రచనల్లో శాబ్దిక పటాటోపం శైలీ లౌల్యం (Pompourness), దర్శనమిస్తాయి. పురాణం సీత 'ఇల్లాలి ముచ్చట్ల'లోనూ; మునిమాణిక్యం 'కాంతం కథ'ల్లోనూ పారంపరిక సామాజిక సంప్రదాయ ప్రవృత్తి, అహేతుక విశ్వాసాలు (Sentimentalism) చోటుచేసుకుంటాయి. సంజీవదేవ్ రచనల్లో శైలీగతమైన శబ్దలౌల్యం (Pedantry) ఉండడాన్ని గుర్తించవచ్చు అందువల్ల ఈ విధంగా ఏదో ఒక 'ప్రత్యేకమైన' శైలీ విన్యాసం ఉన్నవారి రచనలే పేరడీకి గురవుతాయి/గురయ్యాయి.

ఒక పేరడీని పేరడీగా పాఠకుడు ఎట్లా గుర్తిస్తున్నాడు అని ఆలోచిస్తే ఈ కింది అంశాలు తెలుస్తాయి. మాతృకలోని వస్తువు (content) కూ రచనా పద్ధతికీ మధ్య ఉండే సమన్వయాన్ని (co-ordination) సమతౌల్యాన్ని (Balance) భగ్నం చేయడం ప్రధానంగా పేరడీలో జరిగే పని

## I మాతృకా సౌష్ఠవం మార్చడం :

1. అర్థవిపరిణామం

a) అర్థం లేని అవాకులు చవాకులు ఉండడం.

b) అధిక్షేపాత్మకమైన అర్థాన్నివ్వడం

2. పదాల నైఘంటుక, ఆలంకారిక అర్థాలను మార్చడం.

3 వాక్య నిర్మాణంలో మార్పులు చేసి తద్వారా అర్థంలో మార్పులు కలిగించడం

4 కాల పురుష వచనాది వ్యాకరణాంశాల్లో మార్పులు చేయడం ద్వారా అర్థంలో మార్పులు కలిగించడం.

5 విషయాంతరం (Contextual change). మూలంలో ఉన్న వస్తువుకు బదులుగా వేరొక వస్తువును కల్పించడం.

6. సాంఘిక మాండలిక భేదాలవల్ల కూడ అర్థంలో మార్పులు కలిగించడం మొదలైన వాటిని చెప్పుకోవచ్చు.

## II. భావ ప్రకటనం :

1. మాతృక / మాతృకా రచయిత మీద విసిరే విసుర్లు.
2 మొత్తం పేరడీలో కానవచ్చే అభిప్రాయ ప్రకటనం.

## III పాఠకునిపై చూపే ప్రభావం :

1. మాతృకపై ఉన్న గౌరవాదరాలకు భంగం కలిగించి పాఠకుని దిగ్భ్రాంతికి లేదా హాస్యానికి లోనుచేయడం.

2 మాతృకను బాగా చదివిన వారిపై ప్రభావం చూపడం . . ఇలా మూడు విభాగాల్లో పేరడీ రూపుదిద్దుకుంటుందని, పేరడీ గూర్చి విశిష్ట కృషి సల్పిన మార్గరెట్ రోస్[1] వివరించారు

ఈ విధంగా మాతృకారచయిత శైలి, శైలీగత విన్యాసాలు, పద, పదబంధ ప్రయోగరచనాగత వైచిత్రి అర్థ, భావ, అంతస్తత్వ విశేషాలు మొదలైన వాటిని అతిశయించి, న్యూనపరిచి అధిక్షేపాత్మకంగా, హాస్యపూరితంగా అనుకరించడంద్వారా పేరడీ తయారవుతుంది.

## పేరడీ రచయిత :

"కవి తన 'మూడు' (Mood) లో తానే ఉంటాడు వికటకవి పరకాయ ప్రవేశం చేస్తాడు ఇతను సాహిత్య సర్కస్‌లో బఫూన్‌లాంటి వాడు. ఇతను వారి వారి పనులు చేస్తున్న సమర్థులైన వేరు వేరు వస్త్రాదులను ఒక్కడే ఒకడు రెండు మూడుసార్లు అంతే సమబుద్ధితో అనుకరిస్తూ మూడోసారి హాస్యం నిమిత్తం పిల్లిగంతు వేస్తాడు కాని అందరి పనులు చేయగల సమర్థుడు. వికటకవి కూడా అంతే ఒక్కడే తను పేరడీ చేస్తున్న విభిన్న రచయితల ఊహా ప్రపంచానికి తట్టుకొని నిలవగల కవి రవి, వికటకవి ఒక్కొక్క కవిని పేరడీ చేస్తున్నప్పుడు ఒక్కొక్కడై ఒక్కొక్కడిలాగా కనిపిస్తాడు ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కొక్కడై తోచినట్లు "[2]

---

1 Margaret-A-Rose - Parody Meta-fiction (1979) Page 25-26.

2. మాచిరాజు దేవీప్రసాద్ పారడీలు (1986) పుట xviii.

ఏ కవిని అనుకరిస్తున్నప్పుడు ఆ కవిగా కనిపించడమనేది పేరడీస్టుకు సాధారణాంశం. ఏ ఇతర ప్రక్రియా రచయితలకు లేని మరొక విలక్షణ విశేషం పేరడీకారునికి ఉంది. అటు పాఠకునిగాను, ఇటు రచయితగాను సమర్థంగా రెండు పాత్రలను ఏక కాలంలో పేరడీస్టు పోషిస్తాడు పాఠకుడంటే మామూలు పాఠకుడు కాదు. కావ్యగుణాగుణ వివేచన చేయగలిగిన ఉత్తమ విమర్శక పాఠకుడు. మొదట పేరడీస్టు ఒక ఉత్తమ పాఠకునిగా మాతృకను ఆమూలాగ్రం లోతుగా అధ్యయనం చేసి, దాని మంచి చెడ్డలను ఆకళింపు చేసుకుంటాడు. మాతృకలోని లొసుగులను హావభావ వైలక్షణ్యాన్ని (Mannerisms) అతిశయించి చూపుతూ వ్యంగ్య మర్యాదతో హాస్యాన్ని మేళవించి గాంభీర్యాన్ని పల్టీకొట్టిస్తూ రచయిత అవతారమెత్తి పేరడీ చేస్తాడు

ఈ విధంగా ద్విపాత్రాభినయం చేయడమనేది సాహిత్య క్షేత్రంలో పేరడీస్టుకు మాత్రమే సాధ్యం ఇతర ప్రక్రియల్లో ఉదా॥కు ఒక నాటక రచయిత నాటక రచయితగానే నాటకం రాస్తాడు కాని పాఠకుని లాగ పని చేయలేడు అలాగే ఒక పాఠకుడు ఏదేని ఒక రచనను ఆస్వాదిస్తాడే కాని రచయితగా మారలేడు. విమర్శకుడు కూడా కొంతమేర ద్విపాత్రాభినయం చేసినట్లు కనిపిస్తాడు కాని అతని వ్యాపారమంతా 'గద్యం'లోనే సాగుతుంది సృజనాత్మక వ్యాసంగం విమర్శకునికి తప్పనిసరికాదు. కాని పేరడీస్టు మాతృక ఏ ప్రక్రియలో ఉంటే పేరడీని అదే ప్రక్రియలో కొనసాగించాలి ఈ విధంగా ఈ రెండు పనులను (పఠనం - రచనం) చక్కగా నిర్వహించి, అటు మాతృకా రచయితకు ఇటు పేరడీ పాఠకులకు ఒక రకమైన సయోధ్య కల్పిస్తాడు పేరడీస్టు.

మాతృకను అనుకరించడం పేరడీకారుడు అవమానంగా తలపోయడు "అనుకరణం ఒక రకమైన స్తుతి వ్యాపారం అనుకరణ ఎప్పుడూ గౌరవ పురస్సరంగానే జరుగుతుంది గాని ఇంకోవిధంగా జరగదు. అనుకరణ ప్రధాన గ్రంథకర్తకు ఉత్కర్షాహేతువు "[1] కనుక పేరడీకర్త ప్రసిద్ధమైన ఉత్తమమైన స్వీయశైలి గలిగిన రచన / రచయితలనే పేరడీకి గ్రహిస్తాడు అంతే తప్ప

1. మునిమాణిక్యం నరసింహారావు, మన హాస్యం (1968) పుట 105.

పేరడీస్టు ప్రతిభా సామర్థ్యాలు, కీర్తిప్రతిష్ఠలు అన్నీ మాతృక గొప్పతనం మీద ఆధారపడి వుంటాయి పేరడీ చదివిన వెంటనే ఇది ఫలానా దానికి వికృతి అని పాఠకునికి తోచలేదంటే పేరడీ రచయిత ప్రయత్నం విఫలమయినట్లే. పేరడీకర్త స్వీయ ప్రజ్ఞను సంపూర్ణంగా విస్మరించి మూలకవిలో లీనమైనపుడే మంచి పేరడీ సృష్టించగలడు

The Parodist sinks his own individuality as completely as possible He lives in the writer whom he parodies, like a soldier crab in a shell carrying his original about is fantastic excursions over which the original has no control. It must enter into the spirit of its model and not merely echo its voice [1]

అవి ఎడ్మండ్ గాస్ చెప్పిన మాటలు స్మరణీయాలు

నిశిత పరిశీలనాశక్తి, రచనా ప్రావీణ్యం, ధారణ పేరడీ రచయితలకు అత్యవసరం ఎవరెవరు? ఎలాంటి సందర్భాలను ఏ యే విధంగా వివరిస్తారు? వర్ణిస్తారు? వారి శైలి, వారి ఊతపదాలు పట్టుకోగలగలిగే సామర్థ్యం పేరడీస్టుకు వాంఛనీయం మూల రచయిత లోతుపాతుల్ని, శైలినీ శయ్యా సౌందర్యాన్ని కూలంకషంగా తెలుసుకొన్న విమర్శకునికి తప్ప పేరడీ అందరికి సాధ్యం కాదు 'పేరడీ వ్రాయడమంటె యేమీ తేలికైన పని కాదు దానికి బాగా శబ్దశక్తి యొక్క రహస్యములు, పద్య రచనలో వున్నటువంటి విశేషాలు, అపుదలలు, పెంపుదలలు, రకరకాలైనటువంటి మెళుకువలు తెలిస్తే కాని పేరడీ వ్రాయడం సాధ్యపడ'దని[2] విశ్వనాథ సత్యనారాయణ అభిప్రాయం

మూల రచయిత మీద ద్వేషంతో కాక ప్రేమ, సానుభూతి ఉంచుకొని పేరడీ చేయాలి మూల కర్త గూడా చదివి ఆనందించగలగాలి అంతేకాని

---

1 మాచిరాజు దేవీప్రసాద్ ఉల్లేఖనం 'వికట కవిత్వం' ప్రతిభ, జులై 1942.

2. జరుక్ శాస్త్రికి శ్రద్ధాంజలి ఘటిస్తు 'వాణి' ఆకాశవాణి మాసపత్రిక ఆగస్టు 1968.

ముఖం మాడ్చుకోకూడదు. అప్పుడే పేరడీలు విజయవంతమై పాఠకులకు ఆనందాన్ని ఆహ్లాదాన్ని ఇచ్చి మరోసారి చదివించుకొంటాయి

## పేరడీ పాఠకుడు :

సాహిత్యంలో మరే ఇతర ప్రక్రియకు లేని ఒక విశేషగుణం పేరడీలో ఉంది. నాటకం చూసినా, నవలను, మహాకావ్యాన్ని పఠించినా చదువరి (**Reader**) ఆ ఒక్క అంశానికే పరిమితమవుతాడు తాదాత్మ్యం చెందుతాడు అంతేగాని ఒక పుస్తకమో, ఒక గేయమో చదువుతూ వేరొక పుస్తకాన్ని గురించి కానీ, వేరొక గేయాన్ని గురించి కానీ ఆలోచించడు పేరడీ చదివే పాఠకుడు మాత్రం అట్లాకాదు. ఒక్కసారిగా రెండు విషయాలను (Two text worlds) అనుభవంలోకి తెచ్చుకుంటాడు జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి పేరడీకి ఆనందిస్తూనే అదే సమయంలో ఆ పేరడీకి మూలమైన శ్రీశ్రీ గేయాన్నో మరోదాన్నో పరిత స్మృతిపథంలోకి తెచ్చుకుంటాడు పేరడీని దాని మాతృకనూ ఏక కాలంలో తులనాత్మకంగా పరిశీలించుకొంటాడు. మాతృకను దెబ్బకొట్టడంలో పేరడిస్టు ఎంతవరకు సఫలీకృతుడయ్యాడనేది బేరీజు వేసుకొంటాడు ఇదంతా మాతృకలోని సౌందర్యం, పేరడీలోని ప్రతిభ గుర్తించగలిగిన ఆదర్శ పరిత చేసే పని.

మాతృక పూర్తిగా తెలియికపోతే పేరడీని స్వతంత్ర రచనగా పాఠకుడు పొరపడే అవకాశముంది దాంతో పేరడీలోని అస్తవ్యస్తత, అసంగతార్థాలు ఉద్దేశ్య పూర్వకమైనవేనని గుర్తించక విపరీత వ్యాఖ్యానాలు చేసే అవకాశముంది. ఒకవేళ మాతృక అరకొరగా మాత్రమే తెలిసి ఉండి, పేరడీగా గుర్తించకపోతే పేరడిస్టు పొరపాటున మాతృకను తప్పుగా ఉటంకిస్తున్నాడని భ్రమపడే వీలుంది.

## పేరడీ ప్రయోజనం :

'Parody is a both a form of literary humour and a branch of critism '1

1. Robert P. Falk (introduction) 'An Antic Muse'

మాతృకా రచయితలోని 'మేనరిజమ్'లను అతిశయించి చూపి గేలి చేయడం, హితవు చెప్పడం పేరడీలో జరిగేపని దీనివల్ల మాతృకారచయిత పాతదానికి కట్టుబడిపోయి ఆ ప్రపంచంలోనే స్థిరపడకుండ ఎప్పటికప్పుడు లోకం పోకడ గుర్తించగలుగుతాడు తన రచనాధోరణిని భావాలను వర్తమానకాల రీతులకు సమన్వయించుకోగలుగుతాడు

మాతృకలోని ఊతపదాలను, అలవాట్లను అధిక్షేపరీతిలో నవ్వులపాలు చేయడం మూలాన పేరడీ ఏకకాలంలో సృజనాత్మక హాస్యప్రక్రియగానూ, విమర్శగానూ విలక్షణ రూపాన్ని సంతరించుకొంటుంది.

తాను చెప్పదలచుకొన్న అంశాలను సూటిగా చెప్తే దూషణలపాలవుతానని భావించి కూడ రచయిత పేరడీ ప్రక్రియను ఆశ్రయించవచ్చు. దీనివల్ల అసలు రచయితకు తనపట్ల, తన పేరడీ పట్ల చిన్నచూపు ఏర్పడకుండా జాగ్రత్త పడడం ఒక ప్రయోజనం మాతృక / తద్రచయిత మీద గౌరవాతిశయం కూడ పేరడీకి పురికొల్పుతుంది ఒక మహాకవి రచనా ధోరణిని కీచురాళ్ళప్రాయంగా అనుకరించే అర్భకులను హేళన చేయడం కోసం పేరడీ రాయవచ్చు. కరడు కట్టుకొనిపోయిన సాహితీ సంప్రదాయాలకు కాలం చెల్లిందని పేరడీ ద్వారా డండోరా వేయవచ్చు ఇవేవీ కాకుండా ఒక రచయిత శైలిలోకి పరకాయ ప్రవేశం చేసి తన దృష్టిలో నున్న ఇంకేదోదాన్ని (another target) ఆట పట్టించడానికి కూడ పేరడీని ఎన్నుకోవచ్చు పేరడీ కర్త 1. మూల రచయితను, 2 మూలరచనను, 3 అన్యవస్తువును మొత్తం మూడింటిలో దేనినయినా లక్ష్యంగా పెట్టుకొని పేరడీకి పూనుకోవచ్చునన్నమాట.

కలకల నవ్వుతూ నవ్విస్తూ ఉండడం ఆరోగ్య మూల రహస్యాల్లో ఒకటి. హాస్య రచనలు అందుకు బాగా ఉపకరిస్తాయి. సాహిత్యరీత్యా పేరడీ ప్రక్రియ ఆ ప్రయోజనాన్ని సాధిస్తుంది పేరడీ ప్రయోజనం పరితల మనస్సులను తేలికపరచడం, ప్రశాంతపరచడం

## పేరడీ శబ్దచర్చ :

పేరోడియా (parodia) అనే గ్రీకు శబ్దం నుంచి పేరడీ పుట్టింది. Para = Beside, Ode = Song అని పదవిభాగం. అనగీతి 'అనుసరించి

పాడుట' (counter song) అని అర్థం ఒక మంచి రచనను అనుకరిస్తూ తదాకృతికంగా చేసే మరొక రచన అని భావం ఈ పేరోడియా శబ్దాన్ని మనకు తెలిసినంతవరకు తొలిసారిగా అరిస్టాటిల్ Poetics లో వాడాడు. జర్మనీలో పేరడీని Beige Song అని అంటే ఫ్రెంచిలో Contre chant అని అంటారు.

ఇక భారతీయ భాషలకు వస్తే పేరడీని హిందీ, కన్నడం, మరాఠీల్లో 'విడంబన' సాహిత్యమంటారు విడంబనమంటే అనుకరించడం అనే అర్థం. అనుకరణాత్మక సాహిత్యానికే ఆ భాషల్లో విడంబన సాహిత్యమన్న పేరు పరిమితం కాలేదు అధిక్షేపాత్మక రచనలకు కూడ విడంబనమనే వ్యవహరిస్తున్నారు తెలుగులో మాత్రం 'పేరడీ' అనే పేరే ప్రసిద్ధంగా ఉంది.

## పేరడీకి తెలుగు పేరు :

పేరడీని విమర్శకులు రకరకాలుగా తెలుగు చేశారు మాచిరాజు దేవీ ప్రసాదు 'వికటకవిత్వం' 1 అన్నారు 1895లో ప్రథమంగా వచ్చిన బ్రౌన్ ఇంగ్లీషు తెలుగు నిఘంటువులోనూ, జి ఎన్ రెడ్డి సంపాదకత్వంలో తెలుగు అకాడమీ ప్రచురించిన ఇంగ్లీషు తెలుగు నిఘంటువులోను 'వికటకవిత్వ' మనే ఉంది ఇంకా చాలామంది 'వికటకవిత్వ'మనే అన్నారు అన్ని రకాల హాస్యాన్ని కలుపుకొని అతి విస్తృతమైన అర్థంలో వాడబడే సామాన్య పదం 'వికట కవిత్వం' 'పేరడీ'కి ఉండే పరిమితులు 'వికట కవిత్వం' లో లేవు,

తెనాలి రామకృష్ణుని పేరుమీద వచ్చిన చాటువులను వికటకవిత్వమనే అంటున్నాం కాని పేరడీలుగా గుర్తించడంలేదు మాచిరాజు దేవీప్రసాదు మాటల్లోనే చెప్పాలంటే 'వికటకవిత్వం' అనేది పేరడీకి సార్థకనామం కాదు వికటకవిత్వం అనేమాట యొక్క అర్థం సువిశాలమైంది హాస్యం, వ్యంగ్యం, దూషణ, ఆభాస చమత్కారం ప్రధానంగా కల ప్రతి కవిత్వం వికట కవిత్వమే. కాని పేరడీ వీటి అన్నిటికంటే ఇంకోగుణం అధికంగా కలది. మిగతా వికట కవిత్వ భాగాలు యావత్తూ ఇంకో దానితో సంబంధం లేకుండా నిరాధారంగా ఉంటాయి".2

---

1 & 2 మాచిరాజు దేవీప్రసాద్ పారడీలు (1986) పుట ix

ఇలాగే హేళనకావ్యం,[1] హాస్యానుకృతి,[2] వక్రానుకరణం,[3] వికటానుకరణం,[4] వ్యంగ్యానుకరణం,[5] అని పేరడీకి సమానార్థకాలుగా కొందరు పేర్కొన్నారు. 'హేళన'లో పేరడీ లక్షణాల్లో ప్రధానమైన 'అనుకరణం' ధ్వనించడం లేదు 'హాస్యానుకృతి'లో వ్యంగ్యం, వ్యంగ్యానుకరణంలో హాస్యం స్ఫురించడం లేదు 'వక్రానుకరణం' చేసేవాడు 'వక్రబుద్ధి' కావడం లేదు.

'వినోదమే గమ్యంగా వెలసిన సాహిత్య ప్రక్రియ అయిన ఈ పేరడీని 'వినోదానుకరణ'మని పిలవడం ఉచిత'[6]మని జరుక్ శాస్త్రి పేరడీల గురించి పరిశోధించిన సూరంపూడి సుధ అభిప్రాయం.

పైన పేర్కొన్నవన్నీ పేరడీకుండే 'భావాన్ని' ప్రతిబింబిస్తున్నవే తప్ప ఏ మాత్రం అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాలు లేకుండా సూటిగా పారిభాషిక స్థాయిలో తయారయినవి మాత్రం కాదు

పేరడీకి ఒక తెలుగు పేరు ఖాయం చేయాలని పూనుకుంటే కృత్రిమంగా కొత్తగా మరో సంస్కృత పదాన్ని సృష్టించవలసివుంటుంది. లేకపోతే ఏదైన మారుమూల అచ్చ తెనుగు పదం గాలిస్తే దొరుకుతుందేమో! ఒకవేళ లభించినా కిటికీ అంటే సోరణగండి అని అగమ్యగోచరంగా చెప్పినట్లే అవుతుంది. పారిభాషిక పదం నిర్ణయించేటప్పుడు అర్థంలో సూటిదనం, ఉచ్చారణలో సారళ్యం, పదిమందికి తెలిసి ప్రచారంలో ఉన్నదా? లేదా? అన్న విషయాలు

---

1. ఎస్ వి రామారావు, తెలుగులో సాహిత్య విమర్శ (1989) పుట 109
2. ముట్నూరి సంగమేశం, తెలుగుహాస్యం (1953) పుట 29
3 ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి పీఠిక, శ్రీరమణ (1986) పుట 4
4. జి. లలిత, తెలుగులో చాటుకవిత్వం (1981). పుట 153 - 154
5 Glossory of Parliamentary legal and Administrative terms with telugu, page 537
6 జరుక్ శాస్త్రి పేరడీలు - ఒక పరిశీలన (1987) పుట 40.

పరిశీలించాలి తప్ప, ఏ భాషకు చెందింది అన్నదానిమీద పట్టుబట్టి కూర్చోరాదు. 'అన్య భాషా సమంబు తత్సమంబు, అన్యభాషాభవంబు తద్భవంబు' అని చిన్నయసూరికి విస్తృతార్థాన్ని చెప్పుకోవలసిన చారిత్రక పరిణామదశలో ఉన్నాం. ప్రచారంలో లేని ఏ సంస్కృత పదాన్నో ఏ అచ్చతెనుగు పదాన్నో కృత్రిమంగా సృష్టించి నెత్తికెక్కించుకోకూడదు దానికి బదులు సూటిగా, సరళంగా రేడియో, కంప్యూటర్, బస్, పెన్ను, రోడ్డు, పెన్సిలు మొ॥ వాటిలాగా ఆంగ్లపదం 'పేరడీ'ని స్వీకరించడమే మంచిది.

**

# 3. పేరడీ – స్వరూపం

పేరడీ ఒక రూపప్రక్రియ (Form) కాదు కథ, నవల, పద్యం, గేయం ఇలా ఏ ప్రక్రియలోనైనా పేరడీ ఉండవచ్చు ప్రబంధ కవిత, భావకవిత, అభ్యుదయ కవిత, చారిత్రక నవల, సెక్స్ కథల్లాగ పేరడీ ఒక వస్తు ప్రక్రియ (content) కూడా కాదు వస్తువును నిర్వహించే పద్ధతిలో పేరడీ ద్యోతక మవుతుంది. ఉదా॥కు దీనజనోద్ధరణ, మార్క్సిజం వస్తువులుగా స్వీకరించింది అభ్యుదయ కవిత్వం. అదే విషయాలతో పేరడీ రాయవచ్చు జీవితాన్ని తీరు తీరులుగా అనుభవించడానికి, దర్శించడానికి సాధనభూతాలయ్యేవి సాహిత్యాది కళలు వాటిలో పేరడీ కూడా ఒకటి పేరడీని కళగా భావించడానికి ఎటువంటి అభ్యంతరం ఉండనక్కరలేదు

వస్తువు (Content) నుబట్టి రూపాన్ని (Form)బట్టి పేరడీని రక రకాలుగా వింగడించి చూపే అవకాశముంది

హాస్యం లక్ష్యంగా పెట్టుకుని చేసే పేరడీని Comic Parody అనీ విమర్శ లేదా అధిక్షేపం గమ్యంగాసాగే పేరడీని Critical Parody అనీ ప్రిన్స్టన్ విజ్ఞానసర్వస్వం[1] భావించింది అట్లాగే C Wells పేరడీని శబ్దంపరంగా, రూపంపరంగా, అర్థంపరంగా (word rendering, form rendering, sence rendering) విభజించాడు [2] Joseph T Shipley కూడ ఈ విధం గానే **verbal, formal,** Thematic Parodies అని పేరడీని వింగడిం చాడు [3] C. Wells చెప్పిన వాటికీ Shipley చెప్పిన వాటికీ పదాల్లోనే తేడా

---

1 Princeton Encyclopaedia of Poetry & Poetics (1975), Page 600

2 C Wells, A Parody Anthology (1904) కి రాసిన పీఠికలో

3. Joseph T Shipley, Dictionary of world literary terms (1955) Page 299.

తప్ప భావం ఒక్కటే తెలుగు పేరడీలను ఆంగ్లమార్గంలో కాకుండా స్వతంత్రంగా ఎన్ని రకాలుగా విభజించడానికి వీలుందో గమనిద్దాం.

## I. ధ్వన్యాశ్రయ పేరడీలు (Phonic Parodies) :

**A) స్వర సహిత పేరడీలు** · వేదమంత్రాలు స్వరప్రధానాలు వాటిని ఉదాత్తానుదాత్త స్వరిత భేదాల ననుసరిస్తూ నిర్దుష్టమయిన రీతిలోనే పఠించవలసి వుంటుంది. కాని హాస్యకారుడు సోమయాజుల వేషంలో (పగటివేషగాళ్ళలో)

అంబలి ముఖ్యం త్వలంకారం కంబళి ముఖ్యంతు భోజనం
రాట్నం ముఖ్యంతునారీణాం దుక్కి ముఖ్యంతు బ్రాహ్మణః॥

బాకీసార్లా సుమనసా సర్వాదాయం యథా క్రమం
తిన్నట్టే తినకున్నట్టే ఉన్నవారికి మాడడం
మాట మాట ప్రసంగేన డబ్బుదిబ్బు స్తథైవచ
పాదరక్ష ప్రయోగేన శరీరం పీడ వర్జయేత్ [1]

అని ఉదాత్తానుదాత్త స్వరయుతంగా ఆలపిస్తే ఎంతో రమ్యంగా ఉంటుంది ఇంకా-

కాచీ కాచీ ములక్కాయ కాయవే పొట్టి కాకరీ
కాయానాం వంగపింజానాం కూరానాం గుజ్జుపచ్చడీ[2]

అని లయబద్ధంగా చదివితే ఒక్కోసారి వేద మంత్రంగానే భావించి మోసపోయే ప్రమాదముంది దీనికి మాతృకగా ఏ ప్రత్యేక మంత్రాన్నీ పేర్కొనలేం వేదమంత్రాలు చదివే తీరు మాత్రమే మూలం కనుక వీటిని స్వర సహిత పేరడీలు (Tonic Parodies) అనవచ్చు ఇక్కడ లిపికి స్థానంలేదు 'విని' ఆనందించవలసిందే కాని 'కని' ఆనందించలేం.

---

1 & 2 ముట్నూరి సంగమేశం తెలుగు హాస్యం (1953) పుట 63.

B ఛందోబద్ధ పేరడీలు (Metric Parodies) : ప్రతి ఛందానికి తనదైన ధోరణి, లయ ఉంటాయి చాలామంది విద్వాంసులు పద్యాన్ని ఎక్కడో మధ్యలో మొదలుపెట్టి చదివినా అది ఏ ఛందమో చెప్పగలరు తప్పు చదివితే వెంటనే ఎక్కడో తప్పు ఉందని చెప్పగలరు దీనికి కారణం ఆ ఛందం నడక లయజ్ఞానం వారికి వశపడడమే. ఒక సంస్కృత పండితుని ఇంట్లో దొంగలు పడ్డారట. మందాక్రాంత ఛందం ధోరణిలో దొంగల నుద్దేశించి ఆ పండితుడు-

"దొంగల్లారా! భయపడకుడీ పేదవాళ్ళం గదర్రా.
కుండాగిండా మయిలపడితే కొనుక్కోలేం గదర్రా" అని వేడుకొన్నాడట

ఇక్కడ ప్రత్యేకమైన ఏ ఒక్క మందాక్రాంత శ్లోకాన్ని మాతృకగా చూపజాలం. కేవలం ఆ ఛందం నడకే ఆధారం ఇక్కడా లిపికి అస్తిత్వం లేదు.

## II. సంశ్లిష్టవర్ణాశ్రయ పేరడీ (Supra Segmental Parody :

మొదటి విభాగంలో ఉచ్చారణ, నడక లయల ఆధారంగా సృష్టించిన పేరడీలు చేరాయి లిపికి ప్రాధాన్యంలేదు లిపితో సంబంధం లేదు ఈ విభాగంలో లిపి ఉంటుంది లిపిలో ఏ మాత్రం మార్పు జరగదు యథాతథంగా ఉంటుంది కేవలం విరుపులవల్ల, ఊనికలవల్ల, విరామాల వల్ల అర్థ వైపరీత్యం, అసంగతార్థం సృష్టించవచ్చు

A సంధిగతం :

'రవికానని చోట కవిగాంచు - ఇది మూలం
రవిక అననిచోట కవిగాంచు - ఇది వికటత్వం '

ఇక్కడ అసంగతంగా (సంధి) విడదీయడం వల్ల హాస్యం ఉత్పన్నమయింది ఇది సాధారణంగా సరళాదేశాలు, నుగాగమాలు, యడాగమాలు వచ్చేచోట కలుగుతుంటాయి పరిశీలిస్తే ఎన్నో దొరుకవచ్చు

'యుద్ధమునఁ గౌరవనాశము తప్పదు' - ఇట మధ్యనున్న అరసున్న గమనించకుండా, సరళాదేశమయిందన్నది మరచిపోయి యుద్ధంలో ఓడిపోతే గౌరవం పోతుందని వ్యాఖ్యానిస్తే తెలిసినవారికి నవ్వొస్తుంది

**B విరామగతం :** ఎక్కడ పూర్ణ, అర్ధ విరామా లివ్వాలో తెలియకుండా చదవడం వల్ల కలిగే ఆభాస

పతితులు, కారు నీ యెడల భక్తులు
శంఠరలు, కారు విద్యలం జతురులు—

పల్లెటూళ్ళలో తిరుపతి వెంకట కవుల పాండవోద్యోగవిజయం నాటకం అతివేలంగా ప్రదర్శింపబడుతుంది చదువు, అవగాహన అంతగాలేని శ్రీకృష్ణ పాత్రధారి చదివే తీరు ఇది శ్రీకృష్ణుడు పాండవుల సుగుణాలను కీర్తిస్తు ధృతరాష్ట్రునితో పలికిన పద్యం. ఇష్టం వచ్చినట్లు చదవడం వల్ల వికృతార్థాన్ని ఇచ్చింది. అల్లే ఇంకొకటి.

చండజ్వర జర్జరమును
పాండురమును నైన మేను బాలిక! తాల్చెన్
దండధరుఁ డిపుడు సుమనః
కాండౌజః కీర్తి భారకలితుఁడ పోలెన్ [1]

నలుడు దమయంతి నుద్దేశించి "ఓ బాలికా! తీవ్రమైన తాపముచేత యముడు పోలిపోయాడు (చండజ్వర జర్జరమును పాండురమునైన మేను తాల్చెన్ దండధరుడు)"అని చెప్పుతున్నాడు ఇందులో 'బాలిక' అనేది సంబోధన అన్న సంగతి మరచిపోయి చదివితే 'చండజ్వర జర్జరమును, పాండురమునునైన మేను బాలిక తాల్చెన్' అని అవుతుంది బాలిక కర్త అవుతుంది

"అమ్మలగన్న యమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ, చాల పె
ద్దమ్మ, సురారు-మ్మ, కడుపాఱడి పుచ్చినయమ్మ"

అని భాగవత పద్యాన్ని అమ్మ అని ఉన్న చోటల్లా విరామమిచ్చి చాల మంది చదువుతుంటారు దానివల్ల రెండవ పాదంలో అపార్థం వస్తుంది 'సురారులమ్మ కడుపు ఆరడిపుచ్చినయమ్మ' అని చదవాలి

సరిగా సంధులు విరుచుకోలేకపోవడంవల్ల, ఎక్కడ ఎంత సేపు ఆపాలో, ఎలా పలకాలో తెలియమి వల్ల ఉప్పతిల్లే అపహాస్యం ఇదంతా.

---

1 శృంగారనైషధము 4-36

## III అసందర్భాశ్రయ పేరడీ (Devient Parody) :

ఒక సందర్భంలో చెప్పిన ప్రసిద్ధ పద్యాన్ని యథాతథంగా వేరొక సందర్భంలో ప్రయోగించడంతో అన్యార్థ స్ఫూర్తి కలుగుతుంది పద్యంలో ఒక అక్షరం కూడ మారదు అర్థం మాత్రం మారిపోతుంది సాధారణంగా ఈ రకమైన హాస్యం సర్వనామాలు ఉండడం వల్ల కలుగుతుంది ఉదాహరణకు ఇది చూడండి :



వాని కలలోన కానని వనజముఖియు
వాని మార్పునఁ బేర్కొని మానవతియు
వాని గానాత్మ భావించి వరుని గవయ
నప్పళింపని సతియు లేదయ్యె నెచట

శ్రీనాథ కవిసార్వభౌముడు నలుని వైభవాన్ని గూర్చి నైషధంలో (1-62) చెప్పిన పద్యం ఇది దీనిలో ఎలాంటి మార్పులు, చేర్పులు చేయలేదు కేవలం దానిమీద ఒక విదూషకుని ఫోటో అతికించడం జరిగింది అంతే వెంటనే అన్వయం మారిపోయి నూతనార్థం వచ్చింది నా అభిప్రాయంతో ఒక మిత్రుడు ఏకీభవించలేదు 1

---

1 మూలాన్ని మూలంగానే ఉంచుతూ రచనాపరంగా ఏ మార్పూ చెయ్యకుండా రచనేతర కారణాలవల్ల పేరడీని సాధించినప్పుడు పూర్తిస్థాయి పేరడీ అనడం సబబుకాదు. అది అనుకరణా కాదు పూర్తి పేరడీ కాదు రెండింటికీ మధ్య దశ. అనుకరణ పేరడీ వైపు సాగే దశ. ఈ రకమైన సందర్భాల్లో 'ప్రి-పేరడీ' (Pre-Parody) అనే మాట వాడుకోవచ్చునని తోస్తుంది అంటే పేరడీకి ముందు రూపం అని.
ఏది పేరడీ? .. ఏది నిర్వచనం? (వ్యాసం) డా॥ రెంటాల వెంకటేశ్వర రావు - ఆంధ్రప్రభ 4-10-1993

## IV. పదాశ్రయ పేరడీ (Morphological Parody) :

సాధారణంగా ఒక పద్యం కర్తనాశ్రయించిగాని; క్రియనాధారం చేసుకొనిగాని ఉంటుంది. తక్కిన భాగమంతా ఆ కర్తకు కాని; క్రియకు గాని, విశేషణంగా ఉండవచ్చు అటువంటి పద్యాలలో కీలకమైన ఆ ఒక్క పదాన్ని మార్చివేస్తే పద్యార్థం మొత్తం మారిపోతుంది ఆ విశేషణాలన్నీ నూతనపదానికి అనుగుణంగా ఒదిగిపోతాయి ఆంగ్ల విమర్శకులు ఈ విభాగాన్ని Verbal Parody గాను, word rendeing గాను వ్యవహరించారు ఇది చాల సులువైన పేరడీ అని చెప్పుకోవచ్చు [7]

---

7 The simplest form of parody is verbal, which gains its ludicrous effect by taking a well known poem and alterning a word here and a line there so as to make a different sence mutilating the original form

The nearer the original diction is preserved, the fewer the alternations needed to produce totally opposite meaning of ridiculous contrast, the more complete the antitheses, the more striking is the parody

Example ..

Original { Here shall, the Spring her earliest **Sweets** bestow
Here shall the first **Roses** blow.

Parody { Here shall the spring her earliest **Coughs** bestow
Here shall the first **Noses** blow

['మాచిరాజు దేవిప్రసాదు 'వికటత్వం' (వ్యాసం) ప్రతిభ జూలై 1942 ]

**A. కర్తృవాచి మారడం వల్ల :-** పద్యంలోని కర్తృపదం మార్చడం వల్ల విశేషణాలన్నీ మారిన పదానికి అనుగుణంగా ఒదిగిపోవడం

**భూ**షణములు సెవులకు బుధ
**తో**షణము లనేక జన్మ దురితౌఘ విని
**శ్శో**షణములు మంగళ తర
ఘోషణములు **గరుడగమను** గుణభాషణముల్[1]

**భూ**షణములు సెవులకు బుధ
**తో**షణము లనేక జన్మ దురితౌఘ విని
**శ్శో**షణములు మంగళ తర
ఘోషణములు **రాజీవుని** సుగుణ భాషణముల్[2]

ఇక్కడ కర్త మారడంతో విశేషణాల అన్వయం మారిపోయింది. ఇట్లాగే క్రియలు, కర్మలు మార్చుకోవచ్చు

లింగ వచన విభక్తుల్లాంటి వ్యాకరణాంశాలను కూడా మార్చివేసి సరికొత్త రూపాలు సృష్టించవచ్చు.

**B లింగభేదం :**

వంద నలయ**డు** వేవురు వచ్చిరేని (అలయదు)
నన్నపూర్ణకు నుద్దియో **నామెగేస్తు** (అతని గృహిణి)
**యతిథు లేతేర** నడికి రేయైనఁ బెట్టు
వలయు భోజ్యంబు లింట నవ్వారిగాఁగ

మనుచరిత్ర (1-56) లో సోమిదమ్మ సౌశీల్యాన్ని కీర్తిస్తున్న ఈ పద్యం పేరడీస్టు చేతిలో లింగ పరిణామం వల్ల కొత్త సొబగులు సంతరించుకొంది

---

1. పోతన భాగవతం దశమస్కంధం పూర్వభాగం పద్య సంఖ్య 1687
2 వెలుదండ నిత్యానందరావు రాజకీయ భాగోతం (పద్యం) ఆంధ్రప్రభ దినపత్రిక 20-12-1981

**C. వచన భేదం :**

సావిత్రి బహుపతివ్రత
ద్రౌపది బహుపతివ్రత

ఇక్కడ సావిత్రి వద్ద 'బహు'ను 'గొప్ప' అనే అర్థంలో కాకుండా బహువచనంలో గ్రహించినపుడు అన్యార్థం కలుగుతుంది

**D అల్పప్రాణ మహాప్రాణ భేదం :-** ఒక్కోసారి మహోన్నత భావ సమ్మిళితమైన పద్యంకానీ, శ్లోకం కానీ కేవలం ఒక అక్షరాన్ని మార్చడంతో, అల్ప ప్రాణాన్ని మహాప్రాణంగా ఉచ్చరించడంతో వెకిలిపాలయి పేరడీగా మారిపోతుంది పేరడీస్టు ఎక్కడ దెబ్బ కొట్టాలా అనే చూస్తాడు. కాని ఉచితానుచితాలు గమనించడు.

| మూలం | పేరడీ |
| --- | --- |
| **క**రాగ్రే వసతే లక్ష్మీ | **ఖ**రాగ్రే వసతే లక్ష్మీ |
| **క**రమధ్యే సరస్వతీ | **ఖ**రమధ్యే సరస్వతీ |
| **క**ర మూలేతు గోవిందః | **ఖ**ర మూలేతు గోవిందః |
| ప్రభాతే **క**ర దర్శనమ్ | ప్రభాతే **ఖ**ర దర్శనమ్. |

ప్రాతస్మరణీయమైన ఈ శ్లోకరాజంలోని అల్పప్రాణం మహాప్రాణంగా పరిణమించడంతో నవ్వులపాలయిపోయింది

## V పాదాశ్రయ పేరడీ (Syntactical Parody) :

ఇంతకు మునుపు పదాలను ఆశ్రయించుకొని కలిగే మార్పులను పరిశీలించాం దానినే కాస్త పొడిగించి అంటే పాద వినిమయంతో పేరడీ తయారు చేయవచ్చు

వేదుల సత్యనారాయణశాస్త్రిగారి 'రాధ'కు మాచిరాజు దేవీప్రసాదు చేసిన పేరడీ ఇందుకు ఉదాహరణ

పవన వీచికలందలి పరిమళమ్ము
మధుర చంద్రాతపములోని మార్దవమ్ము
మంజుల సుమామృతములోని మధురిమమ్ము
కలవు గోపాల! నీ వేణు గానమందు.

గోపికాలోలుని మధుర మంజుల మోహన వేణుగానానికి పులకితయైన రాధ మనసు లోని మాట ఇది. దీనికి మాచిరాజు దేవీప్రసాద్ 'భోజనశాల' పేరడీ గేయంలో మొదటి మూడు పాదాలు అలాగే ఉంచి చివరి పాదంలో మాత్రం "కలవు బుచ్చమ్మ! నీ పచ్చి పులుసు నందు" అని మార్చాడు. ఇక్కడ కర్తృవాచి యైన గోపాలునికి బదులు బుచ్చమ్మను, వేణుగానం స్థానంలో పచ్చిపులుసును ప్రవేశపెట్టి పేరడీ అకటావికటం చేశాడు.

## VI. ప్రక్రియాశ్రయ పేరడీ (Genric Parody) :

తెలుగులో పురాణం, ప్రబంధం, భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం, కథ, నవల, నాటకం మొదలైన రూప, వస్తు ప్రక్రియలు ఎన్నో ఉన్నాయి. వాటన్నింటికి ప్రత్యేకమైన లక్షణాలు, శైలి, పదజాలం వగైరాలున్నాయి. పేరడీస్టు ఏ ప్రత్యేక గ్రంథానికో కాకుండా మొత్తం ప్రక్రియను హేళన చేసేలా పేరడీ సృష్టిస్తే ఈ విభజన కిందకు చేరుతుంది. అప్పుడు ప్రక్రియ మొత్తం మాతృక అవుతుంది తప్ప ఏ ఒక్క గ్రంథం కాజాలదు.

చంద్రరేఖా విలాపం, అభాగ్యోపాఖ్యానం ప్రబంధ ప్రక్రియకు పేరడీలు డిటెక్టివ్, అనువాద నవలలకు శ్రీరమణ చేసి చూపిన పేరడీలు నిదర్శనం.

## VII. శైలీగత పేరడీ (Stylistic Parody):

దీనిలో మాతృకగా ప్రత్యేకమైన గ్రంథాన్నో, ఖండికనో చూపరు కవికి పేరడీ అయితే ఆ కవి సాధారణ శైలిని; వ్యాసమయితే అలాంటి వ్యాసాల సామాన్యరీతిని మూలంగా చూపుతారు. దీనిని మూడు అంతర్భాగాలు చేయ వచ్చు 1. కవుల శైలి, 2. ప్రసిద్ధ పాత్రల శైలి, 3. ఒక పద్ధతికి చెందిన వ్యాసాల శైలి.

A కవిశైలి : ఒక కవి కష్టపడి సాధించుకొన్న లేదా అతనికి సిద్ధించిన శైలిని అక్షరాలా అనుకరించడం రెండు మూడు వాక్యాలు చదవగానే అది ఫలానా వారికి పేరడీ అని తెలిసిపోతుంది కాని ఫలానా

రచనకు పేరడీ అనికాదు. విశ్వనాథ, సంజీవదేవ్, శేషేంద్రశర్మ, చలం మొ॥ వారికి శ్రీరమణ చేసిన పేరడీలు ఇందుకు నిదర్శనం

**B. పాత్రల శైలి :-** ఏ సాహిత్యంలోనైనా కొన్ని పాత్రలు సజీవంగా చిరస్థాయిగా నిలిచిపోతాయి. ఆ పాత్రల ముద్ర ప్రజలమీద పడిపోతుంది క్రమేపి పాత్రలు ప్రజల్లోను, వాటిని సృష్టించిన రచయితలు పండితుల్లోను మిగిలిపోతారు తెలుగునాట గిరీశం, జంఘాలశాస్త్రి, కాంతం, అప్పారావు, బుడుగు మొదలయిన పాత్రలు అలాంటివి. వీటిని అనుకరిస్తూ ఎందరో రాశారు. గిరీశానికి పేరడీ గురజాడకు పేరడీ కాదు. జంఘాల శాస్త్రికి పేరడీ పానుగంటికి పేరడీ కాదు. మాతృకే హాస్యస్ఫోరకమైనప్పుడు దానిమీద ఆధారపడి మంచి పేరడీ రాయడం సాధ్యపడదు అందుకే ముళ్ళపూడి 'గిరీశం లెక్చర్లు,' తదితరమైనవి కేవలం అనుకరణలుగానే తప్ప పేరడీలుగాపరిగణించడం లేదు.

**C. ఇతర శైలులకు :-** ప్రతి విషయానికి ఒక ప్రత్యేకమైన శైలి, పద్ధతి ఉంటాయి. ఆ పద్ధతిలో ఆ విషయాన్ని చెప్తేనే అందంగా ఉంటుంది. అనువుగా వుంటుంది. వేరే విషయాలను ఆ శైలిలో చెప్తే ఇమడకపోగా హేళన పాలవుతాయి. సాహిత్య విమర్శనాత్మక వ్యాసాల రీతి ఒకటైతే, దినపత్రికల్లో రాజకీయవార్తల ధోరణి మరొక తీరుగా ఉంటుంది. భారతి పత్రికలో రాసే వ్యాసాల తీరుతెన్నులు ఒక రకంగా ఉంటే, కార్యాలయాల్లో 'ఫైళ్ళు' రాయడం ఇంకొక ప్రత్యేకమైన పద్ధతిలో కొనసాగుతాయి ఉదా॥ "అసలు సత్యాశ్రయ కందశిలా శాసనం'[1] అనే పేరుతో జరుక్ శాస్త్రి చేసిన పేరడీ భారతి పత్రికలో శాసన పరిశోధనను గురించి రాసే వ్యాసాలకు హాస్యానుకరణం పత్రికల్లో ఉత్తరాల ధోరణికి 'సంపాదకునికి లేఖలు' శీర్షికతో మాచిరాజు దేవీప్రసాద్ పేరడీ అలాగే కార్యాలయ ధోరణికి మాచిరాజు దేవీప్రసాద్ 'కచేరీ కథనం',[2] దిన పత్రికల వార్తల రీతిలో శ్రీరమణ 'పాత్రికేయుని ప్రేమవార్త'[3] పేరుతో చేసిన పేరడీ ఈ విభాగానికి దృష్టాంతాలు.

---

1 కె వి రమణారెడ్డి (సం॥), జరుక్ శాస్త్రి పేరడీలు-ఇతర కవితలు [1982]

2 మాచిరాజు దేవీప్రసాదు తెలుగు పేరడీలు [1986]

3. శ్రీరమణ, శ్రీరమణ పేరడీలు [1980]

## VIII. వైయక్తిక పేరడీ (Individual Parody):

ఒక ప్రత్యేకమైన అంశాన్ని గ్రహించి తగిన రీతిగా మార్చి పేరడీ చేయడం. 'మాతృక ఇదీ' అని స్పష్టంగా 'ఒకదానిని' చూపించడం ఇందులో వీలవుతుంది.

A పదజాలాన్ని సృష్టించడం : ఒక పదం తీరుగా కొత్త పదాన్ని నిర్మించడం ముళ్ళపూడి వెంకటరమణ, శంకరనారాయణ దీనిలో సిద్ధహస్తులు.

చీ మా భా = చీమలసంఖ్య>జనాభా
భర్తకంట్రోలు = Birth Controle
పార్టీవ్రత్యం = పాతివ్రత్యం (ఒక పార్టీకి కట్టుబడి ఉండడం)
'జీత'భాగస్వామి = జీవిత భాగస్వామి

B. ఉపమాసామగ్రి, నుడికారాలు, కవిసమయాలు, సామెతలు మొదలైన వాటిని మార్చుకొంటూ కొత్తవాటిని హాస్యస్ఫోరకంగా రూపొందించడం

తల వెంట్రుకలను తుమ్మెద రెక్కలతో కాకుండా గొర్రె బొచ్చుతోను; ముక్కును సంపెంగతో కాకుండా పొగపీపతోను, అధరాన్ని దొండపండుతో కాకుండా తొట్టితోను, స్తనాలను దానిమ్మ పళ్ళతో కాకుండా కొలిమి తిత్తులతోను పోల్చి చంద్రరేఖావిలాపకర్త ఈ రకం పేరడీకి పాదులు తీశాడు.

**నుడికారాలకు, సామెతలకు :**

1. నవ్వేకవిని, ఏడ్చే రాజకీయనాయకుణ్ణి నమ్మకూడదు.
2. తిరిగి సబ్ ఎడిటర్, తిరగక రిపోర్టర్ చెడతారు
3. దొంగలను కొట్టి పోలీసులకు వేసినట్లు
4. తంతేపోయి బారులో పడ్డట్టు.
5. బారు పెట్టినవాడు బీరు పోయడా?

ఇలాగే ఎన్నింటినో శ్రీరమణ 'నూనుడు'ల పేరుతో ప్రకటించాడు. శంకరనారాయణ ఆంధ్రప్రభ దినపత్రిక ఆదివారం అనుబంధంలో కొన్నేళ్ళుగా ఇలాంటివి రాస్తున్నాడు

మానవులు యుద్ధంలో చస్తే వీరస్వర్గమలంకరించడం కవి సమయం ఈ కవి సమయాన్ని క్రీడాభిరామకర్త కోడిపందెంలో మరణించిన కోళ్ళకు అన్వయించాడు.

C మహాకవుల గేయాల కెందరో పేరడీలు నిర్మించారు రాయప్రోలు 'జన్మభూమి'కి ద్వానాశాస్త్రి 'ఏకాలేజికేగినా', దేవులపల్లి 'ఏల ప్రేమింతును?' కు జొన్నవిత్తుల 'సందియము', శ్రీశ్రీ 'దేశ చరిత్రల'కు మాచిరాజు 'రహదార్లు' ఈ కోవకు చెందిన పేరడీలు.

**D.** ఒక సంపూర్ణమైన గ్రంథానికి (నవల, నాటకం ఏదైనా) పేరడీ చేయడం అంటే మూల గ్రంథంలోని ఏ సంఘటన కా సంఘటనను గ్రహించి వికృతీకరించడం.

యండమూరి వీరేంద్రనాథ్ 'తులసిదళా'నికి శ్రీమతి సంగీతారెడ్డి పేరడీ 'వేపమండలు' ఇందుకు దృష్టాంతంగా చెప్పవచ్చు.

## IX. వస్త్వాశ్రయ పేరడీ (Thematic Parody) :

ప్రతి రచయితకు కొన్ని అభిమానాంశాలుంటాయి. ఒక 'కమిట్ మెంట్' ఉంటుంది. అతని రచనలన్నీ ఆ వాదాన్ని సమర్థించే దిశలోనే సాగుతాయి. దాంతో వాటినే వివిధ రూపాలుగా వివిధ సందర్భాలలో చెప్పడం సహజం విశ్వనాధ సత్యనారాయణగారి రచన పరమార్థమంతా భారతీయ సంస్కృతీ ఆచార సంప్రదాయాల విశ్వాసాల సమర్థనం, స్థాపనం. శ్రీశ్రీ కలం కదిపినా గళం మెదిపినా కార్మిక లోకపు కళ్యాణం, శ్రామిక లోకపు సౌభాగ్యం, సోషలిస్టు వ్యవస్థకు సంబంధించిన అంశాలే వస్తాయి. వారి శైలిలోనే వారి రచనల అంతస్సారాన్ని అవహేళన చేస్తూ పేరడీ చేయడం. తెలుగులో ఇది చాల తక్కువే.

విశ్వనాథ సత్యనారాయణ సృష్టించిన ఒక స్త్రీ పాత్ర (పునర్జన్మ నవలలో) చనిపోయి, మళ్ళీ జన్మ ఎత్తి పూర్వ జన్మలోని తన భర్తను గుర్తించి ఆతని చేరుకుంది ఇది విశ్వనాథ రచనల్లోని ఒక అంశం. దీనిని గ్రహించి పి ఎస్. గోపాలకృష్ణ 'పునరపి జననం' పేరుతో పేరడీ చేశాడు పురుషుడు చనిపోయి మళ్ళీ జన్మ ఎత్తి, పూర్వ జన్మలోని తన భార్యను గుర్తించి ఆమెను చేరడం ఆ పేరడీలోని ఇతివృత్తం

పురుషుడు తనకన్న వయస్సులో స్త్రీ ఎంత చిన్నదయినా, తానెంత ముసలి వాడయినా పెళ్ళి చేసుకుంటాడు. ఈ విధంగా పెళ్ళి చేసుకోవడం అసహజంగా తోచదు కాకుంటే జాలి వేస్తుంది. వయస్సులో పెద్దఅయిన స్త్రీని పురుషుడు పెళ్ళాడకు కాని ఇక్కడ ఒక జన్మ కూడా మారడంతో పురుషుడు మరీ నూనూగు మీసాలవాడు కావడం, భార్య దాదాపు నడివయస్సు స్త్రీ కావడంవల్ల సహజత్వానికి భంగం కలుగుతుంది. అందువల్లే పేరడీ ఆకట్టుకొంటుంది.

శ్రీశ్రీ శైలిలో వచన కవితల్లో సంప్రదాయ భావాలు, విశ్వనాథ మార్గంలో పద్యాల్లో విప్లవ భావాలు ప్రకటిస్తూ ఎవరైన పేరడీ చేస్తే బావుండేది. ఎక్కడా జరిగినట్లు తోచదు.

## X విలోమ పేరడీ (Inverted Parodies) :

ఉదాత్తమైన వస్తువును అపహాస్యం చేయడం అనేది పేరడీలో సామాన్యాంశం కాని అనుదాత్తమైన అంశాలను ఉదాత్తమైన పద్ధతిలో చెప్పడం విలోమ పేరడీ ఆంగ్లంలో ఈ రకం వాటిని Mock heroic అంటారు

క్రీ శ 5 వ శతాబ్దిలో Hegemon అనేవాడు The Battle of the Giants లో Epic Style లో ఒక అధముని గురించి రాశాడు. తెలుగులో ఉదాత్తమైన దైవస్తుతి పట్ల మాత్రమే పరిమితమైన దండక, సుప్రభాతాది ఛందోరీతుల్ని అల్పవిషయాలపట్ల ప్రయోగించడాన్ని చెప్పుకోవచ్చు.

| | | |
|---|---|---|
| దోమదండకం | — | భమిడిపాటి కామేశ్వరరావు |
| కాఫీ దండకం | — | కపిల కాశీపతి |
| తిట్ల దండకం | — | పూడిపెద్ది వెంకటరమణ కవి |
| వత్సల సుప్రభాతం | — | నాయని సుబ్బారావు |

ఈ విధంగా రకరకాలుగా పేరడీలను వింగడించుకోవచ్చు. పేరడీని గురించి మరింత స్పష్టంగా అవగాహన చేసుకోవడానికి అవకాశం కలిగించడం ఈ వింగడింపు ప్రయోజనం

**

# 4. పేరడీ – ఇతర ప్రక్రియలు

Parody is a complex genre, in terms of both its form and its ethos.

పేరడీకి ఇతర ప్రక్రియలకు గల సంబంధాన్ని పరిశీలించడం ఈ సందర్భంలో ఎంతయినా అవసరం. Pastiche, Burlesque, Travesty, Mockheroic, Satire, Caricature irany, Mimicry మొదలైనవాటికీ పేరడీకీ దగ్గర పోలికలున్నాయంటారు. Burlesque, Travesty లు పేరడీకి సమానార్థకాలుగా వాడిన దాఖలాలు ఆంగ్ల సాహిత్యంలోనే కనబడుతున్నాయి.

No good purposes can be served by a too rigid insistence up on nomenclature in a discussion of parody, burlesque and travesty in literature All three employ the device of incongrous imitation and deflationary treatment of serious themes for satiric purposes [1]

ఉదాత్తమైన అంశాన్ని అనుదాత్తమైన శైలిలో వివరిస్తే బర్లెస్క్ అవుతుంది అనుదాత్తమైన విషయాన్ని ఉదాత్తమైన రీతిలో వ్యక్తీకరిస్తే Mock heroic అవుతుంది. Irony తెలుగులో వ్యాజస్తుతి అలంకారంలో పర్యవసిస్తుంది. ప్యాస్టిచ్, బర్లెస్క్, ట్రావెస్టీ, ఐరనీ ఇవేవీ తెలుగులో ప్రక్రియా రూపం పొంది పెద్దగా స్థిరపడినవి కావు ఒక్క సెటైర్ అధిక్షేపరచగా· కారికేచర్-కార్టూన్‌గా; మిమిక్రి ధ్వన్యనుకరణ కళగా తెలుగులో స్థిరంగా ఉన్నాయి.

---

1. Princeton Encyclopaedia of poetry and poetics
   అనుదాత్తీకరణ - బర్లెస్క్ - అధిక్షేపం ఆర్ ఎస్ వెంకటేశ్వరరావు తెలుగు. ఏప్రిలు 1993

## అధిక్షేప రచన - పేరడీ :

'సంస్కరణం, అపమానోపశమనం, ఆత్మోన్నత్య ప్రతిష్ఠాపనం లక్ష్యంగా లేదా లక్ష్యాలుగా కలిగి సాహిత్యరూపంలో వెల్వడి ప్రాయికంగా పరిహాసాన్వితమై తోచే భావోద్వేగభరిత (emotional) దోషఖండనమే అధిక్షేపం.'[1]

అధిక్షేపరచన ఎప్పుడూ దోషోద్ఘాటనే గమ్యంగా వ్యతిరేక ధృక్పథంతో (Negative Attitude) తో కొనసాగే ప్రక్రియ అనా పదేశంగా అధిక్షిప్తాన్ని సంస్కరించాలనుకోవడం, ఎత్తిచూపడం, దుమ్మెత్తిపోయడం అధిక్షేప రచయిత చేసేపని. హాస్యదృష్టి అనుషంగికం. అధిక్షిప్తాన్ని బాధపెట్టటం కూడ జరుగుతుంది. అధిక్షిప్తుడికి, పాఠకుడికి ఈ విషయం తెలుస్తూనే ఉంటుంది. అయితే నిలబెట్టి అడిగితే మాత్రం తప్పించుకునే వీలు అధిక్షేప రచనలో రచయితకు ఉంటుంది పేరడీ అలాకాదు హాస్యసంపదనే లక్ష్యంగా సానుకూల దృష్టి (Possitive attitude) తో కొనసాగే ప్రక్రియ అయినా సంస్కరణాభిలాషా, అధిక్షేపాత్మక దృష్టి ఉంటాయి. కానీ అవి అప్రధానాలు మాతృకను నవ్వుల పాలు చేయడం, లాఘవపరచడం ప్రధానంగా ఉంటుంది. పేరడీ మూలరచనను పూర్తిగా అనుకరిస్తుంది చూడగానే మాతృక తెలిసిపోతుంది పేరడీస్టు తానాగేయాన్నో ఖండికనో పేరడీ చేయలేదని తప్పించుకోవడానికి ఏమాత్రం వీలు లేదు పాఠకుడికి మాతృక తెలియలేదంటే పాఠకుల దోషం కాదు- పేరడీస్టు విఫలమయినట్లు లెఖ్ఖ

అధిక్షేప రచన భావప్రాధాన్యం కలిగింది తన భావాన్ని ప్రకటించడానికి అధిక్షేప రచయిత తనకిష్టమైన ఏ రూపన్నాయినా (వ్యాసం, కవిత్వం, కథ, మొ॥) స్వీకరించవచ్చు అధిక్షేప రచయితకు ఆ స్వేచ్ఛ ఉంది. పేరడీ మాతృకమీదే ఆధారపడుతుంది మాతృక ఏ రూపంలో ఉంటే పేరడీ విధిగా ఆ రూపంలోనే వెలువడాలి ప్రక్రియను గ్రహించడంలో పేరడీస్టు పూర్తిగా అస్వతంత్రుడు తన కిష్టమైన ప్రక్రియ లో పేరడీ చేసే స్వేచ్ఛ అతనికి లేదు. దేనిని దృష్టిలో పెట్టుకుని అధిక్షేప రచన వచ్చిందో, పేరడీ వచ్చిందో

---

1 అధిక్షేపం: ఆర్.ఎస్. వెంకటేశ్వరరావు, తెలుగు, నవంబరు 1990.

పాఠకుడికి తెలియకపోతే మాత్రం ఈ రెండూ వృథా అయిపోతాయి. తెలిసిన వాడికి ఎంతో ఆనందాన్నిస్తాయి. ఈ రెంటిలోనూ సమానంగా ఉన్న అంశాల్లో ఇదొకటి. రెంటిలోనూ హాస్యానికి చాలినంత చోటు ఉంటుంది. కాకపోతే కలిగే అనుభవం వేరు. ఒకటి గిల్లితే, మరొకటి గిలిగింతలు పెడ్తుంది. అంతే. రెండూ ఏదో ఒకదాన్ని అనుకరించేవే అయితే అనుకరించే దృక్పథాల్లోని వైరుధ్యాల వల్ల వేరయిపోతున్నాయి.

పేరడీలో అధిక్షేపం గోచరించవచ్చు అధిక్షేప రచనలో పేరడీ కనిపించవచ్చు. అయినా రెండు వేరు వేరే. ఎందుకంటే, అధిక్షేపం మచ్చుకైనా కనబడని పేరడీ లుంటాయి పేరడీని వాడుకోని అధిక్షేప రచనలూ అనేకం ఉంటాయి.

## పేరడీ - మిమిక్రి :

"హాస్యస్ఫోరకమైన అనుకరణ ధ్వని సంబంధం అయితే అది మిమిక్రి; ఒక రచయిత పద్య లేదా గద్య శైలిని హాస్యస్ఫోరకంగా అనుకరిస్తే అది పేరడీ"[1] అని ఒక్క మాటలో మరోమాట అవసరం లేకుండా చెప్పాడు శ్రీరమణ

అధిక్షేపాన్ని పేరడీ నుండి వేరుచేసి చూపినట్లే మిమిక్రీని కూడ వేరు చేసి చూపవచ్చు. అన్యాపదేశంగా అనుకరిస్తూ అధిక్షేప రచన సాగిస్తాడు మిమిక్రీలో, నవ్వు వచ్చేలా మూల వ్యక్తిని అనుకరించి 'మాట్లాడుతాడు ' ఈ 'మాట్లాడడం' అన్యాపదేశంగా అధిక్షేపం గమ్యంగా కాక సాధారణంగా ఆకర్షించడం కోసం ఆనందింప చేయడం కోసం హాస్యపూరితంగా ఉంటుంది మూల వ్యక్తిని నోటితో బాగా అనుకరించి మెప్పు పొందడమే మిమిక్రికి ప్రయోజనం. మిమిక్రి కళకు అక్షర రూపం పేరడీ మాతృక వాగ్రూపమైతే మిమిక్రీ, సాహిత్య రూపమైతే పేరడీ.

**

ఈ విభాగమంతా అక్టోబరు' 90
'తెలుగు' మాసపత్రికలో ముద్రితం.

---

1 శ్రీరమణ పేరడీలు (1980) పుట. 9.

# 5. క్రీడాభిరామము

దీని కర్త వినుకొండ వల్లభరాయుడు అని కొందరూ, కాదు శ్రీనాథుడే అని మరి కొందరూ అభిప్రాయపడుకున్నారు తెలుగు సాహిత్యంలో ఈ క్రీడాభిరామంలోనే మనకు మొదటిసారిగా పేరడీ ధోరణులు కనిపిస్తాయి 'హేళన కావ్యము సయితము కావ్య గుణోపేతమైన సుందర వస్తువుగా తీర్చిననే తప్ప ఇది నిలబడదు. ఈ (క్రీడాభిరామ) వీథి శ్రీనాథుని ప్రజ్ఞవలన నైషధాదులతో పాటు అనశ్వరమైయున్నది. అందువే క్రీడాభిరామము హేళన కావ్యములలో మొదటిదే కాక ఉత్తమోత్తమమునునైనది' 1 అని పండితుల అభిప్రాయం కాకతీయులనాటి ఏకశిలానగరంలోని సమస్త పౌరజీవితాన్ని 'సెల్యూలాయిడ్'పై చూపిన హాస్య అధిక్షేపాత్మక సాంఘిక కావ్యం క్రీడాభిరామం ఇది తెలుగులో తొలి ఉత్పాద్య కావ్యం కూడా కాసల్నాటి మంచనశర్మ, టిట్టిభసెట్టి అనే కోడె వయసు మిత్రు లిద్దరు సూర్యోదయం మొదలు సూర్యాస్తమయం వరకు ఓరుగల్లులో చూసిన వింతలు విశేషాలు వినోదాలను సరస సుందరంగా చిత్రించిన కావ్యం ఇది. ఇందులో అంకురప్రాయంగా కనిపించే పేరడీ ధోరణులను మాత్రం గమనిద్దాం.

మంచనశర్మ టిట్టిభసెట్టితో కలిసి ముందుకు సాగుతూ శుభశకునాలు చూశాడట.

గార్గ్య సిద్ధాంత మత ముషఃకాల కలన
శకున మూనుట యది బృహస్పతి మతంబు
వ్యాసమతము మనః ప్రసాదాతిశయము
విప్రజన వాక్యమరయంగ విష్ణుమతము. (66)

ఈ పద్యానికి మూలమైన పద్యం శ్రీనాథుని భీమఖండంలో కనిపిస్తుంది.

---

1. పింగళి లక్ష్మీకాంతం ఆంధ్ర సాహిత్య చరిత్ర (1970) పుట 89.

గార్గ్య సిద్ధాంత మత ముషః కాల కలన
శకున మూనుట యది బృహస్పతి మతంబు
విప్రజన వాక్య మరయంగ విష్ణుమతము
సర్వ సిద్ధాంత మభిజిత్తు సమ్మతంబగు (3.41)

వ్యాసులవారూ, అగస్త్యమహర్షీ కలిసి భీమేశ్వరుణ్ణి సందర్శించడానికి తగిన సుముహూర్తం గురించి తలపోసే సందర్భంలోది భీమఖండంలోని పద్యం.

ఈ సన్నివేశంలో సూత్రధారులు మహర్షులు. వారు చేస్తున్న పని పునీతమైన, ముక్తిదమైన భీమనాయకుని సందర్శనం. దీంతో వారేగాక పాఠకులు కూడ భక్తి భావ ప్రపూరితు లవుతారు మరి ఇలాంటి ఘట్టంలో రచింపబడిన పద్యం క్రీడాభిరామంలో ఎలా మారిపోయిందో గమనించవచ్చు. విలాసపురుషులైన మంచన, టిట్టిభులు వారవిలాసినీ పరిష్వంగంలో పరవశించడం కోసం శకునాలను చూస్తున్నారు. అవిఘ్నమస్తుగా తమ పురభ్రమణం వేశ్యాసంగమాది కాంక్ష లీడేరాలని తలపోస్తున్నారు.

ఒక పవిత్ర కార్యనిర్వహణార్థం శుభశకునాలను పరిశీలించడం సముచితం. కాని ఒక సిగ్గుమాలిన పని కోసం గార్గ్య, వ్యాస, బృహస్పతి సిద్ధాంతాలను బరిలోకి లాగడం అనేది అనౌచిత్యం. అయితే వ్యాసుమహర్షి కదెంత ముఖ్యమో మంచనకూ ఇదీ అంతే ముఖ్యం ఎవరి అవసరాలు వారివి. ఎవరి ఆలోచనలు వారివి క్రీడాభిరామకర్త 'కథాప్రారంభం' ఈ పద్యంతో గావించడం సంకల్ప పూర్వకమే. శ్రీనాథుని భీమఖండంలో ఉదాత్తమైన సన్నివేశంలో ఎదురైన విచికిత్సను చిత్రిస్తున్న పద్యాన్ని 'అనువుగానిచోట' అన్వయించి హేళన చేయడమే కాక వేశ్యాసక్తిని అధిక్షేపించడం కూడ కనిపిస్తుంది అందువల్ల ఈ పద్యం పేరడీగా నిలుస్తుంది శ్రీనాథుని కృతుల్లో చాలాచోట్ల ఒక ఉత్తమ సన్నివేశంలో ప్రయోగింపబడిన జాతీయాలు, కవి సమయాలు, రచన అంతా పూర్తిగా లజ్జాస్పదమైన విషయానికి ఆపాదించి అధిక్షేపించడం, నవ్వుల పాలు చేయడం క్రీడాభిరామంలో గుర్తించవచ్చు.

క్రీడాభిరామంలో మంచనశర్మ పొట్టేళ్ళను, కోళ్ళను విటులు గాను, కాబోయే దేవ వేశ్యా భుజంగులుగాను వర్ణించడం వైపరీత్య లక్షణం.

యోధానుయోధులు (రామ రావణులు ఇత్యాది) పోట్లాడుతుంటే దేవతలు 'మెచ్చుకొని' 'పూలవాన' కురిపిస్తారు వీరులు రణరంగంలో మరణిస్తే సూర్య లోకం ఛేదించుకొని సూటిగా వీర స్వర్గానికి చేరి రంభాద్యప్సరసలతో సుఖిస్తారని భారతీయుల విశ్వాసం. సాహిత్యపరంగా అయితే ఇది అతార్కికమైన ఒక కవిసమయంగా భావించవచ్చు ఈ భావజాలాన్ని కోడిపుంజుల పందానికి వల్లభరాయ లన్వయించడం హాస్యభాజనం విలోమ పేరడీలకు ఇవన్నీ సము చిత లక్ష్యాలు.

కోడిపుంజులు 'చారణ గంధర్వ గరుడ విద్యాధర శ్లాఘనీయంబుగా' అవక్రవిక్రమం చూపాయనడం వికటత్వమే

హా! ఖగేంద్రంబులార! కయ్యమున నీల్గి
పోవుచున్నారె మీరు దేవతా భువనమునకు
మీరు రంభాతిలోత్తమా మేనకాది
భోగ కార్యార్థమై కోడి పుంజులార!

యుద్ధరంగంలో ప్రాణాలు విడిన వీరులు వీర స్వర్గ మలంకరించడం అనేది మానవులకే నియతం అని కవి సమయం ద్వారా భావించాలి. మరి మానవేతరాలు పోరులో మరణిస్తే వాటికి మాత్రం వీర స్వర్గ ప్రాప్తిని ఎందుకు కల్పించరాదన్న తలంపు ఇక్కడ హాస్యోత్పత్తికి మూలమైంది. మానవులకు అందునా సామాన్య మానవులకు గాకుండా ప్రాణాలు తృణప్రాయంగా ధార పోసిన వీర పురుషులకు మాత్రమే అనుభోగ్యమానమైన వీర స్వర్గ ప్రాప్తి అనే ఉదాత్తమయిన కవిసమయాన్ని మానవేతరాలకు, కుక్కుటాది క్షుద్రజీవుల కాపాదించి అనుదాత్తీకరించడం వల్ల పేరడీ అయింది. ఆ విశ్వాసాన్ని అధి క్షేపిస్తూ పేరడీ ప్రయోజనాత్మకమైంది కూడ రంభాదులకు కోడిపుంజులతో సంభోగం అనే ఊహ అద్భుత పరిహాసభాజనం.

ఉదాత్తమైన వస్తువును అనుదాత్తీకరించి లాఘవాన్ని ఆపాదించడం పేరడీకి సహజధర్మం అట్లే అనుదాత్తమయిన వస్తువిశేషణాలను మహోదాత్త మైన దైవ సంబంధమయిన వానికి అంటగట్టితే కూడా పేరడీయే అవుతుంది.

సీ॥

గీ॥ జారచోరాది ధూర్త విహారభూమి
దైన్య కార్పణ్య జలరాశి ధవళకరుడు
కలిమహారాజు నెచ్చెలికాడు, లోభు
డతడు సురలకు జోహారువనుచు మ్రొక్క.

అని శ్రీనాథుడు ఎంతో సహజంగా లోభిని శృంగారనైషధం (7-55)లో వర్ణించాడు. ఈ 'జారచోరాది ధూర్త విహారభూమి' అనే పదబంధాన్ని తీసుకొని వినుకొండ వల్లభరాయడు-

కారవేల్లమతల్లికా కల్పవల్లి
కడుపు నిండారగాంచిన కొడుకు
జారచోర మహాధూర్త చక్రవర్తి
దేవవేశ్యా భుజంగుడు తెలుగుభర్త

అని హీనమైన లోభ మనఃప్రవృత్తిని తీసుకొనివెళ్ళి శ్రీకాకుళాదీశ్వరుని కాపాదించడం వల్ల పేరడీ అయింది.

'దేవవేశ్యా భుజంగుని'గా శ్రీనాథుడు భీమఖండంలో (2-13) ద్రాక్షారామ భీమేశ్వరుని స్తుతించడాన్ని యథాతథంగా వల్లభరాయడు శ్రీకాకుళాదీశ్వరుని పట్ల ప్రయోగించాడు. కనుక ఇది పేరడీయేనని బి. వి. సింగరాచార్య అభిప్రాయం 1 కాని భీమ ఖండంలోను క్రీడాభిరామంలోను దేవతలు వేరయినా స్తుతి ఒకటే, భక్తి భావం సమమే సమానాంశాలపట్ల అనుకరణ ఉండడం, అనుభూతిలో వైవిధ్యం లేకపోవడం మూలాన ఇక్కడ '[illegible]' డనేది భీమ ఖండానికి కేవలానుకృతియే తప్ప పేరడీ కాజాలదు. 'దేవవేశ్యా భుజంగు'డని దేవదేవుని సంబోధించడంలో కవిలోనున్న భక్తి కన్నా రక్తియే మిన్నగా గోచరిస్తుంది.

అసలు క్రీడాభిరామంలోని గోవింద మంచన శర్మ, టిట్టిభసెట్టులు శ్రీనాథ, అవచితిప్పయ సెట్టుల స్త్రీ లౌల్యాన్ని వ్యంగ్యంగా పరిహసించడానికి కల్పించబడిన కార్టూన్ మూర్తులేనన్న బి. వి సింగరాచార్య అభిప్రాయాన్ని కూడా కాదనజాలం 1

**

**27-10-90 ఆంధ్రభూమి దిన పత్రికలో ప్రచురితం.**

---

1 ఎమెస్కో వారి క్రీడాభిరామానికి రాసిన 'సమాలోకనం'లో. పుటలు 41 - 43.

# 6. తెనాలి రామకృష్ణుడు

పేరడీ లక్షణాలుగా చెప్పుకొనే ప్రతి లక్షణమూ పొల్లుపోకుండే సరిపోయే పేరడీ చాటువుల్లో లభించడం విశేషం వికటకవి తెనాలి రామకృష్ణుని ప్రప్రథమ పేరడీ కవిగాను, అతడు కవయిత్రి మొల్ల పద్యాన్ని అధిక్షేపిస్తూ చెప్పిన పద్యాన్ని ప్రప్రథమ పేరడీ పద్యంగాను నిర్ణయించవచ్చు.

ఆతుకూరి మొల్ల తెలుగు కవయిత్రుల్లో అగ్రశ్రేణికి చెందింది. ఆమె శ్రీకృష్ణదేవరాయల ఆస్థానాన్ని సందర్శించినట్లు జనశ్రుతి. ఆమె కృష్ణదేవరాయలను ఈ పద్యంతో ప్రస్తుతించింది:

అతడు గోపాలకుం డితడు భూపాలకుం
　　　డెలమినాతని కన్న నితడు ఘనుడు,
అతడు పాండవ పక్షు డితడు పండితరక్షు
　　　డెలమి నాతని కన్న నితడు ఘనుడు
అతడు యాదవపోషి ఇతడు యాచకతోషి
　　　యెలమి నాతని కన్న నితడు ఘనుడు
అతడు కంసధ్వంసి ఇతడు కష్టధ్వంసి
　　　యెలమి నాతని కన్న నితడు ఘనుడు

పల్లెకాతండు పట్టణ ప్రభువితండు
స్త్రీల కాతండు పద్మినీ స్త్రీల కితడు
సురలకాతండు తలప భూసురులకితడు
కృష్ణుడాతండు శ్రీమహాకృష్ణుడితడు.[1]

శ్రీకృష్ణునకు -కృష్ణరాయలకు మధ్య ఉండే తేడాలను చెప్తూ శ్రీకృష్ణుడి కన్నా కృష్ణదేవరాయలే మిన్న అని నిరూపిస్తున్న చాటు పద్యమిది. 'అతడు'

---

1. జి లలిత తెలుగులో చాటు కవిత్వం (1981) పుట 245.

'ఇతడు' అన్న సర్వనామాలను కర్తృవాచిగా గ్రహించి ప్రతి అర్ధపాదంలోనూ భేదప్రతిపాదకాలైన విశేషణాలను కూరుస్తూ ద్వితీయార్ధపాదంలో అతనికన్న ఇతడే ఘనుడని నిశ్చయంగా తెలపడం ఈ పద్యంలో కనపడే శిల్పం.

మొల్ల పద్యాన్ని విన్న వికటకవి తెనాలి రామకృష్ణుడు తన సహజ ధోరణిలో దానిని అనుకరిస్తూ ఒక పద్యం చెప్పాడని అంటారు ఈశ్వరునితో ఎద్దును పోలుస్తూ చెప్పిన పద్యం అది

ఆతడంబకు మగం డితడమ్మకు మగండు
నెలమి నాతనికన్న నితడు ఘనుడు
అతడు శూలము ద్రిప్పు నితడు వాలము ద్రిప్పు
నెలమి నాతనికన్న నితడు ఘనుడు
ఆతడమ్మున నేయు నితడు కొమ్మున డాయు
నెలమి నాతని కన్న నితడు ఘనుడు
అతని కంటను చిచ్చు నితని కంటను బొచ్చు
నెలమి నాతని కన్న నితడు ఘనుడు
దాతయాతండు గోనెల మోత యితడు
దక్షుడాతండు ప్రజల సంరక్షుడితడు
దేవుడాతండు కుడితికి దేవుడితడు
పశుపతి యతండు శ్రీ మహా పశువితండు.[1]

మాతృకవలెనే ప్రథమార్ధంలో పోలిక, ద్వితీయార్ధంలో నిశ్చయార్థం నిక్షేపిస్తూ పద్యరచన కొనసాగింది సామాన్యమైన ఒక ఎద్దును కవితావస్తువుగా స్వీకరించి దానిని మహాశివుడితో పోల్చి చెప్పడమే కాకుండా శివుడికన్న మిన్న అని నిరూపించే యత్నం చేయడం పాఠకులకు నవ్వు తెప్పిస్తుంది మాతృకలో కృష్ణరాయలకు కృష్ణుడితో పోలిక చెప్పినప్పుడు ఒక చక్రవర్తిని విష్ణువుతో పోల్చడం భారతీయ సంప్రదాయంలో ఉన్నదే కావడం మూలాన (నా విష్ణుః పృథివీపతిః) పాఠకులు గంభీర మనస్కులయి పద్యాన్ని వింటారు కాని

1. జి లలిత తెలుగులో చాటుకవిత్వం (1991) పుట 245.

అనుకృతపద్యంలో అలాకాదు శివుడు పార్వతికి మగ డయితే ఆ వృషభరాజం ఒక ఆవుకి మగ డనీ; శివుడు త్రిశూలాన్ని తిప్పితే ఇతడు తోకను తిప్పు తాడనీ; అతని కంట్లో అగ్ని ఉంటే ఇతని కంట్లో బొచ్చు ఉంటుం దనీ, ఆ మహా శివుడు దాతకాగా ఇతడు మోతగా డని; ఆయన దేవు డయితే ఈయనేమో కుడితికి దేవుడనీ శివునికి - ఎద్దుకు సారూప్యాలు తెచ్చి ఎద్దును శివునికన్నా అధికంగా నిరూపించడం తెనాలి రామకృష్ణుని వికటప్రవృత్తికి విశిష్ట ప్రతీక కృష్ణరాయలు ఎంత మహారాజయినా, సాహితీ సమరాంగణ సార్వభౌముడయినా, ఒక మానవుడే ఒక సామాన్య మానవుని ఆద్యంతాలు లేని ఆ పరమేశ్వరునితో పోల్చి అదికుడనడం అతిశయోక్తే తప్ప ఔచితీమంతం కాదని కవయిత్రి మొల్లను అధిక్షేపించడం కూడ రామకృష్ణుని పద్యంలో గమనించవచ్చు.

చాటు వాఙ్మయవారాశిలో లభించిన మేలువన్నె రత్నం ఈ పేరడీ పద్యం.

ఆంధ్ర కవితా పితామహుడు అల్లసాని పెద్దన చేసిన 'అమవసనిసి' పద ప్రయోగాన్ని అవహేళన పూర్వకంగా అధిక్షేపిస్తూ తెనాలి రామకృష్ణుడు చెప్పాడన్న పద్యం సాహితీ లోకంలో సుప్రసిద్ధమైందే.

కలనాటి ధనము లక్కర
గలనాటికి దాచ కమలగర్భునివశమా?
నెలనడిమి నాటి వెన్నెల
లలవడునే గాదె బోయ అమవసనిసికిన్

ఇది పెద్దన చాటువు. రామకృష్ణుని చాటువు వినేదాక ఈ పద్యంలోని విశేషం మనకు బోధపడదు.

ఎమితిని సెపితివి కపితము?
బ్రమపడి వెరిపుచ్చకాయవడిదిని సెపితో?
ఉమెతఃకయ తిని సెపితో?
అమవసనిసి అన్నమాట అలసని పెదనా[1]

---

1 రావూరి దొరసామిశర్మ తెలుగులో తిట్టుకవిత్వం (1968) పుటలు 28-34

పెద్దన పద్యంలో 'అమవసనిసి' అని పద్యం చివర అన్ని లఘువులే వరుసగ రావడం మూలాన పద్యం నడక కుంటుపడుతుంది. శయ్యాభంజకమైన 'అమవసనిసి' అన్న పదప్రయోగాన్ని అతిగా విస్తరించి అన్ని లఘువులతో పద్యం చెప్పడంవల్ల మాతృకలోని విలక్షణతను భూతద్దంలో పెట్టి ప్రదర్శించి నట్లయింది. 'అల్లసాని పెద్దన' 'అలసనిపెదన' కావడంతో పద్యంలో వికృతీ కరణం తారస్థాయికి చేరుకొందని చెప్పవచ్చు.

రాయలు స్వయంగా తన కాలికి తొడిగిన గండపెండేరపు ఘలంఘలలకు మురిసిపోతూ పెద్దన ఒకనాడు ఇలా అన్నాడట.

వదలక మ్రోయు ఆంధ్రకవి వామపదంబుననున్న నూపురం
బుదిత మరాళ కంఠరవనిదోక్తుల ఏమని పల్కుపల్కుడీ....'

ఇది విన్న వెంటనే పక్కనే ఉన్న తెనాలి రామకృష్ణుడు ఏమాత్రం తడుముకోకుండా ఇలా పూర్తిచేశాడట:

గుదియల కామి నున్నని త్రికోణముపై గల భాగ్యరేఖ నీ
నుదుటను లేదు లేదనుచు నూరు తెరంగుల నొక్కి పల్కెడున్.

పెద్దన పద్యంలో ఉత్తరార్థం, రామకృష్ణుని పద్యంలో పూర్వార్థం ఏమున్నాయో, అసలున్నాయో లేదో కూడ తెలియదు అల్లసాని పెద్దన రెండు పాదాలు చెప్పిన వెంటనే తెనాలి రామకృష్ణుడు కూడ అదే ధోరణిలో పద్యం పూర్తిచేసి అహంకారం తగదని మెత్తగా చురక అంటించాడు.

స్తుతమతియైన ఆంధ్ర కవి ధూర్జటి పల్కుల కేల కల్గెనీ
యతులిత మాధురీ మహిమ ...

అని భువన విజయంలో సారస్వత సంగోష్ఠిలో కృష్ణరాణ్మహేంద్రుడు ధూర్జటిని ప్రశంసించాడు. ఈ పద్యాన్ని ఎవరు ఎలా పూరించారో తెలియదు.[1]

1. స్తుతమతియైన యాంధ్ర కవి ధూర్జటి పల్కుల కేల కల్గె నీ
యతులిత మధురీ మహిమ నా మును మీ పెదతాత చాల స
న్నుతి గనె కృష్ణరాయల మనోజ్ఞ సభన్వినుమీవనట్లు మ
త్కృత బహుమాన వైఖరుల కీర్తి వహింపుము ధాత్రి లోపలన్

(మిగతా పక్క పేజీలో)

హా! తెలిసెన్, భువనైకమోహనో
ద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతాపహారి సం
తత మధురాధరోదిత! సుధారసధారల గ్రోలుటంజుమీ

అని రామకృష్ణుడు అధిక్షేప పరిహాస పూర్వకంగా చేసిన పూరణ మాత్రం లభించింది. ధూర్జటి శైలికి, సమాస రీతికి మూలం వారవనితా సాంగత్యమేనని ఒక హేత్వాభాసాన్ని కల్పించి, ధూర్జటి రచనా రీతికి చేసిన వికృతానుకరణం ఈ పూరణం. ఈ పద్యం మొదటి భాగం కృష్ణరాయలు తన ధోరణిలో తాను ధూర్జటి గురించి చెప్పింది కాగా రెండవ భాగం రామకృష్ణుడు ధూర్జటి గురించి చెప్పింది.

రంజన చెడి పాండవు లరి
భంజనులై విరటు గొల్వ పాల్పడిరకటా!
సంజయ! ఏమందు విధిని
కుంజర యూధంబు దోమ కుత్తుక జొచ్చెన్

అని తెనాలి రామకృష్ణుడు మొదట సమస్యాపూరణం చేసి, అతనే తిరిగి-

గంజాయి తాగి తురకల
సంజాతుల గూడి కల్లు చవిగొన్నావా?
లంజల కొడుకా ఎక్కడ
కుంజర యూధంబు కుత్తుక జొచ్చెన్?

దీనిలో కూడా ఒక రకంగా స్పష్టాస్పష్టంగా పేరడీ ఛాయలున్నాయి. కాని జన వ్యవహారంలో ఉన్న కథ ప్రకారం అయితే అనుదాత్తంగా తొలుత పూరించి తర్వాత ఉదాత్తీకరించాడట.

---

ధూర్జటి మనుమడైన కుమార ధూర్జటి వేంకటార్యుడు తన కృష్ణరాజ విజయము (1-29) న కృష్ణరాయలు ధూర్జటిని సన్మానించిన సంగతి గ్రంథస్థం చేశాడు

అలాగే 'అపశబ్దభయంనాస్తి అప్పలాచార్య సన్నిధౌ' అని అప్పలాచార్యుల గురించి ఉన్న శ్లోకానికి అధిక్షేప అవహేళనాత్మకంగా 'అనాచార భయం నాస్తి శిష్ణమ్మాత్రస్య సన్నిధౌ' అని విడంబించడం పేరడీయే

రాజగురువులైన తాతాచార్యుల మీది భక్తి ప్రపత్తులు మేరమీరిపోయి అప్పయ దీక్షితుల కన్నా గొప్పవాడని కీర్తించడం మొదలుపెట్టారు అప్పటి వైష్ణవులు

అప్పయ్య దీక్షితాత్పూర్వం
తాతః పూజ్యోన సంశయః

ఈ వీరపూజ గిట్టని రామకృష్ణుడు

ముఖ ప్రక్షాళనాత్పూర్వం
గుద ప్రక్షాళనం యథా

అని నీచోపమతో ఆ గురుశిష్యులను ఆట పట్టించాడు. అతడంబకు మగడు, అమవసనిసి పద్యాలు తప్ప ఇక్కడ పేర్కొనబడిన పద్యాలు నూటికి నూరు శాతం పేరడీలని కచ్చితంగా చెప్పలేం పేరడీలు కావనీ నిరాకరించలేం. ఇవి ఒకరకం సందేహాస్పద పేరడీలు (Suspesious parodies). వీటిలో పేరడీ ఛాయలు దోబూచులాడుతున్నాయని మాత్రం నిస్సంశయంగా చెప్ప వచ్చు ఈ విధంగా చాటు పద్య వాఙ్మయాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే మరికొన్ని పేరడీలు దొరకవచ్చు

**

# 7. చంద్రరేఖావిలాపము

పేరడీకి ఒక నిర్దుష్టమైన ఆకృతి, సాకల్య రూపం కూచిమంచి జగ్గకవి (1700 - 1760) రచించిన చంద్రరేఖా విలాపంలో కనిపిస్తుంది. ఈ రచనకు కవి స్వార్థమే హేతువు కావచ్చు చింతలపాటి నీలాద్రిరాజు అనే జమీందారు చేసిన వంచనవల్ల జగ్గకవి ఆగ్రహోదగ్రుడై చంద్రరేఖావిలాపం వెలువరించడాని చెప్తారు. మొట్టమొదటి పద్యం మొదలుకొని చిట్టచివరి పద్యంవరకు బహుశా మనకు దొరకని చంద్రరేఖా విలాసానికి ప్రతిపద్య వికృతీకరణం కావచ్చు.

ఎంతో ఆశతో రచించిన కవికి 'నిరసన'యే సత్కారమైతే - చీకొట్టడమే ప్రశంసలైతే మనస్సు కుతకుత ఉడకక తప్పదు వికటించిన ప్రతిభకు లక్ష్యం వెలువడక తప్పదు ఆ మహావేశంలో కొన్ని బూతులు, మరికొన్ని అసభ్యాలు దొర్లడం సహజం. అది మానవ బలహీనత.

ఒక విద్వాంసుని ప్రతిభ వికటిస్తే, హృదయం ఆక్రోశిస్తే ఎలాంటి కావ్యం అవతరించగలదో తెలుసుకోవడానికి తెలుగులో ఉన్న ప్రబలసాక్ష్యం ఈ కావ్యం. గుంటూరు శేషేంద్రశర్మ అన్నట్లు "హాస్యరసాన్ని గౌరవించి, ఆ రసాన్ని ప్రధానంగా స్వీకరించి, సంప్రదాయ సముద్ధతమయిన శృంగార రసాన్ని ఆభాసంచేసి జంకూగొంకూ లేకుండా ఒక కావ్యాన్నే వ్రాసి పడేసిన హాస్యరస వీరుడు కూచిమంచి జగ్గకవి ఒక్కడే ఉన్నాడు "1

చంద్రరేఖా విలాపంలో కవి సమయాల్లో వికటత్వం ఉపమానాల్లో మార్పు నాయక లక్షణాల్లో విపరీత రీతి, వర్ణనల్లో వ్యత్యస్తం, భావంలో తల తిరుగుడు, గమనంలో తలకిందులు, అనూచాన ధోరణి అంటే మంట, ప్రబంధ బంధాల తెంచివేత, అపహాస్యరసపోషణ అడుగడుగునా గోచరిస్తాయి కావ్యాది మొదలు కావ్యాంతం వరకు, నాయకాభ్యుదయం మొదలుకొని నాయికా సంద

1. సాహిత్య కౌముది (1968) పుట 113

ర్ణనం, విరహవేదన, కళ్యాణం వరకు సమస్తం అస్తవ్యస్తమే వికట ప్రకటనమే హాస్యరస లక్ష్మికెత్తిన విజయకేతనం చంద్రరేఖావిలాపం.

**అవతారిక :** ఇష్టదేవతాస్తుతి, కృతిపతి వైభవ వర్ణన, కావ్యస్వీకర్త కావ్యకర్తను సంభావించడం, కవి ప్రతిభను కీర్తించడం, గ్రంధరచనకు తాంబూలమివ్వడం, షష్ఠ్యంతాలు ఇత్యాది కావ్యావతారికాంశాలన్నింటిని జగ్గకవి విలోమమార్గంలో విడంబించాడు

కృత్యాదిపద్యం సాధారణంగా కృతిభర్తకు శుభంబగుగాక అని సాగుతుంది 'మంగళాదీని' అనేది భారతీయ సాహితీ సంప్రదాయం కావ్యరచనకు పేరకుడైన గ్రంథ గ్రహీత చల్లగా ఉండేనే రచన పూర్తవుతుంది. కావ్యాది పద్యంలో పొరపాటున కూడ ఫలానవాడికి శత్రువైనవాడు, ఫలాన వాడిని చంపినవాడు (కంసారీ, కంసాంతకుడు) లాంటి ప్రయోగాలు రాకూడదు. వ్యుత్పత్త్యర్థాల రీత్యా కోపతాపాలు వ్యక్తం చేసేవి కాకూడదు. వీలయినంత ప్రసన్నమధురంగా కావ్యాది పద్య రచన సాగాలి.

శ్రీకంఠుండు, భుజంగభూషణుఁడు, భస్మీభూతపంచాస్త్రుఁడ
స్తోకాటోప బలప్రతాపపురరక్షోదక్ష సంశిక్షణుం
డాకాశోజ్జ్వల కేశపాశుఁడు, త్రిశూలాంకుండు రుద్రుండుతా
వీకం జింతలపాటి నీల నృపతిన్ వీక్షించు నేత్రత్రయిన్ 1.1

ఇది ఈ విలాస కృతికి శ్రీకారం చుట్టుతూ చెప్పిన పద్యం ఇటువంటి పద్యం పూర్వకావ్యాలలో కాగడా పెట్టి వెతికినా కానరాదు పూర్వ కావ్యాల అవతారికలన్నీ కృతికర్త, కృతిభర్తలమధ్య విలసిల్లిన సత్సంబంధాల కారణంగా రచింపబడ్డాయి ఇది మాత్రం జగ్గకవి- నీలాద్రిరాజుల నడుమ పొడ సూపిన ద్వేషాసూయలు, వైరుధ్యాలు మూలంగా వెలువడింది. రుద్రుడు తన మూడు కళ్ళతోనూ కృతిభర్తను కటాక్షించుగాక అని చెప్పడం వికటత్వం

'శ్రీమజ్జగన్నాథ దేవ కరుణాకటాక్ష వీక్షణానుక్షణ సంలబ్ధ సరస కవితా విచిత్రు'డైనవాడూ, పరమ విష్ణుభక్తుడూ అయిన జగ్గకవి మొదటి పద్యంలో శివస్తుతి గావించడం అసలు సిసలయిన వికటత్వం.

నలుమూలలకు పాకిన నీలాద్రిరాజు అపకీర్తి నలుపులను, అనునిత్యం వెల్లువలయిసాగిన అతని పిసినారితనాన్ని, నలుగురిలో నవ్వులపాలయిన అతని పందతనపు చిందులను, సిగ్గువిడిచి కొనసాగిన అతని జారవిహారాలను, చంద్రరేఖా స్పర్శతో అబ్బిన సుఖరోగపరంపరా విలసనాన్ని కృతిభర్త వైభవాన్ని ప్రశంసించవలసిన సమయంలో పేర్కొనడం కావ్యస్వీకర్త ఎడల కవికి ఉన్న ఏహ్యాభావానికి దర్పణం

'పుర్గుణాధ్యక్షుండును, సర్వావలక్షణుండును, బాలరండా సమాకర్షణ కుతూహలుండు.. ' అని వచనంలో నీలాద్రిరాజును ప్రస్తావించడం మొదలైనదంతా ప్రబంధ పద్ధతికి విపర్యయమే.

సాధారణంగా షష్ఠ్యంతాలు కృతిపతిపై ప్రశంసల పూలజల్లు కురిపిస్తాయి. కాని ఈ షష్ఠ్యంతాలు కవి క్రోధాగ్ని కీలలకు ప్రతిరూపాలయి నీలాద్రి నెత్తిపై నిప్పులు క్రక్కుతున్నాయి.

క్రూరునకు, సాధుబాధా
చారునకున్, యోనిపాన సరశీలునకున్
జారునకు విప్రతతి ధన
చోరునకున్, బుద్ధిహీన శుభరహితునకున్ 1.37

అతిమూఢశీలునకును, సం
తత మృగయాఖేలునకును, దాసవనితా
వితతరతిలోలునకు, ఘన
పతిత కుజనపాలునకును బతయాళునకున్ 1.39

షష్ఠ్యంతాలలో పరిచయమున్న వారందరికీ ఈ పద్యాల్లోని వికృతత్వం సుబోధకమే.

'అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన. ' అని సాధారణంగా ఉండవలసినచోట 'అనభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన .' అని జగ్గకవి పేర్కొనడం కూడ వైపరీత్యమే.

మామూలుగా సంస్కృతాంధ్ర కావ్యాలు సూతుడు, శౌన కాదిమునులకు నైమిశారణ్యంలో చెప్పినట్లు రచించడం కవి సమయం. కాని ఈ కావ్యం 'శ్రీ శివబ్రాహ్మణ వర్ణాగ్రగణ్యుండగు వీరభద్ర భట్టారకేంద్రునకు శ్రీమద్వైఖానస వంశోత్తంసంబగు నంబి నరసింహాచార్య పర్యుండిట్లని చెప్పందొడగె' అని పరస్పర విరుద్ధ శాఖీయులైన వైష్ణవ 'నంబి'ని శైవ 'తంబి'ని కలపడం వికటత్వం వేశ్యల ముచ్చట్లు చెప్పుకోవడానికి పరమశైవ, పరమవైష్ణవుల కయిన 'ఒద్దిక' కుదురుతుంది తప్ప - దైవవిషయాలకు కుదరదని అధిక్షేపించడం జగ్గకవి ఉద్దేశ్యం ఆశ్వాసాద్యంతపద్యాలు సైతం ప్రబంధమార్గానికి విలోమానుసరణమే.

**ఇతివృత్తకల్పన :-** సాధారణంగా తెలుగు కావ్యాలు చాలామటుకు పౌరాణిక సంబంధమైనవి, కళ్యాణాంతమైనవి లేదా పతితులైన భక్తులు దైవదర్శనంచే ముక్తులైన ఇతివృత్తాలు గలవి అని స్థూలంగా చెప్పవచ్చు

ఈ 'హాస్యప్రబంధం'లో ధీరోదాత్తాదినాయకులు, అమితపరాక్రమశాలురైన మహారాజులు, ముగ్ధానాయికలు లేరు ఒక మామూలు జమీందారు ఒక యాగశాలలో ఒక వేశ్యను చూచి మరులుకొనడం, పెళ్ళాడడం ఇతివృత్తం- అంతే. దీనిలోని కథాకల్పనం, సంఘటనల కూర్పు ప్రతిదీ ప్రబంధ మర్యాదను అతిక్రమించేవే. సమాజంలో జీవించిన వ్యక్తులనే పాత్రలుగా గ్రహించి కావ్య రచన చేసిన సాహసి జగ్గకవి.

బోయగొల్లావుపల్లిలో ఒక 'మాలపెద్ద' తవ్వించిన చెరువు వద్ద ఒక పెనుపాకలో అణివెళ్ళ వెంకటశాస్త్రి కాపురముంటాడు. ఆయనకూ ఒక వేశ్యకూ మంచి దోస్తీ వారిరువురికీ పుట్టినబిడ్డ చంద్రరేఖ చంద్రరేఖకు తగిన వరుని సంపాదించడానికి వెంకటశాస్త్రి యాగం చేయ సంకల్పించాడు 'మాలవాని చెరువు' వద్ద యాగం అనడమే హాస్యాస్పదం యాగ సందర్శకులకు అన్నదానం చేసి తృప్తిపరచడం శాస్త్రవిధి. కాని-

కొందఱు కొకింత కూడిడి
కొందఱకుంగూర లొసఁగి కొందఱకిడకే
దండన సేయుచు గెంటుచుఁ
గొందఱఁ దిట్టుచును వెళ్ళగొట్టుచుఁ గడకన్ 1.64

పప్పులో ఉప్పు కలిపి, నేతిలో ఆముదం కలిపి లోభత్వం ప్రదర్శించడంతో అందరూ ఆకలితో లేచి శపిస్తూ వెళ్ళిపోతారు యాగం పేరు చెప్పుకొని కొంత ధనం దాచుకోవాలని వెంకటశాస్త్రి సంకల్పం చతుర్విధ పురుషార్థాలలో మోక్షం కోసం కాకుండ ధనం కోసం యాగాలను చేసేవారిని వెక్కిరించడం ఈ కల్పన లోని ప్రయోజనం

కావ్యనాయకుడైన చింతలపాటి నీలాద్రిరాజు యాగ సందర్శనం కోసం విచ్చేశాడు వేటకు వెళ్ళి కన్నెను తోడు తెచ్చుకున్న రాజుల కథలు విన్నాం కాని యాగశాలయే నాయికానాయకులకు ప్రథమవీక్షణ వేదిక కావడం జగ్గకవి కావ్యంలోనే సాధ్యం గొగ్గిపండ్లతో, బారకట్లల బాహులతో విటకంటికి చిత్త విభ్రమ మొదవ చంద్రరేఖ ప్రవేశించింది ఆ అపురూప సౌందర్య రాశియైన చంద్రరేఖను చూసి మోహ పరవశుడయ్యాడు నాయకుడు. నాయిక కూడ నీలాద్రిని చూచి కామోద్రిక్త అయింది. అనురాగోదయం, సౌకుమార్యం, లాలిత్యం సాధారణ ప్రబంధాలకు అతిసాధారణ లక్షణం ఈ వికటప్రబంధానికి ఆ లక్షణాలు కూడవు ఈ 'మాపీ యింతిని నా కామాతురత తీర కూడవలె' [1-82] నని తొలి చూపులోనే నాయకుడు భావిస్తాడు 'వీనిగూడిమది వెర్రి దగుల్కొని జేయుటెన్నడో' నని నాయిక పలవరిస్తుంది

విరహం అతిశయించింది కల్లుతాగినవానిలాగ, నిప్పుతొక్కినకోతిరీతి, కుడితిలోబడ్డ ఎలుకవలె నీలాద్రి అసురసురంటున్నాడు ఇట్టి కథా కథనం ఔపమ్యకల్పనం జగ్గకవికే చెల్లు

'నీవును నావలె కాముకులను వంచన చేసి విత్తమార్జింపవలె' [2-24] నని వేశ్యమాత కూతురికి చెప్పి 'అనుష్ఠాన వేదాంతాన్ని' ప్రబోధిస్తుంది నాయికా నాయకులు విరహవేదన అధికమై, ఇంతకుపూర్వం తామిద్దరూ ఎంతమందిని కూడింది స్మరించుకోవడం పాఠకులను గిలిగింతలు పెడుతుంది. ఇలా పూర్వ సంబంధాలు తలచుకోవడం పూర్వ ప్రబంధాలలో ఎక్కడా కనబడదు.

చంద్రరేఖ విరహవేదనను అనుంగు చెలికత్తెలు కాక కింకరులు, మగవారు వేశ్యామాతకు తెలిపారనడం జగ్గకవి చూపిన వైచిత్రి వికట శిశిరోపచారాలు కొనసాగుతాయి. చివరికి వెంకటశాస్త్రికి విషయం తెలుస్తుంది ఆయన సంతోషానికి మేరలేక పోతుంది కూతురును గాంచి-

బాలరో! నీవు మిగుల సౌభాగ్యవతివి
యొక బొజుఁగువోవ మఱియొక్క డుత్తముండు
దొరకె నీలాద్రిరాజు సచ్చరితుడిపుడు
నిన్ను గోరి పిలువనంపె, నేడు నీవు 3-79

మరి ఆ చంద్రరేఖ-

మందు మంత్రంబులను నీల మనుజవరుని
లోలుగావించి కలధనంబోలి లాగి
పిదప జోగిగఁ గావించి డించి
తెత్తు మీ సన్నిధికి నా ప్రతిజ్ఞ వినుడు 3-82
అని ప్రతినబూనుతుంది

చంద్రరేఖను అలంకరింపచేసి నీలాద్రి కడకు చెలికత్తెలు తీసుకొనిరారు అలా తెస్తే విశేషమేముంటుంది? సాక్షాత్తు తల్లిదండ్రులే తెస్తారు.

ముప్పది యాఱేండ్లది, ముం
దెప్పుడు నొక్కరుని, బొందదేలాగున నీ
విప్పుడు దిద్దుకొనియెదో

మొప్పెతనము మాన్పవలయు ముందఱపనిలో (3-106) అని అంటారు. ముప్పదియారేండ్ర నాయిక అనడం ప్రబంధ నాయికల ముగ్ధత్వాన్ని ఆటపట్టించడమే పడకటిల్లే కళ్యాణ మందిరంగా పట్టెమంచమే వేదికగా తండ్రే పురోహితుడుగా తల్లే పేరంటాలుగా చంద్రరేఖా నీలాద్రిరాజులకు పెళ్ళి జరుగుతుంది 'ఎవ్వరిని జేరనరుగకయుండు'నని ఆ పతివ్రతా శిరోమణి నీలాద్రికి అభయ ప్రదానం చేస్తుంది 'ఇతరులను చేరడం' అన్న భావం రావడమే సున్నితత్వానికి ప్రబల విరోధం. గుడారం వెలుపల నాయికానాయకులను గమనిస్తున్నవారు చెలికత్తెలు కారు- వెంకటశాస్త్రి మరి నాయకుడు-

ఇల్లెఱుగక పట్టెఱుఁగక
యెల్లధనము దానికిచ్చి యెగ్గును సిగ్గున్
జెల్లగఁ దత్పాదద్వయ
పల్లవముల దండమున్ సి పడికాచ్చెండెన్ 3-159

ఇలా ప్రబంధాలలోని ఏ నాయికకూ, ఏ నాయకునికీ ఏ నాయిక తండ్రికీ సరిపోలని పాత్రలతో సమాంతరంగా, వికృతంగా అపహాస్యభాజనమై చంద్రరేఖా విలాపం కొనసాగుతుంది.

**వర్ణనలు:-** ప్రబంధాంగాలలో ముఖ్యమైన అష్టాదశవర్ణనలు కూడా చంద్ర రేఖా విలాపంలో వికటంగానే కొనసాగుతాయి. చంద్రరేఖా విలాపంలోని బోయ గొల్లావుపల్లి 'వప్రస్థలీ చుంబితాంబరమై' ఒప్పడం కాని 'లలితోద్యాన పరం పరా పిక శుకాలాప ప్రతిధ్వనులతో చెన్నొందడం'కానీ చూడలేం బోయగొల్లావు పల్లెలో రకరకాల పశుకళేబరాలు, మాంసఖండాలను పీక్కుతినే రాబందులు' ఈగలు, బొక్కలు తినే నక్కలు, కుక్కలు కొల్లలుగా ఉంటాయి. ప్రబం ధాలలో ఎంతో రమ్యంగా రూపుకట్టించే పురవర్ణనను ధ్వంసం చేస్తూ వెగటు కలిగించే రీతిలో అపసవ్యమార్గంలో జగ్గకవి చిత్రీకరించాడు

వారస్త్రీలుడైన నీలాద్రిరాజు వైతరణిలో పడే విధంగా సూర్యుడు గ్రుంకాడని సూర్యాస్తమయ వర్ణనలో కథాంశాన్ని జోడించి చెప్పడం (3-141), అట్లాగే నీలభూపతి అపయశస్సులాగా అంధకారం వ్యాపించిందనడం; శరీరం మీద వ్యాపించిన రసపొక్కుల్లాగ నక్షత్రాలు ఉన్నా (3-93) యని ఉత్ప్రేక్షిం చడం మొదలైనవన్నీ కవి వికట ప్రవృత్తికి ప్రతీకలే ఇతివృత్తాన్ని జోడించి ప్రకృతి వర్ణన చేసిన మనుచరిత్రాది (3-11) కావ్యాలలోని పద్యాలకు పేరడీలుగా వీటిని భావించవచ్చు.

చంద్రరేఖకు హీనోపమలు వేసి వర్ణించడం జగ్గకవి వికటకల్పనా చాతురికి నిదర్శనం ముఖాన్ని చంద్రబింబంతో కాకుండా కోతితోను, కంఠాన్ని కంబువుతో కాకుండా కొంగతోను, కన్నులను పద్మాలతో కాకుండా పిల్లి కన్నులతోను, పెదవిని దొండపండుతో కాకుండా తొట్టితోనూ, స్తనాలను కుంభాలతో కాకుండా కొలిమితిత్తులతోనూ పోల్చడం గతానుగతికంగా లాక్షణిక గ్రంథాల్లో చెప్పబడ్డ కవి సమయాల నన్నింటిని వరుసగా పేర్చి కవిత్వాలను సృష్టించేవారిని అవహేళన చేయడమే ఔతుంది.

పురవర్ణనం, సూర్యచంద్రుల ఉదయాస్తమయాలు, చీకట్ల చీకాకులు, చక్కిల రభసలు, వనితల వైఖరులు, శిశిరోపచారాలు- ఇలా దేన్నయినాసరే ఉన్నతంగా ఉత్తమంగా వైభవోపేతం చేయడం ప్రబంధ కవులకు సాధారణ లక్షణం కాని జగ్గకవి ధోరణివేరు. సాధారణ ప్రబంధపక్కీని విపర్యయం చేసిన వికటరీతి ఇది ఇక్కడ అంతా అస్తవ్యస్తమే ప్రబంధాలలో ఎప్పుడూ 'ఎత్తు'కు తీసుకొని వెళ్ళే వర్ణనలు చదివి చదివి వాటికి అలవాటుపడిన చదువరులకు అదే తీరుగా, అంతేవేగంగా జగ్గకవి 'కిందకు' తీసుకొని వెళ్తుండడం చూసినపుడు ఆశ్చర్యసంభ్రమాలు కలుగుతాయి అదే కవి సాధించదలచుకొన్న వికటత్వానికి ప్రయోజనం

**భాష :** ప్రబంధాలకు ఆలంకారికశైలి జీవం. ఓజఃపూరితమైన, తత్సమ పదభూయిష్ఠమైన భాష ప్రబంధలక్షణాలలో ఒకటి. జగ్గకవి ఎదురు తిరిగాడు. ప్రబంధలక్షణమైన ఆలంకారిక శైలిలోనే రాస్తూ నిత్యవ్యవహారంలో ఉండే భాషను గ్రంథస్థం చేశాడు. వస్తాడు, తెస్తాడు, ఇస్తాడు, చస్తాడు, వంగుండు, తొంగుండు, లంజటక్కు మొ॥ గాక స్త్రీ పురుష జననాంగ స్ఫోరకమైన, రతి క్రియాసూచకమైన దేశిపదజాలం బాహాటంగా జగ్గకవి కావ్యస్థం చేశాడు. ఆయా సందర్భాల్లో సంస్కృత పదజాలం ప్రయోగించకుండా, ఇతర సమానార్థకాలు వేయకుండా కావాలని జనవ్యవహారంలో ఉండే పదాలను వాడి గ్రామ్యత్వాన్ని బలపరిచి, సమకాలీన భాషా సాహిత్య స్థితికి, అభిప్రాయాలకు విరుద్ధంగా జగ్గకవి వ్యవహరించాడు

**అనుకరణలు :** పూర్వ కవుల పద్య రచనా రీతిని కూడా జగ్గకవి వదిలిపెట్టలేదు. వికటంగా అనుకరించాడు

హాయను! ధర్మరాజ తనయాయను! నన్నెడబాయ నీకు జ
న్నే యను . .(ఆంధ్ర మహా భారతం, ద్రోణపర్వం 2.242)

అనే తిక్కన పద్యాన్ని—

హాయను! జంచరీక నిచయాంచిత కుంచిత రోమ కామ గే
హాయను ..... . .. (2.124)

అని వికృతంగా విడంబించిన వైనాన్ని గురించి పేరడీ లక్షణాలను - అనుకరణ ప్రాధాన్యాన్ని చర్చిస్తున్న సందర్భం (పుటలు 11, 12) లో విశదీకరించడమైంది 'ఈ పద్యం ప్రబంధ శైలి అంతటికి పోటు' అన్నాడు మాచిరాజు దేవీప్రసాద్

సహసా నఖంపచ స్తనదత్త పరిరంభ
మాముూల పరిచుంబితాధరోష్ఠ
.. . . .. ... . ....
.. ... ..... . .
అస్తిమిత భూషణారవమావధూటి
ప్రథమ సురతంబు గంధర్వపతి గరంచె (మను చరిత్ర 3 - 116)

అని సాగే అల్లసాని పెద్దన పద్యంలోని అల్లికనూ జిగినీబిగినీ గ్రహించి జగ్గకవి ఇలా వికృతీకరించాడు :

పారదోపమ వీర్య ధారాతతభగంబు
స్తనచర్మ భస్త్రికాతాడనంబు
.. .
గార్దభస్వర నిస్సర ద్గ్రామ్యవచన
మమిత రోదన జలపూరితాననంబు
చంద్రరేఖాభిధాన వేశ్యానలాస్య
ప్రథమ సురతంబు నీలభూపతి గరంచె 3-138

'ఈ క్రిందిది పై పద్యానికి మక్కికి మక్కి వ్రాసిన పేరడీ కాదు. మొదటి చూపులో రెండింటికి సామ్యం కానుపించదు పద్యమంతా వ్రాసి ఆఖర్న తిప్పి కొట్టాడు జగ్గకవి పెద్దనకు వచ్చి తగిలేట్టు. ఆఖరిపాదం దాకా ఒకదాన్ని ఒకటి తాకలేదు ఆఖరి పాదంలో గ్భున తిరిగింది పెద్దనగారి నిర్దిష్టమైన పద్యం మీదికి వెంటనే పేరడీ అయి ఊరుకుంది.'[1]

1 మాచిరాజు దేవీప్రసాద్ వికటకవిత్వం (వ్యాసం) ప్రతిభ నవమవార్షికోత్సవ సంపుటం ఎప్రిలు 1943 పుటలు 117-118.

దాని జానగు యోనిలో నటింపని మహో
ద్దండ దర్పిత కామదండ మేల?
దాని కోమల సుధాధరము గ్రోలని మధు
రస రుచి వ్యాలోల రసనయేల? 2 - 86

పద్యం భాగవత పద్యానికి అనుకరణ ప్రాయమైందేనని చూడగానే తెలుస్తుంది. ఈ విధంగా జగ్గకవి పూర్వకవుల పద్యరచనా ధోరణిని వికటీకరించిన దృష్టాంతా లెన్నింటినో చూపవచ్చు

అన్ని ప్రబంధాలలో సామాన్యంగా గోచరించే నాయకుల ప్రథమ సందర్శనలు, ఉపాలంభనలు, సంగమాలు మొదలైన 'శృంగార వర్ణనలు' ఈ కావ్యంలోనూ ఉన్నాయి. కాని ఇవేవీ కూడ కామోద్రిక్తత కలిగించేవి కావు. హీనాతి హీనమైన ఉపమానాలు ప్రయోగించడంతో పిప్పళ్లలాంటి, శతపత్రేక్షణలు అణుమధ్యలకు కాలం చెల్లిందని చాటాడు కొండనల్లేరు. దూలగొండి, చిగురుప్పు శిశిరోపచారాలకు స్వీకరించడంతో తామరతుండ్లు, గొజ్జంగి నీరు, కర్పూరాదులు గాలికి కొట్టుకుపోయాయి భూతద్దం పెట్టి అన్వేషించినా కళాత్మకమైన చిత్రణ, ఆనందకరమైన భావం, నుడికారపు సొగసుదనం కనిపించకుండా చేయడానికి జగ్గకవి ప్రత్యేకంగా కృషి చేస్తాడు జన వ్యవహారంలోని భాష ప్రయోగించి, గ్రామ్యత్వాన్ని బలపరచి, గ్రాంథిక భాషను ఆ భాషలోని పలుకు బళ్ళను అటపట్టించాడు

ప్రబంధ కవిత్వంలో అలవాటుగా ఒక విషయాన్ని చెప్పే సందర్భాల్లో ఉపయోగించే పదజాలానికి, పద్ధతికి వీటిని వికటీకరణలుగానే భావించాలి. కాని కామోద్రేకం కలిగించేవిగా తలపోయడం పొరపాటు అహల్యా సంక్రందనం, రాధికాసాంత్వనం వంటి కావ్యాల్లాగా పాఠకుల్లో లైంగికోద్రేకాన్ని రెచ్చగొట్టాలనే తపన జగ్గకవికి ఉంటే ఈ వికటీకరణలవల్ల కలుగుతున్న అపహాస్య భావానికి, జుగుప్సా భావానికి వీలుపడేదికాదు చంద్రరేఖా విలాపంలోని జననాంగాలకు సంబంధించిన దేశిపదజాలం, ఆ కవి సమయాలు, హీనోపమ సామగ్రి వీటన్నింటికీ జగ్గకవిలోని విధ్వంసక తత్వమే ప్రధాన ప్రేరణ.

ఆహ్లాదజనకమైన భావశకలం, ఆమోదయోగ్యమైన సన్నివేశం రమణీయతా ప్రతిపాదకమైన చిత్రణం జగ్గకవిలో ఏమాత్రం చూడం ప్రబంధాలకు కార్బన్ కాపీలు తీస్తూ జీవంలేని అనుకరణ సాహిత్యంగా చలామణి అవుతున్న క్షీణయుగ సారస్వత కాలంలో జగ్గకవి కవిత్వం వికృతాకారంలో వచ్చింది. అలా వచ్చినపుడే సమకాలీన సాహిత్య ధోరణిని కవులు గుర్తించగలరు. జీవం పోయి పిప్పిమాత్రమే మిగిలిన ఆకారాలు, కాలంచెల్లిన పలుకుబళ్ళు, పద బంధాలు తిరిగి కవిత్వం వేషం వేసుకుని ఊరేగకుండా జగ్గకవి చావుదెబ్బ కొట్టాడు. సామాజిక ప్రయోజనం దీనివల్ల ప్రత్యక్షంగా లేకపోవచ్చు కాని పరోక్షంగా ఉంది జడతామయమైన సాహిత్య రూపాల్ని ధ్వంసం చేయడం ఒక ప్రయోజనం తనను పరాభవించిన కృతిపతిపై ప్రతీకారం తీర్చుకోవడం రెండవది. నిజానికి రెండవదిగా చెప్పబడినదే మొదటిది. మొదటిదిగా చెప్పబడినదే రెండవది కవిగా తాను సాధించుకున్న ప్రయోజనం అపకారిని అవమానపరచడం. అయితే కవి-అపకారి ఇద్దరు మర్త్యులు కావడంతో వారి మరణాలతో ఆ ప్రయోజనం ముగిసింది కృతిపతి జరిపిన అన్యాయానికి సాక్ష్యంగా కావ్యం నిలిచిపోయింది.

నిజానికి జగ్గకవికి ప్రబంధధోరణిపట్ల వైముఖ్యంగాని, హేళన చేయాలనే సాహిత్య స్పృహ కానీ లేవు జగ్గకవి రాసిన సుభద్రాపరిణయం, సోమదేవ రాజీయంలాంటి ప్రబంధాలు కూడ ఉన్నాయి గదా! జగ్గకవికి ప్రబంధం మీద వైముఖ్యం పుట్టడానికి తగిన విదేశీ సాహిత్య పరిచయమో విప్లావక ధోరణో ఆ కాలంలో లేవు అతని లక్ష్యం నీలాద్రిరాజును హీనంగా చిత్రించి కసితీర్చుకోవడమే. ఇది వ్యక్తిగత ద్వేషమే. ప్రబంధ వ్యతిరేకత అతనికి ఏకోశానా లేదు. (అట్లా అని నీలాద్రి పైన కక్ష ఉన్నట్లు ఎక్కడా సూచనలేదు.) కానీ క్షీణ యుగంలో ప్రబంధ విలువలు దిగజారిన కాలంలో చంద్రరేఖా విలాపం రావడం వల్ల పేరడీగా చెప్పడానికి ఆస్కారమేర్పడింది. ఇదే కావ్యం ఒక వందేళ్ళ పూర్వం అంటే కనీసం 1550-1600 ప్రాంతాల్లో వచ్చి ఉంటే పేరడీగా పొరపాటున కూడ ఊహించడానికి అవకాశం లేకపోయేది. ఆధునికులైన జరుక్ శాస్త్రి, మాచిరాజు దేవీప్రసాదుల్లాగా 'పేరడీ రాస్తున్నా' అనుకొని జగ్గకవి

రాయలేదు తన కోపాన్ని మనస్సులో పెట్టుకొని తనకే తెలియకుండా జగ్గకవి పేరడీ ప్రబంధం రచించాడు అందువల్లనే పేరడీ లక్షణాలన్నింటినీ ఈ కావ్యంలో ఒక్కోసారి ఒదగకపోచ్చు. లేదా సందేహాలకు తావివ్వవచ్చు

ఇది ప్రబంధ కవిత్వంపట్ల, సంప్రదాయ కవిత్వంపట్ల పరిహాస దృష్టిని కల్పించడం కోసమే కాని తన రచనా మార్గంపట్ల అనుయాయిత్వాన్ని ప్రోత్సహించడం కోసం చేసిన రచన కాదు అందుకే 'పిల్ల వసుచరిత్రలు' లాగా 'పిల్ల చంద్రరేఖా విలాపాలు' పుట్టలేదు ఆంధ్ర శేషగిరిరావు ఈ విషయాన్ని గుర్తించాడు 'ఈర్ష్య చెతనే అనుకొనుడు జగ్గకవి యీ గ్రంథము రచియించినది ఎట్లయిననేమి దీనిని వెల్వరించి ఆంధ్ర సారస్వతమున నూతన మార్గగామియైనాడతడు. అనుకరణము మానవులకు గోణము కట్టుటాదిగా గల గుణమే యైనను ఏలకో చంద్రరేఖా విలాపమునకు ప్రతిబింబములు బయలు దేఱలేదు. అది ఒకవిధముగా మన యదృష్టమే.'[1]

నిజానికి జగ్గకవిది ఇతరులు అనుకరించదగిన కవితామార్గం కాదు. అనుద్దిష్టంగానయినా ఎలా రాయకూడదో చెప్పడమే అతని పుస్తకం చేసేపని

కూచిమంచి జగ్గకవి ధోరణిలో రేకపల్లి మహాదేవ నామకవి పిళ్ళ వేంకట నరసింహుడు అనే వ్యక్తిని ద్వేషించి హేళన చేస్తూ 'ఒక్క చమత్కారానుసార పరిహాస కథానుబంధ బంధురంబగు ప్రబంధం' రచించాడు. దాని పేరు 'చిన్ని వెంకట నరసీయం.' ఇది అముద్రితం. మద్రాసు ప్రాచ్య లిఖిత భాండాగారంలో ఉంది.

**

మే '93 'స్రవంతి'లో ప్రచురితం.

1 ఆంధ్ర సారస్వత వ్యాసావళి (1952) పుట. 63

# 8. అభాగ్యోపాఖ్యానం

"ఇంచుమించుగా తెలుగు భాషలోనున్న ప్రబంధములన్నియు కామినీ కచ కుచ సంభోగాది వర్ణనలతో నిండియుండి ఏకరీతిగా నుండుటచేతను, అట్టి ప్రబంధములను రచించిన వారిలో నే నొక్కఁడనైనను నాకు వెనుకటి యభిప్రాయములు మాఱి శృంగార ప్రబంధములు చేయు మేలుకంటె కీడెక్కువగా నుండునన్న సిద్ధాంతమునకు వచ్చినవాడ నగుటచేతను, ప్రబంధ ప్రణేతృ పంథను పరిహసింపవలెనన్న ఉద్దేశముతో అభాగ్యోపాఖ్యానము చేసితిని''[1] అని కందుకూరి వీరేశలింగం పంతులు చెప్పుకొన్నాడు

కూచిమంచి జగ్గకవికి 'చంద్రరేఖా విలాప' రచనతో వ్యక్తిగత ఆక్రోశాన్ని, తనకు లాభించలేదన్న కసిని తీర్చుకోవడమే ప్రధానాశయం ప్రబంధ ధోరణిని అవహేళన చేయడం అనేది ఆనుషంగికం కందుకూరిది ధర్మాగ్రహం - వ్యక్తిగత ప్రయోజనాన్ని ఆశించిందికాదు. సాహిత్యం వైవిధ్య రహితమై, గతానుగతికమై పోతుందన్న ఆవేదన ఆయనది అందుకే విమర్శిస్తూ వ్యాసం రాయకుండా - జవసత్వాలు కోల్పోయిన ప్రబంధ లక్షణాలను అభాగ్యోపాఖ్యానం (1876) ద్వారా అతిశయింపచేసి మరింత అవహేళన చేశాడు. ఒకప్పుడు ఎంతో ఉన్నతంగా వెలిగిన ప్రబంధ ప్రక్రియ కాలప్రవాహంలో ఎంతగా దిగజారిపోయిందో, ఎటువంటి జీవచైతన్యం చూపలేని దశకు చేరుకుందో కందుకూరి అమితశక్తిమంతంగా నిరూపించాడు ఈ రచన కేవలం ఆవేశంవల్ల రచించింది కాక సాహిత్య ప్రగతికోసం చేసింది. అందువల్లనే జగ్గకవిలోని బండబూతులు, వ్యక్తి నిందలు అభాగో.పాఖ్యా.నంలో కనిపించవు. సభ్యతమీరని పలుకుబళ్ళతో పరితృలోకానికి ఆనందాన్ని కలిగిస్తుంది ఇది. కాలగమనాన్ని గుర్తించి తమను హెచ్చరిస్తున్న రచనగా కందుకూరి అభాగ్యోపాఖ్యానాన్ని చదువరులు ఆదరిస్తారు.

---

1. స్వీయ చరిత్ర ద్వితీయ భాగం (1915) పుట 168.

అభాగ్యోపాఖ్యానంలో కథాకల్పనం, పద్యరచనా శిల్పం, ఔపమ్య కల్పనం, వర్ణనలు మొదలైనవన్నీ వివిధ ప్రబంధాలకు విరూపాలే, వికృతీకరణలే కథలో కొంతవరకు వసుచరిత్ర కనిపిస్తే, మరికొన్ని సన్నివేశాలలో మరొకటి కనిపిస్తుంది. ఈ రచనలో విజయవిలాసం, మనుచరిత్ర వంటి ప్రబంధాల్లోని పద్యాలు పోకడలు అడుగడుగున కనపడతాయి

అభాగ్య నాముడయిన రాక్షసుడు వ్యాఘ్రమాఖ్య పట్టణాన్ని ఏలుతుంటాడు. ఆయన వేటకు వెళ్ళి ఒక యువతిని గాంచి మరులుకొనడం ఇతివృత్తం పుర వర్ణన, చాతుర్వర్ణ్య వర్ణన, మృగయావర్ణన ఇత్యాదులు - స్త్రీ ఆర్తనాదం విని దానిని తెలిసికొనిరమ్మని చెలికాడిని పంపడం, వాడు వెళ్ళి వచ్చి ఆమెను నఖశిఖ పర్యంతం వర్ణించి రాజు నామెపట్ల ఆకృష్టుణ్ణి చేయడం, తర్వాత అభాగ్యుడు ఆమెను వెదుక్కుంటూ వెళ్ళి ఒక గడిలో కలియడం; అది చూసిన ఆ యువతి మగడు ఇద్దరికీ దేహశుద్ధి చేయడం, చచ్చి సున్నమైన అభాగ్యుణ్ణి సేవకులు పురానికి మోసుకొని వెళ్ళడం మొదలైన కథాంశాలు కడుపుబ్బ నవ్వు పుట్టించేలా వర్ణించబడ్డాయి.

ఆ పురము లచ్చియప్పకుఁ
గాపురము జగంబు లందుఁగల పురములలోఁ
గాపురము పాపసమితికి
దాపురము మహాపుర మల దానవతతికిన్ (5)

సాధారణ ప్రబంధాలలో ఉన్నట్లుగా ధనధాన్య భోగభాగ్య విలసితమై అలరునట్టిది కాదు అభాగ్యుని వ్యాఘ్రమాఖ్య పట్టణం ఆ నగరం లోని దుష్టుల కౌటిల్యంతో పోటీపడి గెలవలేక ఓడిపోయి పాములన్నీ పాతాళం చేరుకొన్నాయి ఈ విధంగా ఘనత వహించిన ఆ గ్రామంలోన జీవించే ప్రజల వేశ్యాలోలత్వం ఎటువంటి ప్రౌఢత గలదో గమనించండి:

వెలయాలి నింటనె విడియించి దానిచేఁ
    దిట్లును దన్నులుఁ దినెడువారు
తల్లిపోయిననాఁడు దానింటనే యుండి
    పనియున్న దిదె వత్తు ననెడివారు

కన్నెరికము చేయు కార్యంబునకుఁబూర్వ
లార్జించు మాన్యమ్ము లమ్మువారు
భోగకాంతలు గాక పౌరుగువారల భార్య
లను జేరి సౌఖ్యంబు గనెడివారు
నిలువ సారాయి సీసాలకొలది ద్రావి
యొడలు తెలియక వీధులఁ బడెడివారు
నగుచు మర్యాదలను గాంతు రనవరతము
బ్రాహ్మణోత్తము లాదివ్య పట్టణమున (7)

ఇంకా వారి సుగుణసంపత్తి, ప్రతిభా సామర్థ్యాలు గుర్తించండి

మార్దవంబన్యాయ మార్గవాక్కుల యంద
సాహసం బాహార సమయమంద
ప్రజ్ఞయంతయును దంభములు కొట్టుటయంద
యంద బంటుతనము వంట యింట
మిత భాషణము శాస్త్రతతుల చర్చలయంద
కలిమి పురంధ్రుల కౌనులంద
నిలకడ నెలఁతల నేత్రయుగ్మము నంద
ధైర్యంబు పెద్దల తరుముటంద
వడి లతాంగుల వంకర నడల యంద
శాంతి యెంతయు దుష్కర్మసహనమంద
కాని మరియెందు వెదకినఁ గానరా ద
నంగఁ దద్దయు నాపట్టణము వెలుంగు (13)

ఈ రకమైన పద్యరచనా నిర్మాణం ప్రబంధ వాఙ్మయంలో మామూలు ముచ్చట ఏమేమి ఎక్కడెక్కడ ఉండకూడదో అవన్నీ అక్కడక్కడ నిలుపుతూ వ్యాజస్తుతి రూపంగా రాయడం ఇక్కడ కందుకూరి పాటించిన శిల్పం అన్యాయవర్తనులనీ, తిండిపోతులనీ, వాక్శూరులనీ, అపండితులనీ, పిరికిపందలనీ ఆ గ్రామస్థులను వర్ణించాడు స్త్రీల సౌందర్య లక్షణాలుగా భావించే ధర్మాలకు విరుద్ధంగా కలిమి (సంపద)ని నడుముల్లోను, నిశ్చలత్వాన్ని

నేత్రాల్లోను, వేగాన్ని నడకల్లోను నిక్షేపించాడు. ఇంకా లాక్షణికులు స్త్రీల కళ్ళకు విశాలత్వం, స్తనాలకు కఠినత్వం, శరీరానికి సౌకుమార్యం, కనుబొమలకు వక్రత నిర్దేశించారు ఇవన్నీ సామాన్య ప్రబంధ నాయికలకు సరిపోతాయి కాని వికట ప్రబంధాలను పీలుపడవు వికృతాకారం, వికృత చేష్టలు, వికృత వాక్కులతో విలసిల్లేది వికట ప్రబంధం అందుకే కందుకూరి -

చారునగంబులన్, ధనువు, సంపెంగపూవును, గెంపుగూర్చి సిం
గారపుఁ జన్నులన్, బొమల ఘ్రాణము, వాతెరజేసి బ్రహ్మ తా
వారక వాని కర్కశత, వంకర, బచ్చన, రక్తకాంతి, చెం
పొరగఁ దీసి చేసెమెయి, నూరును గన్నులు గుంతలంబులన్. (52)

అని ప్రబంధ రీతిలో క్రమాలంకారం ఏమాత్రం పొల్లుపోకుండా ప్రయోగిస్తూనే ఉండవలసిన ఆయా విశిష్టధర్మాలు లేనట్లు వర్ణించి ప్రబంధాంగనల చారు సోయగాలను హాస్యభాజనం గావించాడు.

అత్యంతవేగంగా పరుగులెత్తే లేళ్ళు ఆ పురంలో కాపురమున్న పురంధ్రుల నడకల నందుకోలేక పోయాయని ఉత్ప్రేక్షించడం (18 వ పద్యం) లోని ఉద్దేశం- మందమందంగా ఏనుగుల్లాగ, వయ్యారంగా హంసల్లాగ సాగుతాయని కవులు చేసే ప్రమదల నడకల వర్ణనలు చదివి చదివి విసిగెత్తిన పాఠకులకు 'రొటీన్ బోర్డమ్' నుండి ఒక్కసారిగా విముక్తి కలిగించి పకపక నవ్వుకొనేలా చేయడమే. విజయవిలాసంలోని ఒక పద్యభావం (1-8) ఈ వక్రీకరణకు మాతృకగా తలపోయవచ్చు.

స్త్రీ వర్ణన ప్రబంధాలలో చాలమటుకు ఒకే తీరుగా కవి సమయాలను గణబద్ధంగా పేర్చి రాయడం కనిపిస్తుంది మచ్చుకు మనుచరిత్రలోని సుప్రసిద్ధ పద్యాన్ని చూడవచ్చు

కనియెన్ విద్యుల్లతా విగ్రహన్
శతపత్రేక్షణ జంచరీక చికురన్ జంద్రాస్య జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక మరున్నారీ శిరోరత్నమున్. (2-25)

మనుచరిత్రకన్నా పూర్వం వచ్చిన శ్రీనాథుని శృంగార నైషధంలోని దమయంతి (2.21), పిల్లలమర్రి పినవీరన్న శృంగార శాకుంతలంలోని సరోవర దేవత (2.27), శకుంతల (2.53); తర్వాత వచ్చిన చేమకూర వెంకటకవి విజయ విలాసంలోని చిత్రాంగద (1.150), సుభద్ర (2.106); కూచిమంచి తిమ్మకవి రసికజన మనోభిరామంలోని సుశ్యామ (2.64) మొదలైన వివిధ కాలాల్లో వెలసిన భామామణులందరూ ఇంచుమించు ఒకేతీరు అందచందాలను కలిగి ఉండడం దీనికి నిదర్శనంగా చెప్పుకోవచ్చు కూచిమంచి జగ్గకవి సాభిప్రాయంగా హీనోపమలను, అశ్లీలోక్తులను కలగలిపి ప్రయోగించి చంద్రరేఖను వర్ణించాడు. కందుకూరి వీరేశలింగం అశ్లీలోక్తులు మాత్రం పరిహరించి నీచోపమలతో స్త్రీ వర్ణన చేశాడు.

కనియెన్ దానవదూత సూక్ష్మనయనన్, గాలాంతకాకార, ని
ర్ధన జీవన్, ఖరవాణిఁ, గీశసమవక్త్రిన్, రక్త వర్ణాలకన్,
ఘనదుద్యద్వసుధాధరాంచితవలగ్నన్, భూరి నీలాధరన్,
ఘనదేహన్, లసదుష్ట్రియానఁ, విలసత్కాంతాకదంబాధమున్ (46)

అభాగ్యోపాఖ్యానంలోని నాయిక అందరిలాగ విశాలమైన కన్నులతో విలసిల్లేది కాదు- చిట్టి కళ్ళ చిన్నది పగలు చూడగానే రాత్రి తలపుల్లోకి వచ్చి గిలిగింతలు పెట్టే సుమనోహర సుస్వరూప కాదు- యమునిలాగ భయంకరమైన ఆకారం గలిగింది దాసదాసీజనాలు సేవిస్తుండగా బంగరు తూగుటుయ్యాల మీద విలాసంగా ఊగే రాకుమారి కాదు- భోగభాగ్యాల స్పర్శ ఏ మాత్రం ఎరుగనీ బీదరికమే సంపదగా కలిగింది మాటిమాటికి వినాలనిపించే చిలక పలుకుల చిన్నారి కాదు- కర్ణకఠోరంగా ఓండ్రపెట్టే గాడిదల కంఠాన్ని మించిన గాత్ర మాధుర్యం కలిగింది వారిజ వదన కాదు- వానర ముఖంతో పోలిక కలిగింది అలినీలాలక అసలే కాదు- ఎర్రటి వెంట్రుకలు కలిగింది. శూన్య మధ్య కాదు- భూమికే ఆధారభూతమైన ఇరుసంత నడుం కలిగింది కెమ్మోవి కాదు- ఏవగింపు కలిగించే నల్లటి పెదవులు కలిగింది సుకుమారమైన లతాంగి కాదు- ఘనమైన (మేఘతుల్యమైన) దేహం కలిగింది అంచయాన కాదు- ఒంటె నడకల వయ్యారం కలిగింది

సాహిత్యంలో ప్రసిద్ధిగన్న ఉపమానాలను గ్రహించి మూసపోసినట్లుగా వర్ణించడమే 'కవిత్వం'గా తలపోసిన 'అకవుల'ను నవ్వులపాలు చేయడానికి పనిగట్టుకొని ఆ కవులు వాడే ప్రతి ఉపమానాన్ని కందుకూరి వికృతీకరించాడు దీనివల్ల కలిగే ప్రయోజనం విమర్శించవలసిన వస్తువును మరింత జుగుప్సావహంగా వర్ణించి గేలిచేయడం తప్ప వేరేకాదు

ప్రబంధాల్లో సాధారణంగా కనిపించే భ్రాంతిమత్, ఉపమ, అతిశయోక్త్యలంకారాలకు సరసరసోదంచితమైన హాస్యాస్పదమైన ఇటువంటి విలోమానుకరణలు ఆయన కావ్యం అంతటా కనిపిస్తాయి.

దనుజులు మర్త్యలం దునిమి తత్తనుమాంసము మెక్కిపోవగా
నెనసి పురంబు నల్గడల నెమ్ములరాసులు భూధరంబు ల
ట్లనుపమ లీలనుండుఁ బ్రమథావళితోడ మనోజవైరి యా
మనికికి వెండి కొండ యని మాటికివచ్చుఁ బరిభ్రమింపుచున్. (17)

ప్రబంధశైలి మొత్తాన్ని ఏ విధంగా అభాగ్యోపాఖ్యానం అనుసరించిందో పై ఉదాహరణలవల్ల తేటతెల్లమైంది. ఇక పూర్వకావ్యాల్లోని పద్యాలను ఏవిధంగా ఈ వికట కావ్యం అనుసరించిందో పరిశీలిద్దాం.

డాయను బీతిఁబొంద మగడాఁయనుఁ దల్పులు తీయరాదె రం
డాయనుఁ బల్కవేమి చెవుడాయను సొమ్ములు వెట్టు రంకు ముం
డాయను వేగరావె మొరడాయను లోపలఁజేరి యేడ్వగా
డాయను సిగ్గుబూనుటిపుడాయను నెచ్చెలి మాటిమాటికిన్ (72)

ఇది విరహవేదనాదోదూయ మానసయయిన కావ్య నాయికను చెలికత్తె ఉపాలంభించడం ఇది తిక్కన పద్యానికి (ద్రోణపర్వం, 2-242) చేసిన వక్రానుకరణ అని ప్రత్యేకించి చెప్పపని లేదు.

చేరి నిల్చిన వంటయిల్ చేరి నిల్చు
గాన వచ్చినఁ బరువెత్తి కానసొచ్చు
దంబుమీరిన భట సమూహంబు తోడ
సాటియౌదురె మానవకోటి నెవరు (15)

ఇది ఆ పురంలోని వారి శౌర్య పరాక్రమాలను వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇటువంటి వారితో ఎవరూ సాటిరారు, వీరికి వీరే సాటి అనడంలో ఎవరికి విప్రతిపత్తి లేదు ఈ పద్యానికి మూలం విజయ విలాసంలో కనపడుతుంది. ఆ పద్యం ఇది:

పాఱఁజూచినఁ బర సేన పాఱఁ జూచు
వింటికొరగిన రిపురాజి వింటికొరగు
వేయు నేటికి? నల పాండవేయు సాటి
పేరుడిల లేఁడు; ప్రతి రఘువీరు డొకండె (1.94)

విజయ విలాసంలో కనీసం అర్జునుడికి రఘువీరుడైనా ప్రతివీరుడిగా ఉన్నాడు కాని ఈ పురం జనులకు సాటియైనవారే లేరు!

'అచట పుట్టిన చిగురు కొమ్మైన చేవ' (మనుచరిత్ర 1 - 50)

అన్న అరుణాస్పదపుర వర్ణనకు వికృతీకరణంగా 'పురినిబుట్టిన నుక్కైనఁ బుచ్చిపోవు' (16) నని ఉత్ప్రేక్షించాడు

కొమ్మ గాదది మేటి పెద్దమ్మ గాని
బాల గాదది యము చేతికోలగాని
కన్నె గాదది బలిసిన దున్న గాని
నారి గాదది జనులకు మారి గాని (54)

ఈ పద్యానికి మాతృక విజయ విలాసంలో కనిపిస్తుంది ఇలాగే ఎన్నో పద్యాలకు ప్రసిద్ధ ప్రబంధ మూలాలు చూపవచ్చు

సాధారణంగా తెలుగు కావ్యాలు కళ్యాణాంతాలు నాయకుడు ధీరోదాత్త, ధీరశాంత, ధీరలలితుల కోవలోకి చెందుతాడు అజేయమైన బలపరాక్రమాలుంటాయి విజయమే తప్ప అపజయం అన్నది ఏనాడూ అనుభవంలోకి వచ్చిన వాడు కాడు. నాయిక ముగ్ధ, కన్య, అంతేకాక స్వీయ విధిగా నాయకుడు దక్షిణ నాయకుడు నాయిక ఆ దక్షిణ నాయకత్వాన్ని సగౌరవంగా అంగీకరించి ద్వితీయగానో, తృతీయగానో ఉండగలదు అంతేతప్ప నాయకుడు కాని, నాయిక కాని అక్రమ సంబంధాలకు పూనుకోరు

ఈ ఆదర్శాన్ని పటాపంచలు చేసి కందుకూరి వారు ఏ తీరుగా చూసినా ఒక పనికిరాని వాడిని కావ్యనాయకుడిగా చేశాడు ఒక మగనాలితో, పరకీయతో అభాగ్యుడికి సంబంధాన్ని అంటగట్టాడు వాళ్ళిద్దరూ కూడిన ప్రదేశం ఏ లతాంతో ద్యానవాటికో కాదు- పవిత్రమైన కోవెల వారి కలయిక నిరాటంకంగా సాగలేదు. కథ పక్వస్థితికి వస్తుండగా ఆ నాయిక భర్త, అతడి బంధుబలగం చూశారు

వెలుపలికిఁ దీసుకొని వచ్చి వీపుమీద
ముఖము మీదను మెడమీద ముక్కుమీద
మఱుగు గుద్దుల వానల మచ్చుచూపి
పిండి పెట్టిరభాగ్యుని నిండుగాను.

ఆ దెబ్బలకు-

తాళగలేక సౌమ్యసిల దానవుఁ డల్లన మూర్ఛపోవగా
బాలిక బంధువు ల్గని యభాగ్యుఁడు చచ్చె నటంచు నెంచి యా
ఖీలతఁ జూప లోపలను బెట్టి యభాగ్యునిఁ జుట్టి కట్టి దే
వాలయ పూర్వభాగమున యందలి గోతను వైచి రొక్కటన్

రాజుకు కాళ్ళు చేతులు స్వాధీనంలో లేవు. లేచి నడవలేకపోతున్నాడు. సేవకులు ఎంతో శ్రమపడ్డారు ఏ ఉపాయమూ తోచక ఒకే ఒక్క ఉపాయం తోచింది

పందిరి గడలను రెంటిన్
సందిటఁగొని వచ్చి కట్టి సద్వాహనమున్
సుందర గతిఁ జేసి మహా
నందముతో రాజునందు నయమొప్పారన్ (107)

శయనింపఁ జేసి యిద్దరు
దయతోడ న్మూపుపైనిఁ దద్వాహనమున్
గయికొని పరమపదంబున
కయిచేర్చు మహానుభావు కరణిని నృపునిన్ (108)

వీరేశలింగం పంతులు ఈ విధంగా నాయకుని తన్నులు తిన్నట్లుగా చిత్రీకరించాడు క్షతగాత్రుడైన వాడిని చేతుల మీదుగానో మరో విధంగానో తీసుకొనిరాక ఒక 'శవాన్ని' మోసుకొని వచ్చినట్లు, 'పందిరి గడలతో చేసిన వాహనం' మీద తీసుకొని వచ్చారని వర్ణించాడు ఇదంతా ప్రబంధ ప్రక్రియ గతానుగతికమై ఉపజ్ఞారహితమై అభాసు పాలైందని చాటడమే; ఆదర్శ స్వరూపుడైన ప్రబంధనాయకుడు చైతన్య రహితుడై పోయాడని అధిక్షేపించడమే. ప్రబంధ లక్షణాలన్నిటిని అపసవ్య మార్గంలో అనుకరించడం వల్ల అభాగ్యోపాఖ్యానం పేరడీ అయింది. **

# 9. దుర్మార్గ చరిత్ర

విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వరకవి 'దుర్మార్గచరిత్ర' పేరుతో ఒక ప్రహసన కావ్యాన్ని వెలువరించాడు ఇది 1906 లో ఏలూరులోని మంజువాణీ ముద్రాక్షర శాల ద్వారా ప్రకటితం దీనిలో ముఖ్యంగా మనుచరిత్ర పద్యాలకు, తిరుపతి వేంకట కవుల పద్యాలకు హాస్యానుకరణలు కనిపిస్తాయి

ఈ ఏకాశ్వాసకృతి ప్రారంభంలో దేవతాస్తుతిగా ఒకే ఒక్క పద్యంలో శివుని స్తుతించాడు తర్వాత వెంటనే కథ మొదలైంది

వచనం :- 'అవధరింపుము సకల దుష్టగుణరుడుంపగు సాతాని చెవిటి బసవయ్యాచార్యునకు హీనవిశ్వాస్థాభుజంగుడగు జంగమ మూగ పెరుమాళ్ళ లింగమిట్లనియె . '

ఒక చెవిటివాడికి ఒక మూగవాడు చెప్తున్న కథ ఇది అనడం పరిహాసం పరాంకోటిని అందుకోవడమే ఆ కథ ఇలా ఉంది:

కాటికాపరిగానున్న హరిశ్చంద్రుడి చెంతకు 'అవివేకి' అనే పేరు గల ఒక బ్రాహ్మణుడు వస్తాడు. 'దారపుత్రుల నెడబాసి ఘోరశ్మశానమున ముప్పులబడు నన్నుబోలు వాడు గలడే?' అని దుఃఖిస్తున్న హరిశ్చంద్రుని గాంచి అవివేకి త్రిమూర్తుల భార్యా వియోగవృత్తాంతం ఇలా వినిపిస్తాడు:

'అసౌఖ్య' పట్టణానికి రాజు 'దుర్మార్గుడు' అతడు సార్థక నామ దేయుడు. ఆ రాజెంతో ప్రజలూ అంతే యథారాజా తథా ప్రజా! 'దుర్బోధ' అనే పేరుగల బ్రాహ్మణుడు వచ్చి రాజును ప్రోత్సహించడంతో దుర్మార్గ ప్రభువు రెచ్చిపోయి రెట్టింపు ఉత్సాహంతో వెర్రిమొర్రిచేష్టలు చేస్తుంటాడు వాడి ఆగడాలకు ప్రజలు పడుతున్న బాధలు చూసి తాళలేక బ్రహ్మ విష్ణు మహేశ్వరుల పత్నులు అదృశ్యమవుతారు. దాంతో త్రిమూర్తులు ఎంతో దుఃఖంతో వారికోసం అన్వేషిస్తారు. శ్రీ వాణీ గిరిజల పట్టుదల లెరిగిన త్రిమూర్తులు 'దుర్మార్గుడి' మరణం కోసం ఘోరతపస్సు చేయవలసి వచ్చింది

దుర్మార్గుడు వేటనిమిత్తం చెలికాడయిన 'కుమతి'ని వెంట తీసుకొని అడవికి వెళ్తాడు అక్కడ 'కురూపి' అనే అసమాన సౌందర్యరాశి (పేరులోనే ఉందికదా ఆ లోకాతీత సౌందర్యం)ని గాంచి బలిమిని పెళ్ళాడి 'అసౌఖ్య'పురానికి తీసుకొనివస్తాడు. ఆ రాత్రి రాజభవనం దగ్ధమై నూతన దంపతులు అగ్నికి ఆహుతవుతారు కొత్తకోడలు కాలుపెట్టడంతో ఇల్లు, ఇంటాయన, చివరికి ఆమె మంటల్లో పడి మసి అయిపోయారన్నమాట! ప్రధాన కథతో తర్వాత ఏమీ సంబంధంలేని ఇంకో పిట్ట కథ వస్తుంది

అచటి బాపలకొక్క యక్కరము హుళక్కి
 పొట్టనేమూలను బొడిచి గనిన
అచటి రాచకొలంబు లక్షై యుఱుకుచుండు
 చీమ చిటుకు మన్న చెంది భీతి
అచటి మూడవ కొలం బర చేతిలోన వై
 కుంఠంబు చూపించి కొంద్రు సొమ్ము
అచటి బలిజెలు ధరామరల ధనంబు
 పొడి బెల్లమును బోలె బొక్కుచుంద్రు
అచటి వారకాంతలు కోతులందమంత
మించి నాట్యంబు సేయుచు మెలగుచుంద్రు
అచట బుట్టిన బంగార మరయ మన్ను
అచట బుట్టిన యుక్కైన నఱుము చెదలు (3)

ఇది అల్లసాని పెద్దనామాత్యుని పద్యానికి హాస్యానుకరణమని ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు పెద్దన పద్యం గమనించండి.

అచటి విప్రులు మెచ్చరఖిల విద్యా ప్రౌఢి
 ముదిమది దప్పిన మొదటి వేల్పు
నచటి రాజులు బంటునంపి భార్గవునైన
 బింకానఁ బిలిపింతు రంకమునకు (మనుచరిత్ర 1.50)

పురవర్ణనలో చాతుర్వర్ణ్యాన్ని వర్ణించాలన్న లాక్షణిక నిర్దేశాన్ని పెద్దన్న 'సన్మార్గంలో' పాటిస్తే సుబ్రహ్మణ్యకవి 'దుర్మార్గంలో' పాటించాడు.

అలాగే మరొక మనుచరిత్ర పద్యానికి పట్టిన భ్రష్టత్వం ఎలా ఉందో చూడండి.

ఏయే వేశ్యగణంబు నారసితి రేయే శిష్టులం దిట్టి నా
రేయే కొంపలయందు చిచ్చిడితి రేయే చెర్వులంబూడ్చి నా
రేయే దారుల కంపగొట్టితిరి యేయే తోటలంటికి నా
రాయా దుష్టవిదుష్ట చేష్టలను భ్రష్టా! నాకు చెప్పంగదే (70)

ఈ పద్యం ప్రవరుడు తన ఇంటికి విచ్చేసిన సిద్ధుని ప్రశ్నించిన సందర్భం లోని ప్రసిద్ధ పద్యానికి వికటానుకరణం.

ఏయే దేశములన్ చరించితిరి మీరేయే గిరుల్ చూచినా
రేయే తీర్థములందు గ్రుంకిడితి రేయే ద్వీపముల్ మెట్టినా
రేయే పుణ్యవనాళి ద్రిమ్మరితి రేయేతోయధుల్ డాసినా
రాయా చోటుల గల్గు వింతలు మహాత్మా! నా కెరింగింపరే. (1.68)

ఈ విధంగా దుర్మార్గ చరిత్రలో పెద్దన పద్యాలకు చేసిన అనేక హాస్యానుకరణలున్నాయి.

తిరుపతి వేంకట కవులు తమ ప్రతిభా సామర్థ్యాలను వెల్లడించే సన్నివేశంలో చెప్పిన ఈ కింది పద్యం సువిదితమే.

శతఘంట కవనమ్ము సల్పు సంగతియన్న
కరతలామలకమ్ము గాదె మాకు
ఆశుధారా కవిత్వాడంబరంబన్న
నల్లేరుపై బండి నడక మాకు
అష్టావధాన కష్టావలంబనమన్న
నంబికొండయ దండనంబు మాకు
సత్కావ్య నిర్మాణ చాకచక్యంబన్న
షడ్రసోపేత భోజనము మాకు

వ్యర్థమగువాదము లొనర్చినట్టివారి
దంబమణగించు టాపోశనంబుమాకు
దానరాధేయ, కవి సముదాయ గేయ
పండితవిధేయ రామ భూపాల రాయ

'దుర్మార్గ చరిత్ర'లో ఒక పాత్ర తన ప్రతిభా సామర్థ్యాలకు పై పద్యాన్ని అన్వయించుకొన్న తీరు ఎంత హాస్య రసవత్తరంగా ఉందో చూడవచ్చు.

మునలి ముండల మీద దెసల జూపుట యన్న
నల్లేరుపై బండి నడక గాదె
కనపడిన తిరిపెగాండ్రను దిట్టుటయటన్న
నంబికొండయ దండనంబుగాదె
తప్పు సాక్ష్యము వల్కి ధనములాగుట యన్న
షడ్రసోపేత భోజనము గాదె
తడి వస్త్రములతోడ మెడలగోయుట యన్న
జననముతో జనించినది గాదె

ముక్కుపచ్చ లారని ముద్దు పుత్రికలను
వరుస విక్రయించుట యన్న వ్రతము గాదె
కుట్రమాటకు చెవికోసికొనుట యన్న
నిక్కమైన పూర్వాచార పక్కి గాదె 84

ఈ ఒక్కటే గాదు - తిరుపతి కవులను సుబ్రహ్మణ్యేశ్వరకవి చాలచోట్ల అనుకరించాడు

కథానాయక 'కురూపి' వర్ణనలో విజయవిలాసం పోకడలు దర్శన మిస్తాయి

చానగాదిది జముకోల వానగాని
ఇంతిగాదిది ఇడుముల దొంతిగాని
యన్నుగాదిది వలకాటి మన్నుగాని
కొమ్మగాదిది బోడి పెద్దమ్మ గాని (55)

చలియవదన మిత్తడిసిబ్బి చెన్నుదన్ను
సకియ కనుబొమల్ ధ్వజముల సౌరుగేరు
మెలత మైఛాయ బొగ్గుల మించునొంచు
నువిద నడక గాడిద నడయొప్పు దప్పు. (56)

విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వరకవి దుర్మార్గ చరిత్ర నామనిర్దేశాన్ని బట్టి, కథా నిర్మాణాన్ని బట్టి, వర్ణనల బట్టి కందుకూరి అభాగ్యోపాఖ్యానాన్ని పూర్తిగా మార్గదర్శకంగా పెట్టుకొని సాగిన పరిహాస ప్రబంధం అని చెప్పడంలో అసంగతమేమీ లేదు. ఈ కవి జీవిత వివరాలు ఇతర, రచనలు తెలియరాక పోవడం విచారకరం.

**

# 10. జరుక్ శాస్త్రి

విశాల ఫాలభాగాన వెలుగులీనుతున్న విభూతి రేఖలు, పెద్ద కళ్ళద్దాలు, నోటిలో గెల్పుతెల్పు ధ్వజమ్మైక్, దివిటీలా వెలుగుతున్న 'సీజర్సు సారజ్ఞమణి.' గళసీమనలంకరించిన రుద్రాక్షమాల, ఆపైన ఉరిపోసుకొన్నట్లు ఖద్దరు ఉత్తరీయం. ఇంకా కమీజు, ధోవతి గల అవతారమే జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిది. "పూర్వ సంప్రదాయాల నతడు విడిచిపెట్టలేదు. కాని, కొత్త వెలుగు నరికట్టలేదు. ఎప్పటికప్పుడు సమాజ సాహిత్యాల్లో కలిగే మార్పులన్నింటిని శ్రద్ధగా పరిశీలన గావించి మంచిచెడ్డలు తెలుసుకొనేవాడు ఎందులోను వెనుకబడేవాడుకాడు ముందు దారికోసమూ కొత్తదారి కోసమూ ప్రాకులాడేవాడు ''1

'జరుక్‌నాథ జాంబక్ (Zambuck) మినీశాస్త్రి హాంబక్ (Hambuck)' అని శ్రీశ్రీ చేత ప్రేమగా పిలిపించుకొన్న జరుక్‌శాస్త్రి. ఇహలోక జీవితం 1914 సెప్టెంబరు 7 న రేవతీ నక్షత్రం మూడవ పాదంలో బందరులో ప్రారంభమైంది 'భావ కవిత్వంలా విజృంభించిన మూలశంక'2 తో 1968 జులై 20 న ఉదయం 4 గం॥ 5 ని॥లకు యాభై నాలుగవ ఏట విజయవాడలో ముగిసింది.

'కవనార్థం బుదయించితిన్' అన్నట్లు పేరడీ ప్రక్రియకు ఆద్య లక్ష్య కర్తగా విలసిల్లిన జరుక్‌శాస్త్రి చిట్టి గూడూరు ప్రాచ్య కళాశాల నుంచి 1937 లో డిగ్రీరీత్యా పాండిత్యం రీత్యా ఆంధ్ర గైర్వాణోభయ భాషా ప్రవీణుడయ్యాడు. బందరులో విద్యార్జన కాలంలో ముట్నూరి కృష్ణారావు కృష్ణాపత్రిక దర్బారులో ఒక పిల్ల కవిగా ప్రవేశించాడు. అక్కడ అందరి ప్రేమాభిమానాలు పోగు చేసుకొంటూ ఎన్నో సాహిత్య సమావేశాల్లో పాల్గొంటూ తనకంటూ ఒక పరపతి సంపాదించుకొన్నాడు ఆంధ్రపత్రికలో ఏడేళ్ళపాటు ఉప సంపాదకునిగా పని చేశాడు 1946 నవంబర్ 1 న ఆయన మద్రాసు ఆకాశవాణిలో స్క్రిప్టు

---

1 వింజమూరు శివరామారావు. ఆంధ్రప్రభ దినపత్రిక 21-7-68.

2. కనక్ ప్రవాసి, భారతి జూన్ 1982.

రైటర్‌గా నియమితుడయ్యాడు అక్కడే ఆకాశవాణి వారి మాస పత్రిక 'వాణి'కి 1958 నుండి 1964 వరకు ఉప సంపాదకునిగా పత్రికను నిర్వహించాడు 1964 మేలో విజయవాడి ఆకాశవాణికి బదిలీ అయ్యాడు

"గుంటూరంటే నాకు మంట. ఆ ఊళ్ళో చిన్నప్పుడు నేను పడ్డపాట్లు మరిచిపోలేదు. కాళ్ళు అరిగిపోయేట్లు తిరిగాను. ఉద్యోగం కోసం ఎక్కేగడపా దిగేగడపా ఎక్కడికి పోయినా చుక్కెదురే కొన్ని పూటలు మరమరాలూ, బరానీలూ తిని, మంచినీళ్ళు తాగి గడిపేశాను పగలంతా తెగతిరిగి రాత్రి అరండల్ పేటలో కట్టెల అడితీలో తలదాచుకొనేవాణ్ణి"[1] అని తాను బాల్యంలో అనుభవించిన పేదరికాన్ని, ఈతి బాధలను స్మరించుకొన్నాడు క్రొటగడ్డ రాజ గోపాలరావు లాంటి సహపాఠుల వల్ల, శ్రీశ్రీ వల్ల అభ్యుదయ భావాలవైపు ఆకర్షితుడయ్యాడు కమ్యూనిస్టు ఉద్యమానికి 'హోల్‌టైమర్' అవుదామని కూడా ఉబలాటపడ్డాడు 1946 మే 1 న రాజమండ్రిలో అ ర సం నిర్వహించిన సదస్సు గూర్చి రెండు చేతులా స్వయంగా నివేదిక రాసి అచ్చువేశాడు. అప్పటి నవ్య సాహిత్య పరిషత్తులో వామపక్షం ఏర్పరచాలని గట్టిగా వాదించాడు.

ఒక దశాబ్దం గడిచేలోగా ఆ ఉత్సాహం చల్లారిపోయింది మనస్సు కొత్తదారులు తొక్కింది ఇంకా సరిగ్గా చెప్పాలంటే - 1952 మేలో ఆయనలో మథనం ప్రారంభమైంది 1952 దసరా నవరాత్రుల నుంచి సంధ్య వార్చంది పచ్చి మంచినీళ్ళు తాగడం లేదు 'శ్రీ విద్యోపాసనే' ఆస్తిగా; 'రమణాచలం' మోక్షాచలంగా; 'యోగం' సర్వరోగ నివారకంగా తలపోయసాగాడు రాజకీయాలు, నినాదాలు ఎంత గగ్గోలు ఎత్తించినా అశాంతిని పెంచేవే కాని ఆత్మ తృప్తిని అవి కలిగించలేవని, ముఖ్యంగా నినాదాలు అరుపులు చాలా కన్నులలో దుమ్ముకొడుతున్నాయన్నాయన్న నమ్మకం పెరగసాగింది. ఆయన మాటల్లోనే చెప్పాలంటే ఇదంతా రియాక్షనరీ (వెనక్కు మళ్ళే తత్వం) అంటారట.[2]

---

1 అమరేంద్ర, ఆంధ్రప్రభ దినపత్రిక 5.3.81

2 కనకప్రవాసి, భారతి, జూన్ 1982

ఎదుటి వారెంతవారయినా సరే తనకు తోచింది నిర్భయంగా నిర్మొహమాటంగా జరుక్ శాస్త్రి అనేవాడు వేళాకోళం పట్టించేవాడు. ఒక్కొక్కసారి ఈ హాస్య ప్రియత్వం, ఈ వివాద ప్రియత్వం ఆయనకు చిక్కుల్ని తీసుకొని వచ్చిన దాఖలాలు కూడా లేకపోలేదు. మచిలీపట్నంలో గురువుగారయిన చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు చేసిన ఒక ప్రయోగాన్ని సభలోనే తప్పన్నారు. సతీర్థులూ ఇతరులూ అంతా అవాక్కయిపోయారు. గురువుగా రాలోచించి, శాస్త్రం పరిశీలించి శిష్యుని అభిప్రాయమే సరయినదని తేల్చి ఆశీర్వదించారట.[1]

గురజాడ అప్పారావు యుగకర్త అని గగ్గోలు పెడుతుంటే ఏ పాటి యుగకర్తో చూద్దాం అని జరుక్ శాస్త్రి ఒక ఊపు ఊపాడు. 'జయంతి కుమార స్వామి' పేరుతో 1955 మే 13 నాటి ఆంధ్ర పత్రికలో 'కన్యాశుల్కం రచన ఎవరిది?' అని అగ్గి రాజేశాడు దాంతో సాహితీ లోకం తుళ్ళిపడింది. జయంతి కుమారస్వామి వ్యాసాన్ని ఖండిస్తు 'కన్యాశుల్కం గోమఠం శ్రీనివాసాచార్యుల రచన కాదు, గురజాడవారిదే' అని శ్రీ వసంతరావు బ్రహ్మజీరావు, గిడుగు సీతాపతి 1955 మే 27 నాటి ఆంధ్ర పత్రికలో వ్యాసాలు రాశారు. జరుక్ శాస్త్రి చిలిపి చేష్టవల్ల ఇంకా ఎందరికో ఆ కాలంలో అదొక 'బర్నింగ్ టాపిక్' అయి కూర్చుంది జయంతి లాంటి తదితర పత్రికల్లోను వేడిగా వాడిగా ఈ విషయమై చర్చలు తలెత్తాయి. దీనిని ఆయన క్షుద్రచేష్టగా కొట్టివేయలేం 'అప్పారావుగారు ప్రతిభావంతులు, గొప్ప పండితులు- ఆంగ్లంలో- కాని తెనుగున వారికి సహాయం- ఇతరుల సహాయం ఉంది'[2] అని తర్వాత కూడ విశ్వసించాడు. అప్పారావుకు 'మన వాళ్ళంటే ఉండే అసహ్యం, మన సంస్కృతి యందుండే అసహ్యం ఎంతైన గర్హ్యం'[3] అని భావించాడు

---

1 పైడిపాటి, ఆంధ్రప్రభ దినపత్రిక 24-7-1968

2. కనక్ ప్రవాసి, భారతి జూన్ 1982

3 ,, ,,

అలాగే విశ్వనాథ సత్యనారాయణను కూడా ఒకసారి ఆట పట్టించ బోయాడు ఆయన పిలకపట్టుకొని జాడించబోతే ఎలాగో తప్పించుకొన్నాడట.[1]

జరుక్ శాస్త్రి, అబ్బూరి వరదరాజేశ్వరరావులు కలిసి గుంటూరులో 'ద్రౌపదీ మాన సంరక్షణమో' 'వస్త్రాపహరణమో?' సినిమాకు వెళ్ళారు దుశ్శాసనుడు ద్రౌపది వలువ లూడ్చడానికి యత్నిస్తున్న సన్నివేశం 'సహింతురా సహింతురా రాజాధి రాజుల్ సహింతురా' అంటూ ద్రౌపది పాడుతుంది. జరుక్ శాస్త్రికూడ 'రమింతురా రమింతురా రాజాధిరాజుల్... ' అని పాడుతుండ డంతో ప్రేక్షకులు విసుక్కొన్నారు పాటనంతా నడుమ నడుమ విరుస్తూ నవ్వులపాలు చేస్తుండడంతో వీర పాండవాభిమానులు ఆయనను మందలించారు. ఆయన అసహనంతో 'నీ కెందుకు బాధ' అని ప్రశ్నించేసరికి ఒక ప్రేక్షకుడు కోపంతో 'నోర్ముయ'మన్నాడు. దాంతో మాటా మాటా పెరిగింది 'ద్రౌపది వీళ్ళ పెళ్ళాం కాబోలు' నని జరుక్శాస్త్రి అనడంతో అందరూ కలిసి శాస్త్రిని, వరదరాజేశ్వరరావును బలవంతాన బయటికి గెంటివేశారట.[2]

'పద్యం వ్రాస్తే విశ్వనాథతో సమానంగా, లిరిక్ వ్రాస్తే కృష్ణశాస్త్రితో సమానంగా, గేయంవ్రాస్తే శ్రీశ్రీ లాగా, వచనం వ్రాస్తే వేలూరి శివరామశాస్త్రి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిలాగా, కథలు వ్రాస్తే చలంలాగా వ్రాయగలిగినపుడే వ్రాస్తాను, అలా వ్రాయలేనపుడు కలం కింద పడేసి కూచుని హాయిగా చదువు కుంటా'[3] ననేవాడు అయినా జరుక్ శాస్త్రి కథలు చెప్పాడు. నవలలు రాశాడు. పద్యాలు అల్లాడు ఎన్ని రాసినా ఎన్ని చేసినా జరుక్శాస్త్రికి పేరు తెచ్చిపెట్టినవి ఆయన రాసిన పేరడీలే పేరడీకి ఆయన పర్యాయపదమయ్యాడు. తెలుగు సాహిత్యంలో పేరడీ ప్రక్రియకు ప్రాచుర్యం కల్పించి, సుస్థిర రూపకల్పన చేసింది జరుక్ శాస్త్రి.

---

1 అమరేంద్ర, ఆంధ్రప్రభ దినపత్రిక- 2.3.81

2. అబ్బూరి వరదరాజేశ్వరరావు 'కవన కుతూహలం' (1993) పుట 51-61.

3 అమరేంద్ర, ఆంధ్రప్రభ దినపత్రిక 5.3.81

చలికాలం మార్తాండరావు, జయంతి కుమారస్వామి, వెల్లటూరి సోమనాథం అని ఇష్టం వచ్చినట్లు మారుపేర్లు పెట్టి పత్రికల్లో ఎన్నో వ్యాసాలు, కవితలు ప్రకటించాడు పత్రికల్లోను, రేడియోలోను ఉద్యోగం చేయడం మూలాన ఎప్పుడూ ఒకేపేరు బాగుండదనీ, డబ్బు అవసరం కొద్దీ రకరకాల పేర్లతో వ్యాసాలు రాసేవాడు. ఏవి ఆయన రచనలో ఏవి కావో గుర్తుపట్టరానంతగా పాడు చేశాడు. ఎంతో శ్రమతో పత్రికలన్నీ గాలించి కె. వి. రమణారెడ్డి 'జరుక్‌శాస్త్రి పేరడీలు-ఇతర కవితలు' పేరుతో 1982 లో సంకలనం వేశాడు. 'ఇది సమగ్రమనిపించడం లేదు సమగ్రమయ్యేదీ కాదు. ఎందుకంటే, అవి మరెన్ని పత్రికల్లో పడివున్నాయో నిశ్చితంగా తెలియదు. మారుపేర్లతో రాసే దురల వాటు వుండినందుచేత ఏవి ఆయనవో ఏవి ఇతరులవో తెలిసే వీలు తక్కువ' అని కె.వి. రమణారెడ్డి పీఠికలో పేర్కొన్నాడు అందుకే కాబోలు, 34 శీర్షికలున్న ఈ గ్రంథంలో పది పన్నెండు పేరడీలు మాత్రమే ఉండి, తక్కినవన్నీ స్వీయ కవితలే ఉన్నాయి

భావ కవులనూ అభ్యుదయ కవులనూ జరుక్‌శాస్త్రి పేరడీ చేశాడు. నాయని సుబ్బారావు, విశ్వనాథ, మల్లవరపు విశ్వేశ్వరరావు, పిఠాపురం యువరాజు, శ్రీశ్రీ లాంటి సుప్రసిద్ధ కవుల రచనల తీరుతెన్నులను, భావాల సొబగులను అకటావికటం చేశాడు. ఆ వికట రచనా పాండిత్యాన్ని ఇక్కడ పరిశీలిద్దాం.

## అసురకృత్యం

ఎవ్వడే నీ గళమ్మునం దిరవుకొనగ
నేను ఏసిరిన ప్రేమ ప్రసూనమాల
నడుమ నీవు చూడగ బట్టి నలిపివైచి
నీ కనుల యందు నెత్తురుల్ నింపినాడు.

ఇది నాయని సుబ్బారావు 'సౌభద్రుని ప్రణయ యాత్ర' లోని 'అసుర కృత్యం' శీర్షిక కిందసాగిన అయిదు పద్యాలలో మొదటిది. దీనితో నాయని

అనుసరించిన నిర్మాణ శిల్పం, ఎత్తుగడ, అందిస్తున్న భావచిత్రాన్ని గుర్తించాక జరుక్‌శాస్త్రి 'ఎవ్వడే వీడు' ఖండిక పరిశీలిస్తే పేరడీకర్త ఎంత వరకు కృతకృత్యుడయ్యాడో తెలుస్తుంది

తన ప్రేయసికి తనకూ మధ్య అగాధాలు సృష్టించి తమ మధ్య ఎడబాటుకు కారణమైన వ్యక్తిని ఉపాలంభిస్తున్న సందర్భం నాయని పద్యంలోది ఆ వ్యక్తి ఎవరనేది అనవసరం, ఈ సందర్భంలో అజ్ఞాతం కాని అతని చర్య మాత్రం తెలుస్తుంది, ఫలితం కనిపిస్తుంది తాను ఏం చేయగలడో తెలియకున్నా ఆ మనిషి ఎవరో తెలుసుకోవాలన్న సహజ సిద్ధమైన కోరిక ఉంది. అందుకే పద్యం 'ఎవ్వడే అని ఆరంభం కావడం ఈ పద్యంలో ముగ్గురు వ్యక్తుల చిత్రణం గోచరిస్తుంది.

1. ప్రేమ ప్రసూనమాల విసిరిన ప్రియుడు
2 దానిని మధ్యలోనే తుంచివేసిన అజ్ఞాతవ్యక్తి
3 దానివల్ల కళ్ళల్లో నెత్తురు (నీళ్ళు) నిండిన ప్రేయసి

ఇంకో విషయం కూడా ఉంది

ప్రేయసికి తెలియకుండ ప్రియుడు పూలమాల విసరడం లేదు. ఆమె చూస్తుండగ ఆమె మెడలో పడాలన్న కాంక్షతో విసురుతున్నాడు. ఆమె కూడ తన మెడలో దండ వచ్చి పడాలన్న ఆకాంక్షతో నిరీక్షిస్తుంది కాని అకస్మాత్తుగా అవాంతరం ఏర్పడింది ఇది సుబ్బారావు తన పద్యంలో పాటించిన నిర్మాణం పద్ధతి. ఇక జరుక్‌శాస్త్రి పద్యం.

ఎవ్వడే వీడు మాట సొంపేమరిలక
పూలతేనెల వాకలు పోగుచేసి
త్రచ్చి తెచ్చిన మదు సుధారావ మందు
కటిక బొంగురు గొంతుక కలుపుతాడు?

[జరుక్‌శాస్త్రి పేరడీలు - పుట 99]

'ఎవ్వడే' అని మాతృక లాగే ఆరంభమై అలాగే కొనసాగింది. మూలంలో ప్రశ్నిస్తున్న వ్యక్తి ప్రియుడు, ఆయన చేసిన పని(పూలదండ విసరడం)కి విఘాతం కలిగించిన వాడిని గురించి ఈ పద్యంలో కూడ అడుగుతున్న వ్యక్తి ప్రియుడే, కాని అతడేపనీ ఇక్కడ చేయడం లేదు. కాకుంటే ప్రేయసి కంఠ మాధుర్యం తనకు చేరడంలో మధ్య అంతరాయం ఏర్పడింది. అందువల్ల అడుగుతున్నాడు.

నాయని పద్యంలో ప్రియుడు విసిరింది పూలమాల. అది భౌతికమైన వస్తువు కావడం వల్ల అతడి చేతకు అవకాశ మేర్పడింది. కాని జరుక్ శాస్త్రి పద్యంలో ప్రేయసి కంఠ మాధుర్యం పూల తేనెల వాకలు పోగుచేసి తెచ్చిన సుధే కావచ్చు కాని ఆ మాధుర్యం ప్రియుని వల్ల వచ్చింది కాదు. అందువల్ల ఇక్కడ ప్రియుడు నిష్క్రియుడవుతున్నాడు కాని ఆరాటపడుతున్నాడు ఎందుకా ఆరాటం? ప్రేయసి కంఠ మాధుర్యాన్ని అనుభవించే (అనుభవిస్తున్న) వ్యక్తి తానే నసుక అంతేగాదు, మూలంలో ప్రియుడు తన పూలదండ ప్రేయసిని చేరలేదని ప్రేయసీ ప్రియులిరువురు బాధపడుతున్నారు జరుక్ శాస్త్రి పద్యంలోను ప్రేయసి కంఠమాధుర్యం ప్రియుడికి చేరడంలేదని ఇద్దరు దుఃఖిల్లుతున్నారు. అందువల్ల అనుకృతపద్యంలో గాంభీర్యం చోటు చేసుకుంది దాంతో రెండు పద్యాల్లోను కలిగే సమానమైన ఫలితం 'విలాపం' అయి, అనుభూతి వైవిధ్యం కొరవడింది.

నాయని పద్యాన్ని తొలగించి ఆ స్థానంలో జరుక్ శాస్త్రి పద్యాన్ని చదివితే ఎలాంటి వికృతి కలగడంలేదు మొత్తం కావ్యం చదువుతున్న మనఃస్థితిలోనే ఈ పద్యాన్ని చదివే అవకాశముంది. పేరడీ మాతృకతో కలిపి చదివినా వెంటనే బయటపడాలి అట్లాగే మూలం కలిగించే అనుభూతికి భిన్నంగా ఉండితీరాలి. అప్పుడే పేరడీ అవుతుంది.

జరుక్ శాస్త్రి అనుకృత పద్యంలో గంభీరమైన వాతావరణం చిత్రితం కావడంవల్ల నాయని పద్యం కన్నా భిన్నమైన అనుభూతిని ఇవ్వలేకపోవడం వల్ల, పేరడీ కాకుండా పోయింది.

భావి భాగ్యోదయ ప్రభా భాసమాన
సుందరం బైన స్వాప్ని కానంద మందు
మైమఱచి యుండ నెవ్వడే మచ్చరించి
నా యెదదలోన చురకత్తి నాటినాడు?

ఇది నాయని రెండోపద్యం.

ఎవ్వడే వీడు, మైమఱ చెదను చేయి
వైచి నిద్రించు వేళను కాచి పొంచి
కుచ్చితము తోడ నన్నలు మచ్చరించి
మెసల తలకింద దిండు కాజేసినాడు. (పుట 99)

ఇది జరుక్‌శాస్త్రి అనుకరించిన పద్యం.

మూలంలో నాయకుడు భవిష్యత్తులో తాను కోరుకున్న యువతి తన వశమై సర్వసుఖాలు అందిస్తుందని కలలు కంటున్నాడు ప్రేమలో పడినవానికి ఇది సాధారణాంశం ఈ విధంగా తలచుకొని కలల్లో తేలియాడుతున్న అతని హృదయంలో వ్యతిరేకి చురకత్తి నాటినాడు. చురకత్తి నాటడమంటే అతని ప్రేమకు ప్రోత్సాహమివ్వకుండా అభ్యంతరం ప్రకటించడ మన్నమాట

మూలంలోని ఉదాత్తతను పేరడీకర్త తన పద్యంలో భగ్నం చేశాడు. మైమరచి నిద్రిస్తున్న వేళ తలదిండు కాజేయడమనేది సుబ్బారావు పద్యంతో పోలిస్తే గాంభీర్యాన్ని సంతరించుకున్న కవితా వస్తువు కాదు మూలంలో 'ప్రేమ' విషయమైతే పేరడీలో 'నిద్ర' వస్తువైంది దాంతో విషయాంతరం సిద్ధించింది. విషయవైవిధ్యం అనుభూతి వైవిధ్యానికి తావిచ్చింది. మాతృకను చదివినపుడు ప్రియునితో పాటు పాఠకుడుకూడా సహానుభూతి పొందుతాడు. ప్రియునిపట్ల జాలిని ప్రకటిస్తాడు. కాని జరుక్‌శాస్త్రి పద్యాన్ని చదివి హాయిగా నవ్వుకుంటాడు అందువల్ల ఈ పద్యం చక్కని పేరడీకి నిదర్శనంగా గుర్తించ వచ్చు

ఈ నిరంతర తీవ్రబాధా నివృత్త
మైన నా ముగ్ధ హృదయమ్మునంతరాళ
శూన్యతలి, నెవ్వడే నిలుమంచబెట్టి
ఎడతెగని సంశయముల బంధించినాడు?

ఇది నాయని మూడవ పద్యం.

నాయకుని ముగ్ధ హృదయం ప్రేమతో నిండి ఓలలాడుతుంది. సాఫీగా సాగిపోతుందనుకొన్న ప్రణయ నౌక ఆటుపోట్లకు గురయింది తమ ప్రేమ ఫలించి తామొక్కటి అవుతారా శాశ్వత వినియోగమే ప్రాప్తిస్తుందో లేక మరేం జరగబోతుందో అనూహ్య పరిణామాలేమి రానున్నాయో అని విపరీతమైన ఆందోళకు గురయ్యాడు నాయకుడు సంశయాలు అతనిని పట్టి పీడిస్తున్నాయి

ఈ అనారత బాధా ప్రహేళికలకు
కులిమి ఏడ్చేడి నన్నట్టు లామతించి
వట్టి మాటల నిలబెట్టి పట్టుదలకు
రాక్షసుడ వీడు? చే బదలడుగుతాడు! (పుట. 100)

ఇది జరుక్ శాస్త్రి పేరడీ

పద్యం ఎత్తుగడలోను, నిర్మాణంలోను ముమ్మూర్తులా నాయనిని అనుకరించింది. జరుక్‌శాస్త్రి పద్యం మొదటి మూడు పదాలు ఎంతో గంభీరంగా సాగి, చివరి పదంలో 'చేబదులడగడం'తో ఆ గాంభీర్యం, ఉదాత్తత తొలగిపోయి హాస్యభాజనమైంది పద్యం దాంతో పేరడీగా రూపుదిద్దుకుంది.

## ఇతర గీతాలకు :

విశ్వనాథ సత్యనారాయణ శైలి ఇదీ అని గద్యంలో చూపినట్లుగా పద్యంలో చూపడం కష్టం రసానుగుణమైన శైలిని వరిస్తాడాయన మహా ప్రాబంధిక శైలిలో 'మారుమూల పదమ్ముల నేరి తెచ్చి కోమలేతర కవనమ్ము' కూర్చగలడు. అట్లాగే పూర్తి వ్యావహారిక రీతితో సులభశైలిలోను రాయగలడు 'నిత్యవేగి' ఆయన చిత్తం 'సుంతయు విలంబన మోర్వదు ' జరుక్ శాస్త్రి నిందాస్తుతిగా కాకుండా వాచ్యంగానే విశ్వనాథ రచనా ధోరణిని విమర్శించాడు.

అతని సమ్ముఖమందు రసాధిదేవ
తాత్మ కుంచుక కుంచుక తారుచుండు
ముక్కు తిప్పుకు మూతని ముడుచుకొంచు
పరమ ఛాందసు ముందర ప్రౌఢవోలె (జరుక్‌శాస్త్రి పేరడీలు, పుట 31)

అని జరుక్‌శాస్త్రి చమత్కరించాడు

'కవిత శాస్త్రము వంటి కళ'[1] గా తలపోసే విశ్వనాథతో విభేదించినా, ప్రౌఢిమ పేరుతో ప్రాణాలు కొరికెడి హింసాత్మకతను భరించలేక పోయినా ఆయనలోని సుధామృదు సుధూక్తినీ కవితాత్మనూ జరుక్ శాస్త్రి మెచ్చు కొన్నాడు.

పూర్ణముగ నిన్ను అవునని ముద్దుసేయ
రాదు, కాదని పట్టి పల్లార్చరాదు
గౌరవింపగదగ్గ శిఖండి వీవు
నీదు మార్గాన నీయంత నేతలేడు. (జరుక్ శాస్త్రి పేరడీలు, పుట 32)

అని జరుక్ శాస్త్రి ఆ 'నవ్య ప్రాచీన ప్రాచీన నవ్యుడిని' గురించి తలపోస్తాడు. విశ్వనాథ శైలీ కాఠిన్యాన్ని హేళనాత్మకంగా అనుకరిస్తూ 'అర్థం లేని పదాలు' శీర్షికతో పద్య సప్తకం చెప్పాడు.

కించిత్తిక్త కషాయ షాడబ రసక్షేపాతిరేకాతి వా
క్సంచార ప్రచయావకాశములలో కవ్యూఢ్వ, గండాశ్మముల్
చంచల్లీల నుదాత్త వాగ్గరిమతో సాధించి వేధించుమా
పంచారించి ప్రవహ్లికాకృతిన్ పాషాణపాక ప్రభూ! (పుట 32)

జరుక్ శాస్త్రి ఏ ముహూర్తాన విశ్వనాథను 'పాషాణపాక ప్రభూ!' అని సంబోధించాడో కానీ అది సాహితీ లోకంలో స్థిరపడిపోయింది. పాషాణపాక పద ప్రయోగానికి జరుక్ శాస్త్రి ఆరంభకులు కాదు, ఆయన కన్నా

---

1 ఈ ఉల్లేఖనం విశ్వనాథ ఎక్కడ చేశాడో తెలియదు 'కవిత శాస్త్రము వంటి కళ అను నీ మాట పుడమిని మెచ్చుకో చూడలేను' - అని జరుక్‌శాస్త్రి ఎందుకో! ఎవరి మీదనో' శీర్షికతో విశ్వనాథ ధోరణిని అధిక్షేపిస్తు రాసిన పద్యంలోది జరుక్‌శాస్త్రి పేరడీలు పుట 31-32.

ముందు వెంకట రామకృష్ణ కవులు రచించిన 'ఆంధ్ర కవుల అపరాధములు'1లో కూడ కనిపిస్తుంది

కె.వి రమణారెడ్డి సంకలనంలో చేరందీ, జరుక్‌శాస్త్రి విశ్వనాథ మీద చెప్పిందీ అయిన ఒక పద్యం ఇది·

శ్రీ కావ్యాత్త రసప్రపీథులు సితశ్రీ శ్వేష్ఠకాష్ఠాయిత
వ్యాకృత్ ప్రాక్తన సామిధేని జ్వలన వ్యాలోల ధూమచ్ఛటా
చ్ఛేక ప్రాభవ జింఖనీకృత సురజ్యేష్ఠాది వాసాధికల్
బ్రేకుల్ లేని కపీ గవీద్వతతికిన్ భీశాస్త్రి కేశ్మోర్మెడ్రెదన్.

దేవులపల్లి కృష్ణశాస్త్రి 'తొలి వియోగిని నేనే, తొలి ప్రేయసిని నేనే' అని సాగే ప్రసిద్ధ ఖండికను, హేళనాత్మకంగా అనుకరించాడు

విరహమే విశ్వముగ. బేల కార్చిచ్చుగా
నుసిగా పలకరించి, పసిమిగా పులకించి
తులసి మొక్కను నేనే
తురక వేపను నేనె
ఆనాటి కీనాటి
కేను మృత్కణమేను (జరుక్‌శాస్త్రి పేరడీలు, పుట 83)

'అర్థంలేని పద్యాలు' శీర్షికతో కృష్ణశాస్త్రి కవితను సగంవరకు బుద్ధిగానే అనుకరించి తర్వాత ఎటో వెళ్ళిపోయాడు కృష్ణశాస్త్రి 'జైలులో శ్రావణం' ఖండికకు 'దమ్ము పద్యాలు' పేరుతో జరుక్‌శాస్త్రి పేరడీ రాశాడని విమర్శకు లంటారు. కాని రెండింటిని పోల్చి చూస్తే భిన్నమని తేలుతుంది. 'కన్నీటి

1 కృష్ణరాయడు చేసిన విష్ణు చిత్త
కావ్యమందలి భావము శ్రావ్యమెయగు
నెన్నిమార్లు పఠించిన నెఱుకపడని
వట్టి పాషాణ పాకమెవ్వండు సదువు?
(1965 మే ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ సంచికలో పునర్ముద్రణం.)

'కవిత శాస్త్రము వంటి కళ'[1] గా తలపోసే విశ్వనాథతో విభేదించినా, ప్రౌఢిమ పేరుతో ప్రాణాలు కొరికెడి హింసాత్మకతను భరించలేక పోయినా ఆయనలోని సుధామృదు సుధూక్తినీ కవితాత్మనూ జరుక్ శాస్త్రి మెచ్చు కొన్నాడు.

పూర్ణముగ నిన్ను అవునని ముద్దుసేయ
రాదు, కాదని పట్టి పల్లార్చరాదు
గౌరవింపగదగ్గ శిఖండి వీవు
నీదు మార్గాన నీయంత నేతలేడు. (జరుక్ శాస్త్రి పేరడీలు, పుట 32)

అని జరుక్ శాస్త్రి ఆ 'నవ్య ప్రాచీన ప్రాచీన నవ్యుడిని' గురించి తలపోస్తాడు. విశ్వనాథ శైలీ కాఠిన్యాన్ని హేళనాత్మకంగా అనుకరిస్తూ 'అర్థం లేని పదాలు' శీర్షికతో పద్య సప్తకం చెప్పాడు.

కించిత్తిక్త కషాయ షాడబ రసక్షేపాతిరేకాతి వా
క్సంచార ప్రచయావకాశములలో కవ్యృద్ధ, గండాశ్మముల్
చంచల్లీల నుదాత్త వాగ్గరిమతో సాధించి వేధించుమా
పంచారించి ప్రవహ్లికాకృతిన్ పాషాణపాక ప్రభూ! (పుట 32)

జరుక్ శాస్త్రి ఏ ముహూర్తాన విశ్వనాథను 'పాషాణపాక ప్రభూ!' అని సంబోధించాడో కానీ అది సాహితీ లోకంలో స్థిరపడిపోయింది. పాషాణపాక పద ప్రయోగానికి జరుక్ శాస్త్రి ఆరంభకులు కాదు, ఆయన కన్నా

---

1 ఈ ఉల్లేఖనం విశ్వనాథ ఎక్కడ చేశాడో తెలియదు 'కవిత శాస్త్రము వంటి కళ అను నీ మాట పుడమిని మెచ్చుకో చూడలేను' - అని జరుక్‌శాస్త్రి ఎందుకో! ఎవరి మీదనో' శీర్షికతో విశ్వనాథ ధోరణిని అధిక్షేపిస్తు రాసిన పద్యంలోది జరుక్‌శాస్త్రి పేరడీలు పుట 31-32.

'విరిదండ మెడలోన వేయుటే కాని కన్నార నీ మూర్తి గాంచనే లేదు' అని మొదలయ్యే వెంకట పార్వతీశ్వర కవుల గీతాన్ని ఉపక్రమించమే కాకుండ సాదృశ్య పరంపరలతో ఒకే భావాన్ని చెప్తూ, ఒకే వాక్య శిల్పాన్ని వరసగా అనేక పాదాలలో కూర్చే వేంకట పార్వతీశ్వర కవుల శైలిని 'అర్థంలేని పదాలు' పేరుతో కవిత రాసి అధిక్షేపించాడు.

పలికింది పలికింది పరపారవరతీర
పర్జన్య దుర్జేయ వాౢజేయ శంఖం
పరిభూత నరపుంఖ పునరుద్యమాంకం, చిరనిరాతంకం
శంఖం, శంఖం, పలికింది పలికింది - (జరుక్‌శాస్త్రి పేరడీలు, పుట 96)

అని విపరీతమైన తద్ధితరూపాలలో మారుమూల పదాలతో పండితైకవేద్యంగా దురవగాహంగా మల్లవరపు విశ్వేశ్వరరావు 'శంఖనాదం' శీర్షికతో ఓ గేయం ప్రకటించాడు. జరుక్‌శాస్త్రి ఆ గేయానికి గట్టి 'పేరడీ ప్రయత్నం' చేశాడు. విశ్వేశ్వరరావు గేయం శంఖనాదం కాదని కేవలం డమడమల చప్పుడు మాత్రమే నని సూచించడానికి పేరడీ గేయానికి 'క ఞ న్ క ఞ న్' అని పేరు పెట్టాడు.

పలికింది పలికింది పలికింది పలికింది
శంఖం శంఖం
టడ నణల శంఖం
త ద న ణ ల శంఖం
ప ఫ బ భ మ య ర ల వల శ ష స హ ళల శంఖం
పలికింది పర్జన్య శంఖం గర్జన్య శంఖం

అని మల్లవరపు గేయంలోని లక్షణాలను అతిశయించి చూపుతూ అర్థ రహితమైన పదాలతో నవ్వుల పాలు చేశాడు

## శ్రీశ్రీ గీతాలకు :

జరుక్‌శాస్త్రి శ్రీశ్రీ గేయాలకు చేసిన పేరడీలు బాగా ప్రసిద్ధి చెందాయి. వాటిల్లో శ్రీశ్రీ 'నవ కవిత' కు ఆయన రాసిన 'సరదా పాట' ఒకటి

'కవిత శాస్త్రము వంటి కళ'[1] గా తలపోసే విశ్వనాథతో విభేదించినా, ప్రౌఢిమ పేరుతో ప్రాణాలు కొరికెడి హింసాత్మకతను భరించలేక పోయినా ఆయనలోని సుధామృదు సుధూక్తినీ కవితాత్మనూ జరుక్ శాస్త్రి మెచ్చు కొన్నాడు.

పూర్ణముగ నిన్ను అవునని ముద్దుసేయ
రాదు, కాదని పట్టి పల్లార్చరాదు
గౌరవింపగదగ్గ శిఖండి వీవు
నీదు మార్గాన నీయంత నేతలేడు. (జరుక్ శాస్త్రి పేరడీలు, పుట 32)

అని జరుక్ శాస్త్రి ఆ 'నవ్య ప్రాచీన ప్రాచీన నవ్యుడిని' గురించి తలపోస్తాడు. విశ్వనాథ శైలీ కాఠిన్యాన్ని హేళనాత్మకంగా అనుకరిస్తూ 'అర్థం లేని పదాలు' శీర్షికతో పద్య సప్తకం చెప్పాడు.

కించిత్తిక్త కషాయ షాడబ రసక్షేపాతిరేకాతి వా
క్సంచార ప్రచయావకాశములలో కవ్యుద్ధ, గండాశ్మముల్
చంచల్లీల నుదాత్త వాగ్గరిమతో సాధించి వేధింపుమా
పంచారించి ప్రవహ్లికాకృతిన్ పాషాణపాక ప్రభూ! (పుట 32)

జరుక్ శాస్త్రి ఏ ముహూర్తాన విశ్వనాథను 'పాషాణపాక ప్రభూ!' అని సంబోధించాడో కానీ అది సాహితీ లోకంలో స్థిరపడిపోయింది. పాషాణపాక పద ప్రయోగానికి జరుక్ శాస్త్రి ఆరంభకులు కాదు, ఆయన కన్నా

---

1 ఈ ఉల్లేఖనం విశ్వనాథ ఎక్కడ చేశాడో తెలియదు 'కవిత శాస్త్రము వంటి కళ అను నీ మాట పుడమిని మెచ్చుకో చూడబోను' - అని జరుక్‌శాస్త్రి ఎందుకో! ఎవరి మీదనో' శీర్షికతో విశ్వనాథ ధోరణిని అధిక్షేపిస్తు రాసిన పద్యంలోది జరుక్‌శాస్త్రి పేరడీలు పుట 31-32.

అయినా అవి ప్రబోధించే విషయం వేరు మాగాయా, ఆవకాయ కూడా 'ఎరుపు'ను వ్యంజింపచేసేవే అయినా ఇవి చెప్పే సంగతులు వేరు. మొదటి జంట విప్లవ ప్రబోధకాలు కాగా - రెండవ జంట హాస్య సంపాదకాలు. ఉప్పు, కప్పురాలు ఒకటే అయినా రుచులజాడ వేరయినట్లు రెండు ఒకే రంగు కలిగున్నా స్వభావాలు వేరయ్యాయి

మాతృకలో జనసమ్మర్దం చెలరేగింది దేనికోసం? సమాధానం ఉడుకు రక్తం ఉరక లెత్తించేది మరి పేరడీలో జనసమ్మర్దం చెలరేగింది. 'అచ్చమ్మ హోటేల్లో చేపల' కోసమట - ఇదీ హేత్వాభాసమే.

ఖడ్గమృగోదగ్ర విరావం
ఝం ఝూనిల షడ్జధ్వానం

అనేవి మాతృకలో ఉంటే, పేరడీలో—

చించేశిన కాలెండర్ షీట్
నపుంసకుడి థాట్ డెవలప్‌మెంట్

చోటుచేసుకున్నాయి గతించిన నెల క్యాలెండర్ షీట్ కాలాన్ని నడిపించే చైతన్య సూచిక కాదు. అలాగే మగతనం లేనివాడు ఎన్నెన్నో ఊహాలు ఆలోచనలు రమ్యాతి రమ్యంగా మధారాతి మదురంగా చేయవచ్చు. అవన్నీ వృథాయే కానీ వాడి ఆలోచనలు విన్నవాడికి నవ్వు పుట్టిస్తాయి శ్రోతకు అది 'సరదాపాట' అవుతుంది.

'మునుముందుకు సాగించే'దేదీ 'ఈ జన్మకు పనికిరాదు' - అలాగే 'పరిపూర్ణపు బ్రతుకిచ్చే'దేదీ మనకెప్పుడూ కలసిరాదు.

'నవకవిత' మొదటి భాగంలో 'అరుణం' రెండవ భాగంలో 'తేజం' మూడవ భాగంలో '(ని)నాదం' నాలుగవ దానిలో 'ఫలితం' ఇలా ఒక క్రమ పరిణామ వికాసం ఉంది. ఆ వికాసానికీ రచనా పద్ధతికీ ఒక గొప్ప ప్రయోజనముంది. 'సరదా పాట' శైలిలోను నిర్మాణంలోను మాతృకను పూర్తిగా అనుసరించింది సరదా పాటకు కావలసిన హంగులన్నీ ఏమాత్రం పొల్లుపోకుండా, ఏమాత్రం అటూ ఇటూ కాకుండా 'నవకవిత' చట్రంలో బిగించి పెట్టాడు. నిర్మాణంలో తేడా లేదు కాని 'సరదా పాట' చదివినపుడు కలుగుతున్న

అనుభూతి 'నవకవిత' కన్నా భిన్నమై, వినోద మార్గంలో సాగుతూ, పేరడీ అయింది.

శ్రీశ్రీ 'అద్వైతాన్ని' జరుక్‌శాస్త్రి హాస్య 'విశిష్టాద్వైతం'గా మలచిన తీరు సహృదయరంజకమై ప్రశంసల చూరగొంది.

ఆనందం అర్ణవమైతే
అనురాగం అంబరమైతే
అనురాగపుటంచులు చూస్తాం
ఆనందపు లోతులు తీస్తాం (మహాప్రస్థానం, పుట 70)

అని సాగే అద్వైతగీతం అందరికీ సుపరిచితమే

ఆనందం అంబరమైతే
అనురాగం బంబరమైతే
అనురాగం రెక్కలు చూస్తాం
ఆనందం ముక్కలు చేస్తాం (జరుక్‌శాస్త్రి పేరడీలు, పుట 90)

అని మొదలుపెట్టి ఆది నుండి అంతందాకా పదాల కూర్పులోను, నిర్మాణంలోను వినోద ప్రాయంగా అనుకరించాడు. 'అద్వైతం' చివర '(A C, Swinbowrne తన రచనలలో ముఖ్యంగా A Match అనే గీతంలో చూపిన మార్గానికి కృతజ్ఞతతో)' అని శ్రీశ్రీ రాసుకొన్నాడు ఈ వాక్యాన్నే యథా తథంగా అనుకరిస్తూ- [శ్రీrangam శ్రీnivasa Rao తన గేయాల్లో- ముఖ్యంగా 'అద్వైతం' అనే గేయంలో చూపిన మార్గానికి కృతజ్ఞతతో తజ్ఞతతో') అని బ్రాకెట్లతో సహా రాశాడు.

శ్రీశ్రీ కవితలకు జరుక్‌శాస్త్రి చెప్పిన పేరడీ శకలాలు చాలా దొరుకుతున్నాయి. అవి పూర్తిగా లభించి ఉంటే ఇంకా ఎంతో బావుండేది అసలు ఆయనే పూర్తి గేయాన్ని కాకుండ ప్రసిద్ధ పంక్తులను అలవోకగా అనుకరించి ఊరుకున్నాడేమో-

నేను సైతం కిళ్ళీకొట్లో పాతబాకీ లెగర గొట్టాను
నేనుసైతం జనాభాలో సంఖ్య నొక్కటి వృద్ధి చేశాను

ఇంకా

ఏ కాకి చరిత్ర చూచిన ఏమున్నది గర్వకారణం

ఇంకా

ప్రపంచమొక సర్కస్ దేరా (ప్రపంచమొక పద్మవ్యూహం)
కవిత్వమొక వర్కర్ బూరా (కవిత్వమొక తీరని దాహం)
ఫిరదౌసి వ్రాసేటప్పుడు తగలేసిన బీడీలెన్నో
(తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీ లెవరు)

ఫిరదౌసి కవి గజనీ మహ్మద్ జీవిత చరిత్ర 'షానామాను' రాసేటప్పుడు తగలేసిన బీడీలను గురించి జరుక్‌శాస్త్రి అడగడం లేదనుకుంటాను ఫిరదౌసి కావ్యం రాసేటపుడు గుర్రం జాషువా తాగిన బీడీలను గురించి కావచ్చునేమో!(?)

ఇవి శ్రీశ్రీ కవితలకు ఆయన చేసిన వినోదానుకరణలు.

శ్లోకాలు కీర్తనలు సినిమా పాటలకు కూడ జరుక్‌శాస్త్రి వినోదానుకరణలు చేశాడు.

చోటాహజ్రీ నమస్తుభ్యం
వరదే కామరూపిణి
కాఫీ పానం కరిష్యామి
సిద్ధిర్భవతు మే సదా

అని జరుక్‌శాస్త్రి చెప్పిన సరదా శ్లోకానికి మూలం జగత్ప్రసిద్ధమైందే.

సరస్వతీనమస్తుభ్యం
వరదే కామరూపిణి
విద్యారంభం కరిష్యామి
సిద్ధిర్భవతు మే సదా

విద్యారంభం నిర్విఘ్నంగా కొనసాగాలని ప్రార్థించే శ్లోకం ఆయన చేతిలో కాఫీ పానానికి అన్వయమై పోయింది. గుణసుందరి కథ అనే చిత్రంలో 'అమ్మా మహలక్ష్మి దయచేయవమ్మా' అని లక్ష్మి స్తుత్యాత్మకమైన పాటను దరిద్ర దేవతకు స్వాగత గీతంగా మార్చడం ఆయనకే చెల్లింది.

అమ్మ - పెద్దమ్మ విచ్చేయవమ్మా
నీకు కొండపై పూశారు పసుపు
కొండదిగగానే వేశారు ముసుగు

నువ్వు కట్టిం కిత్తనారచీర
చేత పట్టింది ఇనపట్లకాడ.[1]

జరుక్‌శాస్త్రి 'విడుదలో విడుదలో' అనే గేయం ఉన్నవ లక్ష్మీనారాయణ 'నాయకురాలు' నాటకంలో హరిజనులకు సంబంధించి ఉన్న గేయ పద్ధతికి అనుకరణగా కె.వి రమణారెడ్డి (పుట. 73) భావించాడు. కాని ఈ గేయం మహాకవి సుబ్రహ్మణ్య భారతి రచించిన 'విడుదలై' అనే ప్రసిద్ధ గీతానికి అనువాదప్రాయమైంది సుబ్రహ్మణ్య భారతి కవితలో ఆయువుపట్టు అనదగిన ప్రధాన భావాన్ని హృద్గతం చేసుకొని సమర్థంగా ఆ ప్రభావంతో స్వతంత్రంగా రాసిన గేయం 'విడుదలో విడుదలో.'

ఇంకా విశ్వనాథ 'నర్తనశాల' నాటకాన్ని అధునిక 'కీచకవధ'గా మార్చేశాడు. ఈ నాటకంలో కీచకుడు ఫ్రెంచి కట్ మీసంతో, బెంగాల్ క్రాప్‌తో ఉంటాడు. 'కవి చౌడప్ప శతకం' లాంటి 'ప్రబంధా'లను చదువుకున్నాడు. పెద్ద బాలశిక్ష కూడ బాగా వచ్చు ద్రౌపది సుదేష్ణకు, ఉత్తరకు టీ లందిస్తుంటుంది ఉత్తర సిగిరెట్టు తాగుతుంటుంది సింహబలుడు ఉత్తరకు కన్నుగొడతాడు. ఆమె మొహం చిట్లించుకుంటుంది సుదేష్ణ ద్రౌపదిని టీ పొడి తీసుకు రమ్మని రాత్రి పది దాటాక సింహబలుడి ఇంటికి పంపిస్తుంది. ద్రౌపది వెళ్తుంది. సింహబలుణ్ణి ఇనుపగుదియ బండ టీసుకొని నెత్తిన కొడుతుంది. ఇదీ ఇతివృత్తం.

వీరాభ్యుదయవాదులకు కూడా ద్రౌపదిచేత సింహబలుణ్ణి చంపించవచ్చునన్న ఆలోచన తట్టలేదు. జరుక్ శాస్త్రి ద్రౌపదిచేత కీచకుణ్ణి చంపించి, ఎవరంతటికి వారే ఆత్మరక్షణ చేసుకోవాలని ప్రబోధించాడు

'అసలు సత్యాశ్రయ కంద శిలా శాసనం' పేరుతో శాసన పరిశోధకుల వ్యాసాలకు ఏర్పడిన మూసకట్టు బాణీని హేళనాత్మకంగా అనుకరించాడు, (దీని వివరం తర్వాత ఉంటుంది ) ఆనందవాణిలాంటి పత్రికల్లో ఆయన పేరడీలెన్నో రాశాడంటారు ఆ పత్రికలు గాలిస్తే మరెన్ని దొరుకుతాయో!

---

1 ఆరుద్ర వ్యాసపీఠం, ఆంధ్రజ్యోతి దినపత్రిక 4 7.1982
(సూరంపూడి సుధ, జరుక్‌శాస్త్రి పేరడీలు (1987) పుట 121-123)

గుడిపాటి వెంకటచలంతో జరుక్ శాస్త్రికి సన్నిహిత సంబంధ ముంది. ఆయన 'కవిహృదయం' ఇతర రచనల్లో ఈయన ప్రస్తావన ఎన్నోసార్లు వస్తుంది. జరుక్ భావుకతకు దర్పణం పట్టే పంక్తులు మనకు మహాప్రస్థానానికి చలం ఇచ్చిన యోగ్యతా పత్రంలో కనిపిస్తాయి జరుక్‌శాస్త్రి ఒక ఉదయం వచ్చి చలంతో ఇలా అన్నాడట . ''ఇదేమిటి, ఈ మూల స్త్రీల కోసం ఇట్లా మూలుగుతున్నారు? శ్రీశ్రీ పద్యాల వేగంతో ప్రపంచపు పాత దుమారమంతా పూడ్చుకుపోతోవుంటే! హృదయాలమీది పెంకులు పగిలిపోతున్నాయి. బైట వినబడుతున్నాయి, ఇట్లా రండి, రోడ్డుమీదికి "

జరుక్‌శాస్త్రి ఆనాడు మహాప్రస్థానం పట్ల ఎంతగా స్పందించి పులక రించాడో కోవెల సంపత్కుమారాచార్య 'తెలుగు ఛందోవికాసం'పట్ల కూడా అంతే స్పందించాడు చొక్కమైన పాండిత్యం కంరదగ మైన భావుకత ఉన్నవాడు, కవిత్వం పట్ల, శాస్త్రం పట్ల సమానంగా ప్రతిస్పందిస్తా డనడానికి ఇది చక్కని నిదర్శనం 1962 మేలో సంపత్కుమార గ్రంథం వెలువడ్డాక జరుక్‌శాస్త్రి ప్రశంసిస్తూ 1.11 62 న పద్యాలు రాశాడు.

ఎదో వ్రాస్తామంటే ఎవరికయినా హేళన గదా
సదా మోగేవారిన్ సరకు గొనరే సాధు హృదయుల్
నిదానంగా చూచీ నియతమతితో నేర్పుగలిగీ
ప్రధానమ్మౌ గ్రంథం రచన సలుపన్ శక్తి కలుగున్

అమోఘం నా శాస్త్రం (గ్రంథం) బనిన నగుబాటౌనటులనే
ప్రమాణం లేకుండా బలికిన సభల్ పక్కన నగున్
సమంగా యోచించీ సరస ఫణితిన్ శాస్త్ర హితమున్
అమందంగా కూర్చన్ వ్యవహరణ యోగ్యంబగు గురూ!

శభాషో సంపత్తూ! సలిపిన కృషిన్ ఛాందసుడవై
నిభాయించావయ్యా నిజమిది బలే నేర్పరివి పో
కబుర్లా యేం ఛందో గ్రథనముపయిన్ గ్రంథమనిసన్
నిబంధించంగా నన్నయకు మునుపు న్నేటిదనుకన్.

శిఖరిణి వృత్తం సంస్కృత సాహిత్యానికే పరిమితమైంది తెలుగులో ఎక్కడో ఆశ్వాసాంత పద్యాల్లోను విశేష ఛందః ప్రయోగాలు చేసిన చోట్లల్లోను తప్ప శార్దూల మత్తేభాల్లాగా ప్రసిద్ధం కాదు. అత్యష్టి (17వ) ఛందానికి చెందిన శిఖరిణిలో యమనభవ గణాలుంటాయి. 13వ అక్షరం యతి ప్రాసనియమ ముంటుంది నిజానికి ప్రాసల్లో మహా ప్రాణ అల్ప ప్రాణ సాంకర్యం చేయ కూడదు కాని ఇక్కడ జరిగింది. దీన్ని కూడ వ్యావహారికతకు నిదర్శనంగానే చెప్పుకోవచ్చు గంభీరంగా సమాస గంధిలంగా సంస్కృతబద్ధమైన శైలిలో విల సిల్లే శిఖరిణి వృత్త పద్యాల నడకను అనుకరిస్తూ అదే ఛందంలో వ్యావహారికతను ఆధునికతను ప్రవేశపెట్టడం మూలాన పేరడీగా భావించవచ్చు లక్షణ పరా మర్శలో పేర్కొన్న ఛందోఽశ్రయ పేరడీ (Metric Parody)కి లక్ష్యంగా వీటిని చెప్పుకోవచ్చు

కళ్యాయె, వెధవై, లఫంగు మనిషై, 'ఖడ్గ ప్రియా' కర్తయై
వెస్పార్మానిసీ, వెఱ్ఱినాయనను, మహా వేదాంతి, డాఫర్ బ్రదర్
విశ్వనాథము జంటకాకవులు భేరీప్రాపు కాంక్షించుమా
'ఎస్సెమ్మెల్లనుదాసు' గాడితడె బియ్యే ఉల్లిపూవేసుడీ[1]

'ఖడ్గప్రియ' అనే పేర ఒక పద్య వ్యాసాన్ని రాయకుండానే రాసినట్లు ప్రచారం చేసుకొన్న S.M.L N. దాసు B A. పై (ఎవరో ఈయన) జరుక్‌శాస్త్రి ఝళి పించిన అధిక్షేపం కొరడా ఈ పద్యం, ఈ పద్యానికి మాతృక అనదగిన పద్యం 'పాత పద్యాలకు కొత్త పేరడీలు' అధ్యాయంలో కనిపిస్తుంది.

జలసూత్రం ఎంతమందిని వెక్కిరించినా ఎవరూ 'సీరియస్'గా తీసుకొని మూతి విరవనూ లేదు, కోపగించనూలేదు ఈయనా అంతే సరదాగా అనుక రించాడే తప్ప ఎవరినో నొప్పించాలనీ, లేక ఒప్పించాలనీ అధిక్షేపించాలనీ పేరడీ చేయలేదు నాటి కవులందరికీ అత్యంత ప్రీతిపాత్రుడు కాటూరి పింగళి

---

1. వ్యంగ్యము- అర్వాచీనాంధ్రము (సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం) 8 Vol బి కుటుంబరావు.

కవుల దృష్టిలో 'చషకీకృత కాఫీ టీ జలనిధి'[1] అయ్యాడు శ్రీశ్రీ, ఆరుద్రలు రుక్కుటేశ్వరుడనీ, జలాలుద్దీన్‌రుమీ అనీ, రుక్కాయ్ అనీ ప్రేమతో పిలుస్తూ అసంపూర్ణ ఋక్కుటేశ్వర శతకాన్ని జరుక్‌శాస్త్రికి అంకితమిచ్చారు. ఇక ఎంకి పాటల నండూరికయితే 'మిత్రుడు రుక్మిణీనాథుడు ' ఇంద్రగంటివారికయితే 'తమ్ముడు రుక్మిణీనాథ శాస్త్రి.' ఇంద్రగంటివారన్నట్టు 'సాహిత్యమే తిండి అదే పానీయము కాని, దేనిమీద స్థిరంగా నిలబడక ఏదీ సమృద్ధిగా ఇవ్వక ఆకస్మికంగా తెరవెనకకు వెళ్ళిపోయాడు. చెప్పినంత వరకు వ్రాసినంత మేరకు తనది తనదిగా ముద్రవేసి పోయాడు.'[2]

---

1 చషకీకృత కాఫీ టీ
జలనిధి ఖిల్లీ సహస్రచర్వణచణ ని
ర్మల ధూమోజ్వల పరివే
షలసన్మూర్తీ సిజర్సు సారజ్ఞమణీ
శ్రవణావతంసమై చే
దివిటీయై నీదుగెల్పు తెల్పు ధ్వజమ్మై
భువి నీదు యశోఘృణియై
మివులన్ వెలిగింపుమోయి! మేటి సిజర్సన్.

ప్రతివాద ముఖ విధానము
హితముఖ వికసనము శాత్రవీక్షణ ధూతా
మిత రజము మిత్రనేత్రా
మృతవర్తిన నీ సిజర్సు మెచ్చందగురా!
వదనబిల నాసికాపుట
పదతీయుగ సద్విధూత బంధుర ధూమాం
బుదమాలమాకు శీతల
మెదిరికి కరకాన్వితమ్ము దృష్టినొసగుటన్.

—రావూరి వెంకట సత్యనారాయణరావు వంద చందమామలు (1982), పుట 17.

పింగళి కాటూరి కవులు 1936 లో జరుక్‌శాస్త్రి 'సాహిత్య శిరోమణి' పరీక్ష రాయాలని తహతహలాడినపుడు చెప్పిన చాటువులు.

2 ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి పీఠికలో, జరుక్‌శాస్త్రి పేరడీలు (1982)

జరుక్‌శాస్త్రి కేవలం పేరడీలే చెప్పలేదు 'పెళ్ళికాని పరమేశ్వరి' నాటకం, 'నాగపూజ', 'వాడిన గులాబి' మొదలైన నవలలు, 'దేవయ్య స్వీయచరిత్ర' అనే అసంపూర్ణ నవల రచించాడు 'తనలో తాను', 'శరత్పూర్ణిమ' పేరుతో ఆయన కథలు రెండు సంపుటాలుగా వెలువడ్డాయి ధర్మకీర్తి లిఖించిన సంస్కృత వ్యాకరణాన్ని 'రూపాంతరం' పేరుతో తెలిగించాలని మొదలు పెట్టాడు, తిరుపతి కవుల జీవిత చరిత్ర రాయడానికి కాలికి బలపం కట్టుకొని కనబడిన ప్రతివాడిని వేధించి విశేషాలు సేకరించి, అవి సరిపోవని పరలోకంలో కవితా గోష్ఠులతో తలమునకలుగా నున్న తిరుపతి కవులను సంప్రదించడానికి వెళ్ళిపోయాడు ఆయన ప్రసంగిస్తుంటే 'అర్జునుడాహవమ్ములో గుప్పిన బాణాల్లా' మాటలు పరిగెత్తేవి పద్యాలు ధారాపాతంగా ప్రవహించేవి కవిత్రయం వారి 'మహాభారతము' వావిళ్ళవారి చేతిలో 'ఆంధ్ర మహాభారత' మయిందని ఆయన చేసిన విమర్శ నిశిత పరిశీలనకు తార్కాణం 'వైదిక పరిభాష'ను గురించి వృష సం॥ర ఆంధ్ర పత్రిక ఉగాది ప్రత్యేక సంచికలో విలువైన వ్యాసం ప్రకటించాడు ఎన్నో సాహిత్య వ్యాసాలు రాశాడు ఎన్ని చేసినా, ఎన్ని రాసినా చిరస్మరణీయుడైంది పేరడీల ద్వారానే **

ఉస్మానియా తెలుగుశాఖ వార్షిక సంచిక 'వివేచన'
(1988-89) లో ముద్రితం
కొన్ని అంశాలు 18-7-82 **ఆంధ్రప్రభ దినపత్రికలోను**
7 8-89 **ఉదయం దినపత్రికలోను** వచ్చాయి

# 11. మాచిరాజు దేవీప్రసాద్

తెలుగులో పేరడీకి ఒక సాహిత్య ప్రక్రియగా గుర్తింపు తెచ్చిపెట్టిన వాళ్ళిద్దరు వారిలో మొదటి వ్యక్తి జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి ఇక రెండవ వ్యక్తి మాచిరాజు దేవీప్రసాదు. జరుక్ శాస్త్రి పేరడీ కవితలే రాశాడు. (శాసనం పేరడీ, కీచక వధ నాటకం మినహాయింపు) దేవీప్రసాదు శ్రీశ్రీ 'దేశ చరిత్రలు' 'నిజంగానే' గేయాలకు, వేదుల సత్యనారాయణ శాస్త్రి 'రాధ' మొదలైన ఖండికలకు పేరడీ గేయాలు రాశాడు. అంతటితో ఆగిపోలేదు. విశ్వనాథ, శ్రీశ్రీ, నాయని సుబ్బారావు, శివశంకరశాస్త్రి ప్రభృతుల శైలిని పేరడీ చేశాడు 'కార్యాలయ లేఖలు' తెలుగులో నడిస్తే ఎన్ని రకాల తప్పులు రిపోర్టులు, వక్రభాష్యాలూ సాధ్యమో మచ్చుకు చూపించాడు. పత్రికలకు పాఠకులు రాసే ఉత్తరాలను విడంబించాడు ఇలా గద్యంలో కూడ పేరడీని ప్రతిష్ఠించిన ఘనత మాచిరాజు దేవీప్రసాదుకు దక్కుతుంది. 'వికటత్వం' (పేరడీ) పైన విలువైన విశ్లేషణాత్మక వ్యాసాన్ని కూడా వెలువరించాడు [1]

మాచిరాజు దేవీప్రసాదు 1922 నవంబరులో జన్మించి, 31 అక్టోబరు 1974 న గతించాడు జీవితంలోనూ సాహిత్యంలోనూ తనది 'విదూషక పాత్ర'గా భావించాడు గతానుగతికమైన భావకవుల ప్రణయవైపరీత్యానికి; దేశభక్తికవుల సంకీర్తనా విలాపానికి, అభ్యుదయ కవుల వైప్లవ్య జపానికి కినిసి మాచిరాజు అధిక్షేపాత్మక పేరడీ రచనలకు పూనుకొన్నాడు. 1939-52 మధ్యకాలంలో కృష్ణాపత్రిక, భారతి, చిత్రాంగి, ఆంధ్రపత్రిక, నవోదయలాంటి పత్రికల్లో దేవీప్రసాద్ పేరడీలు ఎన్నో ప్రచురింపబడ్డాయి బ్రిటీషుహయాంలో సెంట్రల్ ఎక్సయిజ్ శాఖలో 'సహంపోలీసు' ఉద్యోగం చేసి మధ్యలో వదిలివేశాడు. ఉద్యోగ కాలంలో ప్రభుత్వ కార్యాలయాల్లోని లోపాలను, కుతర్కాలను, కుత్సి

---

1. 'వికట కవిత్వం' ప్రతిభ నవమవార్షికోత్సవ సంపుటి జూలై 1942 ఏప్రిలు 1943

తాలను తన రచనలతో ఎండగట్టడంతో అధికార్ల క్రమశిక్షణ చర్యలకు గురయ్యాడు. సహోద్యోగులు ప్రమోషన్స్ పొందుతుంటే ఈయన కిందికి దిగాడు 'భూమాతా ఎరువుల డిపో' అని త్రిభాషా మిశ్రమమైన పేరు పెట్టి హనుమకొండలో వ్యాపారం చేశాడు.

'అసలు దేవీప్రసాద్ పేరడీ కవిగా రచయితగా మారటమే విడ్డూరం చిన్నతనంలో ఛాందసంగా సంస్కృతం నేర్చుకొని, తెలుగు ప్రబంధాలను ఒప్ప చెప్పినవాడు. అవ్యాకృత ప్రయోగాలనూ వైరి సమాసాలనూ సమకాలిక సాహిత్యంలో నుంచి వెతికి తీస్తుండేవాడు అతగాడు కలం పట్టే నాటికి తెలుగు సాహిత్యం ఒకవైపు అభ్యుదయ కవితా ప్రవాహంలో కొట్టుకుపోతుంటే, మరోవైపు ప్రణయ కవితోన్మాదంలో తలకిందులయిపోతుండేది. మరోవైపు శ్రీశ్రీ అభ్యుదయ కవితా ధోరణి అప్పుడే తలయెత్తటం మొదలయింది. మద్రాసులో బి ఎస్‌సి. చదివే రోజుల్లో తెలుగుసాహిత్యం 'సాంబారులాగా' మిశ్రపాకంగా మారుతున్నదని గోలపెడ్తుండేవాడు. రాను రాను అతడికి అభ్యుదయకవిత్వ మన్నా ప్రణయకవిత్వ మన్నా మొహం మొత్తింది. సమకాలిక భావకవులు ఎన్ని విధాల మిశ్ర సమాసాలు వాడేరో, ఎవరెవరు ఎలాంటి వైరి సమాసాలు కల్పించారో ఎవరూ అడక్కుండానే చెప్పేవాడు- 'పుటసంఖ్యలతో' సహా అప్పటి మద్రాసు లోని 'అరవ తెలుగు' వాతావరణం (ఇప్పుడు మద్రాసులో అది కూడా లేకుండా పోయింది) రెండో ప్రపంచయుద్ధం కారణంగావచ్చిన (కాగితం) కరువూ, నిష్కారణ యుద్ధ సన్నాహాలూ, కొంపలంటుకుపోతున్నా ఒక కొలిక్కిరాని ప్రభుత్వ పరిపాలనా పద్ధతులు అతణ్ణి కవిగా - పేరడీ కవిగా మార్చేశాయి '[1]

ప్రస్తుతం మాచిరాజు దేవీప్రసాదు చేసిన పేరడీలను కొన్ని విశ్లేషించి చూద్దాం

### భోజనశాల :

భావకవిత్వం ఉవ్వెత్తున పొంగిన రోజుల్లో వెలువడిన విశిష్ట కృతుల్లో ఒకటి వేదుల సత్యనారాయణ 'దీపావళి' కావ్యం వేదుల సత్యనారాయణ "కవిత్వపు లోతులు తెలిసినవాడు, భావాన్నీ, భాషను

---

1 బూదరాజు రాధాకృష్ణ పరిచయ వాక్యాలు తెలుగు పేరడీలు (1987)

ఒక్క శ్రుతికి కూర్చగలడు భాష లొంగిన పనిముట్టు ఎంత క్లిష్టమైన భావా న్నైనా చక్కగా చెప్పి, పద్యం సుఖంగా నడిపించగలడు. వృత్తాలు నడిపించడం ఈయన సొమ్ము ఈయన పద్య నిర్మాణంలో పూర్వుల శిల్పం కూడ కొత్త ఒయ్యారాలు కులుకుతుంది. ఈయన ఏ భావాన్ని రేకెత్తించినా దానిలో అధునాతన తేజస్సు గోచరమవుతుంది కాళిదాసు కావ్యాలలోని పరువమూ, బరువూ ఈయన పద్యాలలో కన్పించుతవి "[1]

మధురభావ ప్రణయోన్మత్తయైన రాధ వివశయై విరహార్తయై చారు శారద యామినీవేళ మధురలో వేణుగానలోలుని చేరిన సన్నివేశానికి వేదుల సత్యనారాయణ గీసిన రమణీయ అక్షరాకృతి 'రాధ' శీర్షికతో సాగిన ఐదు పద్యాలు.[2] హృదయపు లోతులను స్పృశించి కమనీయభావ స్రవంతిలో ఓల లాడించే పద్యాలివి అటువంటి పద్యాలను మాచిరాజు దేవీప్రసాద్ 'భోజన శాల'కు అనువర్తింపచేసి పేరడీ సృష్టించాడు[3] భోజన ప్రియుడొకడు వీధి వీధుల తిండికై వెదకి వెదకి బుచ్చెమ్మ భోజనశాల చేరుకొన్న సన్నివేశం పేరడీలోని ఇతివృత్తం. వేదుల పద్యాలు చదివి మనస్సు మధుర భావపరీతమై ఆర్ద్రమైతే మాచిరాజు పేరడీ చదివి హాస్యరస ప్లావితమై తేలికవుతుంది

పవన పులకిత చంద్రాతప ప్రసన్న
చారు శారద యామినీ సమయమందు
వీథి వీథుల మధురలో వెదకి వెదకి
చేరుకొంటి బృందావిహారు నిన్ను

దీనిలో మొదటి రెండు పాదాలను యథాతథంగా పేరడీలో ఉంచాడు తక్కిన రెండు పాదాలు మార్చాడు

వీధి వీధుల తిండికై వెదకి వెదకి
చేరుకొంటి విశాల బుచ్చెమ్మశాల

1. ముద్దుకృష్ణ వైతాళికులు (1957) పుట 13
2. వేదుల, దీపావళి (1978) పుట 8
3. మాచిరాజు దేవీప్రసాద్ తెలుగు పేరడీలు (1986) పుట 27

ఒక తిండిపోతు పూటకూళ్ళ ఇంటికి చేరుకోవడం, పేరడీలో వస్తువై హాస్య భాజకమైంది మూలంతో కలిగే అనుభూతికి భిన్నమైన అనుభూతిని పేరడీ కలిగిస్తుంది.

దూరమున నుండి నీ
హృదయము సోకినంత మేనెల్ల మరచి
తిరుగుచుంటిని యమునానదీ వివిక్త
పులిన సీమల వెఱ్ఱినై పోయినేను.

ఇది వేదుల రాధ స్థితి అయితే మరి పేరడీలో-

దూరముననుండి నీ పోపు సౌరభమ్ము
హృదయమున సోకినంత మేనెల్ల మరచి
భవనపరిసరమ్మున కొయ్యబారి, కోర్కె
నాగితిని బాష్పవృష్టి రవ్వంత సేపు.

లీలా జగన్మోహనుని హృదయం వలపు తలపులు తలపు వలపులు సోకిన రాధ వెఱ్ఱిదానివలె యమునా తీరంలో [illegible] పేరడీలో పోపు ఘుమఘుమలు అతనిని పట్టి నిలిపాయి ఆనందాతిరేకంతో బాష్పవృష్టి కురిసింది.

మంజుల సుమామృతములోని మధురిమమ్ము
మధుర చంద్రాతపములోని మార్దవమ్ము
మృదు సమీరమ్ములోని పరిమళమ్ము
కలవు గోపాల! నీ వేణుగానమందు

వేణుగానమాధుర్యాన్ని ఉత్ప్రేక్షించిన పదార్థాలను యధావిధిగా పేరడీ కర్త స్వీకరించాడు మూడు పాదాలను ఏమాత్రం మార్చలేదు 'కలవు గోపాల! నీ వేణు గానమందు' అనే పాదం స్థానంలో 'కలవు బుచ్చెమ్మ! నీ పచ్చిపులుసు లోన' అని చేర్చాడు. పద్యం మొత్తం అలాగే ఉంచి ఒకటి రెండు పదాలు మార్చి పేరడీ తయారుచేసే పద్ధతిని ఆంగ్లంలో Verbal Parody అంటారు. పూల తేనెల తీపిదనము, వెన్నెల మార్దవము, గాలిలోన సుగంధము అన్నీ గోపాలుని వేణుగానంలో ఉన్నట్లే బుచ్చెమ్మ పచ్చి పులుసులోనూ ఉన్నాయని అతిశయించడంతో పేరడీ అయింది.

ప్రకృతి పులకింప యమునా స్రవంతి పొంగ
భావము చిగుర్పఁ బిల్లనఁ గ్రోవి నూది
పరవశం జేసి నన్ను .
ప్రేమ తనివార నొకముద్దుఁ బెట్టుకొనుము

భావకవులకు ప్రీతిపాత్రమైంది తేటగీతి పద్యం. గీతాన్ని గేయంగా నడిపిన ఘనత భావకవులకు దక్కుతుంది భావకవిత్వంలో కనిపించే చిత్రమైన లక్షణం పద్యం నాలుగు పాదాలు సంపూర్ణంగా రాయకపోవడం పైన పేర్కొన్న రెండు పద్యాలు అసంపూర్ణంగా ఉండడం గుర్తించవచ్చు అయితే మాచిరాజు దేవీ ప్రసాద్ తన పేరడీలో ఆ లక్షణాన్ని ఎందుకో పట్టించుకోలేదు లేకపోతే దాన్ని కూడ ఒక ఆటపట్టించే వాడే.

ప్రకృతి చిగురింప, ఆస్య స్రవంతి పొంగ
గంటె పులకింప, వేసి వంకాయ కూర
పరవశుంజేసి నన్ను, తప్పాలరాణి
డెందముప్పొంగ అన్నమొడ్డింపు మమ్మ!

మాతృకలో యమునా స్రవంతి పొంగితే పేరడీలో ఆస్యస్రవంతిపొంగింది. సన్నివేశం భోజనశాల కావడం వల్ల నోరూరడం (ఆస్య స్రవంతి పొంగడం) సహజాంశం ఇతనికి అన్నం వడ్డిస్తే గంటె పులకిస్తుందట తప్పాల (పాత్ర) డెందముప్పొంగుతుందట అంటే అచేతనాలు కూడ చేతనాలై స్పందిస్తాయనడం ఒక అతిశయోక్తి కలకాలం గుర్తించుకోదగిన మంచి పేరడీ పద్యాలలో మాచిరాజు దేవీప్రసాద్ రచించిన ఈ బోజనశాలకూడ ఒకటి అని చెప్పడంతో ఏమాత్రం సంశయించనక్కర్లేదు.

## మాతృగీతాలు :

మాచిరాజు దేవిప్రసాదు చేతిలో హేళనకు గురయిన వారిలో నాయని సుబ్బారావు ఒకరు సుబ్బారావు 'మాతృగీతాల'కు ఆయన చేసిన పేరడీ పరిశీలిద్దాం

**మాతృక :** ఎవ్వడా క్రూర కర్మరుఁడెవఁడు, నీల
జలద నిర్ముక్త శైశిర శర్వరీ ప్ర
శాంత మలవాటుపడిన నిశాంతమందు
అకట నట్టింటి దీపమ్ము నార్పినాడు.
ఎవ్వఁడా విరసాత్మకుండెవఁడు సాంధ్య
రాగమంజుల రేఖా విరాజమాన
మంగళాకాశ సీమంతరంగమందు
కారు చీకట్ల రాసుల గ్రక్కినాడు.
ఎవ్వఁడా నిర్దయ స్వాంతుడెవడు నన్నుఁ
గంటక నిగూఢ విపిన మార్గములఁ దల్లి
లేని బిడ్డను గావించి, మానసంపు
టాసలన్నియు నకుగంటఁ గోసినాఁడు [1]

ఈ పద్యత్రయ నిర్మాణం ఒక క్రమ పద్ధతిలో కొనసాగింది ప్రథమంగా ఒక ప్రశ్నార్థకం (ఎవ్వడు?) తర్వాత విశేషణయుతమైన ప్రశ్నార్థకం. మొదటి పాదం చివరి గణం మొదలుకొని మూడవ పాదం చివర వరకు ఒకే సమాసం విస్తరించి ఉండడం మొదటి రెండు పద్యాల్లో గమనించవచ్చు నాల్గవ పాదంలో అవతలి వ్యక్తి చేసిన పనిని (దీపమార్పడం, చీకట్లు గ్రక్కడం) తెల్పడం పాటించబడింది మూడవ పద్యంలో సమాస విస్తరణలో కొంత తగ్గుదల కనిపించినా మొత్తం పైన మొదటి రెండు పద్యాల నిర్మాణక్రమమే దానిలోను గోచరిస్తుంది

వస్తు పరంగా గమనిస్తే నవ మాసాలు మోసి ప్రాణాలు పణంగా పెట్టి కని, విద్యాబుద్ధులు చెప్పి పెంచి పెద్ద చేసి, ఒకనాడు (1924 లో) అకస్మాత్తుగా కనుమూసిన ఆ మాతృమూర్తి ఉదయమ్మ వియోగాన్ని తాళలేక ఆ బాధను నాయని సుబ్బారావు అక్షరాల్లో పలికించాడు నట్టింట్లో దీపాన్ని ఆరిపేయడమన్నా చీకట్ల రాసుల గుమ్మరించడమన్నా ఆకులన్నీ కోయడమన్నా భావం ఒకటే తనను తన తల్లి నుండి వేరుచేసిన ఆ 'విధి'ని ఉపాలంభించడం. అదే

1 నాయని సుబ్బారావు కృతులు (1958) పుట 69

ఈ పద్యంలోని వస్తువు. పాఠకులు కవి ఆవేదనతో తాదాత్మ్యం చెంది సహాను భూతి పొందుతారు. ఇక పేరడీ గమనించండి:

**పేరడీ :**

ఎవ్వడా క్రూరకర్మరుడెవడు? తాత
దిండు పక్కగ వేంచేసి తెలుగారు
క్యాంపు చేసిన శర్వరీ కాలమందు
అకట! నట్టింటి దీపమ్ము నార్పినాడు?
ఎవ్వడా విరసాత్మకుండెవడు, నా ప్రి
యావియోగాన నే లిఖియించుకొన్న
రమ్య ప్రణయనీ రూప చిత్రమ్ముపైని
నిండ సీల్కాలు బుడ్డి తన్నేసినాడు?
ఎవ్వడా నిర్దయ స్వాంతుడెవడు? పురుష
రాజితశ్రీ చరించు పొలమ్ము నందు
కారుమీసాల కుబుసంపు కళల నారు
కోతకత్తితో మొదలంట గోసినాడు?[1]

మాతృక మూడు పద్యాలలో ఉంటే పేరడీ కూడ మూడు పద్యాలలోనే ఉంది. ప్రశ్నార్థకంతోనే ఆరంభమైంది మొత్తంపైన పదబంధాలు, సమాసాల కూర్పు, విస్తరణ అంతా మాతృకలో ఉన్న తీరుగానే పేరడీలో కూర్చబడ్డాయి.

మాతృకలో కవి స్వీయవేదనను అభివ్యక్తీకరించడానికి ప్రతీకలను సృష్టించుకొన్నాడు నీలజలద నిర్ముక్త శైశిరశర్వరీ ప్రశాంతమలవాటు పడిన నిశాంతం, సాంధ్యరాగ మంజుల రేఖా విరాజమాన మంగళాకాశ సీమంతరంగం అని రెండు ప్రతీకలు ప్రయోగించాడు ఇవి మాతృమూర్తి జీవించి తన ఆలనా పాలనా చూస్తున్నపుడు ఆమె తన కనుల ఎదురుగా సంచరిస్తున్నపుడు నాయని సుబ్బారావు మనసులోనున్న ఒకానొక 'సుస్థితి'కి సంకేతం. ఆమె పంచభూతాల్లో కలిసిపోయింది ఇక ఆమె లేదు. దానివల్ల కలిగిన ఫలితమే ఒక దుర్విధి నట్టింటి దీపాన్ని ఆర్పివేయడంగా, కారు చీకట్ల రాసులు గ్రక్కడంగా చెప్ప బడింది. ఇది తల్లిలేని వర్తమాన 'దుస్థితి'కి రూపకల్పన.

1. మాచిరాజు దేవీప్రసాద్ పేరడీలు (1986) పుట 70

మొదటి రెండు పద్యాల్లో కవి ప్రతీకాత్మంగా మాతృ వియోగాన్ని చెప్పి మూడవ పద్యంలో ప్రత్యక్షంగానే చెప్పాడు ఇక్కడ మూడవపద్యం చదవకుండా శీర్షికను గమనించకుండా ఉంటే మొదటి రెండు పద్యాలకు కవి భావనకు భిన్నమైన (ప్రేయసీ వియోగం వగైరా) వ్యాఖ్యానం చేసే అవకాశముంది మూడవ పద్యంలో కవి తన తల్లిలేని బిడ్డను చేసి విధి ఆశలన్నీ అడుగంట కోసినాడని పేర్కొన్నాడు

పేరడీలో దేవీప్రసాద్ ప్రతీకలు వాడుకోలేదు తేళ్ళు, పాములు సంచరించే రాత్రిపూట నట్టింటి దీప మార్పేయడం, ప్రేయసీ చిత్రంపై నీల్కాలు బుడ్డి తన్నేయడం, మీసాలను కోసివేయడం ఇవన్నీ మామూలు విషయాలు. మాతృకలో చిత్రితమైనటువంటి 'బరువైన' అంశాలు కావు మాతృకలోని మూడు పద్యాలకు ఏకసూత్రత ఉంది పేరడీలో మూడు విడి విడి పద్యాలే. ఏకసూత్రత గలిగినవి కావు అందువల్ల మాచిరాజు దేవీప్రసాదు పద్యత్రయం పేరడీగా నిలదొక్కుకుంటున్నాయి

'సౌభద్రుని ప్రణయయాత్ర'లో 'పడవ పగిలిన శీర్షికతో సాగిన మూడు పద్యాలకు కలిపి దేవీప్రసాద్ ఒక పేరడీ రాశాడు.

**మూలం**

ఇది పగిలిపోవు నను భయమ్మింత వఱకు
ఈ తలపున నిపుడుల్ల మిగురు లెత్తు
తునిగిపోయిన చెక్కలతో పయోధి
గర్భమున రత్నరథ మీవు కట్టెదవని

**పేరడీ :**

ఈ అణా మారదను భయమ్మింతవరకు
ఈ తలంపున నిపుడుల్ల మిగురులెత్తు
దేబిరించుక కొట్లీవు తిరిగి తిరిగి
పిచ్చిరాయి యుండలు కొని పెట్టెదవని 1

1, మా. దే. ప్ర. పేరడీలు పుట 70.

## నిజంగానే :

శ్రీశ్రీ 'నిజంగానే'[1] గేయానికి మాచిరాజు దేవీప్రసాద్ 'ఆంధ్రమెన్' పేరుతో పేరడీ చేశాడు

ఈ సమస్త మానవాళికి మంచికాలం రావాలనీ, దానవత్వం పోవాలనీ, దోపిడీ ఆర్థిక అసమానతలూ దౌర్జన్యాలూ నశించాలనీ మహాకవి 'నిజంగానే' కోరుకున్నాడు అందుకోసం కలం పట్టాడు గళం విప్పాడు అన్నిరకాల సాహితీ ప్రక్రియల్లోను తాను నిశ్వసించిందే విశ్వసించాడు రకరకాలుగా, చెప్పిన ప్రతిసారీ సరికొత్తరీతిగా, పాతదానికన్నా భిన్నంగా ఒకే ఆశయాన్ని ప్రచారం చేశాడు సాధారంగా శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాలు ఉద్వేగపూరితమైన ప్రవాహ సదృశమైన శైలిలో పరుగులు తీస్తుంటాయి పాఠకుని తమవెంట లాక్కెళ్ళిపోతాయి కాని ఈ గేయం శైలిమాత్రం అదికాదు ఇది ఇంకోరకం విలక్షణమైన శైలి

నిజంగానే నిఖిలలోకం
నిండు హర్షం వహిస్తుందా?
మానవాళికి నిజంగానే
మంచికాలం రహిస్తుందా?
నిజంగానే నిజంగానే
నిఖిలలోకం హసిస్తుందా?
దారుణ ద్వేషాగ్ని పెంచే
దానవత్వం నశిస్తుందా?
దానిసల సంకెళ్ళు బిగిసే
పాడుకాలం లయిస్తుందా?
సాధుసత్వపు సోదరత్వపు
స్వాదుతత్వం జయిస్తుందా?

మిశ్రగతిలో త్రిమాత్రా చతుర్మాత్రా గణాల కలగలుపుతో గేయం సాగుతుంది. (హరిణగతి రగడలాగా) కాని ఈ గేయాన్ని నాలుగు పంక్తులలో

2 మహాప్రస్థానం (1975) పుట 89

రాయబడిన మంజుల వృషభగతి రగడగా తలపోయవచ్చు (ప్రాసలేకపోతే 'మంజుల' అంటారు) తృతీయగణాద్యక్షరం యతి.

నిజంగానే నిఖిల లోకం నిండుహర్షం వహిస్తుందా
మానవాళికి నిజంగానే మంచి కాలం రహిస్తుందా

ఇలానే తక్కిన పాదాలు—

లగం గగం లాంటి విలోమగణాలు ప్రయోగిస్తూ కూడ గతిలో ఒక రకమైన ఉద్ధతిని శ్రీశ్రీ సాధించాడు. ఇంకో తీరుగా చెప్పాలంటే - నాలుగు పాదాల్లోను సమాన మాత్రలు కలిగిన ముత్యాలసరం ఇది.

దేవీ ప్రసాద్ విద్యాభ్యాసం చేస్తున్న కళాశాలలో అరవ హాస్టల్ ఒకటుండేదట తెలుగువాళ్ళ కోసం ఆంధ్ర మెస్ ఒకటి కొత్తగా తెరుస్తారని తెలిసిన సంతోషంలో ఆయన శ్రీశ్రీ 'నిజంగానే' గేయానికి 'ఆంధ్ర మెస్' పేరుతో పేరడీకరించాడు

శ్రీశ్రీ గేయంలోని వస్తువుతో పోలిస్తే ఏ మాత్రం ప్రాధాన్యం లేని అల్పమైన వస్తువు పేరడీలో చోటు చేసుకుంది మాతృక సకల లోక సంక్షేమం కోసం పొందే ఆరాటం, ఆవేదన అయితే, మంచి రుచిగల తిండి దొరుకుతుందన్న ఆనందం పేరడీలో వస్తువు అయింది.

నిజంగానే నిఖిల ఆంధ్రం
నిండు హర్షం వహిస్తుందా?
భోజనానికి నిజంగానే
భోగకాలం రహిస్తుందా?
నిజంగానే నిజంగానే
నిఖిల ఆంధ్రం హసిస్తుందా?
తినకముందే మొహంమొత్తే
మోహన్‌దాల్ నశిస్తుందా?

ఛందస్సులో మాతృకను చాలా వరకు అనుసరించింది. అక్కడక్కడ నియమోల్లంఘనం కూడ జరిగింది.

"మోహన్‌దాల్ నశిస్తుందా'' అనడంలో ప్రథమార్ధంలో ఒక మాత్ర తక్కువయింది. దాంతో సప్తమాత్రాకమైన మిశ్రగతి నడక దెబ్బతింది. ('మోహన్‌దాలు నశిస్తుందా?' అని రాశాడేమో!) అట్లాగే శ్రీశ్రీ ప్రతి రెండు పాదాల ఆద్యక్షరాలకు యతిమైత్రి కూర్చాడు (మూడు పాదాలవరకు) అందు వల్లనే మనకు మంజుల వృషభగతి రగడగా భావించే అవకాశం వచ్చింది. పేరడీలో కూడ మొదటి భాగం, రెండవ భాగంలోని మొదటి రెండు పంక్తులు ఆద్యాక్షర యతిమైత్రి కలిగినవయ్యాయి

తినకమందే మొహంమొత్తే
మోహన్‌దాల్ నశిస్తుందా?

అనడంలో ఆరంభవర్ణాలు విభిన్నమయ్యాయి శ్రీశ్రీ కూడ చివరిభాగంలో ఆ నియమాన్ని పాటించలేదు.

| | |
|---|---|
| జడలు విచ్చిన సుడులు రెచ్చిన | న + భ + న + భ |
| కదలి నృత్యం శమిస్తుందా? | న + గగ + లగ + గగ |
| నడుమ తడబడి, సడలి, ముడుగక | న + నల + న + నల |
| పడవ తీరం క్రమిస్తుందా? | న + గగ + లగ + గగ |

పేరడీలో కూడ

| | |
|---|---|
| పెరటి కోయిల కరకు కూతల | న + భ + న + భ |
| అరవభాష్యం శమిస్తుందా | న + గగ + లగ + గగ |
| కరిలు యిరికిన పరుపు నరకము | న + నల + న + నల |
| మరచుకాలం క్రమిస్తుందా | న + గగ + లగ + గగ |

ప్రతి రెండు పాదాల మొదటి వర్ణాలు పైవానిలో లాగా ఒకటి కాకుండా వేర్వేరు వేశాడు. సరిపాదాలు ఒకే గణ క్రమం కలిగి ఉండగా బేసి పాదాలు భిన్నరీతిలో సాగాయి మాతృకలో ఉన్న ఈ లక్షణాలన్నీ యథాతథంగా పేరడీలో ప్రవేశించాయి మాతృకలో ప్రాసనియమం పాటించబడింది పేరడీలో లేదు మాతృక చదివిన పాఠకుడు కవి భావాలకు, ఆకాంక్షలకు స్పందిస్తే పేరడీ చదివి సరదాగా నవ్వుకొంటాడు.

## దేశచరిత్రలు :

మార్క్స్ ప్రపంచించిన గతి తార్కిక భౌతిక వాదానికి తెలుగు అక్షరాకృతి శ్రీశ్రీ 'దేశచరిత్రలు'[1] "The history of all hitherto existing Society is the history of class struggles" యావన్నరజాతి చరిత్ర వర్గ సంఘర్షణ ఫలితమేనన్న మార్క్స్ సిద్ధాంత సారాన్ని శ్రీశ్రీ-

"పరస్పరం సంఘర్షించిన
శక్తులతో చరిత్రపుట్టెను"[1]

అని ఒక్క ముక్కలో చెప్పాడు క్లుప్తత, గాంభీర్యం, సారళ్యం పుణికిపుచ్చుకున్న వాక్కులివి "తెలుగువారి కీ గీతం ఒక వేదం. ఒక్కొక్క చరణం ఒక్కొక్క ఋక్కు. ఇందులోని మంత్రశక్తి దివ్యమైనది ఒక దేశానికీ ఒక జాతికేగాక ప్రపంచ దేశాలకు జాతులకు ఈ గీతం ఒక ఋక్కు చదివిన మనుష్యులను కలవరపరుస్తుంది మంత్రిస్తుంది"[2] అని విజ్ఞులు ప్రస్తుతించారు. నంద్యాల (1947) లో జరిగిన ఒక సభలో చంద్ర రాజేశ్వరరావు ఈ గేయాన్ని పాడితే సభికులంతా ఉత్సాహోద్రేకాలలో ఊగిపోయారనీ స్థానిక జమీందారు ఆ పాటను పాడకుండా ఆపివేయడానికి ప్రయత్నించాడనీ తెలుస్తుంది[3]

తరతరాల చరిత్రపట్ల, చారిత్రక పరిణామాలపట్ల ఒక గంభీరమైన తాత్విక దృక్పథాన్ని 'దేశ చరిత్రలు' గేయంలో శ్రీశ్రీ ఆవిష్కరించాడు. వర్గ సమాజం ఎలా దోపిడీ చేస్తుందో బలవంతులు దుర్బల జాతిని ఎలా పీడిస్తారో నరహంతలు ఎలా ధరాధిపతులవుతారో వివరించి—

---

1. మహాప్రస్థానం (1975) పుటలు 73-75.
2 రోణంకి అప్పలస్వామి వ్యాసం - శ్రీశ్రీ సన్మాన సంచిక పుట 45.
3 చంద్ర రాజేశ్వరరావు లేఖ ,, పుట 47.
(ఈ రెండు డా॥ జి. చెన్నకేశవరెడ్డి ఆధునికాంధ్ర గేయ కవిత్వం (1988) పుట 370 నుంచి )

చిరకాలం జరిగిన మోసం
బలవంతుల దౌర్జన్యాలూ
ధనవంతుల పన్నాగాలూ
**ఇంకానా! ఇకపై చెల్లవు.**

అని శ్రీశ్రీ కంఠోక్తిగా చెప్పాడు

దేవీప్రసాద్ ఏమాత్రం ప్రాముఖ్యం లేని 'రోడ్ల'ను కవితా వస్తువు చేసి 'దేశ చరిత్ర'లను పేరడీ చేశాడు. దేశ చరిత్రలు ఎంత ఉద్వేగభరితంగా సాగుతుందో ఈ పేరడీ కూడ అదే స్థాయిలో సాగుతుంది. కాని రెంటిలోనూ వస్తువుల్లో ఉండే తేడా అపారం.

ఏ రోడ్డు చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం?
రహదార్ల చరిత్ర సమస్తం
దూళిధూసర పరిన్యస్తం.

ఇది పేరడీ ఆరంభం ప్రశ్న, దాని జవాబుతో మాతృక మొదలైనట్లే పేరడీ కూడ మొదలయింది. ఓజఃపూరితమైన శైలితో సమాసోద్ధతంగా రచన చేస్తూనే మధ్య మధ్యలో వ్యస్త పదాలతో తేల్చిపారేసే శైలిని శ్రీశ్రీ ప్రవేశ పెట్టాడు. పేరడీకర్త దాన్ని బాగా అనుకరించాడు.

నరజాతి చరిత్ర సమస్తం
పరస్పర హరణోద్యోగం
నరజాతి చరిత్ర సమస్తం
రణరక్త ప్రవాహ సిక్తం

ప్రతిపాదం ఒక సమాసమే. విడి విడి పదాలు లేవు. దీనివల్ల ఒక వేగం సిద్ధిస్తుంది. పేరడీలో కూడ అదే తీవ్రత, ఆ ఉద్వేగమే ప్రదర్శితమయ్యాయి.

రహదారి చరిత్ర సమస్తం
యాతాయాత జన సంయుక్తం
రహదారి చరిత్ర సమస్తం
పథిక వాహన ప్రయాణ సిక్తం

పేరడీలో విడివిడి పదాలు లేకుండా పాదమంతా ఒకే సమాసం ప్రయుక్తమైంది

శ్రీ శ్రీ ఎంతో ఆవేశంతో-

బీభత్స రసప్రధానం
పిశాచగణ సమవాకారం

అని చెప్పి, రచనాశైలిలో శిఖరారోహణం చేసి, పాఠకుల్ని తనతోపాటు ఉన్నతంగా తీసుకొనివెళ్ళి అ వెంటనే-

నరజాతి చరిత్ర సమస్తం
దరిద్రులను కాల్చుక తినడం

అని వ్యస్త పదాలను ప్రయోగించి రచనను, పాఠకులను కిందికి తెస్తాడు. ఇది రచనాపరమైన విశిష్టమైన సంవిధాన నైపుణ్యం. దేవీ ప్రసాద్ కూడా అదే తీవ్రస్థాయిలో-

ఘూంకార గర్జిత దిగ్భాగం
చక్రాంగ జ్వలిత సమస్తాంగం
అని ఉన్నతంగా తీసుకొని వెళ్ళి-
రహదారి చరిత్ర సమస్తం
పైజమ్మాలను పాడుచేయడం

అని తేల్చిపారేసి, శ్రీ శ్రీ సంవిధాన నైపుణిలోకి పరకాయ ప్రవేశం చేశాడు.

''నరహంతకులు ధరాధిపతులై
చరిత్రమున ప్రసిద్ధికెక్కిరి''

అని శ్రీశ్రీ నరజాతి సహజ పరిణామాన్ని గతి తార్కిక భౌతిక వాదనా పటిమతో వ్యాఖ్యానిస్తే-

హై రోడ్డులు అశోకుశైళి
చరిత్రమున ప్రసిద్ధికెక్కెను.

అని దేవీ ప్రసాదు రహదార్ల చరిత్రకు హాస్య వ్యాఖ్యను సమకూరుస్తాడు కాని, జనసమ్మర్దమైన హైరోడ్డులు నేడు ప్రయాణీకులకు అశోకుళ్ళవలె గోచరించడం లేదు. శోకదాయులుగా కనిపించి భయం గొల్పుతున్నాయి. రోడ్డు ప్రమాదాలు, కాకుంటే జేబుదొంగతనాలు - ఏదైతేనేం బాధతో గుండెపగిలి ఏడ్వడానికి అడుగుతీసి రోడ్డుమీద పెట్టామా-

లారీరాజం, భారీ బస్సూ
రోడ్డురోలర్ బ్రెన్‌గన్ కారీర్
ట్రాంకారూ ఏమైతేనేం
ఒత్తేయును టూత్పేస్టుల ట్యూబల్లే.

ఆనాడు శ్రీశ్రీ మహాగంభీరంగా తన ఆదర్శాలను లోకానికి చేరువగా తీసుకవచ్చి-

ఒక వ్యక్తిని మరొక్కవ్యక్తీ
ఒక జాతిని వేరొక జాతీ
పీడించే సాంఘిక ధర్మం
ఇంకనా? ఇకపై సాగదు

అని సమసమాజ శంఖారావం పూరిస్తే, పేరడీకారుడు-

ఒక కారును వేరొక కారూ
ఒక బస్సును వేరొక లారీ
చుంబించే ఆ క్షణమందున
రూల్సన్నీ దాగును యెచ్చట?

అని తన సందేహాన్ని బయటపెట్టాడు.

ఈ నడివీథికి సంగరముందా?
ఆ రహదారీ వాలం బెంతుందీ?
పోసిన రాళ్ళూ నడిపిన బళ్ళూ
యివి కావోయి బాటల భాగ్యం

అని అనవసరమైన, అప్రధానమైన విషయాలపై మనసు కేంద్రీకరించ వద్దంటాడు—

రహదారుల మధ్య దారిలో
అగుపించే హంతకు లెవ్వరు?
ప్రక్కన పెట్టిన రోలర్ కాదోయ్
దాన్ని గ్రుద్దిన బండ్లెన్ని?

ఇంకా ఈ సుదీర్ఘ గేయాన్ని ఆయన ఏ విధంగా ముగించాడో పరిశీలిద్దాం.

ఏ గీతం? ఏ కాలంలో
సాధించిన దీ పరిపూర్ణం?
ఏ జలసూత్రం? ఏ 'కలవింకం'?
చూపించిరి ఈ వికటత్వం
ఎగతాళుల ఈ ప్రతిబింబం?
ఈ ఖావం, ఈ కిష్కింధం
ఈ బాష్యం, ఈ బాంధవ్యం

శ్రీశ్రీ దేశచరిత్రలు చదివి ఒక ఉద్వేగభరితమైన **అనుభూతితో ఊగి** పోతాం. దేవీప్రసాద్ పేరడీ చదివి ఎంతో బాగా అనుకరించాడని హాయిగా నవ్వు కొంటాం. ఎంత గొప్ప సమాసాలున్నా ఎంత తర్కం కవిపించినా పాఠకులకు కలిగేది మాత్రం నవ్వు తప్ప గాంభీర్యం కాదు.[1]

దేవీ ప్రసాద్ హాస్య రచనల్లో ''సంక్రాంతి కానుకలు'' ఒకటి. ఇది వాచ్యంగా పేరడీ కాదు. మతిమరుపు వలన కానుకలు తారుమారు కావడంతో సంభవించిన పరిణామాల్ని హాస్య రసవత్తరంగా చిత్రిస్తుంది.

కవికి పరధ్యానంతో ఫ్యాను పేరు జ్ఞాపకం లేకుంటే కవిగారి క్యాంప్ క్లర్కుకు అసలు ఫ్యాను ఉన్నట్టే జ్ఞాపకం ఉండదు సంక్రాంతి సందర్భంగా చైనాబజారులో కొన్ని కానుకలు కొని తెచ్చి, వాటిని పంపమని క్యాంప్ క్లర్కుకు

1. ఆం ప్ర సార్వత్రిక విశ్వవిద్యాలయం వారి బి. ఏ. ద్వితీయ సం॥రం తెలుగు పాఠ్యగ్రంథంలో మాచిరాజు రహదార్లు పేరడీని పాఠంగా పెట్టారు దానికి కేతు విశ్వనాథరెడ్డి గారు చక్కని విశ్లేషణ, వివరణ కూర్చారు

అప్పగించాడు కవి ఆ అద్వితీయుడు. ఆ పరధ్యాన్న, విశ్వపరమసృష్టి కళాపర బ్రహ్మగాడు కానుకలు పంపాడు. అవి ఏవిధంగా చేరాయో గమనించండి:

ఆ మహానసా వీథి విహాయసాన
కార్తికీ శుభ్ర చంద్రికాఖండ మనగ
కీర్తి పరిధవిల్లు వితంతుమూర్తికందె
కెంపు రాకెట్టు వెండి కుంకంపు భరిణ!

సేతుబంధన వైఫల్య సిద్ధి యందు
ధంచి లాగిన రాము కోదండ దండ
మట్టు వంగియున్నట్టి తాతయ్య కందె
నీలపుంజరీల పరికిణీల జంట!

క్వీను మేరీ కళాశాల 'కేకి' నంచు
పేరుగన్న ఆ లక్ష్మికుమారి కందె
పరిసర సఖీ జనాళి విభ్రాంతి దనర
విమల క్షవరంపు కత్తి షేవింగు బ్రష్షు!

క్యాంపుక్లర్కు పరధ్యానంతో అభాసుపాలౌతాడు. కవికి కూడ ఆ మతిమరుపే కాస్త తగిలి హాస్యంలో తలమున్కలయి ఔచిత్యాన్ని మరచిపోయి పప్పులో కాలువేశాడు చూడండి - వీరు తెచ్చినవి మూడు బహుమతులు. 1. షేవింగ్ బ్రష్షు, 2. పరికిణీల జంట, 3 కుంకుమ భరిణి. వాటిని ఇవ్వ దలుచుకున్నది ముగ్గురికి. 1. ముసలి తాతయ్య, 2. వితంతువు, 3. లక్ష్మి కుమారి (ముత్తైదువ) షేవింగు బ్రష్షను తాతయ్య కివ్వాలనుకున్నాడు పేచీ ఏమీ లేదు. కుంకుమ భరిణను లక్ష్మికుమారికి సమర్పిస్తాడని అనుకుందాం! మరి పరికిణీల జంటను వితంతువుకు ధరింపజేసి ఊరేగింపు జరిపిస్తాడా కవి?

మాచిరాజు దేవీప్రసాదు పేరడీ కవితల గురించి సవివరంగా చర్చించాం. ఆయన పేరడీ కృషి కవిత్వానికి మాత్రమే పరిమితం కాదు - గద్యరచనలకు కూడ పేరడీ చేశాడు. అవి తర్వాత గమనిద్దాం. **

'తెలుగు' ఫిబ్రవరి 1993 సంచికలో ప్రచురితం.

# 12. శ్రీశ్రీ

మహాకవి శ్రీశ్రీ కలంలో పేరడీ విశిష్టమైన పోకడలు పోయింది. సరికొత్త వయ్యారాలను సంతరించుకొంది. ప్రబంధ అవతారికలను అనుకరించింది. శతక పద్యాలను వర్తమానానికి తెచ్చింది. సిరిసిరి మువ్వల సవ్వడులను వినిపింపింది ప్రాసక్రీడలాడింది పదవైచిత్రి, అర్థవైచిత్రి, హాస్యలాస్యం, అధిక్షేప విక్షేపం శ్రీశ్రీ విగూషక కవిత్వంలో అడుగడుగున మనలను అలరిస్తాయి. ఆయన హాస్య కవిత్వమంతా 'సిప్రాలి' (1989) పేరుతో గ్రంథ రూపంలో వచ్చింది.

స్వప్నంలో దేవతలు ప్రత్యక్షమై కవిని కావ్యం రాసి అంకితమివ్వమని అర్థించినట్లు మన కవులు రాస్తుంటారు. శ్రీశ్రీ దీనిని హేళన చేస్తాడు. ఒకనాటి రాత్రి శ్రీశ్రీ 'స్వప్నకుటీరములల్లుకొనుచు, తనలో తానే పకపక నవ్వుచు ఊహల షికార్లు పోవొదగిన కాలంలో' (సిప్రాలి. పుట 17)

మును హరిహర నాథుడు తి
క్కనగారికి కలలదారి కనబడినట్లే
మన 'చక్రపాణి' రాణిం
చెను నాదు స్వప్నసీమ సిరిసిరిమువ్వా (పుట 17)

ఈ స్వప్నంలో సాక్షాత్కరించింది సర్వేశ్వరుడు కాదు - చందమామ పత్రిక సంపాదక పరమేశ్వరుడు చక్రపాణి

అనెనాతడిట్లు నన్నని
'అనఘా, శ్రీ శ్రీనివాస, హాస విభాసా
వినవయ్యా, నానుడివెడు
చిని పలుకులు చిత్తమలర సిరిసిరి మురళీ (పుట 18)

నీకొక సిగరెట్టిస్తా
నాకొక శతకమ్మురాసి నయముగ నిమ్మా
త్రైకాల్య స్థాయిగ నీ
శ్రీ కావ్యము వరలునోయి సి-సిరి బాయీ (పుట 18)

అని చక్రపాణి అర్థించాడట. గండ పెండేరాలు, చీని చీనాంబరాలు, అందలాలకు కాలం చెల్లింది. కృతికి సిగరెట్టే బహుకృతిగా తలంచే కాలంగా కల్పించడం ప్రబంధ వాఙ్మయంలోని కృతిభర్తలను గేలి చేయడమే

నరవానర కిన్నర ఖే
చరదానవ యక్ష సిద్ధ సాధ్యాసాధ్యా
తిరథ మహారథులు భవత్
స్థిర కీర్తిని పొగడుతారు సిరిసిరిగారూ (పుట. 18)

అనడం శ్రీశ్రీ హేళనాత్మక ప్రవృత్తికి ప్రతీకయే.

భారద్వాజసగోత్రుడు
వారబ్ద నదేశ తాండవాడంబర మం
జీరా రవాను రణన
స్మేరానన మూర్తి నీవు సిరిసిరిహాపూ! (పుట 19)

"వాగ్నూన్యతలేల? మహో
గ్రాగ్న్యుర్వీధరము నీవె, అమృతహిమానీ
రుగ్న్యగ్రోధము నీవె, అ
సృగ్నృత్య గురుండ నీవె" సిరిసిరి సుకవీ (పుట 19)

"ఛవిముద్రస వర్ధతుల, చ
దివెడు నుదారులకు హృదయతృష్ణ శమింపన్
నవనవముగ శతకము వ్రా
సివేయు" మని మాయమాయె సిరిసిరిమువ్వా (పుట 19)

దుష్కర ప్రాసతో సమాసాడంబరంతో ప్రబంధశైలిని మరిపించేలా రాయడానికి కారణం వాటిపట్ల ఆరాధనాభావం కాదు - అవహేళనార్థమే.

తర్వాత 'ఇష్టదేవతాస్తుతి' ప్రారంభమవుతుంది. ఇష్టదేవతాస్తుతి అని శీర్షిక ఉన్నా ఏ దేవుణ్ణీ నుతించలేదు. తెనాలి రామకృష్ణుని, కవి చౌడప్పను, కూచిమంచి జగ్గకవిని, కృష్ణశాస్త్రిని వెసనను ప్రస్తుతించాడు. శ్రీశ్రీ దృష్టిలో కవులే దేవతలన్న మాట. క్రీడాభిరామం టిట్టిభసెట్టిని, కన్యాశుల్కం గిరీశాన్ని, సాక్షి జంఘాలశాస్త్రిని, బారిస్టర్ పార్వతీశాన్ని, పేరడీ జరుక్‌శాస్త్రిని అభినుతించాడు.

కథ ప్రారంభం అవుతుంది నిజానికి దీనిలో కథ లేదు. సిరిసిరిమువ్వ మకుటంతో నడిచిన శతకం మాత్రమే ఇది. శ్రీరంగనీతులు, వైరాగ్య పద్ధతి, మూర్ఖపద్ధతి మొదలైన శీర్షికలతో రాజకీయ సామాజిక ఇతరేతర అంశాలపై విసుర్లు విసిరాడు.

కోయకుమీ సొరకాయలు
వ్రాయకుమీ నవలలని అవాకు చెవాకుల్
డాయకుమీ అరవఫిలిం
చేయకుమీ చేబదుళ్ళు సిరిసిరిమువ్వా (పుట 38)

అని సుమతి శతక పద్యాన్ని విడంబించాడు సుమతి శతక పద్యంలో 'ఏరకుమీ కసిగాయలు, దూరకుమీ బంధుజనుల' అన్నప్పుడు పద్య సౌందర్యం అంతా "కుమీ".. అని నాలుగు పాదాల్లో ఆ వృత్తి కావడంలో కేంద్రీకృతమై ఉంది. శ్రీశ్రీ ఛందస్సుల హృదయాలు తెలిసినవాడు కావడంతో ఆ సొగసును పేరడీ లోకి తీసుకొనిరాగలిగాడు. ఈ పద్యంలో సొరకాయలకు వాచ్యార్థం లేదు. ప్రగల్భాలు పలకడాన్ని సొరకాయలు కోయడంగా సంకేతించడం తెలుగు నుడికార విశేషం. సుమతి పద్యంలాగే ఆధునికావసరాలకు తగినట్లు నీత్యుపదేశం చేయడం పద్యంలో గమనించవచ్చు. నవలలన్నీ అవాకుచెవాకులేనన్న అధిక్షేపం కూడ చూడవచ్చు

ఎప్పుడు అడిగిన అప్పుడు
కప్పెడు కాఫీ నొసంగగలిగెడు సుజనుల్
చొప్పడిన యూర నుండుము
చొప్పడకున్నట్టి యూర చొరకుము మువ్వా (పుట 17)

ఇది కూడా సుమతి శతక పద్యానికి పేరడీయే అప్పిచ్చువాడు, వైద్యుడు, ఏరు, ద్విజుడు అందుబాటులో ఉండాలని ప్రాచీనులు తలపోశారు ధనవంతుడికి అప్పిచ్చువానితోను, ఆరోగ్యవంతునికి వైద్యునితోను అవసరం లేదు. ఏరు, ద్విజుడు అసలెవరికీ అవసరంలేని స్థితి ఈ కాలంలో ఏర్పడింది. కాని అందరికీ పొద్దునే లేవగానే ముఖం కడిగినా కడగకపోయినా 'కాఫీ దేవత' సాక్షాత్కరించవలసిందే నిత్య జీవితం కాఫీ పానంతో ప్రారంభం కాకుండా ఉండని స్థితి ఏర్పడింది.

శతకాంతంలో ఫలశ్రుతి కూడా చెప్పాడు:

ఈ శతకం యెవరైనా
చూసి, చదివి, వ్రాసి, పాడి సొగసిన సిగరెట్
వాసనలకు కొదవుండదు
శ్రీశు కరుణ బలిమివలన సిరిసిరిమువ్వా                    (పుట 39)

అయురారోగ్య ఐశ్వర్యాలు కలగాలనీ; పుత్రపౌత్రాభివృద్ధి జరగాలనీ; పంటలు పండాలనీ, సర్వజనులు సుఖసౌఖ్యాలతో వర్ధిల్లాలనీ ఆశించడం సంప్రదాయం ఈ సిరిసిరిమువ్వ శతకం చదివినా, విన్నా, రాసినా సిగరెట్టు వాసనలకు [illegible] వికటత్వం, హేళన ప్రాయం.

జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి పేరుమీద శ్రీ శ్రీ 'రుక్కుటేశ్వర శతకం' చెప్పాడు. (కేవలం 19 పద్యాలే చెప్పాడు.)

ద్విగుణీకృత కర్తరికా
సిగరెట్ పొగరీకృతుండు, జిహ్వాగ్రనటత్
భుగభుగ భుగాయితోజ్జ్వల
రిగసా సగరీ గరిసరిగ సారుండున్                    (పుట 39)

సాధారణంగా కావ్యాల్లో కనిపించే షష్ఠ్యంతాల పద్ధతిలో ఓ పద్యం రాశాడు.

రుక్కుటనకు, అగ్రహముగల
ముక్కుటనకు, విచిత్ర భావముఖరితవాణీ
భాక్కుటనకున్, తెగవాగెడి
డొక్కుటనకున్ సాటిలేని డుబడుక్కుటనకున్                    (పుట 39)

షష్ఠ్యంతాలు ఎప్పుడూ ప్రశంసాత్మకంగా ఉంటాయి. ఆ తీరుకు వికటంగా వచ్చిందే ఈ పద్యం. రుక్కుటేశ్వర శతకం 'జరూ' అన్న మకుటంతో సాగుంది. 'గురూ!' శబ్దం స్ఫురించేలా 'జరూ!' అని శ్రీశ్రీ జరుక్‌శాస్త్రిని సంబోధించాడు అట్లాగే (ఆవంత్స) సోమసుందర్‌ను దోమసుందర్ (పుట 45) అనడం పురోభివృద్ధిని తిరోభివృద్ధిగా మార్చేయడం; బొల్లిముంత శివరామకృష్ణను చిల్లిముంతల శివరామకృష్ణ (పుట 45) గా మార్చడం హాస్యానుకరణంలో భాగమే.

ఇంకా ఘోరంగా అసహ్యంగా ఆరుద్రను రోమలక్ష్మీపతి అనడం అధమ తరగతికి చెందిన అపహాస్యానుకరణం.

పదాలను పేరడీకరించడానికి వీటిని నిదర్శనాలుగా చెప్పుకోవచ్చు.

ఏవి తల్లీ నిరుడు కురిసిన
హిమసమూహములు
... .
కాళిదాస మహా కవీంద్రుని
కవన వాహినిలో కరంగిన
ఉజ్జయిని నేడెక్కడమ్మా
ఉంది చూపించు
... .. ..
పసిడి రెక్కలు విసిరి కాలం
పారిపోయిన జాడలేవి?
ఏవి తల్లీ నిరుడు కురిసిన
హిమ సమూహములు

శ్రీశ్రీ రాసిన ప్రసిద్ధ గీతాలలో ఇదొకటి ఈ గీతానికి శ్రీశ్రీయే 1955 లో ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన మధ్యంతర ఎన్నికల సందర్భంగా పేరడీ రాశాడు. కొంత రాజకీయ నేపథ్యం తెలుసుకొంటేనే ఈ గేయం సుబోధకమవుతుంది.

ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు మంత్రివర్గం 1954 నవంబర్‌లో పతనమైంది. దాంతో రాష్ట్రపతిపాలన ఏర్పడింది. 1955 జూన్ 4 న మధ్యంతర ఎన్నికలు జరిగినాయి. ఈ ఎన్నికల్లో కమ్యూనిస్టులు అధికారాన్ని హస్తగతం చేసుకోగలరని అందరూ ఊహించారు. కమ్యూనిస్టులు గెలిస్తే ఎవరెవరు మంత్రివర్గంలో ఉండాలో కూడ నిర్ణయించుకొన్నారు. శ్రీశ్రీ, కొడవటిగంటి మొ॥ వామపక్ష రచయితలంతా కమ్యూనిస్టులవైపు, తదితర రచయితలంతా కాంగ్రెసువైపు ఎన్నికల ప్రచారంలో దిగారు ఆంధ్రపత్రిక కాంగ్రెసు తరపున వకాల్తా పుచ్చుకొంది. దేవులపల్లి, పాలగుమ్మి పద్మరాజు, పిలకా గణపతిశాస్త్రి మొ॥ రచయితలంతా కమ్యూనిస్టులకు ప్రతికూలంగా సంతకాల

ఉద్యమం నిర్వహించడమే కాకుండా శ్రీశ్రీ మీద తీవ్రమైన వ్యతిరేక ప్రచారం చేశారు అధికార పీఠమే దక్కుతుందని ఆశించిన కమ్యూనిస్టులకు ఎన్నికల ఫలితాలు చెంపపెట్టు పెట్టినట్లయింది. మాకినేని బసవపున్నయ్య, తరిమెల నాగిరెడ్డి, మోటూరి హనుమంతరావు, చంద్ర రాజేశ్వరరావు లాంటి ప్రముఖ కమ్యూనిస్టు నేతలందరు ఓటమిని చవిచూశారు. శ్రీశ్రీకి మతి చలించింది. ఈ నేపథ్యంలో శ్రీశ్రీ 'ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమ సమూహములు' (ఈ అర్థం వచ్చేలా ఫ్రెంచిలో శీర్షిక పెట్టాడు) అనే శీర్షికతో కాంగ్రెసును సమర్థించిన రచయితలను విమర్శిస్తూ రాసిన కవిత ఇది.

ఏరి తల్లీ నిరుడు మురిసిన
ఇనప రచయితలు
కృష్ణశాస్త్రు పుటుష్ట్రిపక్షి
దారి తప్పిన నారిబాబూ
ప్రైజు ఫైటరు పాపరాజూ
పలక రెంచేత?
ప్రజాస్వామ్యపు పెళ్ళికోసం
పండితా నారాధ్యుడాడిన
వంద కల్లల పంది పిల్లల
ఆంధ్ర పత్రిక ఎక్కడమ్మా?
ఎక్కడమ్మా ఎలక గొంతుక
పిలకశాస్త్రిల పనికిమాలిన
తలకు మించిన వెలకు తగ్గిన
రణగొణ ధ్వనులు
ఏవితల్లీ నిరుడు మురిసిన
హిమ సమూహములు (పుట 82)

మాత్రాకానుసారియై మిశ్రగతిలోనే ఈ గేయం నడిచింది రచయిత దృష్టిలో ఇనపరచయితలంటే తుప్పు పట్టిన భావాలు గలవారని కాబోలు! ఉష్ట్ర పక్షి (OSTRICH) ఇసుకలో తలముంచి పడుకొనే లక్షణం గలది అంటే కృష్ణశాస్త్రి వర్తమాన భావాలని గ్రహించలేక ఉష్ట్రపక్షిలాగా తన లోకంలో

తాను జీవిస్తున్నాడని తలచవచ్చు మరోచోట కూడ శ్రీశ్రీ కృష్ణశాస్త్రిని 'శాష్ట కృత్రి విష్పరించు చారువేదనా రోగమ్' (పుట 75) అని చమత్కరించాడు. శ్రీరంగం నారాయణబాబును దారి తప్పినవానిగా చిత్రించాడు. 'గాలివాన' (1948) కథ రాసి తెలుగు కథానికకు అంతర్జాతీయ ఖ్యాతి తెచ్చిపెట్టిన పాల గుమ్మి పద్మరాజును ప్రైజుఫైటర్ పాపరాజుగా చమత్కరించాడు. కమ్యూనిస్టు లకు వ్యతిరేకంగా ఆంధ్రపత్రిక ద్వారా ప్రచారం చేసిన పండితారాధ్యుల నాగేశ్వరరావు; ఎలుక కీచుమన్నట్లుగా మాట్లాడే పిలకా గణపతిశాస్త్రి కూడా ఈ గేయంలో పరామర్శింపబడ్డారు.

శ్రీశ్రీ రాజకీయాల సుడిగుండంలో తలమునకలవుతూ ఆవేశంతో గాలి వాటంగా చెప్పిన అధిక్షేపాత్మక పేరడీలు ఇవి. శ్రీశ్రీయే కృష్ణశాస్త్రిని శ్రీరంగం నారాయణ బాబును పాలగుమ్మి పద్మరాజును ప్రశంసించిన సంద ర్భాలు కనిపిస్తాయి.

శ్రీశ్రీ రాసిన 'నిరుడు కురిసిన హిమ సమూహములు' గేయానికి తర్వాత జరిగిన ఎన్నికల సందర్భంగా ఆరుద్ర; చొప్పకట్ల చంద్రమౌళి, అబ్బూరి పేరడీలు రాశారు. *

—3.7.1983 ఆంధ్రప్రభ దినపత్రికలో కొంతభాగం ప్రచురితం.

# 13. జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు

మలితరంలో జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు కవితారంగంలో పేరడీని బాగా సాధన చేశాడు. ఎక్కువగా శ్రీశ్రీ కవితలను విడంబించాడు. శ్రీశ్రీ జయభేరి'కి 'గుండుభేరి' పేరుతోను; 'ప్రతిజ్ఞ'కు 'ప్రతిష్ఠ' పేరుతోను; 'మహా ప్రస్థానం'కు 'మహా ప్రతిష్ఠానం' పేరుతోను; 'అవతారం'కు 'అవసరం' పేరుతోను పేరడీలు రచించాడు. ఇంకా దేవులపల్లి కృష్ణశాస్త్రి 'ఏల ప్రేమింతును' గేయానికి 'సందియం' పేరుతోను; ఆరుద్ర 'నీవు నన్ను ప్రేమిస్తే'కు 'పీ.బూ.దే' పేరుతోను, గురజాడ 'దేశభక్తి'కి 'యథాశక్తి' పేరుతోను పేరడీలు రచించాడు.[1]

శ్రీశ్రీ కవిత్వంలో సాధారణంగా కనిపించే ఉద్వేగ పూరితమైన శబ్ద సంయోజనం, వాక్య సంయోజనాలకు చక్కటి నిదర్శనం ఆయన రాసిన 'ప్రతిజ్ఞ' గేయం ఈ గేయంలో భావం, భాష, ఛందస్సు ముప్పేటలా పెన వేసుకొనిపోయాయి. మార్క్స్ సిద్ధాంతసారం ఈ గేయంద్వారా కవితాత్మకంగా తెలుగులో జాలువారింది

పొలాల నన్నీ
హలాల దున్నీ
ఇలా తలంలో హేమం పండగ
జగానికంతా సౌఖ్యం నిండగ[2]

"పై ఉదాహరణలో మూడు పాదాలలోను జగణం తర్వాత 'గగ'ను వరుసగా ప్రయోగించడం వల్లను, మొదటి రెండు పాదాలలోను చివర వరుసగా రెండు గురువులు ప్రయోగించి, మూడోపాదం చివర వరుసగా రెండు లఘువులు

---

1. జొన్నవిత్తుల పేరడీ గేయాల ప్రచురణ వివరాలను గ్రంథాంతంలో ఇచ్చిన సూచికలో చూడగలరు.
2 మహాప్రస్థానం (1975) పుట 33

ప్రయోగించడం వల్లను గేయం నడకలో మంచి తూగు వచ్చింది. మూడో పాదంలో చివర హ్రస్వాక్షరాల ప్రయోగం వల్ల ఒక కుదుపు వచ్చింది. అను ప్రాసలు, అంత్యప్రాసలు, గుర్వక్షర బాహుళ్యం, మూడో పాదంలో అనుస్వార అవృత్తి - ఇవన్నీ నడక అందాన్ని ఇనుమడింపజేయడంలో కలిసి వచ్చినాయి ఈ గేయంలో పాదాలన్నీ ఈ విధంగానే చాలావరకు జగణాలతోనే ఆరంభం కావడం వల్ల నడకకు ఎక్కడలేని ప్రౌఢిమ, ద్రఢిమ చేకూరినాయి" 1

జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు మాత్రా సంఖ్య సమానంగా వేస్తూ గురులఘు క్రమం మాత్రం అక్కడక్కడ మారుస్తూ పేరడీ రచించాడు. ప్రతిజ్ఞ గేయాన్ని పూర్తిగా పేరడీ చేయలేదు

అవాకులన్నీ
చవాకులన్నీ
మహారచనలై మహిలో నిండగ-
ఎగబడి చదివే పాఠకులుండగ -
విరామ మెరుగక పరిశ్రమిస్తు
అహోరాత్రులూ అవే రచిస్తూ
ప్రసిద్ధికెక్కే కవిపుంగవులకు
వారికి జరిపే సమ్మానాలకు
బిరుదుల మాలకు
దుశ్శాలువలకు
కరతాళాలకు ఖరీదు లేదోయ్2

పాఠకులు కోరుతున్నవే మేం రచిస్తున్నామని దబాయిస్తు పాశ్చాత్య నవల లను దొంగచాటుగా అనువాదం చేస్తూ సెక్సు, క్రైం, హారర్‌లతో పాఠకులలో ఉద్వేగాలను రెచ్చగొట్టి కీర్తి, ధనం కొట్టేస్తున్న వీర రచయితలు కోకొల్లలు

1. డా॥ జి. చెన్నకేశవరెడ్డి ఆధునికాంధ్ర గేయ కవిత్వం (1988) పుట 400.

2 ఆంధ్రజ్యోతి వారపత్రిక 11.5.1984.

వారికి జరిగే సన్మానాలను, వారి రచనల తీరుతెన్నులను అధిక్షేపిస్తూ ప్రయోజనాత్మకంగా వెలువడిన పేరడీ ఇది. నవలలు రాయడం,సీరియల్స్‌గా ప్రచురింపజేయడం (ఒక్క రచయితయే ఏకకాలంలో రెండు మూడు సీరియల్స్ రాయడం, ఈ మధ్య పేరుమోసిన రచయితలు ఇతరుల చేత రాయించి తమ పేరు మీద ప్రకటించుకొంటున్నారని, 'ఘోస్ట్ రైటర్స్'ను పోషిస్తున్నారని కూడ వార్తలు వినవస్తున్నాయి) వాటిని తెలుగులో సినిమాలుగా తీయడం; అదృష్టం బాగుండి లాభాలు వస్తే హిందీలో తీయడం నేడు జరుగుతున్న స్థితి. దీనిని ఖండించడానికి జొన్నవిత్తుల శ్రీశ్రీ గేయాన్ని సాధనంగా వాడుకొన్నాడు.

నరాల బిగువూ
కరాల సత్తువ
నవలల వర్షం కురిపించాలని
అవి సినిమాగా తీయించాలని
నవలల రచనల కార్ఖానాలను
ప్రారంభిస్తూ
తెగవ్రా(యి)స్తూ
ఆంధ్ర పాఠకుల అలరించే యీ
అశేష రచనా విశేషమందున
సహజత్వానికి
సరళత్వానికి
నవరసాలకూ కథాంశాలకూ
డిమాండు తగ్గే సూచన లేదోయ్[1]

ఈ విధంగా శ్రీశ్రీ గేయాలకు ఎంతో సమర్థంగా జొన్నవిత్తుల పేరడీ చేశాడు. అన్నీ గొప్పవే ఒక్కటి మాత్రం మచ్చుకు వివరించడమైంది.

నేను సైతం
తెల్లజుట్టుకు
నల్లరంగును కొనుక్కొచ్చాను

1 ఆంధ్రజ్యోతి వారపత్రిక 11-5-1984.

నేను సైతం
నల్లరంగును
తెల్లజుట్టుకి రాసిదువ్వాను.
యింత చేసీ
యింత క్రితమే
తిరుపతయ్యకు జుట్టునిచ్చాను [1]

అని శ్రీశ్రీ 'జయభేరి'ని జొన్నవిత్తుల 'గుండుభేరి'గా మార్చేశాడు.

అరే ప్రకాశం
ఒరే గణేశం
ఆకలి లోకం పిలిచింది.
పదండి ముందుకు
పదండి తిండికి
పోదాం పోదాం హోటల్‌కి [2]

అని శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాన్ని హోటల్ దిశగా జొన్నవిత్తుల నడిపించాడు

'నీవు నన్ను ప్రేమిస్తే' అనే ఆరుద్ర గీతానికి జొన్నవిత్తుల ఒక మంత్రి అజ్ఞానానికి అన్వయించి పేరడీ చేశాడు

మీరు నాకు ఓటేస్తే
మెజారిటీ పీడిదే
మంత్రి పదవి నాకొస్తే
మీకు మటుకు బూడిదే!

నాకు తెలిసినంతలో
దున్నపోతు ఆడదే
ఎవడన్నా కాదంటే
వాడు అడ్డగాడిదే

సభలోపల పిలుస్తుంటే
నాకు గాఢ నిద్రలే
సంతకాలు పెట్టమంటే
రావు వేలి ముద్రలే [3]

---

1 ఆంధ్రజ్యోతి వారపత్రిక 24.12.82
2. ఆంధ్రజ్యోతి వారపత్రిక ?.10.84 (దీపావళి ప్రత్యేక సంచిక)
3 ఆంధ్రజ్యోతి వారపత్రిక 17.6.83.

## సౌరభం :

స్సౌరభము లేల చిమ్ము బుష్పవ్రజంబు?
చంద్రికలనేల వెదజల్లు జందమామ?
ఏల సలిలంబు పాఱు? గాడ్పేల విసరు?
ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను?[1]

ఈ పద్యంలో పేర్కొన్న పుష్పం, చందమామ, నీరు, గాలి మున్నగు దృష్టాంతాలు ప్రేమించడం అనే కార్యాన్ని సమర్థించడం కోసం తేబడినవి. దృష్టాంతాలన్నీ సహజ ధర్మాలు కలిగినవి ప్రేమించడం కూడ ఒకానొక సహజ ధర్మం అవి ఎంత సహజ సిద్ధమైనవో కవి ప్రేమ కూడ అంతే సహజ సిద్ధమైన అంశం ఒక సహజ ప్రక్రియను సమర్థించడానికి సహజధర్మాలు గలిగిన వాటిని దృష్టాంతాలుగా కృష్ణశాస్త్రి తీసుకొని వచ్చి కార్యకారణ సంబంధాన్ని పద్యంలో సమకూర్చాడు. ప్రశ్నార్థకరూపంలో పద్య నిర్మాణం కొనసాగించాడు

జరర రసమేల స్రవియించు జరరగ్రంధి?
అడవిలో యేల నివసించు నడవి పంది?
ఏల పిచికుక్క కరుచు? కాకేల యరుచు
ఏల తలమీద వెంట్రుకలిన్ని మొలుచు?[2]

ఇది జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు పేరడీ 'సందియం.' మాతృకలాగే ప్రశ్నార్థకాలతో పేరడీ సాగింది మాతృకలోలాగే సహజధర్మాలు గలవాటినే పేరడీస్టు గ్రహించాడు. జరరగ్రంధి స్రవించడం, అడవిపంది అడవిలోనే నివసించడం, పిచ్చికుక్క కరవడం, కాకి అరవడం ఇవన్నీ సహజ ధర్మాలు. వరుసగా ఒకదాని వెనుక ఒకటి మూలంలో ఎలా ఉన్నాయో సరిగ్గా పొల్లు

1 కృష్ణపక్షము (1988) పుట 30
2 ఆంధ్రజ్యోతి వారపత్రిక 8-4-83

పోకుండా అలాగే కూర్చాడు. మొదటి రెండు పాదాల్లో ఒక్కొక్క దృష్టాంతం, మూడో పాదంలో రెండు దృష్టాంతాలు, మొదటి రెండు పాదాల్లో చివరలో కర్తలు (పుష్ప్రవజంబు, జరరగ్రంధి, చందమామ, అడవి), మొదట్లో ఫలితాలు (సౌరభము, జరర రసం, చంద్రికలు, అడవి), మధ్యలో క్రియలు (చిమ్ము - స్రవియించు, వెదజల్లు, నివసించు) మూడో పాదంలో మాతృక ప్రశ్నార్థకంతో ప్రారంభమై సాగిపోతే పేరడీ కూడ అలాగే కొనసాగింది. కృష్ణశాస్త్రిని హేళనాత్మకంగా అనుకరించడంతో ఈ పద్యం పేరడీగా విజయవంతమైంది.

కాని మాతృకలో 'ప్రేమించడం' అనే సహజ ధర్మాన్ని సమర్థించడం కోసం అంటే ఒక నిర్మాణాత్మకమయిన ప్రయోజనాన్ని ఆశించి దృష్టాంతాలు సంకల్ప పూర్వకంగా కూర్చడం జరిగింది కాని పేరడీలోని దృష్టాంతాలు దేనికోసం తీసుకొని రాబడ్డాయి? దేనిని సమర్థిస్తున్నాయి? 'తలమీద వెంద్రుకలు' మొలవడానికా? అంటే అదీకాదు. 'తలమీద వెంద్రుకలు' రావడంకూడ ఒక దృష్టాంతమే. పేరడీలో లక్ష్య రహితంగా దృష్టాంతాల పరంపర కూర్చడంతో, ఏదో ఒక దానిని సమర్థిస్తున్నట్లు లేకపోవడంతో వాటివల్ల రచయిత సాధించిన ప్రయోజనం అనేది లేకుండాపోయింది అన్ని విధాల ఇది చక్కటి పేరడీ అయినా చంద్రునిలో మచ్చలాగా ఈ లోపం ఉందని మాత్రం చెప్పక తప్పదు

*

# 14. భాగవతుల సుబ్రహ్మణ్యం

నాకొ్కంచెం నమ్మకమివ్వు!
కొండలు పిండి కొట్టేస్తాను
చితికిన టొమాటోలాంటి సూర్యుణ్ణి
ఆరిన అప్పడం లాంటి చంద్రుణ్ణి
ఆకాశపు ఎంగిలి పళ్ళెంలోంచి నెట్టేస్తాను!
నాదగు బాహుబంధనంలో ఈ విశాల బ్రహ్మాండాన్ని చుట్టేస్తాను!
నిస్సహాయ మానవేయుని నొసటి వ్రాలు
ఒక్క కలంపోటుతోటి కొట్టేస్తాను,
జీవిత సభాభవన ద్వారం నుంచి
అన్యాయాన్ని, అక్రమాన్ని మెడబెట్టి గెంటేస్తాను
ఇంకా ఎన్నో ఎన్నెన్నో చేసేస్తాను [1]

ఆలూరి బైరాగి రాసిన ప్రసిద్ధ కవితల్లో ఇదొకటి. ఆధునిక జీవితంలో ప్రతి అంగం వ్యాపారాత్మకమై పోయింది. ప్రతి విషయాన్ని 'డబ్బు' తోనూ, ప్రయోజనం'తోనూ తూచడమెక్కువయిపోయింది ఎదుటి వ్యక్తికి నమస్కారం పెట్టాడంటే గౌరవిస్తున్నాడని భావం కాకుండా ఏదో ఆశిస్తున్నాడన్న భావం మదిలో మెదలుతుంది. కుటుంబ సభ్యుల మధ్య, గురుజన బంధు మిత్రుల మధ్య ప్రేమ, వాత్సల్యం, విశ్వాసం, ఆదరణ కరువై పోయాయి మనిషి తన నీడను తానే నమ్మలేక పోతున్నాడు పరస్పర విశ్వాసరాహిత్యంతో ప్రపంచ యుద్ధాలకు ఆయత్తమైపోతూ విశ్వసృష్టికే ఘాతం కలిగిస్తున్న నేటి తరుణంలో ఆలూరి బైరాగి ఆత్మవిశ్వాసం, దాని ప్రయోజనాన్ని చిత్రీకరిస్తూ రచించిన వచన కవిత ఇది.

---

1. 'నాకొ్కంచెం నమ్మకమివ్వు' (పాఠం) సార్వత్రిక విశ్వవిద్యాలయం బి ఏ ద్వితీయ సం॥రం తెలుగు పాఠ్యగ్రంథం (1986) పుటలు 101 102

'చేయగల'ననే నమ్మకం ఉంటే ఎలాంటి మహత్కార్యాలనైన సునాయాసంగా సాధించగలం కొండలు పిండి కొట్టడమేకాదు సూర్యచంద్రుల గతిని కూడ మార్చవచ్చు ఏదో అష్టకష్టాలు పడికాదు. భోజనం చేస్తున్నపుడు చితికిన టమాటలను, అప్పడాలను ఎంగిలి పళ్ళెంలోంచి తీసి పక్కకు పెట్టినంత సులువుగా సునాయాసంగా సూర్యచంద్రులను మార్చవచ్చు అలాగే అన్యాయాలను, అక్రమాలను, నొసటిరాతలను ఛేదించవచ్చు- సాధించగలనన్న 'నమ్మకం' పరిపూర్ణంగా ఉంటే ఈ విధంగా 'బైరాగి' కవిత నమ్మకంకోసం అర్థింపు, నమ్మకం చిక్కాక కలిగే పరిస్థితి, నమ్మకం లేకుంటే కలిగే దుస్థితి అనే మూడు విభాగాలుగా కొనసాగుతుంది

దీనికి భాగవతుల సుబ్రహ్మణ్యం వజ్రపాణి కలం పేరుతో 'నాకూ్కడ చిరు ఛాన్సివ్వు' అని పేరడీ చేశాడు

నాకూ్కడా ఓ చిరుఛాన్సివ్వు! కోతలు దండిగ కోసేస్తాను
అతుకుల బొంతలాంటి జీవితాన్ని
జారిన అదృష్టంలాంటి ఈ తరాన్ని
అవకాశపు అంచుల వలయాన కట్టేస్తాను
అనాదిగా అంతుచిక్కని ఈ మానవాళి దైన్యాలన్నీ
రేపే మట్టుపెట్టేస్తాను
భీతహరిణ మానినీమణి రాత్రింబగళ్ళు
ఒక్కలాగ తిరగ్గలిగే చట్టం కట్టిస్తాను
భావనారమ్య మందిరంలోంచి
ఛాందసాల్ని దురూహల్ని వెడల గొట్టేస్తాను
ఇంకెన్నో, ఎన్నెన్నో కోస్తాను, కాని ఒక్కటి-
నాకూ్కడా ఓ చిరుఛాన్సివ్వు 1

మాతృకలో నమ్మకాన్ని అర్థించడం ఒక మహత్తర ఆశయ సాధన కోసం పేరడీలో కోతలు కోయడం కోసం చిరుఛాన్సడగడం. కోతలు కోయ

1 మయూరి వారపత్రిక - 27-8-1988

దానికి ఏమాత్రం ఒళ్ళు, మనస్సు కష్టపెట్టుకోనక్కర్లేదు కాని నమ్మకం కుదరాలంటే మనస్సు నలగాలి. సమాధానపడాలి మానవాళి దైన్యాల్ని రూపుమాపుతానన్న, స్త్రీలు రాత్రింబగళ్ళు స్వేచ్ఛగా తిరిగేలాగ చేస్తానన్న, ఛాందసాల్ని తొలగిస్తానన్న - ఇవన్నీ సాధించడానికి 'చిరుధాన్యు' అడగడం లేదు పేరడీకర్త పైవన్నీ సాధిస్తానని కోతలు కోయడానికి చిన్న అవకాశం ఇవ్వమంటున్నాడు

ఇంటింటా గగనకుసుమాలు మూడుపూవులుగ
నందన నికుంజాల్లోని అమృతఫలాలు ఆరుకాయలుగా
పూయిస్తాను, కాయిస్తాను

నమ్మకం అనేది ఉంటే ఒక అసంభవాన్ని సంభవంగా ఎలా మార్చేయగలడో చెప్పడానికి బైరాగి చూపిన నిదర్శనమిది గగనకుసుమం అంటేనే శూన్యం, అటువంటి శూన్యంనుండి 'మూడు పూవులు' పూయిస్తాడట. అసలు పైపాదంలో ఒక రకమైన 'అస్తవ్యస్తత' ఉద్దేశపూర్వకంగా తీసుకొని రాబడింది. అసంభవాన్ని సూచించడం, చిత్రించడం ఈ 'అస్తవ్యస్తత'ను కల్పించడంలోని ప్రయోజనం.

1. మొదలే గగన కుసుమాలు— ఏవైతేనేం అవి పూలు
2. మూడు పూవులుగ పూయిస్తాడు— ముందే వికసించిన పూలను మళ్ళీ పూలుగ పూయించడమేమిటి?
3 ఆ పూలే కాయలు కాయాలి. తర్వాత పండ్లు కావాలి. ఇది క్రమపరిణామం కాని పూల ప్రసక్తి అక్కడికే ఆగిపోయింది.
4. అమృతఫలాలు ఆరుకాయలుగ కాయిస్తాను. కాయలు పళ్ళు కాకుండా, పళ్ళనే కాయలుగ కాయిస్తాడట ఈ వ్యత్యస్తం ప్రకృతివైపరీత్యం.

ఈ పదచిత్రణమంతా పరితల నాకట్టుకొంటుంది దీనికి తగినట్లుగా సుబ్రహ్మణ్యం పేరడీ ఉంది.

ఊరూరా దోమలమందు మూడేసి డ్రమ్ములుగ
మురికివాడల ముంగిళ్ళందు ఆరేసి బాల్చీలుగ
పోయిస్తాను, వొంపేస్తాను.

దోమల మందు ప్రస్తావన చూడగానే పకాలున నవ్వేస్తాం నిర్మాణంలో పూర్తిగా మాతృకను అనుసరించింది మాతృకలో మూడు పాదాల్లో వరుసగా మొదటి పాదంలో ఒక విషయం (పూలు) రెండవ పాదంలో ఒక విషయం (కాయలు) చెప్పబడ్డాయి మూడో పాదంలో పై రెంటికి సంబంధించిన సమాపక క్రియలు క్రమంగా వేయబడ్డాయి పేరడీలోను అలాగే ఉన్నాయి. ఈ పేరడీలో కూడా ఒక అందమైన 'అస్తవ్యస్తత' ఉంది. మొదట ఎవరైనా తక్కువ పోసి చాలకపోతే ఎక్కువ పోస్తారు కాని పేరడీలో మూడేసి ద్రమ్ములుగ దోమల మందు పోయిస్తాడట ఆ తర్వాత ఆరేసి బాల్చీలుగ ఒంపేస్తాడట.

నమ్మకం లేని బొందె, ఖాళీ సిగరెట్టు టిన్ను
నమ్మకం లేని హృదయం, పుల్లలు లేని అగ్గిపెట్టె
నమ్మకం లేని బ్రతుకు, కాలిన సిగరెట్టు బూది

అన్నీ ఉన్నప్పటికీ నమ్మకమొకటిలేని ఎడల బ్రతుకువమ్ము. నమ్మకం లేని బ్రతుకు ఎంత దుస్థితిలో ఉంటుందో బైరాగి ఏ మాత్రం అస్పష్టతకు లోనుకాకుండా, లోనుచేయకుండా సూటిగా చెప్పాడు ఖాళీ సిగరెట్టు టిన్ను, పుల్లలు లేని అగ్గిపెట్టె, కాలిన సిగరెట్టు బూది అని నూతన ఉపమానాల సాయంతో నమ్మకంలేని స్థితి ఎంత సారహీనమైందో చిత్రించాడు. పేరడీ కర్త కూడ-

ఛాన్సు ఏమాత్రంలేని 'లైఫు' శుద్ధ వేస్టుబాక్సు
ఛాన్సు ఏమాత్రంలేని 'ప్రూఫు' పరమబోరుకొట్టు
ఛాన్సు ఏమాత్రంలేని 'షేపు' బహుకారిన్యపు బండరాయి
అన్నీ ఉన్నాకూడ అవకాశమ్మొకటిలేని ఎడల చేదునవ్వు.

ఇందులో మాతృకలాగే ప్రతిపాదం రెండు భాగాలుగా విభక్తమై ఉంది ప్రతిపాదం మొదటి భాగంలో ఛాన్సు లేని లైఫు, ప్రూఫు, షేపు మొ॥ చెప్పబడగా రెండవ భాగంలో వాటి ఉపమానాలున్నాయి మాతృకలోను పూర్వార్ధ భాగం నమ్మకంలేని బొందె, హృదయం, బ్రతుకు చెప్పబడగా రెండవ భాగంలో వాటి ఉపమానాలున్నాయి ఒక్క రెండవ పాదంలో మాత్రం పేరడీలో అజాగ్రత్త చోటు చేసుకొంది 'నమ్మకంలేని హృదయం'-'పుల్లలులేని అగ్గిపెట్టె' అని ఒక నామవాచకంతో సామ్యం చెప్పినపుడు పేరడీలో కూడ అలాగే ఒక

నామవాచకంతో సామ్యం చెప్పవలసిన అవసరం ఉంది. తక్కిన పాదాల్లో ఆ పద్ధతి పాటించాడు కూడ. రెండవపాదంలో మాత్రం 'ఛాన్సు ఏమాత్రం లేని ప్రూపు పరమ బోరుకొట్టు' అని క్రియాంతం చేశాడు

మొత్తంపైన బైరాగిలోకి పరకాయ ప్రవేశం చేసి కృతకృత్యుడయ్యాడు భాగవతుల సుబ్రహ్మణ్యం ఉరఫ్ వజ్రపాణి

జరుక్‌శాస్త్రి రచించిన 'ఆశ్వాసాంతం', 'పేర్లపులిగోరు' కవితలను అనుసరిస్తూ భాగవతుల సుబ్రహ్మణ్యం (అ)ద్వితీయాశ్వాసం, 'ఆంధ్ర నామ సంగ్రహం' రచించాడు వీటిని రచయితయే పేరడీలని పేర్కొన్నాడు. 'ఆశ్వాసాంతం' కవిత చూడండి.

లలాటాన కుంకుమాగ్ని, భుజంమీద మబ్బుదబ్బు
కాళ్ళకింద కిర్రు చెప్పు, అంగోస్త్రం, పొడుంకాయ
వ్యవధిలేని అవధానం వెళిపోయిందెళిపోయింది
చెళ్ళపిళ్ళ పద్యావళి, చిలకమర్తి గయుడికథా
వడ్డాదీ, పానుగంటి, బావిలీలు, బ్రహ్మసమాజ్
తాటికాయ నీటికాత, పుల్లుమాను టాటాటా
ప్రచారిణి చింతామణి వెళిపోయాయెళిపోయాయి

అని మొదలయి—

శ్రీ నారాయణబాబూ, అశాంతిలో ఇంద్రకాంతి
పూరిలో పురిపండా, బెంగుళూరు హరీన్‌చటో
పిల్లికళ్ళు, పాముచెవులు, సంగీతపు గడియారం
కెమేరాలు పంపుషూలు, అతి విస్మృత అతిరాజిత
అతిపూజిత అతికామిత అతివాస్తవికాకారం
ఆహారం ఆచారం వొచ్చేశాయొచ్చేశాయి.[1]

1. జరుక్ శాస్త్రి పేరడీలు (1982) పుట 42 - 48.

అని ముగిసే ఈ కవితను జరుక్‌శాస్త్రి జనవరి 1941 భారతిలో ప్రకటించాడు. అప్పటికే ఒక వెలుగు వెలిగి చల్లారిన మహాకవులు, తత్త్వవేత్తలు, రాజకీయవేత్తలు, పత్రికలు, సిద్ధాంతాలు కొత్తతరంగా వెలుగులోకి గుర్తింపు లోకి వస్తున్న వాటినన్నింటిని ఒక చారిత్రక రికార్డుగా కూర్చి జరుక్‌శాస్త్రి ఈ 'ఆశ్వాసాంతం' కవిత విరచించాడు

సింబాలిజం కర్మసాక్షి, సిగ్నేచరు కమ్యూనిస్టు
బుర్రనిండా ఎర్రదనం, అరమాసిన చిరుగడ్డం
వచన విప్లవ కవిత్వం వెళ్ళిపోయిందెళిపోయింది
పన్యాలా, రామవరపు, ఇందిరాజి, ఆంధ్రగాలిబ్,
యమ్వీయల్ యువజ్యోతి, దివాకర్ల విద్వద్గీతి,
ఈదిఅమీన్, వాల్ట్‌డిస్నీ, అబ్బాస్‌ది మూవీ జీన్పాల్‌సార్త్రే,
ప్రభవా, రేపూ తరుణీ, భారతీ పెళ్ళిపోయ-పోయ యి [1]

అని భాగవతుల సుబ్రహ్మణ్యం '(అ)ద్వితీయాశ్వాసం' కవితను జరుక్‌శాస్త్రి కవితలాగే మొదలు పెట్టాడు అప్పటివరకు తెరమరుగైన జాతీయ అంతర్జాతీయ విశేషాలు పేర్కొంటాడు.

హార్డీచేజ్, ఇర్వింగ్‌వాలెస్, హెరాల్డ్‌రాబిన్స్, ఆర్థర్ హెయిల్
అనుక్షణికం చండీదాస్, అవలక్షణ నావెల్సూ
కాష్మోరా సోంబాబూ (కొందరి) డ్రింగర్లు విజయశాంతీ
అసంపూర్తి రావిశాస్త్రీ, బాగు బాగు డిటో డిటో
బ్రేక్‌డాన్సు, లేజర్ బీమ్సు, న్యూట్రాన్‌బాంబు, బాంబెడైయింగ్
క్రైనెటిక్‌లు, మారుతీలు, ఎల్లోజర్నల్స్, కంప్యూటర్లు, టెలివిజన్లు
అతివిస్తృత, అతిబాధిత అతిమాతుక అతిభీతిక
ఆహ్వాధుని కారం, ఆంతర్యం, ఆధారం వచ్చేసాయొచ్చేశాయి.[1]

జరుక్‌శాస్త్రి కవితను చూచి సుబ్రహ్మణ్యం కవిత చూడగానే అనుకృత రచన అని తెలిసిపోతుంది కాని ఆ అనుకరణంవల్ల సాధించిన ప్రయోజన మేమిటి? ఒకరు 1941 లో రాశారు మరొకరు 47 ఏళ్ళ తర్వాత అంటే

---

1. ఆంధ్రజ్యోతి వారపత్రిక 29-7-1988

1938 లో రాశారు జరుక్‌శాస్త్రి తన కవితరచనాకాలం వరకు ఉన్న అంశాలను గ్రంథస్థం చేశాడు దాన్ని గమనించి సుబ్రహ్మణ్యం అదే మూసలో తన కాలంలో ఉన్న అంశాలను 'రికార్డ్' చేశాడు ఈ అనుకరణంలో చమత్కారం కానీ హాస్యంకానీ ఏమీ లేవు అందువల్ల దీనిని 'కేవలానుకరణం'గానే గుర్తించ గలం తప్ప పేరడీగా అంగీకరించజాలం అలాగే జరుక్‌శాస్త్రి రచించిన 'పేర్ల పులిగోరు'[1] కవితకు కూడ సుబ్రహ్మణ్యం రాసిన "ఆంధ్రనామ సంగ్రహం" ను పేరడీగా భావించడానికి వీలులేదు

1. అడవిని A B చేసి
2 అఆ అన్నాను 3 అయిదు నిప్పుల్ని
4. శి రా. శాస్త్రి 5. శి శా, కృ శా లని
ఖరాఖండితంగా గాయపడలేను
జామువాను జావా అంటాను
రాయప్రోలును రాజధానీ అంటాను
విశ్వనాథను విశ్వనాథే అంటాను, గానీ
వేదులలో 'వే' కొట్టేస్తానేమో
7. శివరామాన్ని శి. రా అనవద్దా?
8 కవికొండలను 'కల' అనవద్దా?
ఎవరెవర్ని ఎలా ఎలా అనాలో అలాగే
అంటానుగానండీ

1 అడవి బాపిరాజు—— A B
2 అఆ - ఇంగ్లీషులో అక్షరక్రమం A B తెలుగులో అక్షరక్రమం అఆ అది కదా! ఆ వరుసతో చూస్తే అడవిలో 'అ' - బాపిరాజులో 'బా'లో ఆ - ఆవిధంగా అడవి బాపిరాజు.
3 అయిదు నిప్పులు - పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి
4 శి. రా. శాస్త్రి - వేలూరి శివరామశాస్త్రి

---

1 ఆంధ్ర సచిత్ర వారపత్రిక 24-4-1940.
(6-7-1984 ఆంధ్రజ్యోతి వారపత్రికలో పునర్ముద్రితం.)

5 శి శా. - శివశంకరశాస్త్రి
6 కృ శా. - కృష్ణశాస్త్రి
7 శి రా - వింజమూరి శివరామారావు
8 కవికొండల వెంకట్రావు

ఇలా ప్రముఖుల పేర్లను ఇష్టంవచ్చినట్లు విరవడమే జరుక్‌శాస్త్రి అనుసరించిన రచనాశిల్పం

అదే శిల్పాన్ని అక్షరాలా అనుకరిస్తూ సుబ్రహ్మణ్యం ఆధునికులకు అన్వయించి రాశాడు

1 ఆది (నే) విష్ణు ఆవిరా?
అయితే అవనీ 2 టైగర్ 'ఐ' ని
3 సి నా.రె , 4 దా నా రా , 5. వె నా.రా లని
విరిచి చదవడం నాకు నచ్చదు
అప్సర్‌ను తిరగేసి సర్ప అంటా
ఇస్మాయిల్‌ను 'ష్' మాయంటాను
6 సూర్యదేవరను సూర్యదేవు డన్లేను, గానీ
7. వేగుంటలో వే కొట్టేస్తానే 'మో'
8 రాధాకృష్ణని బూ రా అనవద్దా?
9 పతంజలిని పంజా అనవద్దా?

వీరందర్నీ ఎలా ఎలా అన్నా ఏమనుకోరుగానీండి [1 ఆదివిష్ణు, 2. పులికంటి కృష్ణారెడ్డి, 3 సి నారాయణరెడ్డి, 4 దాట్ల నారాయణమూర్తి రాజు, 5 వెల్చేరు నారాయణరావు, 6 సూర్యదేవర రామ్మోహనరావు, 7 వేగుంట మోహన ప్రసాదు, 8. బూదరాజు రాధాకృష్ణ, 9 పతంజలి (ఉదయం పత్రిక ఒకప్పటి సంపాదకుడు).]

జరుక్ శాస్త్రి కవితకు, ఈ కవితకు నిర్మాణంలో ఎలాంటి తేడా లేదు. పేరడీలో వస్తువైవిధ్యం తప్పనిసరిగా పరిగణనలోకి తీసుకోవాలి జరుక్‌శాస్త్రి తానెరిగిన సాహితీవేత్తల పేర్లు గ్రహిస్తే సుబ్రహ్మణ్యం తన కవితలో తనకు తెలిసిన రచయితల పేర్లు కూర్చాడు అంతే. దాంతో ఇది 'కేవలానుకరణం' గానే మిగిలిపోయింది తప్ప పేరడీ కాలేకపోయింది రచయితలను కాకుండా మామూలు వస్తువులనే వైన గ్రహించి ఇష్టం వచ్చినట్లు విరిచిరాస్తే పేరడీ తయారయ్యేదేమో! ఆరుద్ర, ఎల్లోరా, దాశరథి ప్రభృతుల గేయాలకు కూడ సుబ్రహ్మణ్యం పేరడీలు రచించాడు. **

# 15. పాతపద్యాలకు కొత్తపేరడీలు

పోతనాది మహాకవులు తమ తమ కావ్యాల్లో రాసిన కొన్ని పద్యాలు లోకుల రసనలే ఆకులుగా జీవిస్తూ 'చాటువు' లయ్యాయి అట్లాగే వేమన సుమతి శతకాది పద్యాలు బాగా ప్రచారాన్ని పొందాయి ఆ పద్యాల కర్తలెవరో, ఏ కావ్యంలోనివో,ఏ సన్నివేశంలోనివో తెలియకపోయినాసరే ఏదైనా సందర్భం వస్తే పద్యాన్నో, పద్యపాదాన్నో ఉదాహరించడం అందరికీ తెలిసిందే. ఎవరైనా రాకరాక ఇంటికివస్తే "ఊరకరారు మహాత్ములు" అనడం చూస్తాం ఇది పోతన పద్యమని చాలా మందికి తెలియకపోవచ్చు ఈ విధంగా జాతి జీవనంలో భాగమైపోయిన ప్రసిద్ధ పద్యాలకు పేరడీలు రావడంలో ఆశ్చర్యం ఏమీలేదు మచ్చుకు కొన్ని పరిశీలిద్దాం

అరయన్ శంతనుపుత్రుపై విదురుపై నక్రూరుపై కుబ్జపై
నరుపై ద్రౌపదిపై కుచేలునిపయిన్ నందవ్రజ శ్రేణిపై
పరగం గల్గు భవత్కృపారసము నాపై కొంత రానిమ్ము నీ
చరణాబ్జంబుల నమ్మినాను జగదీశా! కృష్ణ! భక్తప్రియా![1]

ఇది ప్రసిద్ధమైన ఒక చాటువు. భగవన్నుతి దీనిలో ప్రతిపాదితమైన అంశం. ఫలానా ఫలానా వాడిపై గల్గిన నీ దయారసం నాపై కూడ రానిమ్మని కవి వేడికోలు ఉల్లేఖితమైన ఎనిమిదిమందికి 'పై' అనే ప్రత్యయం మాత్రమే కవి వేశాడు మరో ప్రత్యయం ప్రయోగించలేదు దీనివల్ల పద్యానికో సొగసు వచ్చింది దీనికి అబ్బూరి రామకృష్ణారావు రాసిన పేరడీ చూడండి:

---

1 తిక్కన రచనగా వెంకటరంగ కవి ఉదాహరించిందని కందుకూరి ఆంధ్రకవుల చరిత్ర ప్రథమభాగం (పుట 148)లో ఉట్టంకించబడింది. తిక్కనదికాదని, వెన్నెలకంటి జన్నయ రాసిన దేవకీనందన శతకం లోనిదని వంగూరు సుబ్బారావు శతక కవుల చరిత్ర (పుట 92) లో పేర్కొనబడింది

పడపై, నావడపై, పకోడిపయి, హల్వాతుంటిపై, బూందియోం
పొడిపై, నుప్పిడిపై, రవిడ్డిలిపయిన్ బోండాపయిన్ సేమియా
సుడిపై చారు భవత్కృపారసము నిచ్చో కొంతరానిమ్మ నే
నుడుకుం గాఫిని ఒక్కచుక్క గొనవే! ఓ కుంభదంభోదరా!!

పద్యనిర్మాణం ఏకరీతిగా మాతృకను అనుసరించింది మాతృకలో భగవద్భక్తుల పట్టిక వరుసగా పేర్కొనబడింది వాటి స్థానంలో అనుదాత్తమైన తినుబండారాలు చోటు చేసుకొన్నాయి దాంతో అబ్బూరి పద్యం పేరడీగా కృతకృత్యమైంది 2

---

1 వ్యంగ్యము అర్వాచీనాంధ్రము సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము (1971) పుట 443

2. అరయన్ మారుతపుత్త్రిపై శబరిపై నాహల్యపై కైకపై
వరసుగ్రీవునిపై సదా గుహునిపై వాసిష్ఠ మౌనీంద్రుపై
కరమొప్పారగ రావణానుజునిపై కంజాక్షియౌ సీతపై
పరగన్ గల్గు భవత్కృపారసము నాపై జూపుమో శ్రీహరీ!
అజ్ఞాతకర్తృకమైన చాటువిది హాస్యానికి చెందిన పేరడీ చక్కని భక్తితో గూడిన రసోత్కర్షను చూపుతుందని చెప్తూ వేదవల్లి తాయారమ్మ గంటి కృష్ణవేణమ్మ జ్ఞానప్రసూనాంబిక శతకంలోని ఈ క్రింది పద్యాన్ని ఉదాహరించారు
అరయన్ పార్థునిపై మృకండుసుతుపై నబ్జారిపై బాణుపై
కరిపై శ్రీపయి భిల్లవంశపతియౌ కన్నప్పపై కాళుపై
పరగంగల్గు కృపారసంబిపుడు నాపై జూప నీ నాధుతో
కరుణావారిధి తెల్పరాదె జననీ! జ్ఞానప్రసూనాంబికదా!
-తెలుగు సాహిత్యములో హాస్యరసము (1968) పుట. 192
ఇది కేవలానుకరణమే తప్ప పేరడీకాదు చాలామంది పేరడీపట్ల సమగ్ర అవగాహన లేక కేవలం అనుకరణ కనిపించగానే పేరడీ అని తొందర పడి నిర్ణయానికి వచ్చిన దృష్టాంతాలున్నాయి
అబ్బూరి పేరడీ పద్యం ఇంకో తీరుగా కూడ ఉన్నట్లుంది·
ఉపమాపై పెసరట్టుపై యిడిలిపై హుమ్మంచు చూపించు నీ
జపసంబద్ధ పరాక్రమ క్రమ కటాక్షశ్రేణి మన్నించు శు
భ్రపు జిల్లేబి పకోడి లడ్వగయిరాపై కొంత రానిమ్మ శ్రీ
చపలాపాంగ సితాంగ నా హృదయపాశాపూజ్యవస్తుప్రియా!
అబ్బూరి వరద రాజేశ్వరరావు కవన కుతూహలం (1993) పుట 254.

సంస్థానాల యుగంలో (18, 19వ శతాబ్ది) వర్ణసాంకర్యం, మత సాంకర్యం పెచ్చు పెరిగిపోతున్నాయని అప్పటి కవులు కలవరపడినట్లు ఎన్నో దాఖలాలున్నాయి ఆ కాలంలో వచ్చిన ప్రసిద్ధమైన పద్యాల్లో ఇదొకటి

తండ్రి మధ్వాచారి తనయుడారాధ్యుండు
తల్లి రామానుజ మతస్థురాలు
తనది కూచిమతంబు తమ్ముడు బౌద్ధుడు
సర్వేశ్వర మతంబు సద్దకునిది
ఆలుకోమటి జాతి దక్క జంగమురాలు
బావగారిది లింగబలిజ కులము
ఆడుబిడ్డ సుతారి యల్లుఁడు పింజారి
మఱఁదలు కోడలు మారువాడి

కలియుగంబున వర్ణసంకరులు ప్రబలి
యుత్తమ కులంబు లోకమూల కొత్తిగిల్లె
మదరిపువిపాల మునిజన హృదయలోల
వేణుగోపాల భక్త సంత్రాణ శీల.

అని వేణుగోపాల శతకకారుడు (38వ పద్యం) వాపోయాడు

నవీన ప్రజాస్వామ్యయుగంలో వివిధ రాజకీయపక్షాలు అధికారం కోసం యత్నిస్తున్నాయి భావస్వేచ్ఛ పెరిగింది కుటుంబ సభ్యులందరిదీ ఒకే ఆలోచన అని కూడా చెప్పలేం, ఎవరి అభిమానాలు వారివి ఎవరినీ కాదనడానికి వీల్లేదు ముఖ్యంగా ఎన్నికల సమయంలో భిన్న దృక్పథాలు మరింత స్పష్టంగా బయట పడుతుంటాయి

ఈ భిన్నత్వాన్ని వేణుగోపాల శతకకారుని మార్గంలో దాశరథి వ్యక్తీకరించి రక్తి కట్టించాడు

తండ్రి కాంగ్రెసువాది, తల్లి దేశమువాది
తనయుడు మార్క్సిస్టు తత్త్వవేత్త
కూతురు బీజేపి కోసము పోరాడు
అల్లుడు జనతాను అనుసరించు
నిన్నటి జాతీయ నేత నేడు విజాతి
సిద్ధాంతములు ప్రవచించసాగు
మొన్నటి ప్రాంతీయ మూర్తి ఈ రోజున
అఖిల భారతమని అలమటించు

ఓట్లకొరకయి ఎన్నియో పాట్లుపడిరి
నోట్లకట్టలు చూపి సంతోషపెట్టి
యెన్ని చేసినగాని ఓట్లిచ్చువారు
తమకు తోచిన దారినే తరలినారు 1

మాతృక రాచరిక వ్యవస్థ అమలులోనున్న కాలంలోనిది ఆనాడు రాజకీయ పక్షాలు లేవు భక్తి, ఆరాధనా విధానాలు, కులాల డామినేషన్ కన్నా రాజకీయ పక్షాల ప్రభావమధికమైన నేటి కాలంలో పేరడీ రాయబడింది. కనుక పేరడీలో రాజకీయ పక్షాలు చోటు చేసుకున్నాయి. చివరి రెండు పాదాలు మాతృకలో కేవల సంబోధన ఉంటే పేరడీలో కొసమెరుపు ఉంది ఎన్ని ప్రయత్నాలు చేసిన ఓట్లేసేవారు తెలివిమీరిపోయారు వారికిష్టమైన పక్షానికి ఓట్లేస్తారు కనుక భేదాభిప్రాయాలు, కోపతాపాలు అనవసరమన్న సందేశముంది

'ఇతిశ్రీ' రాసిన 'కుమతీశతకం'లో ఇంచుమించు సుమతీ శతకం పద్యాలన్నింటికి పేరడీలున్నాయి 'కేవలవినోద బుద్ధిన్ కావాలని వ్రాసినట్టి కావ్యము సుమ్మీ' అని గ్రంథాంతంలో పేర్కొనబడింది. సమాజంలోని ద్వంద్వ వైఖరులు, అసంగతాలు 'కుమతి'ని సంబోధిస్తూ హాస్య పూరితంగా అధిక్షేపాత్మకంగా చెప్పబడ్డాయి.

అధరము తడిసీ తడయక
మధురమ్మగు కాఫిఁజుర్రి మరి సిగరెట్టున్
ప్రథమముననె ముట్టించెడు
విధమేపో లైఫులోని విజ్ఞత కుమతీ! (5)

సమర్థించరాని అంశాన్ని సమర్థిస్తున్నట్లుగ చెప్పడం ఈ కుమతీ శతకంలో పాటించిన శిల్పం

బ్లేడును చూడని ముఖమును
బీడీ సిగరెట్ల కంపువీడని ముఖమున్
కోడిములు చెప్పు ముఖమును
బూడిద కిరవైన పాడు బొందిర కుమతీ! (102)

---

1. దాశరథి 'పొలిటిగేషన్' (ఒకే ఒక సీస పద్యం), హాస్య ప్రియ మాస పత్రిక, డిసెంబరు 1984.

లంచము పంచక తినకుము
కొంచెంబేనైన చేత గొనకుము సుమ్మీ
లంచంబు పట్టువారికి
కించిత్తుగ రాల్చుకున్న కీడగు కుమతీ (20)

అడిగిన ప్రశ్నలు చెప్పని
మిడిమేలపు టీచరులతొ మెలగుటకంటెన్
వడిగొని ట్యూషను పెట్టుక
బడి ప్యాసవవచ్చుగాదె వసుధను కుమతీ (3)

ఈ కోవలోనే తక్కిన పద్యాలు కూడ కొనసాగుతాయి

కుమతీ శతకంలోని పద్యాలేగాక, దీనికి రాసిన 'పీఠిక' గూడా పేరడీ ప్రాయమైందే ఒక అముద్రిత తాళపత్ర గ్రంథం దొరికినప్పుడు దాని వివరాలు తెలుపుతూ సాధారణంగా విమర్శకులు (భారతి పత్రికలో) రాసే వ్యాసాలను అనుకరిస్తూ రాయబడింది

కుమతీ శతకానికి రెండు తాళపత్రప్రతులు లభించాయట. వాటి ఒడ్డూ పొడుగులు ఇచ్చారు ఒక తాళపత్ర గ్రంథంలో పేర్కొన్న సంవత్సరానికి తిథికి క్రీ శ. 927 అక్టోబర్ 23 కు సరిపోతుంది అంటే నన్నయ్యకు పూర్వం కావ్యమని తేలుతుంది. ఈ కుమతీ శతకాన్ని ఆధారంగా తీసుకొని పేరడీగా సుమతీ శతకకారుడు తన శతకాన్ని ప్రకటించాడు పేరు స్పష్టంగా తెలియడంలేదు కుమతిని సంబోధించడం వల్ల అగస్త్యభ్రాతలాగ 'కుమతిపిత' అని చెప్పుకోవచ్చు బ్రాహ్మణులను, వైశ్యులను విమర్శించడం చేత ఈ కవి 'అబ్రాహ్మణవైశ్య' జాతికి చెందినవాడు ఒక పద్యంలో 'భిమలాపురం' అని ఉండడంచేత రచయిత బెంగాలీవాడు కావచ్చనీ, తెలుగు భాష తీయదనానికి మురిసిపోయి, నేర్చుకొని శతకం రాశాడనీ భావించవచ్చు లేదా ఆంధ్ర ప్రాంతంలో భీమలాపురం ఎక్కడో ఉండే ఉంటుంది కనుక గోదావరి తీరం వాడనీ తలపోయవచ్చు లేదా 'ఉరుకు' పరిగెత్తుట అనే అర్థంలో తెలంగాణ పదం ప్రయోగించడంవల్ల తెలంగాణా వాడే కావచ్చు

కొంత గ్రంథాన్ని ఇప్పటికే చెదలు తినేశాయి 'శ్వేతపిపీలికల నోటి ముందు నుండి బలత్కారంగా లాగికొన్న యీ తాళపత్ర గ్రంథాలని మన పని పూర్తియైన పిమ్మట తిరిగి వాటికే సమర్పించడం న్యాయ సమ్మతం అని తలచి మా మిత్రులు ఆ విధంగానే పాప పరిహారం (ప్రాయశ్చిత్తం) జేసు కొన్నారు '

ఈ గ్రంథాన్ని అనుసరించి అనేకమైన ప్రాచీన గ్రంథాలని ఇతోధికంగా అన్వేషించి ప్రచురించడానికి ఇంకా అనేకమంది ప్రయత్నించగలరనే విశ్వా సంతో శలవు అని 'ఇతిశ్రీ' 'మతిశ్రీ'శతకానికి రాసిన పీఠికలో పేర్కొన్నాడు.

ఈ విధంగా ఒక 'లేని' పుస్తకాన్ని 'వెనుకటికే' ఉన్నట్లుగా రాయడం అది నన్నయకి పూర్వముందనడం, సుమతీ శతకం దీనిని అనుసరించే రాయ బడిందనడం, తాళపత్ర ప్రతి చూసే అవకాశం లేకుండా చెదల కర్పించామనడం ఇదంతా హాస్య భాజనమే

ఈ కుమతీ శతకం 'ఇతిశ్రీ' నామంతో రాసిందెవరో కాదు- ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు

ఏఱకుమీ కసుగాయలు
దూఱకుమీ బంధుజనుల దురితము సుమ్మీ
పాఱకుమీ రణమందున
మీఱకుమీ గురువులాజ్ఞ మేదిని సుమతీ!

ఈ సుమతి పద్యానికి వచ్చిన అజ్ఞాతకర్తృకమైన ఒక పేరడీ చూడండి.

ఏఱకు మెంగిలి చుట్టలు
దూఱకు మంచాల క్రింద దురితము సుమ్మీ
పాఱకుమీ నట్టింటను
మీఱకుమీ ముండలాజ్ఞ మేదిని సుమతీ!

మాతృకలోని సొగసు, లయ, గొప్పదనం అంతా నాలుగు పాదాల్లోను '. కుమీ' అన్న వర్ణాలలో కేంద్రీకృతమైంది. దీనికి కారణం అక్షరపునరా వృత్తియే కాని పేరడిస్టు మొదటి పాదంలో సంధి చేయడంతోను, రెండవ పాదంలో ' మీ' వేయక పోవడంతో ఆ సొగసు తీసుకురావడంలో విఫల మయ్యాడు.

అప్పిచ్చువాడు, వైద్యుడు, ఎప్పుడూ పారే ఏరు, ద్విజుడు ఉన్న గ్రామానికి సుమతి శతకకర్త ప్రాముఖ్యమిస్తే శ్రీశ్రీ లాంటి ఆధునిక కవులు 'కాఫీదాతా సుఖీభవ' అని కాఫీ దాతలున్న గ్రామానికి ప్రాధాన్యమిస్తారు 1

ఇంకో కవి

అప్పుచ్చుల తోడ సుష్టుగ
ఎప్పుడు భోజనము పెట్టు ఇల్లో హొటలో
చొప్పడిన యూరనుండుము
చొప్పడకున్నట్టి యూరు చొరకుము సుమతీ 2

శ్రీశ్రీకి కాఫీ అవసరమయితే ఈ భోజన ప్రియునకు అప్పుచ్చులు అవసరమయ్యాయి ఎవరి అవసరాలు వారివి.

అక్కరకు రాని కారును
మ్రొక్కిన పెడజాచు బాసు, మోహరమున దా
నెక్కిన లేవని ప్లేనును
గ్రక్కున విడువంగవలయు గదరా సుమతీ 3

'చుట్టము', 'వేల్పు', 'గుఱ్ఱము' ఉండవలసిన చోట్లలో ఆంగ్లపదాలు వేసి నేటి కాలానికి అన్వయించాడీ అజ్ఞాతకవి కారు, ప్లేను ఉన్నత తరగతికి చెందినవి. మనకెందుకనుకొంటే ఇది చూడండి.

అక్కరకు రాని బస్సును
చక్కగ సినిమాకురాక సణగెడు భార్యన్
ఉక్కగ నుండెడు ఇంటిని
గ్రక్కున విడువంగ వలయు గదరా సుమతీ.4

ఇది బాగుంది గద!

---

1 ఈ సిద్ధాంత గ్రంథంలోనే పుట 120 చూడండి.

2&4. మునిమాణిక్యంవారు మన హాస్యం (1968) పుట 137 లో ఒక యువ కవి పద్యమని ఉదాహరించారు.

3. అజ్ఞాత కర్తృకం.

తినదగు నెవ్వరు పెట్టిన
తినినంతనె తేన్పులిడక స్థిమితపడదగున్
తిని రుచియు నరుచియు నెఱుగు
మనుజుడె సుఖభోజనుండు మహిలో సుమతీ 1

ఉత్తరార్ధంలో మధ్య మధ్య గురువులు లేకుండా వరుసగ లఘువులు రావడంతో నడక కుంటుపడింది. సర్వలఘుకందాల సంగతి వేరు. మాతృకలోని చతుర్థపాదంలో 'మనుజుడెపో' (నీతిపరుడు మహిలో సుమతీ!) అన్న పద బంధం ఆయువు పట్టులాంటిది. పేరడీకర్త (మనుజుడె) 'పో' అన్న దాన్ని గ్రహించక పోవడంతో మాతృకలోని సొగసు బిగువు పేరడీలోకి రాలేదు.

మామిడన్న సత్యనారాయణమూర్తి చెప్పిన ఈ ఆశు పేరడీ చూడండి:

తినదగు నెవ్వరు పెట్టిన
తిని నంతనె వెళ్ళిపోక తిని తిట్టదగున్
తిని తిట్టి వెళ్ళిపోయెడు
మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ!

మాతృకలోని సౌందర్యం పేరడీలోకి చక్కగా ప్రవహించింది

అరవదాని చీర ఆరుబారలునుండు
పార్సిపడతి చీర పదికి మించు
చీరగొప్పదైన శీలంబు గొప్పదా
విశ్వదాభిరామ వినురవేమ

అని ఒక అజ్ఞాతకవి తన శృంగార రసజ్ఞతకు వేమనను చాటు చేసుకొన్నాడు

ఆధునిక విద్యావ్యవస్థలో విద్యార్థి పెద్దపెద్ద చదువులు చదువుతాడు పెద్ద పెద్ద డిగ్రీలు పొందుతాడు. కాని పల్లెటూళ్ళో బావిపూడిక లెక్క సరిజేయమని నిరక్షరాస్యుడడిగితే నోరువెళ్ళబెట్టే ఇంజనీరు పట్టా గ్రహీతలున్నారు. వారిని జూచి కడుపు మండిన 'ఒకడు' ఇలా అంటాడు:

---

1 మునిమాణిక్యం వారు మనహాస్యం (1968) పుట 138 లో ఒక యువకవి పద్యాలని ఉదాహరించారు

ఇంజనీరు కోర్సు ఇంగిలీసునేర్చి
ఇంటి చుట్టు కొలత నీయలేడు
బట్టీ చదువుకంటె వట్టి చాకలిమేలు
విశ్వదాభిరామ వినురవేమ.

పులికొండ సుబ్బాచారి రాసిన పేరడీ పద్యాలు 'సాధన' పత్రికలో సీరియల్‌గా వచ్చాయి. ఎక్కువగా భాగవతం పద్యాలకు, కవి చౌడప్ప, సుమతి శతక పద్యాలకు సుబ్బాచారి పేరడీలు రాశాడు.

నీతులకేమి యొకింతక
బూతుండని ఫిల్ములిపుడు బోరందురుగా
ప్రీతిగ విటిని జూతురు
ఖ్యాతిగ నో కుందవరపు కవి చౌడప్పా[1]
పదిగీతులు పది బూతులు
పది రేపులు ఫైట్లు గల్గు భారీఫిల్మే
పదిలముగా ధనము గురియు
గదరప్పా కుందవరపు కవి చౌడప్పా[2]

అని చలనచిత్ర పరిశ్రమ పోషణకు మూలకందమైన హింస, సెక్స్, రేప్ ఫార్ములాను ఈయన అధిక్షేపిస్తాడు.

నీటి ఎద్దడిని గ్రహించి భాగవతపద్యం బాణీలో-
కలదందురు మంజీరలొ
కలదందురు గండిపేట కాలువలందున్
కలదందురు పంపులలొ
కలదు కలందనెడు నీరు కలదో లేదో[3]
పులికొండ సుబ్బాచారి చక్కని పేరడీ రాశాడు.

1,2 పేరడీ 'కందాలు' - సాధన మాసపత్రిక, ఆగస్టు 1989.
3 సాధన జనవరి 1986

ఆధునిక కాలంలో స్త్రీలు అన్ని రంగాల్లోను పురుషులను మించి రాణి స్తున్నారు పూర్వం ఎంతగా అణచివేయబడ్డారో నేడు అంతగా మహిళలు విజృంభిస్తున్నారు.

ఇంతింతై వధువింతయై గృహమునందింతై స్వయంవీధిలో
నంతై, గ్రామసభా విభాగమున కల్లంతై స్వతాలూకపై
నంతై మండలమంతయై మరియు తానాంధ్ర ప్రదేశమ్ముపై
నంతై భారతదేశమంతయయి బ్రహ్మాండాంత సంవర్ధియై

మగరాయండుపమింప భర్తయయి, క్షేమంబెన్ను నేస్తంబునై
సగమై పొన్నుకు రాత్రికే హితుడునై సామాన్యమౌ నౌకరై
పగలాడై నిజపాదదాసుడయి, అవ్యాజమ్ముగా బానిసై
పగవాడై నడపీనుగై, మహిళ తాబ్రహ్మాండమున్ నిండుచోన్.1

అని పోతనగారి మార్గంలో పాయల సత్యనారాయణ వామనావస్థలో నున్న స్త్రీలు త్రివిక్రమునిలాగ విజృంభించడాన్ని అక్షర కల్పన చేశాడు. ముళ్ళపూడి వేంకటరమణీయమైన పోతన భాగవత పద్యాల కొన్నింటికి ఋణాత్మక వ్యాఖ్యానం కధల్లో పేరడీ అధ్యాయంలో చూడవచ్చు గజేంద్రుడు ప్రాణావనార్థం ఆర్తారావం చేస్తే బంకుపల్లి పార్వతీశ్వర శాస్త్రి ఋణం కోసం ఋణార్తారావం చేశాడు

ఎవ్వనిచే జనించు ధనమెవ్వనిగీమున నుండు పైడియై
ఎవ్వనియందుడిందు కరువేశ్వరుడెవ్వడు? మూల బొక్కసం
బెవ్వ డనాద మధ్యలయుడెవ్వడు? పైకము తానెయైనవా
డెవ్వడు? వాని నర్థవు నీశ్వరునేను ఋణంబు వేడెదన్ 2

కాని ఈ పేరడీలో 'కరుదేశ్వరు'డనడం వల్ల కర్ణపేయత్వం దెబ్బతింది

1. ఆంధ్రజ్యోతి వారపత్రిక 15-1-1988
2 ,, 23-4-1982

ఇందిరమ్మ గుట్టు ఎరుగుట కష్టంబు
ధాతకైన వాని తాతకైన
విబుధజనుల వలన విన్నంత కన్నంత
తెలియ వచ్చినంత తేటపరుత.

అని గజ్జెల మల్లారెడ్డి ఒకసారి చెప్పాడు. 1

వెలుదండ నిత్యానందరావు భాగవతం పద్యాలను ఆధునిక రాజకీయాలకు అన్వయించి రాసిన పేరడీలు ఆంధ్రప్రభ దినపత్రికలో కార్టూన్‌లతో సీరియల్‌గా పక్షం రోజులకు పైగా వచ్చాయి

ఇందుగలదందు లేదని
సందియము వలదవినీతి సర్వోపగతం
బెందెందు వెదికి చూచిన
నందందే గలదు ఇందిరా కాంగ్రెసునన్2

అని సూటిగా చెప్పాడు. అట్లాగే 'వారిజాక్షులందు వైవాహికములందు' అనే భాగవత పద్యానికి-

పదవి వచ్చువేళ, పదవి పోయెడు వేళ
ప్రాణమైన పదవి భంగమందు
కూడబెట్టినట్టి 'కోట్ల' రక్షణమందు
బొంకవచ్చు నఘము పొందదధిప!3

అని పేరడీ చేశాడు. కానీ పదవి పోయెడువేళ, పదవిభంగమందు అనడంలో నిత్యానందరావు భావపునరుక్తి దోషానికి పాల్పడ్డాడు

చేతులార రాజీవు పూజింపడేని
నోరు నొవ్వ నిందిరకీర్తి నుడువడేని
కోట్లధనమును పదవియు కోరడేని
సీటు నేటికి వానిక సెంబ్లియందు 4

---

1. ఈనాడు 22-8-82
2, 3, 4 ఆంధ్రప్రభ దినపత్రిక 18, 17, 21 డిసెంబరు 1982

కవితా వాసన గలిగిన ఒక కామార్తుడు తీవ్ర విరహానల దగ్ధమానసుడై తన ప్రేయసిని, అభినవ వరూధినిని ఇలా వేడుకొంటున్నాడు:

ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ! వొంటిచరించెదురోడ్డు పైన నే
నత్తిలి కాపురస్థుడను నామలకుండను త్రోవదప్పితిన్
నెచ్చెలి నన్ను జూచి కరుణించి తదీయ గృహంబుజేర్చి నీ
వెచ్చని కౌగిలిన్ వలపు హెచ్చగ పచ్చడి చెయునన్నికన్.[1]

'రోడ్డు' పైన కలిసిన రమణిని కౌగిలితో తరింపజేయమనకుండ పచ్చడి చేయమనడం రచయిత హాస్యదృష్టిని తెలుపుతుంది మదన తాపంతో వేగిపోతున్న వానికి ప్రేయసి మీదనే చిత్తం ఏకాగ్రమవుతుంది కాని ప్రాసభంగం, చతుర్థ పాదంలో యతిదోషం వాటిల్లిందన్న సంగతి ఎలా స్ఫురిస్తుంది? లాక్షణికులు సైతం సానుభూతితో మినహాయింపు ఇచ్చారనుకోండి

ఆనాడు శ్రీనాథుడు పలనాటి సీమకు వెళ్ళి గుక్కెడు నీళ్ళకోసం పడరాని పాట్లుపడి శివుని గంగ విడువమని ప్రార్థించిన వైనం అందరికీ తెలిసిందే. ఆ పద్యాన్ని గ్రైకొని నవీన విద్యా వ్యవస్థలోని ధన ప్రాధాన్యాన్ని తొలగించమని ప్రార్థిస్తున్నాడొక పేరడీకర్త:

సిరిగలవానికి జెల్లును
విరివిగ ధనమిచ్చి వివిధ విద్యలు బడయన్
తరమా సామాన్యులకది
పరమేశా! దీనిదిద్ద పరుగున రావే.[2]

పేరడీతో కేవలం హాస్యమే కాకుండా సామాజిక ప్రయోజనాన్ని కూడ అభిలషిస్తున్నాడు రచయిత

ఇలా ఎన్నింటినో పేర్కొనవచ్చు భాగవతం పద్యాలలోని శ్రవణ సుభగత్వం ధారణానుకూల శిల్పం, సుమతి, వేమన కవిచౌడప్ప శతకాల్లోని సామాజికాంశాలపై దృష్టి, హాస్యదృష్టి పేరడీల రచయితలను బాగా ఆకట్టుకొన్నాయి అందువల్లనే ఇతర రచనలకన్నా ఎక్కువగా భాగవతం, శతక పద్యాలను రచయితలు ఆదరించి పేరడీలు కట్టి ఆనందించారు

---

1 అజ్ఞాత కర్తృకం - మునిమాణిక్యం 'మన హాస్యం'లో ఉల్లేఖితం.
2 అజ్ఞాత కర్తృకం

# 16. ప్రసిద్ధ కవితలకు అప్రసిద్ధ పేరడీలు

అడపా దడపా ఒకటీ అరా పేరడీలు రాసినవారెందరో ఉన్నారు వారిలో సుప్రసిద్ధులూ అప్రసిద్ధులూ ఉన్నారు ప్రముఖుల పేరడీ గీతాలను ఆయా అధ్యాయాల్లో వివరించవైంది మిగిలినవి సంగ్రహంగా ఇక్కడ పరామర్శిద్దాం.

## ఏ దేశమేగినా...

రాయప్రోలు సుబ్బారావు రచనలన్నీ ఒక ఎత్తు. ఆయన రచించిన 'జన్మభూమి'[1] ఖండిక ఒక్కటీ ఒక ఎత్తు

ఏ దేశమేగినా ఎందుకాలిడిన
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనిన
పొగడరా నీ తల్లి భూమిభారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము

తెలుగుదనం, జాతీయాభిమానం, గతవైభవ సంకీర్తనం, ప్రబోధం ఈ గేయంలో వెల్లువలై ప్రవహించాయి రాయప్రోలు 'జన్మభూమి' ఖండిక ప్రాస నిబంధనలేని మంజరీ ద్విపద గణదృష్టితో కాకుండా గతిదృష్టితో సమాన మాత్రాప్రమాణం; అక్షరసమత్వం (Syllabic Similarity) తో కూడి సమ్యక్ సంతులనంతో నడిచిన ద్విపద ఇది. యతికాని, అంత్య ప్రాసగాని విధిగా వున్నాయి ఈ ఖండిక నేటికీ ఉత్తమ దేశభక్తి ప్రబోధగేయంగా మన్ననల నందుకొంటున్నది

ద్వాదశి వాగేశ్వరశాస్త్రి (ద్వా నా శాస్త్రిగా ప్రసిద్ధులు) ఆ ఖండికను కాలేజీలలోని 'లేడీ' విద్యార్థుల కన్వయించి అధిక్షేపాత్మకంగా పేరడీ రాశాడు.[2]

---

1 ఆంధ్రావళి - పుటలు 20 - 24

2 సమాధిలో స్వగతాలు, పుట. 79.

మాతృకను సంపూర్ణంగా పేరడీ చేయలేదు కొన్ని పాదాలు వదిలేశాడు.

ఏ కాలేజికేగినా ఎందుకాలిడినా
ఏ మేష్టరొచ్చినా ఎవ్వరేమనినా
చెయ్యరా అల్లరి నిర్భయముగాను
నిలుపరా నీ జాతి వానరత్వమును
ఏ పూర్వపాపమో, ఏ రోగబలమో
జనియించినాడవీ విద్యార్థిగాను
ఏ మంచి పూవులన్ త్రుంచెసినావో
నినుమోచె వాగ్దేవి దుఃఖభారమున
లేరురా నీవంటి 'విద్యార్థు' లింకెందు.

-ఇలా సాగిపోతుంది

పేరడీలోని విషయాంతరం సుబోధకమే వర్తమాన విద్యార్థుల ఆకతాయి తనాన్ని, క్రమశిక్షణా రాహిత్యాన్ని రచయిత అధిక్షేపిస్తున్నాడు మాతృకలాగ అన్నిచోట్ల మంజరీ ద్విపదగా సాగలేదు. అసలు పేరడీ రచయిత ఛందస్సును పాటించాలన్న నియమం పెట్టుకోలేదని మొదటి పాదమే తెలుపుతుంది కేవలం రాయప్రోలు రచనలోని లయను, పదబంధాల్ని స్వీకరించి పేరడీ చేశాడు. అయినా మంజరీ ద్విపద గేయానికి దగ్గరైనది కావడంవల్ల యాదృచ్ఛికంగా కొన్ని పాదాల్లో మంజరీ ద్విపద అయింది కొన్నింటిలో కాలేదు అట్లాగే యతి, అంత్యప్రాసలు కూడ.

మూలాతిక్రమణం చేసి రెండు పంక్తులు అధికంగా చేర్చాడు

కూయరా క్లాసులో ధైర్యంబుగాను
పాడరా డ్యూయెట్లు పబ్లిక్కుగాను

-తర్వాత జన్మభూమిలోని కొన్ని పంక్తులను పేరడీకరించలేదు.

అవమానమేలరా! అనుమానమేల
భారతీయుడనంచు భక్తితోపాడ
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండు గర్వంబు.

-ఇవి రాయప్రోలు గేయంలోని చివరి పంక్తులు. ఇక్కడ రాయప్రోలు మంజరీ ద్విపదను విధిగా పాటించదలిచాడు. కనుక ఇలా రాశాడు. లేకుంటే-

అవమానమేలరా! అనుమానమేల(రా)
భారతీయుడనంచు భక్తితో పాడ(రా)

అని తుమ్మున్నర్థకంలో కాకుండా విధ్యర్థకంలోనే రాసేవాడనిపిస్తుంది.

అవమానమేలరా? అనుమానమేల
లేజీ విద్యార్థివై కాలేజిలో కులుక
పొగడరా పొద్దంత అభిమానహీరోని
నిలుపరా 'నీ కలాపోసనల్' జగతి.

విద్యాలయాలు విద్యను లయంచేసే కేంద్రాలుగా మారిన దుస్థితిని చిత్రించి ద్వానాశాస్త్రి పేరడీకి ఒక సాంఘిక ప్రయోజనాన్ని కూడ సమకూర్చిపెట్టాడు.

ఎస్వీ సత్యనారాయణ రాయప్రోలు గేయానికి వేసిన వికటత్వం తీవ్ర స్థాయిలో కొనసాగింది [1]

ఏ దొంగలేలినా ఏ దుష్టలేలినా
ఏ తుచ్ఛులేలినా ఏ లుచ్ఛులేలినా
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలపరా నీ జాతి నిలువుదోపిడీని

అంటూ శీలభ్రష్టమైన నాయకత్వాన్ని తెగనాడాడు

ఏ పిరికి పూవులను ప్రేమించినావో
నినుమోచె ఈ తల్లి మురికి గర్భమున

అన్న పట్టున పూవులందు పిరికితనాన్ని ఆరోపించడం గమనార్హమైన ప్రయోగం. ఎంతవరకు తగునో ఆలోచించాలి

అవమానమేలరా? అనుమానమేలరా?
పిరికి పుత్రుడనంచు ప్రీతితో బలుక
ఉత్తరుని వారసుడ ఉన్నదే పలుక

1 ఉద్యమం - పుట 23

అని జాతి నిర్వీర్యంగా 'వొట్టిగొప్పల'తో కాలం వెళ్ళబుచ్చుతుందన్న ఆవేదన, ఆవేశం, అధిక్షేపం ఈ గేయంలో ఎస్వీ ప్రస్ఫుటీకరించాడు.

ఈ మధ్య 'అకవులు' కొందరు రాజకీయ పరంగా 'ఖర్మభూమి' పేరుతో జన్మభూమిని పేరడీ చేశారు 1

ఏ దేశమెళ్ళినా ఏ వేదిక దొరికినా
ఏ రాష్ట్రమెళ్ళినా ఎవ్వరెదురయినా
పొగడరా అల్పిష్టి అధినాయకుడిని
తెగడరా ప్రతిపక్ష ప్రత్యర్థిని
... .. ... ..
లేడురా ఇటువంటి అధినాయకుడెందు
లేరురా మనవంటి చవటలింకెందు
జై జై నినాదాలు వుండునందాక
జెండాల పీలికలు ఎగురునందాక
లేడురా ఇటువంటి అధమాధమ నాయకుడు ఎందు
లేరురా మనవంటి భట్రాజు వెధవలింకెందు
.. . .. .
. ... .. ...

"ఇది రాయప్రోలు 'జన్మభూమి'కి అనుకరణం కాదు. ఇది దేశభక్తి ప్రబోధక మైన గేయం కాదు పాఠకులు పాడుకొని పరవశించడానికి కాదు. కేవలం చదువుకొని చెడిపోవడానికి మాత్రమే ఉద్దేశించింది', అని రచయితలు పేర్కొన్నారు

గురజాడ దేశభక్తి గీతానికి జొన్నవిత్తుల ఒక్కడే పేరడీ రాయలేదు పులికొండ సుబ్బాచారి 'తెలుగు దేశానికి' అన్వయించి పేరడీ చెప్పాడు

---

1 ఆంధ్రజ్యోతి వారపత్రిక 18-8-1989

దేశమును ప్రేమించుమన్నా
పచ్చ చొక్కా తొడుగుమన్నా
వట్టి చొక్కాల్ విడిచిపెట్టోయ్
పచ్చ రంగున ముంచి కట్టోయ్
'దేశ'మనియెడి 'తెలుగు' వృక్షం
తెలుగులను పూలెత్తవలెనోయ్
'తెలుగు' గంగను తడిసి మూలం
'తెలుగు' పంటలు పండవలెనోయ్!

ఎన్. టి రామారావు పాలనకాలంలో తలెత్తిన 'తెలుగు' పైత్యాన్ని ఈ పేరడీలో సుబ్బాచారి ఈ అధిక్షేపించాడు. సముచితమా? కాదా? అని ఆలోచన లేకుండా కనిపించిన ప్రతిదానికి 'తెలుగు' అని ఉపబంధం చేర్చడం ఆ రోజుల్లో 'ఫ్యాషన్' అయిపోయింది. అది చాల మందికి వెగటు కలిగించింది. అందుకే సుబ్బాచారి తెలుగు వృక్షం, తెలుగు పూలు, తెలుగు గంగ, తెలుగు పంట అని మాటిమాటికి తెలుగును ప్రయోగించడం ద్వారా పేరడీకి ఒక సార్థకతను చేకూర్చాడు

ఆరుద్ర పేరడీలెన్నో పాత ఆనందవాణి, ఢంకా, చిత్రగుప్త సంచికల్లో ఉన్నాయని ప్రతీతి. ఆ పత్రికలు నేడు అలభ్యం కావడంవల్ల చాలావరకు దొరకలేదు శ్రీశ్రీ తన 'ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమ సమూహములు' గేయానికి ఆయనే పేరడీ రాసుకొన్న సంగతి తెలుసు. ఈ గేయానికి ఆరుద్ర చొప్పకట్ల చంద్రమౌళి, అబ్బూరి రాష్ట్ర శాసన సభ ఎన్నికలకు అన్వయిస్తు పేరడీలు రాశారు

ఏవితల్లీ నిరుడు మండిన
ఎండు తాటాకుల్

దుర్గభాయీ భస్మరాణీ
భీకరాన న స్వీకరేది?
లోకైక లీడరు రైతురంగా
బూకరింపుల బాకు లెక్కడ
ఎన్నికల నోరును తెరిచి కాలం

ఎందరనో కబళించెనమ్మా
ఏడతల్లీ నిరుడు కురిసిన
వడగళ్ళ గడబిడలు

అని ఆరుద్ర 1955 సంవత్సరం ఎన్నికల్లో ఓడి కనుమరుగయిన నాయకులను పేర్కొన్నాడు చొప్పకట్ల చంద్రమౌళి 1972 ఎన్నికలకు అన్వయించి

ఆసెంబ్లీలో నిరుడు నిలుచుని
హాలు గడగడలాడు స్వరమున
లోపముల పైకెత్తి చూపిన
లోక సేవకులేరి తల్లీ[1]
అని ప్రశ్నించాడు

1988 లో తెలుగుదేశం పార్టీ ప్రభుత్వం పతనమైన సందర్భంలో 'అబ్బూరి' (వరదరాజేశ్వరరావు?) రాసిన పేరడీ గమనిద్దాం.

నందమూరి రామరాయని
నినద భీషణ శంఖమెక్కడ
నెత్తికెక్కిన అహంభావపు
బజారు భాషల వక్తలేరీ
ఏవి తల్లీ నిరుడు విరిసిన
తెలుగు చోద్యాలు?

తెలుగు నేతల జాతిపితల
కోతిమూకల తోకలెక్కడ
పచ్చకార్డులు విసిరికాలం
పారిపోయిన జాడలేవీ

1 ఆంధ్రభూమి దినపత్రిక 16-3-1972

ఏవి తల్లీ నిరుడు విరిసిన
తెలుగు చోద్యాలు[1]

ఆరుద్ర అబ్బూరిల గేయాల్లో ఉన్నంత లయాత్మకత చంద్రమౌళి కవితలో కనిపించదు.

శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాలు తెలుగులో అభ్యుదయ కవితా శాఖకు బీజావాపం చేశాయి. తెలుగు కవిత్వగతినే సమూలంగా మార్చివేశాయి పేరడీ కర్తలను కూడ ఆ గీతాలు బాగా ఆకర్షించడంలో ఆశ్చర్యపోవలసిందేమీలేదు. మహాప్రస్థాన గీతాలకు వచ్చినన్ని పేరడీలు మరి దేనికీ రాలేదు ఆ గీతాల్లో ఉండే ఝటితి స్ఫూర్తి, పద గుంఫనం, ఆ వేగం దీనికి కారణం. శ్రీశ్రీ నామాంకిత కవి శ్రీరంగ శ్రీనివాస కవి రచించిన మహాప్రస్థానం గీతాలకు పేరడీలుగా కవితాజ్వాల శ్రీ 'కాట్రగడ్డ' 'మహోగ్రతాపం' గీతాలు వెలువరించి, శ్రీశ్రీకి అభిమానాంకితం చేశాడు ఇంచుమించుగా మహాప్రస్థానం గీతాలన్నింటిని పేరడీ చేశాడు శ్రీశ్రీ గీతాలలోని శబ్ద గుంఫనాన్ని, వేగాన్ని పేరడీలోకి తీసుకొని రావడానికి కాట్రగడ్డ చిత్తశుద్ధితో యథాశక్తిగా యత్నించాడు.

ప్రపంచమొక పద్మవ్యూహం
కవిత్వమొక తీరని దాహం-గా

తలపోసిన మహాకవి మార్గంలో-

జీవితమే ఊహల ఊయల
జన్మంతా కూసే కోయిల (మహోగ్రతాపం పుట 39)

గా, పేరడీకారుడు భావించాడు

గిరులు
సాగరులు
కంకేళికా మంజరులు
ఝరులు నా సహోదరులు-

1 28-11-1989 ఆంధ్రభూమి దినపత్రిక

అని శ్రీశ్రీ ఊహిస్తే
ప్రయాణ బత్తాలు
ఎడ్వాన్సులు, ఎరియర్లు
మందు బిల్లులు నా సహచరులు (పుట 25)

అని ఒక మధ్య తరగతి సంసారి చాలీచాలని జీతాన్ని జీవితాదాయాన్ని, జైత్ర యాత్ర రూపాన్ని కాట్రగడ్డ తన పేరడీలో అభివర్ణించాడు.

కదిలేదీ కదిలించేదీ
మారేదీ మార్పించేదీ
పాడేదీ పాడించేదీ
మునుముందుకు సాగించేదీ
పెనునిద్దుర వదిలించేదీ
పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ
కావాలోయ్ నవకవనానికి

అని శ్రీశ్రీ 'నవకవితా' స్వరూపానికి లక్షణ నిర్దేశం గావించాడు నవకవిత పరితల్లో చైతన్య జ్యోతుల్ని వెలిగించి, తమస్సు తొలగించి, పరిపూర్ణత్వం వైపుగా పయనించడానికి ప్రేరణ కావాలని శ్రీశ్రీ ఆశించాడు. కవిత్వం ఉత్తమత్వానికీ ఉన్నతత్వానికీ వాహిక కావాలన్న శ్రీశ్రీ ఆకాంక్ష 'నవకవిత' గేయమంతటా వ్యక్తమైంది - కాట్రగడ్డ కవిబలం' శీర్షికతో శ్రీశ్రీ 'నవకవిత' ను పేరడీ చేశాడు.

పిలిచేదీ పిలిపించేదీ
చేరేదీ చేర్పించెదీ
ఆడేదీ ఆడించేదీ
బిరుదాలకు బదులిచ్చేదీ
కవిమతమున కలిసొచ్చేదీ
కవితేనోయ్ నవీన కవులకు (పుట 14)

అని సాహిత్య దృక్పధం కన్నా వర్గ దృక్పథానికీ, నిష్పక్షపాత విమర్శక మండలికన్నా భజన సంఘాలకూ ప్రాధాన్యమిచ్చి, రకరకాల వర్గాలుగా కవులు చీలిపోవడాన్ని పేరడీలో కాట్రగడ్డ అక్షరబద్ధం చేశాడు అడుగడుగున మందు

విందు, పొందు (డబ్బులిచ్చి) సన్మానాలు, శ్రోతలుగా శిష్యబృందం; అరిచేందుకు గొంతు, మైకు నవీన కవులకు కావాలట

దినపత్రిక దిక్కుల వ్రాతలు
దీవించే సంపాదక నేతలు
అర్థానికి అకాడమీ దాతలు
పలుభాషల ప్రచురణ కర్తలు
కౌగిలి కోరే కృతిభర్తలు
కృత్రిమ సంఘం, కుంటి నడకలు
కావాలోయ్ నవీన కవులకు (పుట 14)

శ్రీశ్రీ కవితలన్నింటికి పేరడీ చేశాడు కానీ చాలచోట్ల శ్రీశ్రీని అనుకరించడంలో ఈయన విఫలమయ్యాడు శ్రీశ్రీ రచనలో సాధారణంగా ఉండే వేగాన్ని అందుకోలేకపోయాడు

ఏ పాప పైట జారినా
ఏ కాంతుడు ఏమి జేయునో?
పాపల పవిత్రక్షేత్రం
పడుపు వృత్తి పూజాసత్రం (పుట 41)

అని శ్రీశ్రీ 'దేశచరిత్రల గీతాన్ని పేరడీ చేశాడు మాతృక నిర్మాణానికి భిన్నమైన మార్గంలో పేరడీ వెళ్ళిందని చూడగానే తెలిసిపోతుంది.

ఏ దేశ చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం

అన్న శ్రీశ్రీ గేయంలోని 'ఏమున్నది గర్వకారణం'; అన్నపాదం 'సమస్తం' అన్న పదం పేరడీలోకి తప్పనిసరి తీసుకొని వచ్చినపుడే- పేరడీగా విజయవంత మవుతుంది. మాతృకలో ప్రశ్న, జవాబు ఉంటే. పేరడీలో సందేహార్థకం, సమాధానం చోటు చేసుకొన్నాయి

ఏ పడకను ఎందుకు వేసిరో
ఏ గడపకు సూత్రముంతునో?
నిమిషాలు పరుషాలు
నిష్ఫలితుల జీవితం వ్యర్థం! (పుట 44)

ఇక్కడ మూలాన్ని అనుకరించడంలో విఫలమయ్యాడు

ఏ యుద్ధం ఎందుకు జరిగెనో?
ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో?
తారీఖులు దస్తావేజులు
ఇవి కాదోయ్ చరిత్రకర్థం

పేరడీలో పూర్వార్థ భాగం మాతృకను చక్కగానే అనుకరించింది. చివరి పాదంలో 'ఇవి కాదోయ్ చరిత్రకర్థం' అని అంతే చెప్పాడు కాని, మరె ట్లుండాలో మాత్రం శ్రీశ్రీ చెప్పలేదు (అదంతా తర్వాత పాదాల్లో వస్తుంది.) పేరడీకర్త కూడ అలాగే 'ఇవి కాదోయ్ పాపలకర్థం' ఇత్యాదిగా రాయాలి కాని, 'నిష్ఫలితుల జీవితంవ్యర్థం' అని వాచ్యంగా నిర్ధారణాత్మకంగా చెప్పడంతో మూలంలోని నిర్మాణం పేరడీలో లేకుండా పోయింది

శ్రీశ్రీలో ప్రవాహ సదృశవేగం ఎంతగా ఉన్నా వస్తువుకు ఏకసూత్రతకు భంగం కలుగలేదు కాని కాట్రగడ్డ పేరడీల్లో ఏకసూత్రత, భావధార లోపిం చాయి ముఖ్యంగా 'కవితా ఓ కవితా' గేయానికి చేసిన పేరడీ గేయంలో ఈ లోపాలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. 'సెక్సైస్ సివిక్సైస్' (పుట 43) అనడంలోను ఉత్పత్త్యోత్సవం (పుట 30) లాంటి పదప్రయోగాల్లోను తడబాట్లు కనిపిస్తాయి

సరుల ప్రపంచపు నవ ప్రాణం
నడుము నూపుతూ నిలిచింది (పుట 24)

ప్రాణం నడుము నూపడమేమిటి అన్న సందేహం తలెత్తక మానదు.

జరుక్‌శాస్త్రి అయినా, మాచిరాజు అయినా, మరెవరైనా ఒకటీ రెండు శ్రీశ్రీ కవితలకు పేరడీలు రాసినవారే కానీ, మహాప్రస్థానం గీతాలన్నింటికి పేరడీలు రాయలేదు. ఆ ఖ్యాతి కాట్రగడ్డకు తొలిసారిగా దక్కుతుంది. శ్రీశ్రీ కవితలకు వచ్చిన మరికొన్ని పేరడీలను పరామర్శిద్దాం

నాగుపాము/కర్రసాము/పిల్లమోమూ-
సిల్లీగా చూడకు దేన్నీ
సిన్మామయమేనోయ్

అని విద్యారణ్య కామ్లేకర్ శ్రీశ్రీ ఋక్కులను 'సినిమామయం'[1] చేసి

పరిశ్ర మొక చక్రవ్యూహం
ఎక్స్ట్రా దొరక దిగంబరదేహం

అని సెలవిస్తున్నాడు

వి వి సుబ్బారావు పెగహేప్ష్ కల్తీ జాడ్యాన్ని కళ్ళకు కట్టినట్లుగా చిత్రీకరిస్తున్నాడు.[2]

పాలసీసా, నేతిడబ్బా, మందుబిళ్ళా
నిఖార్సుగా చూడకు దేన్నీ
కల్తీమయమేనోయ్ అన్నీ

'కళ్ళంటూ ఉంటే చూసి వాక్కుంటే వ్రాసి' ప్రజల దృష్టికి కల్తీని తీసుకొని వచ్చే ఆలోచన చేయకుండా-

కళ్ళూడేదాక చూడు
కాళ్ళరిగేదాక తిరుగు
వ్యాపారమొక పద్మవ్యూహం
కల్తీ ఒక తీరని దాహం

అని వి వి సుబ్బారావు శ్రీశ్రీ కవిత్వాన్ని 'కల్తీమయం' చేశాడు

ఇంకా గూటూరి బస్సు ప్రయాణాలలోని 'చిక్కుల'[3]ను వివరిస్తూ-

తౌడు బస్తాలు
అరటి గెలలు

---

1 ఆంధ్రజ్యోతి వారపత్రిక 19-3-1982
2. ఆంధ్రజ్యోతి వారపత్రిక 9-3-1984
3. ఆంధ్రజ్యోతి వారపత్రిక 21 6-1985

ఆవకాయ జాడీలు
కావేరీ రవాణా కనర్థం
అవునౌను లగేజీ ముఖ్యం

అని చెప్తున్నాడు రాపోలు సుదర్శన్ కూడ ఈ గేయానికే '(అ)రాజకీయ బుక్కులు'[1] అనేపేర పేరడీ చేశాడు

మాచిరాజు దేవీప్రసాద్ శ్రీశ్రీ 'దేశచరిత్రల'ను 'రహదార్లు'గా వికటీకరించిన విషయం తెలిసిందే జాగర్లపూడి సత్యనారాయణ కూడ 'దేశచరిత్రలు'[2] అక్షరబద్ధం చేస్తూ -

ఇతరేతర శక్తులు లేస్తే/పడిపోవును పేకమేడలై
వేషాలతో మోసాల్ చెసీ/సినిమా డైలాగులు చేప్తే
ఓట్లు పడే రోజులు పోయాయ్/సినీబ్రైపు మాయాజాలం
ఇంకానా, ఇకపై సాగదు

అని హెచ్చరిస్తున్నాడు

ధనముంటే జరగని పని
భారతమంతా వెదికిన దొరకదు
గతమంతా గడిచే, 'ట్రిక్కు'లతో
కాకుంటే వాగ్దానాలతో

అని కూడా భావిస్తున్నాడు.

పురాణం సుబ్రహ్మణ్య శర్మ పురాణం సీత పేరుతో రాసిన 'జలతరంగిణి' నవలలో ప్రసక్తంగా ఓ పేరడీ వస్తుంది.

ఏ సినిమా చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం
ఈ సినిమాల చరిత్ర సమస్తం
ప్రొడ్యూసర్లను కాల్చుకు తినటం

---

1 పల్లకి వారపత్రిక 21-12-89
2. ఉదయం వారపత్రిక 30-3-1989

మూలంలో నరజాతి చరిత్ర సమస్తం/దరిద్రులను కాల్చుక తినడం అని విడివిడి పదాలున్నట్లే ఇక్కడ ప్రౌఢ్యూసర్లను కాల్చుక తినడం అని వ్యస్తంగా మాతృకానుసారంగా నడిచింది

ఒక పిక్చర్ నింకొక పిక్చర్ - ఒక యాక్టర్ నింకొక యాక్టర్
పీడించే సినీధర్మం - ఇంకానా? ఇకపైసాగదు
ఏ సినిమా ఎందుకు తీసిరో - ఏ పిక్చర్ ఎన్నాళ్ళుందో
జయలలితా జ్యోతిర్లక్ష్మి - ఇవికావోయ్ సినిమాల్సారం

చిత్రసీమ నాగరికతలో - ఎకస్ట్రాల జీవనమెట్టిది?
చలన చిత్ర నిర్మాణానికి సిగ్గొదిలిన శ్రీమంతులెందరు?
సినీ ప్రపంచం పద్మవ్యూహం
సినిమా ఒక తీరని దాహం [1]

అని పురాణం చలన చిత్రరంగంలో సాగే దోపిడీని నిర్ద్వంద్వంగా బయట పెట్టాడు.

భూతాన్ని/యజ్ఞోపవీతాన్ని
వైప్లవ్య గీతాన్ని నేను

అని సాగే శ్రీశ్రీ ప్రసిద్ధ గీతాన్ని అనుసరిస్తూ ప్రసేన్ 'సినిమాటో బయోగ్రఫీ' రచించాడు

బూతుని/కామోద్రేకాన్ని
గుప్తాంగ విన్యాసాన్ని నేను
డోలు వాయిస్తే విప్లవం
కాలు జాడిస్తే నర్తనం
వలువ వేదికమీద వస్త్రసన్యాసం

చలనచిత్రాల్లో పెరిగిపోతున్న సెక్స్ ధోరణులను ఖండిస్తూ సామాజిక ప్రయోజనాన్ని పేరడీకి కలిగిస్తున్నాడు సినిమా స్క్రీన్‌ను 'వలువవేదిక' అని తెనిగించడం హృద్యంగా ఉంది

1 జలతరంగిణి - పుట 145.

స్తనాలు/విదిలించిన జఘనాలు
వళీ ఆవళులు నా పెట్టుబడులు
నా ఊహ రతీదేవి జోల
కామకేళీ హేల
నా గానం జంబల్ ఊళ

శరీర భాగాలను పెట్టుబడిగా పెట్టి విచ్చలవిడిగా ప్రదర్శిస్తూ యువతీ యువకుల్లో అవాంఛనీయమైన కామప్రకోపాలకు హేతువవుతున్న తారలపై తీవ్రకశాఘాతం ఈ పేరడీ—

కామాంధులు
మోహావేశులు కామకేళికి వీక్షకులు
రిరంసువులు నా ప్రేక్షకులు
నేనొక అశుద్ధం
నా దొక దుర్గంధం
అసహ్యం అశ్లీలం నా మార్గం[1]

ప్రసేన్ రాసిన ఈ పేరడీ గీతంలో 'వినోదాత్మక'తను మించి గాంభీర్యం చోటుచేసుకుందేమోనన్న అనుమానం కూడ కలగకమానదు

- ఇవేమిటీ వింత పరిస్థితులు/ - పార్టీలో కుమ్ములాట
- ఇవేమిటా రణగొణ ధ్వనులు/ - ఫిరాయింపులు
- ఆవేమిటా గుసగుసలు/ - పదవీ వ్యామోహదాహం
- ఎచటికి పోతావీ రాత్రి/ అవతల పార్టీకి

అని బి విజయశేఖర్ శ్రీశ్రీ 'అవతలిగట్టు'ను 'అవతలిపార్టీ'[2] కన్వయించాడు. అండా రామారావు కూడ 'అవతలిపార్టీ'[3] పేరుతోనే మరో పేరడీ చేశాడు

---

1 ఆంధ్రప్రభ వారపత్రిక 9-7-1986
2 'అంకితం' సాహిత్య మాసపత్రిక మార్చి 1985.
3. ఆంధ్రజ్యోతి వారపత్రిక 7-1-1983.

మరో కంచం/మరోలంచం/మరో మంచం పిలిచిందీ
పదండి విందుకు/పదండి కాసుకు/పోదాంపోదాం పదవుల్లోకి
కాళ్ళు మొక్కుతూ/కథల్ చెప్పుతూ పదవికోసం సిగ్గువిడుస్తూ
ఎత్తు లేద్దాం చిత్తుచేద్దాం కనబడలేదా
తరతరాల పదవి పిశాచం

అని కమలారాం 'మరోపిశాచం'[1] శీర్షికతో శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాన్ని అనుకరించింది. ఒక పానప్రియుడు ఒకే ఒక అక్షరం మార్చివేసి అర్థాన్ని ఆధ్వాన్నపు అడవిలో వదిలిపెట్టాడు:

మరో ప్రపంచం / మరో ప్రపంచం / మరో ప్రపంచం పిలిచింది
పదండి ముందుకు / పదండి ముందుకు
పదండి డోసుకు

ప్రతి తల్లి తన బిడ్డకు అన్నం పెడ్తూనో, బిడ్డను లాలిస్తూనో 'చందమామ రావే జాబిల్లి రావే.. అన్నింటినీ తెచ్చి మా అబ్బాయి కివ్వవే' అని పాడుతుండడం తెలుగునాట సర్వసామాన్యం. ఆ పాటను ఎన్. రూప ఆధునీకరించింది.[2]

చందమామ రావే - జాబిల్లి రావే
బస్‌లోన రావే - బబుల్‌గమ్ తేవే
కారు లోనరావే - కామిక్స్ తేవే
ప్లేనెక్కి రావే - పాప్‌కార్న్ తేవే
స్టీమరెక్కి రావే - స్టిక్కర్స్ తేవే
టాక్సీఎక్కిరావే - టాయ్‌పిస్టల్ తేవే
అన్నింటిని తెచ్చి మా గడుగ్గాయి కియ్యవే

శీఘ్రంగా పనులు తెమలాలని ప్రభుత్వం కంప్యూటర్స్‌ను ప్రవేశ పెడుతుంది. ఆ కంప్యూటర్స్ సరిగా **Feed** చేయడం చేతకాకపోవడంతో రకరకాల పొరపాట్లు జరుగుతున్నాయి ముఖ్యంగా విద్యార్థుల పరీక్షా ఫలితాలలో జరిగే

---

1. పల్లకి వారపత్రిక 5-12-85.
2. ఆంధ్రజ్యోతి వారపత్రిక 24-9-1982

ఎన్నో అవకతవకలకు మూలం కంప్యూటర్ అవుతున్నది. (నిజానికి ఈ దోషం కంప్యూటర్‌ది కాదు- Feed చేసే వ్యక్తిది) ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడు కావలసిన విద్యార్థి అసలు పరీక్షకే హాజరు కాలేదనీ, పరీక్ష ఫీజే చెల్లించని వాడు ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయినట్లు తీరుతీరుల విన్యాసాలను ప్రదర్శిస్తున్న కంప్యూటర్ లోపాల నుండి, ఆ శాఖలో పనిచేసే ఉద్యోగుల స్వార్థాల నుండి తన 'పరీక్ష' పేపరును కాపాడమని ప్రార్థిస్తున్నాడు ద్రాక్షారాం [1]

దేవుడా / రక్షించు నా పరీక్ష పేపర్ని
స్వార్థపరులనుండి అధికారుల నిర్లక్ష్యం నుండి
పెద్దమనుషుల నుండి, శ్రీమంతుల నుండి
మానవశక్తి నధిగమించే కంప్యూటర్స్ లోపాలనుండి
అక్కడ పని చేస్తుండే వర్కర్స్ నుండి
వారి వారి మిత్రుల నుండి
పుస్తకాలు ముట్టని విద్యార్థుల నుండి
వారి డిగ్రీలను కాంక్షించే తల్లిదండ్రుల నుండి

ఇది కవితాసతి నొసట నిత్యరస గంగాధర తిలకమైన దేవరకొండ బాలగంగాధర తిలక్ రచించిన 'ప్రార్థన' గీతానికి పేరడీ తిలక్ 'అమృతం కురిసిన రాత్రి' కవితా సంకలనం కూడ శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాల సంకలనం లాగే ఆధునిక వచన కవితాభిమానులకు అత్యంత ప్రీతిపాత్రమైంది.

చూడు వీడు / అందమైనవాడు / ఆనందం మనిషైనవాడు /
కలల పట్టు కుచ్చు లాగుతున్న కిరీటం ధరించాడు
కళ్ళచివర కాంతి సంగీత గీతాన్ని రచిస్తున్నాడు
ఎర్రని పెదవులమీద తెల్లని నవ్వుల వీణల్ని మీటుతున్నాడు
ఎవరికి దొరకని రహస్యాల్ని వశపరచుకున్నాడు
జీవితాన్ని ప్రేమించినవాడు జీవించడం తెలిసినవాడు
నవనవాలైన ఊహావర్ణార్ణవాలమీద ఉదయించి సూర్యుడు
ఇతడే సుమీ మన ప్రియుడు నరుడు మనకు వరుడు[2]

---

1. ఆంధ్రజ్యోతి వారపత్రిక 2-7-1982
2. అమృతం కురిసిన రాత్రి (1972) పుట 8.

ఇది తిలక్ 'అమృతం కురిసిన రాత్రి' శీర్షికతో రచించిన గీతంలో ఒక భాగం ఈ పూర్తి గీతంలో తిలక్ నరుని ఉత్కృష్టతను, గతానుగతికంగా అస్వతంత్రతకు అలవాటు పడడాన్ని చిత్రించాడు ఈ గీతాన్ని 'పార్వతి' మాజీ ప్రధాని రాజీవ్‌గాంధి బోఫోర్స్ కుంభకోణానికి అన్వయించి రాజకీయ పేరడీ రచించింది [1] ఎంత హాస్య అధిక్షేపాత్మకమైన పేరడీలు రాస్తున్నా 'హందమైనవాడు' అంటూ భాషలో లేని పదప్రయోగం చేయడంవల్ల సాధించిన ప్రత్యేకమైన ప్రయోజనమీ లేదు

చూడు వీడు నీవాడు
హందమైన వాడు
అవినీతి మనిషైనవాడు
కల్లలు పట్టుకుచ్చులూగుతోన్న
తెల్లని టోపీ ధరించినవాడు
.
వర్తమాన మహాభారతంలో
గల్లంతుపర్వం ప్రవచిస్తున్నవాడు
. .. . .
దేశభక్తిని రహస్యఖాతాగా
మార్చుకున్నవాడు
తక్కర్ కమిషన్‌ను
కాశ్మీరాంబరంగా కప్పుకొన్నవాడు
. . .... .
ఇతడే సుమీ నీ ప్రియుడు! నరుడు!
కాబోయే నీ వరుడు! రా- జీవుడు

ఈ గీతానికే వీరపల్లి వీణావాణి 'ఆకలి కరిచిన రాత్రి' శీర్షికతో పేరడీ చేసింది [2] పార్వతి గేయం తిలక్‌ను మరీ క్లుప్తంగా కొన్ని పాదాలే అనుకరిస్తే వీణావాణి కొన్ని పాదాలే వదిలేసి అంతా అనుకరించింది

---

1 విదూషకుని ప్రేమలేఖ - ఆంధ్రప్రభ దినపత్రిక 10-1-1988
2. ఆంధ్రజ్యోతి వారపత్రిక 30-9-1993

ఆకలి కరిచిన రాత్రి/అందరూ నిద్రపోతున్నారు
నేను మాత్రం/తడికె తెరచి, పాక విడిచి
పల్లెదాటి చీకటిమైదానంలోకి వెళ్ళి
చీకాకుతో నిలుచున్నాను

అని మొదలయ్యే వీణావాణి గేయంలోనుండి సరిగ్గా పార్వతి గేయంలో ఉదహరించిన పంక్తులకు సమానమైన వాటినే పేర్కొంటాను

చూడు వీడు
చూపులకు వికృతమైనవాడు
విషాద విచారములే మనిషైనవాడు
అశ్రువుల పట్టుకుచ్చులు ఊగుతున్న
ఆకలి కిరీటాన్ని శిరస్సున ధరించాడు
పేదరికాన్ని ప్రేమించినవాడు
పరమ దారిద్ర్యపు ఊబిలో ఉదయించిన పంచముడు
ఇతడే సుమీ అధముడు మనకు అస్పృశ్యుడు.

—ఇలా సాంఘికపరంగా సాగుతుంది వీణావాణి పేరడీ

కొండేపూడి నిర్మల రచించిన 'ఓణి' కవిత సున్నితమైన భావచిత్రాలతో హాయి గొల్పేది.[1] కొత్తగా ఓణీలు వేసుకోవడం మొదలు పెట్టిన రోజుల్లో అమ్మాయిల్లో కలిగే అనుభూతులు దీనిలో వర్ణితం ఆ ఓణి ఫలానా ఫలానా దానిలా ఉంటుంది అని సాదృశ్యాల పరంపర పేర్చడం ఈ కవితలో జరిగిన పని.

'తనకే అర్థం కాని ఇమేజరీ'తో ఈ కవిత ఎక్కడా పాఠకులను పీడించదు స్పష్టంగా ఉంటుంది అప్పుడే అయిపోయిందా? అనిపిస్తుంది కవిత మొత్తం ఉల్లేఖించదగిందే ఒక్కోసారి పేరడీ వెలువడడానికి శ్రీశ్రీ కవిత్వమంత ప్రసిద్ధి చెందనవసరం లేదని దీనివల్ల తెలుస్తుంది.

.. .. .

మధ్యతరగతి బూర్జువా కొంపకి పెద్దపిల్లలా వుంటుంది
పుస్తకం బోర్లించిన గ్లాసులో నిలువనీళ్ళ రుచిలా వుంటుంది.

---

1. 5-5-1989 ఆంధ్రజ్యోతి వారపత్రిక.

.... .... ..... .... .. ..
కళ్ళు చెమ్మగిల్లిపోవడంలా వుంటుంది
గౌనుమీద బెంగలా వుంటుంది
చీరమీద మనసులా వుంటుంది
......... ... .... .. ..
బాణీ కట్టని పాటలా వుంటుంది
రాయని పద్యంలా వుంటుంది
ఇవ్వని ముద్దులా వుంటుంది
. .... .. .. .
అది కట్టుకున్న తీరే గమ్మత్తుగా వుంటుంది.

'సామాజిక స్పృహ' అనే పడికట్టు నినాదం మాయాజాలంలో పడిపోయి ప్రతిదానిలోను దానినే అన్వేషించడం 'అది ఒక్కటే' జీవన సమస్త వ్యాపార లక్ష్యం, లక్షణం అని భావించి తెగబాధపడిపోయిన ఓ కమ్యూనిస్టు కుర్రాణ్ణి చూసి కించిత్ చిరాకేసి ప్రకాశరావు పేరడీ రాశాడు. ఈ పేరడీ గేయంలో 'నిర్మలగారి బ్యూటిఫుల్ ఇమేజీలను సాయుధ కవితలకి వ్యతిరేకంగా మార్చినందుకు బోలెడన్ని క్షమాపణలతో' అని ప్రకాశరావు చెప్పుకొన్నాడు కూడ.1

మధ్యతరగతి పెటీ బూర్జువా కొంపకు మల్టీ నేషనల్‌లా వుంటుంది
1917 మీద బెంగలా వుంటుంది.
చందాలు దండుకుని ఎన్నికలందు మహాబిజీగా వున్నప్పుడు
ఇంటికెవరో తుపాకీ తెచ్చినట్టు వుంటుంది
సకల ఆయుధాలూ సంధించి వ్యవస్థ కూలిపోతుందనుకొన్నప్పుడు
ముక్కు సుబ్బారెడ్డి పిక్కబలం చూపినట్టు వుంటుంది
విప్లవోణీ ఎర్రగానే వుంటుంది
జెండా కట్టని కర్రలా వుంటుంది.
పేలని గ్రేనేడ్‌లా వుంటుంది

అసలు తుపాకి పట్టుకున్న తీరే గమ్మత్తుగా వుంటుంది.

1. ఆంధ్రజ్యోతి వారపత్రిక 19-5 89

పేరడీ లక్షణచర్చ చేసేటప్పుడు చెప్పుకున్నట్లుగానే పేరడీ కేవలం రచయిత శైలినో వస్తువునో గేలి చేయనవసరంలేదు సృజనాత్మకత ఘనీభవించి మూసకట్టుగా మారిన దేనినైనా హేళన చేయవచ్చు ఒక మంచి కవితను చదివి ఆనందించక, దానిలో క[illegible] చూడబోయి నిరాశ చెందిన యువకుని అధిక్షేపించడానికి పేరడీని రచయిత వాడుకొన్నాడు

సాధారణంగా కమ్యూనిస్టు కవితల్లో కనిపించే బూర్జువా, పెటిబూర్జువా, ఫ్యూడల్, విప్లవజండ, 1917, తుపాకి, వ్యవస్థ లాంటి పదాలను పేర్చుకుంటూ రాసినంత మాత్రాన కవిత్వమయిపోదనీ, అలాగే రాయాలని ఆంక్షలు విధించడం అతివాదం తప్ప సహేతుకవాదం అనిపించుకోదనీ ప్రకాశరావు పేరడీ హితబోధ చేస్తుంది

చేకూరి రామారావునూ నిర్మల కవిత, ప్రకాశరావు పేరడీ ఆకర్షించాయి. 'కుండ' పేరుతో చేరా ఒక పేరడీ రాశాడు

ప్రజల సొమ్ము తెగమేసి బలిసిన నాయకుడి బొజ్జలా ఉంది
వాడి అర్థరహితమైన ఉపన్యాసంలా ఉంది
రేడియో వచన కవితలా ఉంది
టి.వి సాహిత్యగోష్ఠిలా ఉంది
ఉగాది కవి సమ్మేళనంలా ఉంది
'తెలుగులెస్స' పూర్ణకుంభంలా
కుండ అచ్చం కుండలా ఉంది
కుండ కుండలా ఉండక కొండలా ఉంటుందా?

ప్రకాశరావు తనకు నచ్చని ఒక ప్రత్యేక అంశాన్ని అధిక్షేపించడానికి పేరడీని వాడుకొంటే చేరా కేవలం వినోదాత్మకంగానే పేరడీ రాశాడు నిర్మల కవితలో ఉన్న ఉపమాన పరంపర అంతా అమ్మాయి మనఃస్థితిని ఏకసూత్రంగా చిత్రిస్తుంది ప్రకాశరావు పేరడీలోని సాదృశ్య పరంపర కూడ విప్లవ సంబంధమైన అంశానికి సీమితమయ్యాయి చేరా పేరడీలో అలా ఒక ప్రత్యేక అంశానికి పరిమితం కాకుండా ఉపమానాలు వేటికవే ముక్తంగా స్వతంత్రంగా ఉంటాయి. కుండ వృధా అనుకొంటే రేడియో వచన కవిత, టి.వి సాహిత్య గోష్ఠి నిస్సారం ఇలా పోలికల్లో చెప్పబడ్డ అంశాలన్నీ ప్రయోజన రహితమైనవనీ నిస్సారమైనవనీ విమర్శ కనిపిస్తుంది

నిర్మల కవితలో 'అది కట్టుకున్న తీరే గమ్మత్తుగా ఉంటుంది' అనేది ముగింపు వాక్యం ప్రకాశరావు పేరడీలోను 'అసలు తుపాకి పట్టుకున్న తీరే గమ్మత్తుగా ఉంటుంది' అని చక్కగా వచ్చింది నిర్దేశాత్మక వాక్యాల (Declarative Sentence) అయితే చేరా పేరడీలో 'కుండ కుండలా ఉండక కొండలా ఉంటుందా?' అని ప్రశ్నార్థకంతో ముగింపు పలకడంవల్ల మాతృకకు భిన్నమైన నిర్మాణం చోటుచేసుకొంది అట్లాగే నిర్మల కవిత, ప్రకాశరావు పేరడీ తద్ధర్మాల కూర్పు (ఉంటుంది) అయితే చేరా పేరడీ భూతకాలిక ప్రత్యయంతో (ఉంది) సాగింది

కృష్ణశాస్త్రి 'సౌరభములేలచిమ్ము పుష్పవ్రజంబు' అన్న ప్రసిద్ధ గీతానికి 'పార్వతి' (శివసాగరేనా?) పేరుతో ఒక పేరడీ వెలువడింది

నల్లధనమేల ప్రవహించు తెల్లని దేశములకు?
కిక్ బ్యాక్ లేల కడతేరు స్విస్ బ్యాంకులందు?
ఏల మూసిపారు దోమలేల ముసురు?
ఏల నా బుల్లెట్ప్రూఫ్ హృదయంబు ప్రేమించు నిన్ను[1]

కృష్ణశాస్త్రి ఛాయలో కొత్త దృష్టాంతాలతో బాగానే ఉంది పార్వతి కవిత. కాని మాతృక ఏ ఛందస్సులో ఉంటే కవిత కూడ అదే ఛందస్సులో ఉండాలి. కృష్ణశాస్త్రి పద్యం తేటగీతం పేరడీ ఛందస్సులో లేకపోవడం ఒక ప్రధాన లోపం

**26-3-1990 ఆంధ్రప్రభ దినపత్రికలో ప్రచురితం**

1 విదూషకుని ప్రేమలేఖ - ఆంధ్రప్రభ దినపత్రిక 10-1-1985.

# 17. దండకం....సుప్రభాతం....సంకల్పం

సంస్కృతం నుండి తెలుగులోకి వచ్చిన అనేక ప్రక్రియల్లో 'దండకం' ఒకటి. పూర్వకవులు కావ్యాల్లోనూ, విడిగానూ దైవాన్నిస్తుతించే ఘట్టంలో దండకాలు రచించారు సంస్కృతంలో కాళిదాసు రచించిన 'శ్యామలా దండకం' ఎంతో ప్రసిద్ధిచెందింది దండకం ఉద్ధురమాలావృత్తాలకు చెందినదిగా లక్షణికుల పరిగణనం 26 అక్షరాల ఛందస్సు వరకు నిర్దేశించి, దానికి మించిన వాటన్నింటిని 'ఉద్ధురమాల' అనే పేరుతో ఆలంకారికులు వ్యవహరించారు

రెండు నగణాలమీద రగణాలు కానీ యగణాలు కానీ తగణాలు కానీ ఇష్టం వచ్చినన్ని ప్రయోగించి గుర్వంతం చేస్తు దండకం రాయవచ్చు లేదా ర, య, త గణాలనే పూర్తిగా నగణ ద్వయం లేకుండా ప్రయోగించి గురువుతో ముగించవచ్చు ఆయా గణాల ననుసరించి ఆయా దండకాలకు పేర్లుకూడా పెట్టారు. దండకం వృత్తాలమాదిరి నాలుగు పాదాలతోనూ యతిప్రాసలతోనూ కూడి ఉండదు అందువల్ల ఏకగణ పునః పునరావృత్తివల్ల అక్షర సంఖ్య మాత్రాసంఖ్య సమానమై 'వీనులవిందు' చేస్తుంది రగణ తగణాలు మిక్కిలి సమీపమైనవి తగణ దండకంలోని మొదటి గురువును విస్మరిస్తేచాలు - రగణ దండకమై కూర్చుంటుంది కాని ఏ గణానికి ఆ గణం విరిగితేనే అందం వస్తుంది నన్నయ్య అరణ్యపర్వంలో రాసిన తగణ దండకమే తెలుగులో మొదటిది. శ్రీనాథుడు, నంది తిమ్మన, జక్కన మొదలైన కవులు రగణ దండకాలు రాశారు ఎఱ్ఱన, పోతనాదులు తగణ దండకాలు విరచించారు. తెనాలి రామకృష్ణుడు, కూచిమంచి తిమ్మకవి ప్రభృతులు రెండు రకాలుగాను వెలువరించారు కాని తెలుగులో 'తగణ' దండకాలే ఖ్యాతి గడించాయి

ప్రసిద్ధ కావ్యాల్లోని దండకాలన్నీ దేవుళ్ళను కీర్తించేవిగానే ఉండడం గమనార్హం. దండకం భక్తిపారవశ్యంతో పారాయణం చేసుకోవడానికి అనుకూలమైంది దండకాల్లో భక్తి భావరచనలు కాక మిగిలినవి విరళమే పోతన భోగినీ దండకం శృంగారరస ప్రధానమైందిగా అందరికీ తెలిసిందే. సర్వోన్నతమైన

దైవస్తుతి నుండే దండకాన్ని మరల్చి - కిళ్ళీ, పొగాకు, దోమ, కాఫీ, సినిమాతార మున్నగు అనుదాత్తమైన తక్కువస్థాయి వాటిని 'వస్తువు'గా చేసి హాస్యరస భరితంగా రచించడంతో వీటిని పేరడీదండకాలుగా భావించవచ్చు

వేణుగోపాల శతక కర్త అయిన పోలిపెద్ది వెంకటరాయ కవి ఓ సంద ర్భంలో చెప్పిన తిట్లదండకం ప్రథమంగా పేర్కొనదగింది.

"ఛీ ఛీ ఒరే పాతకా, ఘాతుకా, దుర్నీతా, ఉచ్ఛిష్టపురోత, వారాంగనా మూత్రముల్ పట్టు ముంతా, ఇదే చూడరా ధాత నీ వ్రాత నా చేత పట్టిచ్చెరా, నేడు దుర్భీజమా నైజమా నాజమా ఏర కోవూరి రామా

అంకులాడీయుటం చొక్కమారైన గద్దించి నీకిద్ది మేల్బుద్ధి గాదంచు వాదింపరాదా మదిందోపలేదా? తుదిన్నీకు నాచేత చావయ్యె గాదా .

నీ కాలముంజెల్లె నా శాపమీడేరు, నిక్కంబు, నీ వింటికింబోయి వేవేగ కాల్రొప్పిలికిన్నే గుమాసాగి, కోవూరి రామాయయో రామ రామా సమాప్తం, సమాప్తం సమాప్తమ్ "1

ఇలా ఉంటుంది తిట్ల దండకం. పోలిపెద్ది వెంకటరాయ కవి గేదె ఒకటి కోవూరి రామయ్య అనే సంస్థానోద్యోగి పెరడులోని కూరగాయలతోటను మేసి పాడుచేసిందట కవి ఎంత మన్నింపమని వేడుకొన్నా రామయ్య భార్య విన కుండా కనిపించినపుడెల్లా దుమ్మెత్తి పోసేదట. దాంతో కవి విసిగిపోయి కోపంతో కార్వేటి సంస్థానాధీశ్వరుడైన కుమార వేంకట పెరమాళ్రాజు (1800-1875)కు పిర్యాదు చేసుకొన్నాడు. రాజు రామయ్యను పిలిపించాడు ఎదు రుగా రామయ్య కనిపించగానే కవి ఆవేశంతో ఆశువుగా ఈ తిట్లదండకాన్ని చెప్పాడు ఇది తగణ దండకమే అయినా అక్కడక్కడ రగణాలు కూడ కని పిస్తాయి కవి క్రోధంతోనే ఈ దండకం రాసినప్పటికీ ఆ తిట్లు, ఆ పద ప్రయో గాలన్నీ మనకిప్పుడు నవ్వే పుట్టిస్తాయి

1 రావూరి దొరసామిశర్మ - తెలుగులో తిట్టు కవిత్వము (1968) పుట 123, 124

తెలుగువారి సాంఘిక చరిత్రను దర్శించి తెలంగాణాలో చైతన్య దీప్తుల వెలిగించిన వైతాళికుడు, రచయిత, విమర్శకుడు, పత్రికా సంపాదకుడు సురవరం ప్రతాపరెడ్డి. ఆయన తెలుగు ఉర్దూ మిశ్రశైలిలో గ్రామాధికారుల దురాగతాలను అధిక్షేపిస్తు ఒక దండకం 1931 లో రచించాడు

'ఏమి గ్రాచారమో రాంరామ, పట్వారి, పోలీసు, పొట్టేలు తాసీలు దారంటరో, మొద్దుమీసంట తాలూకుదారంట కచ్చేరి బంటోతులంటా అమీన్‌సాబు యింకా తమాసైన హోద్దాలు వస్తారు పొట్టేళ్ళు పెట్టల్ మరీ గుడ్లు తేవాలె. ఆలస్యమైతేను తుర్కాన చేడంట గీదంట తిడ్తారు మావెత గాదంటె బర్తర్ఫు చేయిస్తమంటారు తైదంబలీయింత పోయించరూ, దూపకూ చిట్టి రాయించమంటేను లుచ్చాలపంగంట యేమేమొ తిడ్తారు మాలాగ ఎట్టీలు మోస్తె తమాషా తెలుస్తుంది 'కానూను' సత్కేది మమ్మల్ని పీడించడాన్కేన అట్లైతే కానూను మాకైతె యేమైన ఉందా మరీ లేద చెప్పండి లేదంటే యీ నౌకరీ మీరె చేస్కోండి '[1]

ఈ దండకం రగణద్వయంతో ఆరంభమైనా తగణ దండకమే పల్లెటూర్లో వెట్టిచేసే కావలివాడు పడే బాధలనూ, వాడిమీద 'జులుం' చేసే రెవెన్యూ అధికారుల ఆగడాలనూ రచయిత అక్షరబద్ధం చేశాడు దీనిలో హాస్యం కన్నా ఆవేదన మిన్న అన్యదేశ్యాలను అనువుగా తగణాల్లో ఇమిడించడం హాస్యోత్పత్తికి కారణమైంది

''శ్రీమన్మహా దోమ, నీ కుట్టడం మండ నేనోడిపోయాను, నెగ్గింది నువ్వేను ఓ దోమరాజాయటంచుం నినున్నే పెద్ద చేతుం, బలే భేషువాయించు కర్ణపేయంబులే నీ గానముల్ వర్ణనల్ సేతు, నిన్ గూర్చి హారతుల్ వెల్గింతు .. నా రక్తమున్ దోడి నీ రెక్కలన్ సిత్తంబు గావించుకో గాని, ఆవంత రక్తంబు పీల్చేసి పై పెచ్చు నా ఒంటిమీద మలేరియా వంటి వ్యాధులన్ దెచ్చిపారేసి బోకుమీ!''[2]

---

1. ముద్దసాని రామిరెడ్డి - సురవరం జీవితము - రచనలు (1974)
2. మన్నవగిరిధరరావు - కథలలో హాస్యం (వ్యాసం) అందాల తెలుగు కథ (1980) పుట 61

అని భమిడిపాటి కామేశ్వరరావు అల్పాతి అల్పమైన దోమను అనంతుడైన భగవంతుని నుతించే దండకరీతిలో కీర్తించి, దోమకాటు నుండి విముక్తి పొంద యత్నించాడు

'శ్రీమాన్ మహామండలేశ్వరుడు, మహారాజాధిరాజు క్రీరపటీర నీహార చంద్రికా సాంద్ర ధిక్కార జగద్వ్యాకాంత యశస్సాంద్రములైన కిష్కింధ మశక మరాజులుగారి విడిద'[1] అని చిన్న దోమకు అంత పెద్ద సమాసం, భాష వాడడం పేరడీ

కలిగొట్ల గోపాలశర్మ 'కిళ్ళీ'ని ప్రార్థించి కృతార్థుడయ్యాడు

"ఓ కిళ్ళీ! మాహాత్మ్యమెన్నంగ చూడంగ సున్నంబు కొంచెంబు పోకాదులున్ జెక్కాలన్ ఆకులుండంగ జర్దాలు, పీటీలు, పాన్లంచు కారంపు కిళ్ళీలు వేర్వేర, పేర్వేర వర్ణింపగా మాతరంబౌనే?

నీవు నున్నట్టి బడ్డీల యందున్ రతీ మన్మథల్, చార్మినార్లున్, సిజర్లున్, త్రిబుల్ఫైవు, బర్క్లీలు, వీక్లీల్ డిటెక్టివ్లునున్ మాసవారీల డైలీల పేపర్లు, బ్రాకెట్లు, పేకాట్లు, కొట్లాట్లు, సారాలు, బ్రాందీలు, హల్వాలు, జాంగ్రీలు, బజ్జీలు

నీవు నుండంగ తాంబూలమంచున్ వరాన్వేషణానంతరంబందు కిళ్ళీలు సేవించి, తర్వాత పెండ్లిండ్లు గావింత్రు ఇంక పెండ్లైన తర్వాత కార్యంబు సేయంగ తాంబూలమే ముఖ్యమౌగాదె. .

నీ రివి, నీ గొప్ప వర్ణింపగా శక్యమే? చెవ్వు పోట్లున్నచో నాకు ముఖ్యంబు, నారీమణుల్ వక్కాలన్ ఇంటలేకున్నచో మందుగా వాడరే? సున్నంబుతో గోడ కందంబు చందంబు ఈ రీతి నీ రివి నీ సొంపు నీ పెంపు నీ రాగ వర్ణంబు వేర్వేర వర్ణింప మేమెంత? ఓ కిళ్ళీ దేవతా ఓ రాగమూర్తీ! ఓ సుందరాంగీ! ఓ కోమలాంగీ! నమస్తే నమస్తే నమః[2]

---

1 మనహాస్యం - పుట 193

2 ఆంధ్రజ్యోతి వారపత్రిక 29-7-1988

ఈ విధంగా ఎన్ని దండకాలైన చెప్పుకోవచ్చు. కాఫీ దండకం, సినీమా తార దండకం, పొగాకు దండకాలు లాంటివెన్నో ఉన్నాయి మచ్చుకు ఇవి పేర్కొనడం జరిగింది. వీటన్నింటిలో కలిగే అనుభూతి ఒక్కటే గంభీరమైన వాతావరణాన్ని ఛేదిస్తాయి అందరినీ అలరింపజేస్తాయి. హాస్యానురక్తుల్ని గావిస్తాయి

## సుప్రభాతం :

భగవంతుని మీదినుండి దృష్టి మరల్చి క్షుద్రాంశాల మీద దండకాలు రాస్తే పేరడీలుగా అంగీకరించినట్లే తిరుపతి వెంకన్న మీదనో, భద్రాద్రి రామన్న మీదనో శ్రీశైలం మల్లన్న మీదనో రాయవలసిన సుప్రభాతాన్ని అన్యథా రాస్తే పేరడీ అవుతుంది దండకాలు, సుప్రభాతాలు తనలోతాను చదువుకోవడంకన్నా పెద్దగా చదవడంలోను, వినిపించడంలోను వాటి మాధుర్యం అనుభవంలోకి వస్తుంది.

> కాఫీ ముహుర్ముహురుపాసిత దివ్య వక్త్రే
> అల్పోపహార సతతార్పిత దంతపంక్తే
> నిత్యానుశీలన సినీ బహు చిత్రలోకే
> శ్రీ సుబ్బరాయ దయితే తవ సుప్రభాతమ్.
> ఉద్యాన పాలన నిరంతర లగ్న దృష్టే
> సత్సీరియల్ పఠన సంతత మగ్నదృష్టే
> వస్త్రాంతరే సతత సీవన బద్ధహస్తే
> శ్రీ సుబ్బరాయ దయితే తవసుప్రభాతమ్.[1]

అని శ్రీమతి వత్సల చెసే పనులను నాయని సుబ్బారావు వాత్సల్యంతో అక్షర బద్ధం చేశాడు "ఉత్తిష్ఠ నరశార్దూలా!" అంటూ దేవుని మేల్కొల్పడానికి వైతాళిక సుప్రభాతాలు పలికినట్లే ఆధునిక స్త్రీని - ఎప్పుడు కాఫీ తాగే దానిని, టిఫిన్ చేసే దానిని, సినిమాలు చూచేదానిని, సీరియల్స్ చదివేదానిని, చినిగిన బట్టల కుట్టుకునే దానిని నాయని సుబ్బారావు సుప్రభాతంలో 'వస్తువు'గా చేసి కీర్తిం

---

1. అనుమాండ్ల భూమయ్య . నాయని సుబ్బారావు కృతులు - పరిశీలన (1981) పుట 31

చాడు వేంకటేశ్వర సుప్రభాతం చదివి భక్తి పారవశ్యంతో అర్ధనిమీలిత నేత్రులయితే ఈ సరికొత్త సుప్రభాతం చదివి ఆనందపరవశులవుతారు.

## సంకల్పం :

హిందువులకు సంధ్యావందనం చెయడం, సంకల్పం చెప్పుకోవడం సంప్రదాయం తానున్న ప్రదేశం ఏయే నదుల సమీపంలో ఉందో చెప్పుకొన్ని, ఆనాటి తిథి వార నక్షత్రాలు, తన పేరు చెప్పుకోవడం 'సంకల్పం'లో భాగం

"ఆద్య బ్రహ్మణః ద్వితీయ పరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే దండకారణ్యే గోదావర్యాః దక్షిణేతీరే " ఈ విధంగా సంకల్పం సాగుతుంది

ఆంధ్రదేశంలో ఉన్నవారికి ఇది సరిపోతుంది. విదేశాలకు వెళ్ళినవారు ఏ విధంగా సంకల్పం చెప్పుకొని సంధ్యావందనం చేయాలన్న ప్రశ్న తలెత్తుతుంది చిలకమర్తి లక్ష్మీనరసింహం రాసిన 'లండన్ సంకల్పం' ఆ సమస్యను పరిష్కరిస్తుంది. చిలకమర్తి 'లండన్ సంకల్పం' సంకల్పరీతికి చక్కని పేరడీగా గుర్తించవచ్చు

"లండన్ వే స్వాహా జూశసే స్వాహా - క్రైస్తవే స్వాహా - ఇంగ్లండ్ - స్కాట్లండ్ - ఐర్లండ్ తత్క్రైస్తోర్వరేణ్యం - జూహోవా దేవస్య ధీమహీ - ధియోయోనః ప్రచోదయాత్" అని కేశవనామాలను పేరడీకరించడంతో మొదలవుతుంది "భూమేః పూర్వగోళార్ధే యూరప్ఖండే, రష్యా, జర్మనీ, ఫ్రాన్సు, స్వీడనేత్యాది మహాదేశానాం పశ్చిమ ప్రాంతే - చతుస్సముద్ర ముద్రిత గ్రేటు బ్రిటన్నామక మహాద్వీపే ఛవియట్పర్వతస్య దక్షిణ దిగ్భాగే - వేల్సుదేశస్యాగ్నేయభాగే బ్రిస్టల్కుల్యాయాః ప్రాగ్దేశే. .. అస్మిన్వర్తమాన వ్యావహారిక హూణమానేన క్రీస్తో రనంతరం వింశతి తమ శతాబ్దే అఖండ థేమ్సనద్యాం వీరభద్రశర్మాహం జ్ఞానస్నానం కరిష్యే "1

---

1. చిలకమర్తి లక్ష్మీనరసింహం - చిలకమర్తి ప్రహసనములు (1969) పుటలు 187 - 188

ఇలా సాగుతుంది చిలకమర్తి లక్ష్మీనరసింహం 'లండన్ సంకల్పం' భౌగోళికపరమైన భారతదేశ భాగాల స్థానంలో లండన్ పరిసర ప్రాంతాలను నిక్షేపించడం, కాలమానం పేర్కొనవలసిన సందర్భంలో క్రీస్తుశకం చెప్పడం ఇత్యాదిగా మొత్తం యథోచితంగా మార్చి చిలకమర్తి హాస్యసృష్టి చేశాడు. సంప్రదాయ సిద్ధమైన 'సంకల్పం' సంస్కృతంలో సాగినపుడే భక్తిపూరితమైన వాతావరణం సిద్ధిస్తుంది. ఆంగ్ల భాషా సంస్కృతుల వాతావరణంలోకి - అంటే భిన్నమైన సంస్కృతిలోకి పరివర్తితం చేయడం మూలాన హాస్యభాజనమై పేరడీ అయింది.

అడవి బాపిరాజు 'కోనంగి' నవలలో ఒక చక్కని హాస్య సన్నివేశాన్ని కల్పించాడు. ప్రియురాలైన వసంతలక్ష్మికి కోపంవస్తే,

వందే లక్ష్మీదేవీనాం నాయొక్క ప్రాణేశ్వరీం
ఆత్మేశ్వరీం నేను వట్టి డం డం హేడునుం
నీ హృదయానికి బాధ కలిగించినందుకు
క్షమింపుమాం నే జేసిన తప్పిదానికి నీవేవిధ
మగు శిక్షవేసినా భరింపసిద్ధముగా నుంటినః

అని "వందే పద్మాకరాం, ప్రసన్న వదనాం" అనే లక్ష్మీ స్తోత్రానికి పేరడీగా తన మాటలతో చదివి దగ్గరకు వెళ్ళి చేతులు జోడిస్తాడు.

వసంత చటాలున లేచి నవ్వుతూ

"ఓయీ భక్తులుగారూనాం
నిన్ను క్షమించితినం అహం
నీకు యే కోర్కె కావాలో అది
తీర్చ సిద్ధముగా నుంటినః (పుట 231)

అని వరదహస్తం, అభయహస్తం పట్టి నిలుస్తుంది ఇది స్తోత్రాలకు చేసిన పేరడీకి నిదర్శనంగా గ్రహించవచ్చును.

* *

# 18. వేప మండలు

తెలుగు నవలా రంగాన్ని యండమూరి వీరేంద్రనాథ్ 'తులసిదళం' నవల ఒక మలుపు తిప్పింది ప్రేమలు, అపార్థాలు, కడివెడు కన్నీళ్ళు నిండిన సాంఘిక నవలల నుండి సైన్స్‌ఫిక్షన్, ఫాంటసీ, విషయ సేకరణ, పరిశీలనాత్మక పరిశోధనాత్మక నవలలవైపు పాఠకుల దృష్టిని తులసిదళం మళ్ళించగలిగింది. ఇది మంచి పరిణామమా? కాదా అనేది వేరే అంశం వైవిధ్యం ఆశించే చదువరులకు, ఒకే తీరు ప్రేమకథలు చదివి విసిగెత్తిన పాఠకులకు తులసిదళం నవలతో వీరేంద్రనాథ్ కొత్త రుచి చూపించగలిగాడు మల్లాది వేంకట కృష్ణ మూర్తి, చల్లా సుబ్రహ్మణ్యం, సూర్యదేవర రామ్మోహనరావు, కొమ్మనాపల్లి గణపతిరావు, శాతవాహన లాంటి రచయిత లందరికీ యండమూరి ఒకరకంగా నాయకుడయ్యాడు

తులసిదళంలోని పేర్లను, కథను, సంఘటనలను, పాత్రలను, పద ప్రయోగాలను, మేనరిజమ్స్‌ను, లోటుపాట్లను పూర్తిగా అనుకరిస్తూ అతిశయించి చూపుతూ అధిక్షేపాత్మకంగా శ్రీమతి సంగీతారెడ్డి 'వేపమండలు' పేరుతో పేరడీ నవల రచించింది 'వేపమండలు' తులసిదళం పట్ల 'సాహిత్యవిమర్శ'గా పనిచేయడమే కాకుండా దానిమీద వచ్చిన విమర్శలను తిప్పికొట్టిన బలమైన ప్రతివిమర్శగా కూడ పనిచేయడం గమనార్హం. మాతృకా విమర్శకులకు జవాబు దారీగా కూడా పేరడీ ప్రక్రియను సమర్థంగా ఉపయోగించుకోవచ్చునని రచయిత్రి నిరూపించింది.

తులసిదళంలోని పాత్రలన్నీ పేర్లు మార్చుకొని 'వేపమండలు'లో ప్రవేశించాయి తులసిదళంలోని శ్రీధర్ శశిధర్‌గా; శారద భారతిగా, తులసి హారతిగా మారారు అనిత సబిత కాగా, అబ్బూరి కేదేశ్వరబ్రాహ్మణ్ (అబ్రకదబ్ర) ఆదుర్తి బదరీనారాయణ (అబ్రాబాబ్రా) అయ్యాడు ఇంకా పైడితల్లి పైడిరాజుగా, సరస్వతీంద్ర చటోపాధ్యాయ (సరస్వతి) ఎస్నాబ్రావుగా, కాబ్రా కార్కాగా, డా॥ పార్థసారధి డా॥ అయోమయంగా, హిప్నాటిస్ట్ జయదేవ్ ప్రొఫెసర్ విభ్రాంత్‌గా, శ్రీనివాసపిళ్ళై రామనాదంపిళ్ళైగా మారిపోయాడు కాష్మోరా షాక్మోరాగా మారింది

'తులసిదళం' చేతబడులు, ఎలక్ట్రానిక్స్ ఇతివృత్తంగా అల్లబడిన నవల. శ్రీధర్, శారదల ఏకైక సంతానంతులసి తులసికి పదేళ్ళ వయసులో 20 లక్షల ఆస్తి చెందాలని ఒక విదేశీయుడు వీలునామా రాస్తాడు ఒకవేళ ఆమె పదేళ్ళు బతకకపోతే ఆ ఆస్తంతా శ్రీకృష్ణ అనాధబాలికల శరణాలయానికి చెందుతుందని ఆ వీలునామాలో ఉంటుంది ఇది తెలిసి శరణాలయానికి చెందిన స్వామి, సరస్వతి, పైడితల్లి పాపకు చేతబడి చేయించాలని యత్నిస్తారు. అది విఫలమవుతుంది. ఒరిస్సాలోని బిస్తా గ్రామంలోనున్న కాద్రాను స్వామి ఆశ్రయిస్తాడు కాద్రా తులసిపై 'కాష్మోరా' అనే క్షుద్ర ప్రయోగాన్ని చేస్తాడు అది మహాభయంకర మైంది. 21 రోజులపాటు మనిషిని రోజుకు ఒక తీరుగా బాధపెట్టి చంపుతుంది. డా॥ పార్థసారధి తులసిని ఎంత పరీక్షించినప్పటికి రోగమేమిటో అర్థంకాదు. పాప రోజురోజుకూ కృశిస్తుంటుంది పైడితల్లికి వచ్చిన ఓ ఉత్తరం ఆధారంతో శ్రీధర్, ఆయన సహోద్యోగి అబ్రకదబ్ర, ఒరిస్సాలోని 'బిస్తా' గ్రామం వెళ తారు అక్కడ 'కాష్మోరా'ను ప్రయోగిస్తున్న మహామాంత్రికుడు కాద్రాను గుర్తించి చంపేస్తారు.

ఈ మధ్యలో శ్రీనివాస పిళ్ళై అనే ఎలక్ట్రానిక్స్ ఇంజనీరు ప్రవేశిస్తాడు. అతడు తులసికి Braintuning చేసి, సరిగ్గా రాత్రి 12 గంటలకు మోర్స్‌కోడ్ ద్వారా సంకేతాలు పంపిస్తుంటాడు తరువాత అది బయట పడుతుంది. మొత్తం మైన కథ సుఖాంత మవుతుంది.

ఈ కథయావత్తు ఉత్కంఠదాయకంగా, ఉద్వేగభరితంగా సాగుతుంది. 'వేపమండలు'లో కూడా స్థూలంగా చూస్తే 'తులసిదళం'లోని కథే వుంటుంది

శశిధర్, భారతిల ఒకే ఒక బిడ్డ హారతి. ఆమెకు జలుబు చేస్తుంది. ఇంట్లో వారంతా ఎవరో గిట్టనివారు 'షాక్మోరా' చేయించారని గగ్గోలుపడు తుంటారు మాంత్రికుడి కోసం ఊరంతా గాలిస్తారు ఇంట్లో దొరికిన ఓ బస్ టికెట్ మీద 'ఏలేశ్వరం' అని వుండడంతో అక్కడికి వెళతాడు శశిధర్. ఒక మాంత్రికుడు ఆ వూరి నుండి పట్నం వెళ్ళాడని తెలుసుకొని తిరిగి పట్నం వస్తాడు శ్మశానంలో మాంత్రికుని కర్రతో బాదుతాడు. (మాంత్రికుడు చనిపోడు)

మధ్యలో శశిధర్ ఇంటి 'ఒసరె' రామనాథం పిళ్ళై ప్రవేశిస్తాడు ఆయన 'తిరుపతి' వెళ్ళి గుండు గీయించుకొని టోపీ పెట్టుకొని వస్తాడు. ఎన్నాత్రావు, అద్రాబాద్రా పిళ్ళై టోపీదారాలను చూసి, మెదడులో కంప్యూటర్ పెట్టకున్నాడని, దాని సాయంతో హారతికి 'సజెషన్స్' పంపిస్తుంటాడని భావిస్తారు వారిద్దరు కలిసి పిళ్ళై బసచేసిన హోటల్ రూంను సోదా చేస్తారు పిళ్ళై ఒక గజదొంగ అని తేలి పోలీసులు పట్టుకొంటారు బామ్మ ఏదో తీర్థం పాప నోట్లో పోస్తుంది అందరూ షాక్మోరాకు విరుగుడుగా తులసి తీర్థం పోసింది బామ్మ అని మెచ్చు కొంటూరు బామ్మ వారి మూర్ఖత్వానికి నవ్వాలో ఏడ్వాలో తెలియక 'రాత్రి నేను పాపనోట్లో పోసింది తులసితీర్థం కాదు - మిరియాల కషాయం' అంటుంది.

వారంతా తామెంత మూర్ఖంగా ప్రవర్తించారో అర్థమై నవ్వలేక నవ్వుతారు

ఈ విధంగా "సంభ్రమాశ్చర్యాలతో ముంచెత్తించి ఆనందడోలికల్లో ఊపిరాడనివ్వకుండ ఉల్లాసపరిచి ఊగించిన వినోదాత్మక నవల 'వేపమండలు'" (వేపమండలు అట్టమీది మాటలు)

'తులసిదళం'లోని కొన్ని సంఘటనలు 'వేపమండలు'లో వికటీకరింప బడిన విధం చూద్దాం.

అనిత డిగ్రీ చదువుతున్న అమ్మాయి 'కాష్మోరా' క్షుద్రదేవత అన్నా చెల్లెళ్ళు లైంగికంగా కలిస్తే (పుట 189) అది తృప్తి చెంది, పాపను వదిలి పోతుందని పైడితల్లి చెబితే నమ్ముతుంది అమాయకంగా మోసపోతుంది ఉరి పోసుకుని చనిపోతుంది (పుట 195)

'వేపమండలు'లో కూడ ఈ సంఘటన చిత్రితం పైడిరాజు సవితతో పాపని షాక్మోరా వదిలివేయాలంటే తామిద్దరూ కలవాలని చెప్తాడు (పుట 44) ఆమె అంగీకరిస్తుంది నిజానికి పైడిరాజు దుష్టుడు కాదు. "హిందీ సినిమాలు చూసి, తెలుగు నవలలు చదివి, హీరోకన్న విలన్‌కు ఎక్కువ డిమాండ్ ఉందని అలా తయారయ్యాడు" తనకు మోసం చేయాలనే ఉద్దేశ్యం లేదని ఏకపాత్రాభి నయం శైలిలో చీకట్లో ఉన్న ఒక ఆకారాన్ని సవితగా భ్రమించి చెప్తాడు.

అపుడే వెనుక తలుపు తీసుకొని సవిత అక్కడికి వస్తుంది " షాకోమ్మేరా, హోష్మా రాల పేర్లు చెబితే మోసపోవడానికి. మేమేమన్నా పల్లెటూరి దద్దమ్మలమను కున్నావా? బి ఎస్సీ. చదివిన అమ్మాయి. అంత సులభంగా బుట్టలో పడు పడుతుందనుకున్నావా?" అంటూ కాగితంలో కారం పెట్టి అతడిమీదికి విసురు తుంది. (పుట 49 )

ఈ రెండు సంఘటనలు పూర్తి సమాంతరంగా చిత్రీకరింపబడ్డాయి. 'తులసిదళం'లో పైడితల్లి మోసగాడు అనితను లోబరుచుకోవాలని యత్నించి విజయం పొందాడు అనిత డిగ్రీ చదివినా, లోకజ్ఞానం ఏమాత్రం లేనిది. 'వేప మండలు'లో సరిగ్గా దీనికి విరుద్ధంగా పైడిరాజు మోసగాడు కాదు కానీ క్షుద్ర సాహిత్యం చదివిన ప్రభావంతో మొదట అలా ప్రవర్తించాడు. తరువాత యదా ర్థాన్ని అంగీకరించాడు సవిత డిగ్రీ చదివింది పిచ్చిగా ప్రవర్తించే వారికి గుణపాఠం నేర్పగలిగిన ధైర్యవంతురాలు కూడా

'వేపమండలు' లోని పాత్రలు అతిసాధారణమైన పాత్రలు, పెద్ద తెలివి తేటలు ఉన్నవారూకారు అట్లాగని మూర్ఖులూ కారు

శశిధర్ 'వేపమండలు'లో నాయకుడు, హారతి తండ్రి. తులసిదళంలోని శ్రీధర్‌లాగా ఇంజనీర్ కాదు కారూ, ధనమూ ఉన్నవాడు కాదు అద్దె ఇంట్లో నెలాఖర్లో అగచాట్లు పడే మామూలు మనిషి బిడ్డని డాక్టరుకు చూపడానికి కూడ డబ్బులులేని స్థితి అతనిది. ఇతడు మంత్ర తంత్రాలను నమ్మడు. ప్రతీ దానికి సైంటిఫిక్ రీజనింగ్ ఉండాలని అంటుంటాడు దూరదర్శన్ కార్య క్రమాలు బాగలేకుంటే అది కాస్మిక్ కిరణాలను; రేడియో ప్రోగ్రామ్స్ బాగు లేకుంటే అది అల్ట్రాసోనిక్ తరంగాల్ని వెలువరించడం మూలాన మనకు బాధ కలుగుతోంది తప్ప కార్యక్రమాలు బాగాలేక కాదని వాదిస్తుంటాడు (పుట 11 ) గడియారం చప్పుడుని మోర్సుకోడుగా భ్రాంతి చెందేవాడు దూరదర్శన్ కార్య క్రమాలు బాగాలేక సవిత వాంతి చేసుకొంటుంది దానికి ఆమెని అపార్థం చేసుకొని, వాడెవడో చెప మని తల వాచేటట్టు చీవాట్లు పెట్టిన తెలివిమంతుడు శశిధర్ (పుట 12 )

తులసిదళంలోని డాక్టర్ పార్థసారథి నిష్ణాతుడయిన వైద్యుడు ఎలాంటి రోగాన్నైనా అవలీలగా నయం చేయగలిగిన సమర్థుడు తులసిలో రోజురోజుకు కలుగుతున్న మార్పులను క్షుణ్ణంగా గుర్తించిన చేయితిరిగిన డాక్టరు. మరి వేప మండలంలోని డాక్టర్ ఇందుకు పూర్తి వ్యతిరేకం ఆయన పేరు డాక్టర్ అయోమయం.

డాక్టర్ అయోమయం కాకినాడ మెడికల్ కాలేజిలో పదకొండేళ్ళపాటు చదివాడు మామగారి చలువవల్ల ఉద్యోగం పొందాడు ఎనిమిదో క్లాసు సైన్సు పుస్తకం తాలూకు జీర్ణమండలం బొమ్మ క్లిప్పుకి పెట్టుకొని ఆపరేషన్ చేయడం అన్న కార్టూన్ అతడిని చూసి వేసిందేనట (పుట 16) రోగిని పరీక్షించే విధానం, రోగాన్ని గుర్తించే పద్ధతి ఎంతో విలక్షణంగా నుండి, పాఠకులు విరగబడి నవ్వేలా చేస్తాయి.

స్టెతస్కోపు చెవుల్లో పెట్టుకోవడం మరచిపోయి హారతిని పరీక్షించి 'గుండె ఆగిపోయింది, కొట్టుకోవటంలేదు' (పుట 16) అని చెప్పిన ఘనుడు డా॥ అయోమయం. పాప తుమ్మడం ఏదో అపశకునాన్ని సూచిస్తుందనే ప్రబుద్ధుడు (పుట 74) 'డిప్రెషన్‌తో వళ్ళు కుంచించుకుపోయి నిరాశ ఆవరిస్తుంది. వంటితోపాటు గొంతు కూడ కుంచించుకుపోవచ్చు. అది తుమ్ములకు కారణం కావచ్చు డిప్రెషన్ (దిగులు) రావడానికి గృహసంబంధమైన కారణాలు, సెక్సు ముఖ్య కారణాలు' (పుట 75) అని డా॥ అయోమయం పదేళ్ళ పసి పాపను పట్టుకొని ఏమాత్రం యుక్తాయుక్త విచక్షణ లేకుండా వ్యాఖ్యానిస్తాడు.

ఈ నవల (తులసిదళం అన్నమాట) చదవటంవల్ల మెదడులో ఏర్పడిన తరంగాలు వస్ రూపంలో ఊపిరితిత్తుల్లో చేరటంవల్ల జలుబుచేసి వుంటుంది' (పుట 163) అని చెప్పే ఘనమైన వైద్యుడు డా॥ అయోమయం.

ప్రొఫెసర్ విభ్రాంత్ పాత్ర తులసిదళంలోని ప్రొఫెసర్ జయదేవ్‌ను అనుసరించి సృష్టించబడిన పాత్ర మెట్రిక్యులేషన్ మూడుసార్లు తప్పినవాడు. కొంచెం మ్యాజిక్ నేర్చుకొన్నవాడు. హిప్నాటిజం వచ్చునని భ్రమపడేవాడు. పిల్లి గిన్నెలు పడగొట్టి చప్పుడు చేస్తే-తన కంఠపు 'ఇన్‌ఫ్రాసోనిక్' తరంగాలకి పళ్ళాలు కదులుతాయి, గ్లాసు అద్దాలు గాజు గ్లాసులు పగులుతాయని హెచ్చ

రించిన ఘనుడు! ఇతని హిప్నాటిజం శక్తి కంటే గదమాయింపులకే పాప బెదిరి కళ్ళు మూసుకొంటుంది (పుట 82)

ఈ ప్రొఫెసర్ షిఖాంత్ వద్ద హిప్నాటిజం నేర్చుకొన్న శిష్యుడు ఎన్నారావు తాను నేర్పలేక ఎట్లాగైనా ఎన్నారావును వదిలించుకోవాలని అతనికి హిప్నాటిజం వచ్చేసిందని చెప్తాడు దాంతో తానో హిప్నాటిస్ట్ అయిపోయానని ఎన్నారావు తలపోస్తాడు తాను ప్రేమించే సబితను హిప్నాటిజం ద్వారా వశపరచుకోవాలని యత్నిస్తాడు.

సబిత నుద్దేశించి "నీ మనస్సు ప్రశాంతంగా ఉంది. నా మాటలు తప్ప నీకింకేమీ వినబడడం లేదు నీ కనురెప్పలు మూతబడుతున్నాయి. నీవు నిద్రలోకి జారుకుంటున్నావు" అంటాడు (పుట 88). సబిత నిద్రలోకి జారుకుంటున్నట్లు కనబడుతుంది 'నువ్వు యిప్పుడు నా దగ్గరకు వస్తావు. తర్వాత మెడచుట్టు చేతులువేసి నన్ను ముద్దు పెట్టుకుంటావు యూఆర్ కిస్సింగ్ మీ స్లోలీ. స్లోలీ.'

ఒక్క మెరుపు మెరిసినట్లు అనిపిస్తుంది. ఆ తర్వాత చెంప చెళ్ళుమన్న శబ్దం వినిపిస్తుంది

'నీ చెంప ఉబ్బుతుంది స్లోలీ స్లోలీ' అని సబిత వెళ్ళిపోవడం కనిపిస్తుంది (పుట 89).

ఇట్లా హాస్య రసవత్తరంగా ఎన్నారావు పాత్ర చిత్రీకరించబడింది.

ఎన్నారావు పాత్ర తీరుతెన్నులు ఇలా ఉంటే అద్రాబాద్రా కూడా ఇంతకన్నా మెరుగ్గా ఏమీ ఉండడు. అద్రాబాద్రా క్షుద్ర దేవతలను, మంత్ర శక్తులను విశ్వసిస్తుంటాడు ఆరాధిస్తుంటాడు. మంత్రగాళ్ళు బిచ్చగాళ్ళ రూపంలో ఉంటారని విని ఇంటి ముందు అడుక్కొంటున్న బిచ్చగాడిని మాంత్రికునిగా అనుమానించిన మూర్ఖుడు అద్రాబాద్రా. సగం సగం చినిగి పడివున్న ఒక కాగితంలోని రాత బారతిదని తెలిసి, కన్న కూతురిమీదే చేతబడి చేయించిందని అద్రాబాద్ర ఆరోపిస్తాడు అది విన్న బామ్మ ఆ కాగితం చాకలిపద్దు తప్ప మరోటి కాదని నాలుగు తిడుతుంది. (పుట 117)

ఏలేశ్వరంలోని ఆర్. కామేశ్వరరావు 'తులసీ దళం' (?) నవల చదివి మంత్రగాడయి (?) పోయినవాడు కామేశ్వరరావు 'కార్కా' నామాంతరంతో మాంత్రికుడిగా చలామణి అవుతుంటాడు మంత్రాలు నేర్చుకోవాలని కార్కాకు ఒకడు శిష్యుడవుతాడు నిజానికి కార్కాకు ఎలాంటి మంత్రశక్తులు లేవు. అడుగడుగునా ఈ గురుశిష్యులిద్దరి ప్రవర్తన నవ్వు తెప్పిస్తుంది.

టికెట్ లేకుండా ప్రయాణం చేస్తున్న నేరానికి టికెట్ కలెక్టర్ గురుశిష్యులను రైల్లోంచి దింపేస్తాడు (పుట 68). భయంకరమైన షాక్మోరాను ప్రయోగించి ఆ రాత్రే టికెట్ కలెక్టర్‌ను లేపేస్తానని కార్కా ప్రగల్భాలు పలుకుతాడు. మరురోజు శుభ్రంగా టిఫిన్ చేస్తు టికెట్ కలెక్టరు కనిపిస్తాడు (పుట 69)

దాంతో గురువు ఒక్క క్షణం బిత్తరపోయి 'నువ్వు సేకరించింది బూటు కిందిమట్టి కావడంతో మనం ప్రయోగించిన షాక్మోరా మనిషిని వదిలివేసి ఆ బూటును పట్టి ఉంటుంది ఒక్క రోజులో అవి కృశించి. అతడి కాళ్ళను కరిచాయి. ఫలితంగా వాటిని అతడు పెంట దిబ్బ మీదికి విసిరేసి వుంటాడు. చూశావా? శిష్యా, మన షాక్మోరా శక్తి?' (పుట 69) అని నమ్మింపజూస్తాడు.

కోడికాలు ఉన్న పాత్రను శ్మశానంలో పెట్టి దేవతల ఆరగింపు కోసం కార్కా ప్రార్థిస్తాడు ఒక కుక్క వచ్చి ఎత్తుకపోతుంది. దాన్ని క్షుద్రదేవతల్లో పద్నాలుగవదయిన శునకాష్మోరాగా సమర్థిస్తాడు.

'త్రికాలజ్ఞాని' (పుట 72) అయిన మాంత్రికుడు తనకు దెబ్బ తగిలి భుజం నుండి రక్తం వచ్చిందని భావిస్తాడే తప్ప, బురద అంటుకొని తడి అయిందని మాత్రం ఊహించలేడు (పుట 72) ఇలా ఉంటాయి వేపమండలులోని పాత్రల పోకడలు.

తులసీదళం నవలలో రచయిత ప్రత్యేకమైన తరహా పదప్రయోగాలు, (Diction) వర్ణనలు చేశాడు అవి అంతకుముందు ఎవరూ చేయలేదు, ఈ రచయితే చేశాడని ఉద్దేశం కాదు ఇవి నవలలో గుర్తించదగిన 'మేనరిజమ్స్' అని భావం

ఆత్మస్థానానికి తగలడం/ఒక్కసారిగ నిశ్శబ్దం ఆవరించడం
ఎక్కడో తీతువు పిట్ట అరవడం/మెదడులో ఎక్కడో పర్జన్యఘోష
సిక్త్స్ సెన్స్ చెప్పడం/ఆనందంతో పెద్దగా కేక వేయడం

మెరుపుకన్న వేగంగా కదలడం / దవడకండరం ఆవేశంతో బిగుసుకోవడం

క్షణంలో వెయ్యవ వంతు / గుండెలవిసేలా కేక వేయడం

వీటన్నింటిని రచయిత్రి హేళనాధిక్షేపాత్మకంగా వేప మండలులో అనుకరించింది

'భారతి కెవ్వున కేకవేయబోయి, మాటి మాటికి అలా కేకలు వేస్తే బాగోదని వూరుకున్నది' (పుట 16); 'ఆమె మాటి మాటికి అలా కెవ్వున కేక వేయడం ఆ ఇంట్లోవాళ్ళకి అలవాటయిపోయింది. కాబట్టి ఎవరూ ఆమెవైపు చూడలేదు' (పుట 75) అనడం అధిక్షేపించడమే.

'రహస్యంగా అరవడం' అన్న ప్రయోగం తెలుగులో కొత్తగా కనిపెట్టబడినది. ఇలాంటి ప్రయోగాలు తెలుగు సాహిత్యంలో ఈ మధ్య చాలా వస్తున్నాయని బ్రాకెట్లో పెట్టిమరీ పబ్లిషర్స్ వ్యాఖ్యానించడం (పుట 134) ఈ రకం పద ప్రయోగాలను విమర్శించడమే

తులసిదళం నవలను హేళనాత్మకంగా అనుకరిస్తూనే దానిపై వచ్చిన విమర్శలకు బలంగా సమాధానమిచ్చి సాహిత్య విమర్శగా రూపుదాల్చడం 'వేప మండలు' ప్రత్యేకత. ఇది పేరడీ వాఙ్మయంలో ఒక ప్రయోగం అని చెప్పవచ్చు. వేపమండలులో బామ్మ పాత్ర తులసిదళంపె వచ్చిన విమర్శలకు జవాబిస్తుంది.

'చిన్నపిల్లల స్థాయిలో చదివే చిన్నపిల్లల బొమ్మల పుస్తకానికి, పెద్దవాళ్ళని టెన్షన్‌తో చదివించే ఈ ఫిక్షన్ నవలకి తేడాలేదని బామ్మ అంటుంది. (పుట 164) ప్రతివాళ్ళూ ఇంకొకరు పాడయ్యారనే అంటున్నారు గానీ ఎవరు పాడయ్యారో చెప్పలేదు!, పుస్తకం చదివి పిచ్చెక్కేటంత బలహీనమైన మన స్తత్వం కలవాడు ఎప్పటికన్నా పిచ్చివాడుగానే మారతాడు ... ప్రజలు వీటిని (చేతబడిలాంటి మూఢాచారాలను) మర్చిపోయారనుకోవటం మన మూర్ఖత్వమే అవుతుంది. అదీగాక రచయిత ఇవన్నీ వున్నాయనీ ఎక్కడా అనలేదు ప్రతి దానికీ హేతువు ఉంటుందనీ, ఈరోజు హేతువు మనకి కనబడలేదు కాబట్టి

అది లేదనకూడదని చెప్పాడు. పోతే ఈ రోజుల్లో చేతబడి పేరిట మనుషుల్ని మోసంచేసే కపట మాంత్రికుల ఆట కట్టించాలని ఉద్బోధించాడు దీన్ని అర్థం చేసుకోకుండా ఇంట్లో చిన్నపిల్లకి జలుబు చేసినా దాన్ని 'చేతబడి'గా భావించి విమర్శిస్తే ఎలా?' అని బామ్మ సూటిగా ప్రశ్నిస్తుంది. (పుట 165.)

'ఏ నవలైనా అందులో నిజంగా మసాలా వుంటేనే చరిత్రలో నిలబడుతోంది. అది లేకపోతే ప్రజలే దాన్ని మర్చిపోతారు. దీనికోసం అయ్యో, సాహిత్యం సర్వనాశనం అయిపోతుందే అని గుండెలు బాదుకోనక్కర్లేదు. ప్రజలకన్నా గొప్ప బరామీటరు ఇంకొకటిలేదు లేదనుకొంటే ఏమీలేదు, ఉందనుకొంటే చాలా వుంటుంది ఎలక్ట్రానిక్స్ నుంచి హిప్నాటిజం వరకూ రకరకాల పాత్రలూ వాటి వ్యక్తిత్వమూ - ఘర్షణ అన్నింటికిమించి మంచి క్లైమాక్స్ ఉండడంతో ఆ నవలకు పేరు ప్రఖ్యాతులు వచ్చాయి కాని నిజ జీవితంలో అంతకంటే ఘోరంగా చిత్రంగా ప్రవర్తిస్తా'మని బామ్మ వాదిస్తుంది (పుట 166) 'బీభత్సరసానికైన సరే ఆకర్షణ ప్రధానం' (పుట 168) 'ఒక అనాగరికమైన ప్రపంచపు నమ్మకాల గురించి వ్రాసేటప్పుడు ఆ ప్రపంచంలోకి వెళ్ళి వ్రాయాలి' (పుట 168) అని ఇతివృత్తానికి అనువైన వాతావరణల కల్పించడం సాహిత్య ధర్మంగా బామ్మ మాటల్లో ద్యోతకమవుతుంది

ఇలా తులసిదళంపై వచ్చిన 'విమర్శ'లను ఎదుర్కోవడంగాక 'విమర్శకు'లను కూడ వేపమండలు ఎదుర్కొంది పనిగట్టుకొని, తన శక్తియుక్తులన్నీ కేంద్రీకరించి తులసిదళాన్ని విమర్శించిన రచయిత్రి ముప్పాళ రంగనాయకమ్మ మేరి పాత్ర చిత్రణలోనూ, బామ్మ విమర్శల్లోను రంగనాయకమ్మ మీద పరోక్షంగా దాడి చేయడం కనిపిస్తుంది

ఒకచోట మేరి పైడిరాజుతో ఇలా అంటుంది:

నా జీవితం ఓ స్వీట్ హోంలా ఉండాలని కలలు కనేదాన్ని. ఎప్పుడైతే నా కాపురం ఉరిపీరం ఎక్కిందో అప్పుడే నాలో కక్ష బయల్దేరింది. ఇన్నాళ్ళూ నేను ఎంత చీకటిలో వున్నానో తెలుసుకున్నాను కేవలం మార్క్స్ ఒక్కడే స్త్రీలని రక్షించగలడని గ్రహించాను రామాయణ కాలంనాటి మార్క్స్

లేకపోవటం సీత చేసుకున్న దురదృష్టం... మనిషి తనకి నచ్చినట్లు బ్రతకాలి. (పుట 131.)

'భర్తలకి విడాకులిచ్చిన వాళ్ళు, భర్తల్తో సరిగ్గా కాపురాలు చెయ్యలేని వాళ్ళు, తాము చేసిన తప్పు గ్రహించటానికి అహం అడ్డొచ్చి తాము నడుస్తూన్న పంథాయే గొప్పదన్న ఒక మాయా ప్రపంచంలో మునిగి తేల్తూ ఉంటారు. సుఖంగా సంసారాలు చేసుకునే ఆడవారికి విడాకులు తీసుకొమ్మని సలహాలు ఇస్తూ వుంటారు. తమ జీవితం సర్వనాశనం అయిపోయిందన్న సత్యం మరిచి ప్రపంచమే సర్వనాశనం అయిపోయిందని వాపోతూవుంటారు.' (పుట 40.)

ఇవన్నీ ముప్పాళ రంగనాయకమ్మ మీద సంధించిన అస్త్రాలేనని తల పోయడంలో అసంగతమేమీ లేదు 'వేపమండలు' తులసిదళం మీద వచ్చిన విమర్శలను ఖండించి, అంతటితో ఆగిపోలేదు తులసిదళాన్ని కూడ అధిక్షేపిస్తూ లోపాలను కూడా ఎత్తి చూపింది

'కార్లలో తిరిగేవారికీ, ఎయిర్ కండిషన్డ్ రూముల జీవితాల గురించి మాత్రమే తెలిసిన వారికీ. ఒక పాప వంట్లో బాగోలేకపోతే నెలాఖరున పది రూపాయలు లేక ఒక మధ్యతరగతి కుటుంబం పడే బాధలగురించి వ్రాస్తే ఎవరూ చదవరు. శశిధర్‌కి కారుండాలి. పాపకి షాక్మోరా అయివుండాలి.' (పుట. 63.)

మెదడులోని తరంగాల ద్వారా ఇంకొకరికి సందేశాలు పంపడం - అదే టెలిపతీ దానిని గురించి చెప్తు రచయిత్రి ఇలా అంటుంది 'వీళ్ళు ఇంగ్లీషు పుస్తకాల్ని జాగ్రత్తగా కాపీకొట్టి వ్రాస్తూ వుంటారు. చిత్రమేమంటే వీరు వ్రాసే విషయాలన్నీ ఫారిన్‌లో జరిగేవే. భారత దేశంలో ఒక్కటీ జరగదు 1932 లో ఏడెన్ స్ట్రీట్‌లో లేడీ ఫింగర్ అనే ఆమె ఇంకో గంటలో లండన్ వచ్చే విమానం కూలిపోతుంది అని చెప్పింది. అలాగే గంటలో అది కూలిపోయింది అని వ్రాస్తారు. నిజానికి ఆ ఏడెన్ స్ట్రీట్ ఎక్కడుందో- ఆ లేడీ ఫింగర్ ఎవరో ఎవరికీ తెలీదు. ఆ తరువాత ఆ అంశాన్నే చదివి మరో రచయిత, తన కలం కొంచెం ముందుకి పోనిచ్చి లేడీఫింగర్ తాలూకు భర్త ఆ విమానంలో వున్నాడనీ, కూలిపోయే విమానంలోంచి భావతరంగాల్ని తన భార్యకి పంపాడనీ వ్రాస్తాడు. అలా చరిత్ర నిర్మించబడుతోంది' (పుట 126).

'ఈ వ్యాసాలు, నవలలు చదివేవాళ్ళు - ముఖ్యంగా పదహారు ఇరవై అయిదేళ్ళ వయస్సు వాళ్ళ తమకు ఆ అద్భుతమైన శక్తులున్నాయను కుంటారు ఆ భ్రమతో రకరకాలుగా వూహించుకుంటారు' (పుట 127).

ఎంతో జాగ్రత్తగా ప్రణాళికా బద్ధంగా యండమూరి వీరేంద్రనాథ్ తులసిదళం రచించినట్లు కనిపిస్తుంది అయినా ఒకటి రెండు పొరపాట్లు దొర్లాయి

'నఀఖై అయిదేళ్ళ డాక్టరు పార్థసారథి' (పుట 154) వైద్యునిగా తన ఓటమి విజయాలను 30 డైరీలలో నింపాడు (పుట 157) అంటే పార్థసారథి 15 ఏళ్ళకే డాక్టరయ్యారన్నమాట.

అలాగే ఇంకోచోట 'తులసికి పదవ ఏట ఆస్తి వస్తుంది' (పుట 83) అని అనడం మరోచోట 'మేజ'రయ్యాక ఆమెకే డైరెక్ట్‌గా చెందుతుందనడం (పుట 84) మైనార్టీ తీరి మేజరయ్యేది 18 ఏళ్ళకు కాని 10 ఏళ్ళకు కాదుగదా!

'వేపమండలు'లో కూడ ఒక చిన్న పొరపాటు కనబడింది ఎన్నాగ్రావు పనిచేసేది టెలిగ్రాఫ్ ఆఫీసులోనే శశిధర్ (బావమరిది)కి తన ఆఫీసులోనే ఉద్యోగం ఇప్పించాడు (పుట 143 ) అంటే శశిధర్ కూడా టెలిగ్రాఫ్ ఆఫీసులో పని చేస్తాడన్నది స్పష్టం కాని మొదట శశిధర్ ఫాక్టరీలో పనిచేస్తాడని (పుట 10) పరిచయం చేసింది రచయిత్రి.

కథాకథనంలోను, నామ నిర్దేశంలోను, పాత్ర చిత్రీకరణంలోను, శైలీ గతమైన మేనరిజమ్స్‌లోను - ఒక్కటనికాదు సర్వ విషయాల్లోను యండమూరి తులసిదళాన్ని వికటంగా విడంబిస్తూ వెలువడిన సమగ్ర పేరడీ నవల శ్రీమతి సంగీతారెడ్డి 'వేపమండలు '

కొసమెరుపు · ఇంతకూ 'సంగీతారెడ్డి' పేరుతో ఈ నవల రాసింది యండమూరి వీరేంద్రనాథే తప్ప మరెవరో కాదు అంటే తన రచనమీద తానే పేరడీ రాసుకొన్నాడన్నమాట!!

* *

# 19. శ్రీరమణ

పేరడీలపై దృష్టి కేంద్రీకరించి కృషిచేసిన మలితరం వారిలో శ్రీరమణది అగ్రతాంబూలం 'శ్రీరమణ తెలుగు వచనోద్యానవనంలో ఈ మధ్యనే విరిసిన పువ్వు. విరిసీ విరియగానే హాస్య పరిమళాల హాయితో, పేరడీల గారడీలతో అందర్నీ సమ్మోహ పరచిన రచయిత.' తెలుగులో తొలిసారిగా 'పేరడీల'ను సంకలనం చేసి ప్రచురించిన ఖ్యాతి శ్రీరమణకే దక్కుతుంది 1980 లో 'శ్రీరమణ పేరడీలు' వచ్చాకనే జరుక్ శాస్త్రి పేరడీలు (1982) మాచిరాజు దేవీ ప్రసాద్ పేరడీలు(1986) తెలుగు పేరడీలు (1986) వచ్చాయి.

శ్రీరమణ ఇంచుమించుగా స్వీయముద్ర గల్గిన ప్రతి రచయిత పద్యగద్య శైలులను అనుకరించి చూపాడు ఒక్కొక్క కవిని అనుకరించేటప్పుడు పేరడీస్టు ఒక్కో అంశాన్ని స్వీకరించడం మామూలుగా జరుగుతుంది. ఒకే వస్తువును తీసుకొని వివిధ రచయితలు ఎలా దాన్ని రాస్తారో ఊహించి రాయడం శ్రీరమణ చూపిన ప్రత్యేకత. పేరడీ చరిత్రలో శ్రీరమణ చూపిన విశిష్టత, నవ్యత ఇది. జాతీయ విహంగమైన నెమలిని కవులు ఎలా వర్ణిస్తారో కవిత్వంలో పేరడీ చేసి చూపాడు రైలు కంపార్టుమెంటులో ఆలోచిస్తూ కూర్చున్న ప్రయాణికుని గురించీ, పుష్కరాలను గురించీ కథకులు, నవలా రచయిత(త్రు)లు, ఫీచర్ రచయితలు వర్ణించే విధానాన్ని పేరడీ చేశాడు ఆయా కవులు, రచయితలు ప్రేమలేఖలు రాస్తే ఎలా వుంటుందో అత్యంత ప్రతిభావంతంగా చూపించాడు

అడవి బాపిరాజు రచనల్లో అతి వివరణాత్మక శైలి ఉంటుంది. ఆయన గ్రహించిన వస్తువు వివరాలను అన్నివైపుల నుండి పూసగుచ్చినట్లుగా పాఠకులకు అందిస్తాడు. కథ చెప్పినట్లుగా గాక చరిత్ర, విజ్ఞానబోధ చేసినట్లుగా కనిపించడం కూడా కద్దు ఈ పద్ధతి నిసర్గ రమణీయంగా అనిపించినా, కథాగమనాన్ని కుంటుపరచి, పరితలకు ఒక్కోసారి విసుగు తెప్పిస్తుంది. బాపిరాజు రాసిన 'నారాయణరావు' గానీ, 'హిమబిందు' గానీ, మరే నవల చదివినా ఈ విషయం బోధపడుతుంది

కథలో ప్రాధాన్యం కలిగిన ఒక భవనాన్ని, అడవి బాపిరాజు ఎలా వర్ణిస్తాడో శ్రీరమణ అనుకరించి చూపాడు:

"రాజమహేంద్రవరములో శ్రీ సర్వోత్తమరావు గారు తమ నివాస భవనమును కట్టించిరి. అది పవిత్ర గౌతమీ నదిని అందిపుచ్చుకున్నట్లుండును. వేయి గజముల నివేశన స్థలములో భవన నిర్మాణము జరిగినది. తొమ్మిది గజముల ముప్పిసము నిడివియు పులిలోపల మూడు గజముల అరంగళముల వెడల్పునూ ఆయము కలిగిన 'డబులు హాల్సు' గలవు. వంటశాల భోజనముల గది ప్రత్యేకముగా నున్నవి. వాటి మారేసు మైసరు' కరు నిల్చుటకు వీలుగా పోర్టికో' నేర్పాటు చేసిరి. గోడలకు ఏడడుగుల బునాదియు, మూడు జేనల మందమునూ వుంచినారు. సింహద్వారము నల్లమాను కొయ్యతో చెక్కిరి. మిగిలిన వురుపులన్నియు ప్రశస్తమైన రంగూను టేకుతో తయారు చేసినారు. గోడ బీర్వాలారంటికి బిళ్ళోరి అద్దములను బిగింపించిరి. ఇంటికి యీశాన్యమున నలుబది గజముల ఖాళీ స్థలమును వదిలిరి. ఈశాన్యము దైవస్థానమని వాస్తు చెప్పుచున్నది. ధవళేశ్వరవాసియు, వాస్తు శిల్పమున దిట్టయునైన శ్రీ రావిపూడి నరసింహ సిద్ధాంతిగారి పర్యవేక్షణమున గృహ నిర్మాణం జరిగింది. ఆనందనామ సం॥ర చైత్ర బహుళ పంచమిన శ్రీ సర్వోత్తమరావుగారు నూతన గృహప్రవేశ మహోత్సవం గావించుచు, శ్రీ నరసింహ సిద్ధాంతిగారిని జత పెద్దపురం జరీ ధోవతులు తోను, నూటపదార్లు రొఖ్ఖంతోను సతకరించిరి." (శ్రీరమణ పేరడీలు పుట 21 - 22)

బాపిరాజు రచనా విధానం ఇలా ఉంటే మామూలు డిటెక్టివు నవల ధోరణి మరో తీరుగా ఉంటుంది. కథలో వేగం, అడుగడుగున పాఠకులను ఊపిరి బిగబట్టించే ఉత్కంఠ, అపరాధ పరిశోధకుడి చురుకుదనం, సాహసం, తెలివితేటలు, బాంబులు, ఫైటింగులు, మారువేషాలు, కాస్త సెక్సు - ఇవన్నీ అపరాధ పరిశోధక నవలలకు ముడిసరుకులు. సాధారణంగా అన్ని నవలలకు ఒకే 'ఫార్ములా' ఉంటుంది. హోమ్ మినిస్టర్ లేదా క్రైమ్ బ్రాంచ్ చీఫ్, డిటెక్టివ్‌ను కలిసి, నేరాన్ని పరిశోధించి, ముద్దాయి పట్టుకోవలసిందని అభ్యర్థించడంతో కథ మొదలవుతుంది. రకరకాల మలుపులు తిరిగి విజయుడైన డిటెక్టివ్‌ను మళ్ళీ వారు అభినందించడంతో ముగుస్తుంది. కొమ్మూరి సాంబశివరావు, విశ్వప్రసాద్, గిరిజా శ్రీ భగవాన్‌లాంటి వారెందరో డిటెక్టివ్ నవలా రచయితలుగా ప్రసిద్ధి గడించారు. కొంతమంది దృష్టిలో ఇది 'శవ సాహిత్యం' కానీ ఒక తరహా పాఠకులకు నిత్య పఠనీయ (పారాయణ) సాహిత్యం. "ఆలివ్ గ్రీన్ కడిలాక్ బులెట్‌లా దూసుకువచ్చి 'కీచ్' మని శబ్దంచేస్తూ గేట్ ముందు ఆగింది. డాష్ బోర్డులోంచి పెన్‌గన్ తీసుకొని గేటు దగ్గరకు నడిచాడు డిటెక్టివ్ సుధీర్

అసిస్టెంట్ వర్మ పాకెట్ కెమరాలో మైక్రో ఫిలిమ్ లోడ్ చేసుకుని సుధీర్‌ని ఫాలో అయ్యాడు.

"చాలా కాలంగా మనుష్య సంచారం లేనట్లుంది కదూ?" అన్నాడు బంగళాని కలియ చూస్తూ సుధీర్, "అవును బాస్! నాకూ అలాగే అనిపిస్తోంది" అన్నాడు వర్మ వర్మ మాట పూర్తి కాకుండానే బంగళాలోంచి మనిషి మూలుగు అస్పష్టంగా విన్పించసాగింది

అంతా చీకటి. కన్ను పొడుచుకున్నా కన్పించనంత చీకటి దూరాన్నుండి నక్కల అరుపులు టక్ టక్ నాలుగు అడుగులు ముందుకు వేసి ఆగి పోయాడు సుధీర్. మనిషి మూలుగు ఆగిపోయింది సడెన్‌గా.

పెన్ టార్చ్‌తో బంగళా మెయిన్ డోర్ వైపుకు నడిచారు ఇద్దరూ

"మిస్టర్ వర్మా! బంగళా వెనుక పెద్ద వేపచెట్టు వుంది గమనించారా?"

"అవున్‌సార్! దానికో పెద్ద తొర్ర కూడా ఉంది

"ఎస్" - తల పంకించాడు సుధీర్ "మిస్టరీ అంతా అందులోనే వుందని నా గట్టి నమ్మకం" అరబ్ సెవెన్ సిగరెట్ వెలిగించాడు డిటెక్టివ్ సుధీర్" (పుట 35, 36)

సాధారణ సాంఘిక నవలల శైలి ఒక ప్రత్యేక పంథాలో సాగుతుంది. సాంఘిక నవలారంగంలో రచయిత్రులదే పైచేయి ఈ రచయిత్రులందరివీ చాలా మటుకు ఒకేరకం భావాలు, ఒకేరకం శైలి అని చెప్పవచ్చు. స్వప్న సంచారాలు చేయించే వీరి నవలలు యువతరానికి ఒక మత్తుమందు లాంటివి. ఇప్పుడు సాంఘిక నవలల ఉధృతి తగ్గింది ఆరడుగుల కళ్యాణ చక్రవర్తులు, రయ్యిన దూసుకుపోయే పడవలాంటి కార్లు, లంకంత భవంతి, నౌకర్లు. తల్లి, పెళ్ళికాని చెల్లి నవలలో కనిపిస్తుంటారు కథానాయకుడు ఏం చదువుతుంటాడో, ఏం చేస్తుంటాడో, కులం, గోత్రం, ఆదాయం వగైరా ఏవీ స్పష్టంగా తెలియవు. అయినా ఖరీదైన బూట్లు సూట్లు ధరించి, పెద్ద పెద్ద క్లబ్బుల్లో విచ్చలవిడిగా ఖర్చు చేస్తూ తిరుగుతుంటాడు ఎంతో అందం, మరెంతో అహంభావం కలిగిన నాయిక ఉంటుంది ఆమె బీదరాలయ్యే ఉంటుంది చీటికిమాటికి హీరోతో పోట్లాడి చివరకు ప్రేమలో పడుతుంది. తర్వాత ఇద్దరూ కాసేపు విడిపోయి ఏడిచి, ఏడిపించి ఒకటవుతారు [మొదట చెంపదెబ్బ కొట్టిన అమ్మాయే తప్పని సరిగా ప్రేమిస్తుంది 'రేప్' చేసినవాడే మొగుడులాంటి తమాషా సూత్రాలు (Motifs) తెలుగు సాంఘిక నవలల నుండి తయారు చేయవచ్చు ఇది ప్రత్యేకించి పరిశోధించదగిన విషయం.]

నాయికా నాయకలుండేది చిన్న పల్లెటూరైనా పెద్ద పెద్ద ఆసుపత్రులను సృష్టించగలరు ఎక్స్‌ప్రెస్ రైళ్ళను ఆపగలరు. కొండాకచో హైదరాబాదులో బీచ్‌లను, వైర్‌లెస్ తీగలమీద పక్షులను చూపగలిగే నిరంకుశులు సాంఘిక నవలా రచయిత్రులు.

"రైలు రాజహంసలా వచ్చి ఆగింది ఫస్ట్‌క్లాస్ కూపేలో తన బెర్త్‌పై కూర్చున్నాడు కిరణ్ 'మే ఐ టేక్ దిస్?' అన్నాడు ప్రక్కన ఉన్న ఫెమినా తీసుకుంటూ 'బై ఆల్‌మీన్స్' అన్నది ఆమె క్లుప్తంగా ఆ మాటలు కోటివీణలు మీటినట్లు విన్పించినై కిరణ్‌కి తలయెత్తి చూచింది ఆమె ఆరడుగుల ఎత్తు, గ్వాలియర్ సూటూ, ఎంబాసిడర్ బూటూ, చూపరులను ఇట్టే ఆకట్టే ముఖం ఆమె అనిర్వచనీయమైన అనుభూతికి లోనైంది కొద్ది క్షణాలు నిశ్శబ్దం రాజ్యం చేసింది కిరణ్ నుదుటిపై పడిన ఉంగరాల జుత్తు రైలు కుదుపుకు అనుగుణంగా కదుల్తోంది చేతినున్న ఒమేగా వాచీలో టైం చూసుకుని, నాన్‌కిప్‌తో నుదురు తుడుచుకున్నాడు రైలు కూతకు ఆమె ఉలిక్కిపడింది అతను కొంటెగా చూసి చిన్నగా నవ్వాడు "(శ్రీరమణ పేరడీలు, పుట 19) .

యద్దనపూడి సులోచనారాణి కాని, మాదిరెడ్డి సులోచన కానీ, మరో రచయిత్రి అయినా ఇట్లాగే రాస్తుందని నవలలు చదివేవారందరికి తెలిసిన సంగతే

అన్య భాషా నవలలను ఎంత సమర్థుడైన రచయిత తెనిగించినా సరే, అవి సహజమైన తెలుగు నవలల శైలికి భిన్నంగానే ఉంటాయి పేరు చూడకున్నా కూడ అనువాద నవలలను గుర్తించవచ్చు ఆయా ప్రాంతాల వాతావరణం భావాలు ఒక విశిష్టమైన రీతిలో; మనకన్న వేరుగా ఉండడమే ఇందుకు కారణం కేంద్ర సాహిత్య అకాడమి, నేషనల్ బుక్ ట్రస్టు వివిధ భారతీయ భాషల్లోకి గ్రంథాలను తర్జుమాచేసి ప్రకటిస్తున్నాయి. దీనివల్ల భిన్న భారతీయ సాహిత్య సంస్కృతుల మధ్య సదవగాహన పెరిగి జాతీయ సమైక్యతకు సేతువు నిర్మించినట్లవుతుంది సాంఘిక ఆచారాల భావాల సామ్య వైషమ్యాలు దేశ ప్రజ లందరికీ తెలిసే అవకాశం కలిగి, ప్రజల్లో విశాల దృక్పథం ఏర్పడుతుంది

ఇరవయ్యవ శతాబ్ది ప్రథమ ద్వితీయ దశాబ్దాల్లో తెలుగులోకి బెంగాలి నవలలు వెల్లువలా అనువాదమయ్యాయి. తెలుగులోకి ఇతర భాషల నుండి వచ్చిన తొలి నవల బెంగాలీదే. బంకించంద్ర చటర్జీ 'కపాలకుండల'ను 1899లో ఓ వె దొరసామయ్య తెనిగించడంతో అనువాద నవలలకు తెలుగులో శ్రీకారం చుట్టినట్లయింది బంకిం చంద్రుని జాతీయ ప్రబోధాత్మక చారిత్రక నవలలు

భారతీయ భాషలన్నింటిలోకి అనువాదమైనట్లే తెలుగులోకీ వచ్చాయి. చాగంటి శేషయ్య, వేంకట పార్వతీశ్వర కవులు, కె రమేశ్, కమలాసన, దండమూడి మహీధర్ ప్రభృతులెందరో బంకిం చంద్రుని నవలలను తెనిగించారు అట్లాగే శరత్‌చంద్ర చటర్జీ కూడ ఆంధ్రులకు ప్రీతిపాత్రమైన నవలా రచయిత ఒక్క తెలుగుకే కాదు- మొత్తం భారతీయ సాంఘిక కౌటుంబిక నవలలకు శరత్‌చంద్ర మూలపురుషుడన్నా అతిశయోక్తి కాదు చక్రపాణి, వేలూరి శివరామశాస్త్రి, జొన్నలగడ్డ ˊర ా ష.. బొందలపాటి శివరామకృష్ణ, గద్దె లింగయ్య, ప్రభృతులు శరత్ సాహిత్యాన్ని తెలుగులోకి తెచ్చారు

"చాందినీపూర్ సంస్థానంలో ముఖర్జీగారి మాటకు విలువ వుంది ఆ వూరి సంస్కృత పాఠశాల ప్రధానోపాధ్యాయుడే కాళీమాత ఆలయానికి పూజారిగా వుండటం దివాణంలో అనాదిగా వస్తున్న ఆచారం సురేంద్రుడు వయసులో చిన్నవాడైనా అటు సంస్కృత పాఠాలు చెప్పగలడు, ఇటు పూజా విధానమూ తెలుసు దివాణంలో కుదిరిన కొద్ది రోజులకే నలుగురి చేత మంచి అన్పించు కున్నాడు సురేంద్రుడు యామినీదేవి అతనికి తగిన యిల్లాలు

రోజూ ఉదయమే కాళీమాతకు నైవేద్యం తీసుకొని వెళతాడు ఊరి వాళ్ళు తలా వొకరు రోజూ ఒక భాగం అమ్మవారికి చేయించే ఆనవాయితీ చాందినీపూర్‌లో వుంది ఒక రోజు చక్రపొంగలి, మరో దినం దద్ధోజనం, యింకో రోజు పులగం- యిట్లా జరిపిస్తూ వుండడం రివాజు కోవెలలో పంచిపెట్టాక మిగిలిన ప్రసాదం యింటికి తెచ్చేవాడు సురేంద్రుడు ఆ పూటకి వారిద్దరూ దాన్నే భోజనంగా సరిపెట్టుకునేవారు ప్రసాదం రోజూ దివాణానికి వెండి పాత్రలో పంపేవాడు సురేంద్రుడు

ఆ రోజు ముఖర్జీగారి మాటలకు సురేంద్రుడు అప్రతిభుడై అలాగే నిలబడి పోయాడు " (పుట 85-86)

బెంగాలీ నవలల అనువాద ధోరణికి ఇది ప్రతిబింబమైతే - తమిళ కన్నడ నవలల వాతావరణం మరో తీరుగా ఉంటుంది శ్రీరమణ వాటిని కూడ పేరడీ చేశాడు

ఈ విధంగా శ్రీరమణ విశ్వనాథ, అడవి బాపిరాజు, బుచ్చిబాబు గోపీచంద్‌లాంటి ప్రముఖ నవలా రచయితల విశిష్ట రచనారీతిని సాధారణ డిటెక్టివ్, సాంఘిక నవలల సాధారణ శైలిని ఒక్కచేత్తో ప్రతిభావంతంగా పేరడీ చేసి చూపాడు

**

# 20. మహాడు (ముని) మాణిక్యాలు

ప్రఖ్యాత హాస్య రచయిత మునిమాణిక్యం నరసింహారావు 'శ్రీకాంతా యమ్మారావుగారి కైఫీయతు'[1] పేరుతో కైఫీయతుల ధోరణిలో మంచి పేరడీ కథ సృష్టించాడు మెకంజీ (1754 - 1821) సేకరించి రాయించిన కైఫీయతులు ఆంధ్రదేశ చరిత్ర పునర్నిర్మాణానికి, సాంఘిక పరిస్థితుల అవగాహనకు అమూల్యమైన సాధనాలు మునిమాణిక్యం 1937 లో అంతకు 150 ఏళ్ళ కిందటి కైఫీయత్తుల్లోని భాషను, వాక్య నిర్మాణాన్ని, ప్రత్యయాలను హాస్యం కోసం ప్రయోగిస్తు ఈ కథ రాశాడు. అప్పులపాలైన వెంకట్రావును భార్య కాంతం మందలించడం దీనిలోని ఇతివృత్తం .. కాంతంని కాంతాయమ్మారావుగారని, వెంకట్రావుని వెంకట్రాయనింగారని, తక్కినవారిని రాజబంధువులుగా జమిందారీ పద్ధతిలో వర్ణిస్తాడు

'వెంకట్రాయనింగారు సాపరాధుల యందు సహనము గలిగి యాచకులకు దానములున్నూ ఆపన్నులకు అభయమున్నూ ఇచ్చేది. వారి నేత్రములు స్వస్త్రీయందు ఉండేషువంటివి శిరస్సు ఉత్తములకు వందనము చేసేషువంటిది.'

ఈ విధంగా వెంకట్రావును జమీందారుగా మునిమాణిక్యం చిత్రిస్తాడు. భాష వాక్య రచనలోని ప్రాచీనత, పద ప్రయోగాలలోని విలక్షణత అంతా కైఫీయత్‌లదేనని వాటితో ఏ కొంచెం పరిచయమున్నవాడికైనా ఇట్టే తెలుస్తుంది.

'అందుక్కు ఆవిడగారు ఏమిస్నీ లెక్కశాయక బట్టల కొట్టులో నున్నూ, ఇతర అంగళ్ళలో నున్నూ దొరవారు అప్పులు చేస్తూన్న సంగతిన్నీ పది పన్నెండు సంవత్సరాల నుంచీ కాపురం చేస్తున్నా ఏమీ పొదుపుగా సొమ్ము వాడుకొనే వైనం తెలియకపోవడమున్నూ దుబారా ఖర్చులు చేస్తున్న సంగతిన్నీ ఇత్యాది కష్టాలు యావత్తు అగుపర్చుకొన్నది.'

---

1 కాంతం కైఫీయతు-పది వినోద కథల సంపుటి: మే 1937 పుటలు 1-8.

అందరూ కల్సి వెంకట్రావు నెల జీతం తెచ్చి కాంతానికి ఇచ్చేయాలనీ ఆమెనే ఇకముందు ఖర్చుల విషయాలు చూడాలని తీర్మానిస్తారు వెంకట్రావు విధిలేక అంగీకరిస్తాడు

'ఇట్లా అంటూ ఉండంగానే కాంతం రాణీ సాహెబా వారు నిద్రాసక్తులై ఆవలించగా పెదబాబుగారు గమనించి తత్క్షణం దేవిగారిని వెళ్ళిపోయి నిద్రింప వలసినదిగా కోరినారు '

ఆమె వెళ్ళి పడుకొంటుంది భర్త సమీపిస్తాడు.

'మైరాణీ సాహెబాహుఁ మేరా హుకుం హైకి ఆప్ ఫూళోంసే సుసజ్జిత్ తల్పమే లేట్‌జానా' అని రీవిగా ఖామందులవారు అనేవర్కు ఘనత చెందిన చినబాబుగారు హిందీ వలన అపకారం జరుగుతూన్న మాట నిజమేనని అను కొంటూ రాణీ కాంతాయమ్మ రావుగారి ఆజ్ఞను మాటలేకుండా నిర్వహించిన వారైనారు " **

## దర్బారు కథ :

కైఫియత్‌ల శైలిలోనే మునిమాణిక్యం కృష్ణాపత్రిక 'దర్బారు - దాని కథా కమామిషు'1 అనే మరో కథ రచించాడు

కృష్ణాపత్రిక కార్యాలయంలో జమ్మిగడ్డితో కప్పబడిన పాక ఒకటి ఉండేది దాన్ని అందరూ 'జమ్మీ మహల్' అని ముద్దుగా పిలుచుకొనేవారు కృష్ణాపత్రిక సంపాదకులు ముట్నూరి కృష్ణారావు పడకకుర్చీలో ఆసీనులు అయ్యేవారు ఆయనను అందరు 'గురుగ్రంథ సాహెబ్' అని పిలిచేవారు

ఆ కాలంలో మచిలీపట్టణ నివాసులైన ప్రఖ్యాత కవులు, రచయితలు విశ్వనాథ, కాటూరి, కోలవెన్ను, రావూరి, జలసూత్రం, చెరుకువాడ ప్రభృతు లెందరో ఆయన చుట్టు ప్రతిరోజు సాయంకాలం చేరేవారు సాహిత్యగోష్ఠులు రసవత్తరంగా జరిగేవి

కృష్ణారావు దర్బారును కైఫీయత్‌ల శైలిలో మునిమాణిక్యం వర్ణించాడు.

1 మునిమాణిక్యం కథలు

ఇష్టాగోష్ఠి సాగుతుంది చీకటి పడింది కృష్ణారావు పంతులు దీపం వెలిగించడానికి లేవగానే ఎవరో లేచి స్విచ్ వేశారు లైటు వెలిగింది ఇదీ సంగతి దీనిని ఆయన వర్ణించిన విధం చూద్దాం:

" 'హే మహాదేవా! హే జమ్మి దేవాలయ వైరిభయంకరా! హే సుఖాసీనా! గురుగ్రంథసాహెబ్ జీ బిరుదాంకితా! అబ్దితుల్ జఖరాన్ కృష్ణరాయ బహదూర్! మీరు ఈ చీకట్లను పారద్రోలడానికి స్వయంగా చేయి చేసుకోవలెనా? తమ దరియాప్తులో ఉండే సిబ్బంది యావత్తూ తమ కనుసన్నల మెలగుతూ ఉన్నాము తమ హస్త సంచలనము హుకుంగా గ్రహించి నిర్వహించగలవారము లడాయికి అంటే లగ్గలు ఎక్కి పిరంగులు బారుసేసి శత్రు సంహారము చేయగలవారము' అనే వర్కు మహాత్ములు దబేలున కుర్చీలో కూలబడిరి అంతట సిబ్బంది యావత్తును తూర్పు ముఖంగా అనిమేషులై చూస్తూ ఉండగా మెరుపులాగ తళుక్కున దీపం వెలగడం సంభవించింది సర్దారులు అంతా సంతోషాం తరంగులైరి " **

## కోర్టులో కాంతం:

తండ్రి సాయంకాలం ఇంటికి రాగానే పసిపిల్లలు ఏడుస్తూ 'అమ్మకొట్టిం' దని పిర్యాదు చేయడం, ఎవరిది తప్పో విచారించడం అనే చిన్న అంశాన్ని తీసుకొని న్యాయస్థానాల పరిభాషను, నేర విచారణ పద్ధతిని వాడి ఏదో గంభీర విషయం చెప్తున్నట్లు భ్రమగొల్పె శైలిలో మునిమాణిక్యం ఓ మనోహరమైన కథ రాశాడు [1] కోర్టు కేసులు వాదాలు తెలిపే పత్రాల శైలిని దీనికొక మాతృకగా తలపోయాలి

" ఇక తల్లి సంగతి నిప్పుపుల్లల పెట్టి చేతిలో ఉండటం మూలానా అదే ఇంతపని చేసి ఉంటుందని తల్లి అభిప్రాయపడి వాళ్ళను తలా నాలుగు కొట్టడం ఎస్సాల్ట్ నేరము క్రిందికి వస్తుంది వాళ్ల ఏడ్పు నానాగోల చేసి ఉంటారు అప్పుడు బ్రీచ్ అఫ్ డొమేస్టిక్ పీస్ జరిగింది ఇదివరకే ముద్దాయినైన నీపై రాంగ్ఫుల్

1. కాంతం కైఫియతు-పధి వినోద కథలు (మే 1937) పుట 38-46

కన్‌ఫైన్‌మెంటు కేసు ఉంది పిల్లలకు పూలకోసం ఇచ్చిన డబ్బును అపహరించావు అదీకాక నీవు ఇటువంటి నేరములను తరచూ చేస్తూ ఉండే ఓల్డ్ అఫెండర్ కాబట్టినీన్ని చేసిన నేరాలన్ని కలిపి కన్‌సాలిడేటెడ్ స్టేట్‌మెంట్ ఒకటి తయారు జేసి తగిన శిక్షను అనుభవించటానికై నిన్ను సెషన్సుకు కమిట్ చేస్తున్నాను. సెషన్సు కోర్టుకు నీవు మాత్రం రావాలి. పిల్లలు రానక్కరలేదు వారి విషయమై ఉన్న రికార్డు చాలు' అని తీర్పు చెప్పాడు గృహస్థు "

సాంసారిక జీవితంలో ఉండే సున్నితమైన హాస్యాన్ని సెల్యులాయిడ్ చెసి మనోహరంగా వర్ణించి చూపిన రచయిత **'కాంతామనోహరుడు '** వర్తమాన సాంసారిక కథకు వ్యక్తి ప్రశంసకు ప్రాచీన కైఫియత్‌ల శైలిని వాడడం వల్ల చిన్న పిల్లల పోట్లాటలకు ఏడ్పులకు కోర్టు పరిభాషను వాడడం వల్లను ఇవి పేరడీ కథలయ్యాయి **

# 21. ఋణానందలహరి

ముళ్ళపూడి వెంకటరమణ ఋణానందలహరిలోను, రాజకీయ బేతాళ పంచవింశతిలోను, మరికొన్ని రచనల్లోను పదాలను విరవడం ద్వారాను, నుడికారాలను వాచ్యార్థంలో గ్రహించడం ద్వారాను, కథనంలోను ఎన్నో తీరులలో పేరడీ ప్రవేశపెట్టాడు.

గురజాడ గిరీశం, పానుగంటి జంఘాలశాస్త్రి, మునిమాణిక్యం కాంతం వలెనే ముళ్ళపూడి సృష్టించిన అప్పారావు కూడ ఒక సజీవ పాత్ర. అప్పారావు జీవించిన 'ఋణానందలహరి' పుస్తకం చదివి నిద్రపోగానే రాత్రి కల్లోకి వచ్చి 'హలో! ఓ ఫైవుందా' అంటూ అప్పు అడిగే ఘనుడు అప్పారావు. ముళ్ళపూడి రాసిన ఈ చిత్రవిచిత్రాల 'ఋణకథల' సంకలనం పేరు ఋణానందలహరి అను అప్పుకపీయము. అసలు పుస్తకం పేరులోనే పేరడీ మొదలైంది. ఋణానందలహరి అనగానే ఆదిశంకరుల శివానందలహరి, అప్పుకపీయము అనగానే ప్రఖ్యాత ఛందోగ్రంథం అప్పకవీయం గుర్తుకు రాలేదంటే వాడు సాహిత్యపఠిత కాడు. భద్రాచల రామదాసు "దాశరథీ! కరుణాపయోనిధీ!' అని ఆరాధిస్తే దాన్ని విరిచి 'ఋణదా శరథీ! కరుణాపయోనిధీ!' అనడం ఒక ముళ్ళపూడికే చెల్లింది.

పోతన భాగవత పద్యాలకు ఋణాన్వయం కల్పించి 'ఋణానందలహరి'కి అవతారికగా రచయిత కూర్చాడు:

ఎవ్వనిచే జనించు ఋణమెవ్వనిచే భ్రమియించు లోకమం<br>
దెవ్వని బుద్ధియే ఋణదమెవ్వడు నవ్వుచు నప్పులిచ్చుదా<br>
నివ్వగ జాలనం చనక నివ్వగ జాలక, దిప్పనట్టి వా<br>
డెవ్వడు - ఆ ఋణాత్ము, ఋణదేశ్వరు నేను ఋణంబు వేడెదన్

అడిగిన వెంటనే ఇవ్వననకుండ ఇవ్వడానికి మరల మరల తిప్పుకోకుండా (ఇచ్చి మరల అడగకుండా) ఉండే ఆ ఋణాత్ముని 'అభీష్టావాప్తి' కోసం ఋణం వేడిన విధప.

ఒక సూర్యుండు సమస్తజీవులకు దానొక్కొక్కడై దోచున
ట్లొకచే రూక ధనమ్ముగా ఋణముగా నొక్కొక్కచో శిక్షగా
నొకచో రక్షగ లక్షగా తృణముగా నొక్కొక్కడై తోచుగా
కొకచే సత్యము- ఒర్రి రూకసుడి! అప్పొప్పుల్ అపోహల్, భ్రమల్

మరి ఈ ఋణదేశ్వరునకు స్తుతులు, నుతులు, నతులు, వినతులు, ప్రణతులు వగైరా వగైరాలన్నీ పూర్తయ్యాక కావ్యలక్షణాల్లో ఒకటైనా షష్ఠ్యంతాలు కనీసం ఒక్కటైనా చెప్పకుంటే పండితులకు ఋణాగ్రహం కలుగుతుంది అది గుర్తించే ముళ్ళపూడి షష్ఠ్యంతం కూర్చాడు·

ఋణ ఋగ్వేదికి వాదికి
ఋణకారణ జన్మదైన ఋణఖాదికి దా
ఋణ బుద్ధికి, ఋణ సిద్ధికి
ఋణ భ్రమాభ్రమరునకును ఋణికిన్ ఘృణికిన్
ఋణతరుణ వందన సహస్రంబాచరించి గ్రంథానికి శ్రీకారం చుట్టాడు

శుకసప్తతి కథల్లో కథలు చెప్పి ఒక చిలుక నాయికను నాయకునితో కలవకుండా నివారిస్తుంది ఆట్లాగే ఋణానందలహరిలో గూడా మున్సబు తన కొడుకు గుర్నాథం అప్పారావుకు అప్పులివ్వకుండా కదలు చెప్పి వారిస్తాడు ఋణదత్తుని కథ, ఋణ హృదయము, ఋణక్రేతుని కథ, ఋణాన్నభుక్కుల కథ, - చీమ పాముల సంవాద ప్రకారము, ప్రమాదము తప్పిన ప్రకారము మొ॥ కథల శీర్షికలు వీటిని చూస్తే ముళ్ళపూడి కావాలనే గ్రాంథికంలో ఉంచి, కావ్యాల శీర్షికలకు పేరడీలుగా తలపింపచేశాడని తలపోయవచ్చు పదాలను, నుడికారాలను, సామెతలను సరికొత్తగా ప్రయోగించడం ముళ్ళపూడికి వెన్నతో పెట్టిన విద్య.

చీమంతి (ఆడచీమ), చీమంతుడు (మగచీమ); చీమాభ (చీమల జనాభ); టోకరాసురుడు, టోకరాస్యుడు, సెన్సారపక్షంగా, డెలిగ్రామ్యభాష, సెగ్జయిట్‌మెంట్ లాంటి వెన్నింటినో పేర్కొనవచ్చు గుర్రానికి గడ్డిపరకలు చెల్లాయి (మనిషికి నూకలు చెల్లాయి) లాంటివి కూడా!

'మీదేవూరు' అని అడగడానికి 'మీదేవూరన్నారు?' అని అడగడం నోటి భాషలో మనకు అలవాటే అలాగే అప్పారావు ఓ పాత్రను అడిగితే ఆ పాత్ర

'నేనేం అనలేదే' అని గడుసుగా జవాబిస్తాడు (పుట 61) అలాగే 'సిగ్గులేదురా' అని 'ఆమధ్య ఉండేదనేవాడివి' అని అనడం (పుట 64) లాంటి వెన్నింటినో ఉదాహరించవచ్చును

ఋణుసందలహరిలో 'అప్పడి కథ' (పుట 91) చెప్తూ, చిన్నపిల్లలు ఇళ్ళల్లో పాఠాలు బట్టీపట్టే విధానాన్ని పేరడీ చేయడం గమనార్హం

"పూర్వము అప్పడని ఒక్కడుండెను ఇద్దరు ఉన్డుటకు వీలులేకనే వక్కడు వున్డెను వానికి ఏబ్బుగల స్నేహితుడూ గలడు అందువల్ల డబ్బు లేదు. అందు స్నేహితుడు అప్పడికి మొహమాటంచె ప్రతి దినమూ ఒక వరహా బదులు ఇచ్చుచుండెనూ ఇట్లుండగా ఒక దినమున అప్పడు ఇట్లాలోచించెను; వీడు నాకు రోజురోజూ వడ్డీ వరహా ఇస్తూ ఉన్నాడుగదా, వక్కసారే వంద ఎందుకు అడగరాదూ విడు ఇవ్వరాదూ ఇట్లా యోచించి అట్లా అప్పుడు మిత్రుదని ఒకరోజున వక్కసారిగా వంద వరహాలు అడిగెనూ. వాడు వెంటనే నాపెద్ద అంత డబ్బులేదు గదా ఏమి చేయుదునూ అని యోచించి, ఓరి అప్పడూ, నావద్ద లేదు అని చెప్పివేసెనూ మొహమాటమూ పోయింది గావున మరునాడు ఒక వరహాకూడా ఇవ్వలేదూ ' అని కథ ముగించాడు చీమల సింహాద్రి ఆయాస పడుతూ ''

చిన్నపిల్లలు బిగ్గరగా చదువుతున్నపుడు వాక్యాంతాలను దీర్ఘాంతంగా పలకడం సహజం ఇంకా పిల్లలు సంభాషణలు పలికే విధానంలో కూడ వైవిధ్యం ఉంటుంది విషయంతో సంబంధం లేకుండా కెవలం చదివే తీరును పేరడీ చేయడం ఇందలి విశేషం

ముళ్ళపూడి రాసిన రాజకీయ భేతాళ పంచవింశతిక నీతిలేని నేతలపై వాత దీనిలో బేతాళుడు రామిరెడ్డి కాగా, విక్రమార్కుడు సుబ్బరాజు బేతాళ కథల్లోలాగే దీనిలోను కథలు ప్రశ్న - సమాధానంగా సాగుతాయి దీనిలో ప్రధానంగా చేపకథ పేరడీకథ అని చెప్పవచ్చు.

ఓ మంత్రి భోజనం చేస్తున్నపుడు ఒక ఎండని చేప వస్తుంది మిగతావన్నీ ఎండినప్పుడు దీనికేం రోగం? ఇదేం అసెంబ్లీ అనుకుందా? మునిసిపల్ కవున్సిల్ అనుకుందా? ఇండిపెండెంటు మెంబరనుకుందా? అని కోపంతో ఆ మంత్రి ఎంక్వైరీ కమీషనర్గా తనను తానే నియమించుకొని విచారణకుద్యమించాడు

చేపా చేపా ఎందుకెండలేదు?
గడ్డిదుబ్బు అడ్డొచ్చింది.
ట్రాక్టర్ మిషన్‌వాడూ! ట్రాక్టర్ మిషన్‌వాడ గడ్డి దుబ్బు
నెందుకు కొట్టలేదు?
కామందు చెప్పలేదు ఆయన తనకుమారుని ఇక్కడికి
బదిలీ చేయించుకోవాలని ప్రయత్నిస్తున్నాడు

ఇలాగ విచారణ తిరిగి తిరిగి, బదిలీల మీద, కంపెనీల మీద, ఉపాధ్యాయుల జీతాలమీద నడిచి తీగలాగితే డొంకంతా కదిలినట్లు తనకే ఎసరు తెచ్చే పరిస్థితి ఏర్పడి ఫైలు మూసేయించాలని యోచిస్తాడు కాని అప్పటికే పత్రికల కెక్కడంతో ప్రతిపక్షాలవారు నివేదిక అడుగుతారు ఫలితంగా ప్రముఖులతో మరో సంఘం ఏర్పడుతుంది వివిధ పట్టణాలలో సమావేశాలు జరిపి, చివరి సమావేశం ఊటీలో నిర్వహిస్తారు అప్పటికి మూడు నెలలవుతుంది ఈ పాటికది కుళ్ళి చెడిపోయి వుంటుంది కాబట్టి ఆ చేప ముక్కను వీధిలో పారెయ్యాలని సూచిస్తారు ఇంచుమించు ప్రభుత్వాలు నియమిస్తున్న విచారణ సంఘాలన్ని ఇలాగే అవుతున్నాయన్న అధిక్షేపాత్మక విమర్శను పేరడీలో ముళ్ళపూడి సంతరించాడు

ముళ్ళపూడి 'సీతాకళ్యాణం'లోని జలప్రళయం కథ కూడ పేరడీ చాయలున్నదే. చీమలలోకానికి ప్రళయం రావడం ఇతివృత్తం ప్రళయారంభము, సంరంభము, సృష్టి ప్రకారము, ప్రళయ సంభవ ప్రకారము, ప్రళయాత్పూర్వము, ప్రళయం సంభవించిన విధము అను శీర్షికలతో ఈ చిన్న కథను ముళ్ళపూడి నడిపిస్తాడు ఓ బాలిక బాల్చిలో నీళ్ళు తీసుకొని పూలమొక్కలకు నీళ్ళు పోయడానికి వచ్చి డాబా పిట్టగోడమీద పెడ్తుంది అది జారి చీమల పుట్టమీద పడడంతో చీమలన్నీ నశిస్తాయి ఇదీ కథ

ముళ్ళపూడి ఈ విధంగా పదబంధాల్లోను నుడికారాల్లోను సామెతల్లోను కథా కల్పనంలోను పేరడీని ప్రయోజనాత్మకంగా ప్రయోగించాడు.

**

# 22. పార్వతి మళ్ళీ పుట్టింది

శరత్‌చంద్ర చటర్జీ (1876 - 1938) భారతీయ సాంఘిక నవలలకు పితామహుని లాంటివాడు. తెలుగు సాంఘిక నవలా రచయితలను, తెలుగు పాఠకులను శరత్ ఆకట్టుకున్నంతగా వారే రచయితా ఆకట్టుకోలేదన్నా అతిశయోక్తి కాదేమో! ముఖ్యంగా ఆయన రాసిన 'దేవదాసు' నవల యావద్భారత ఖ్యాతి గడించింది. సర్వజనుల హృదయాలను దోచుకొంది. తెలుగు ప్రజలు ఏ తాగుబోతు కనిపించినా, ఏ భగ్నప్రేమికుడు కనిపించినా 'పాపం! వాడు దేవదాసయిపోయాడురా!' అని జాలిపడేటట్లు ఆయన నవల చేసింది. దేవదాసు విస్తృత ప్రచారానికి అక్కినేని నాగేశ్వరరావు అపూర్వ నటనే అధిక కారణమైనా మూలం శరత్‌బాబే గదా! దేవదాసు పార్వతులు గాఢంగా ప్రేమించుకొంటారు. దేవదాసు పిరికితనం వల్ల పార్వతి పరకీయ అయిపోతుంది. వారిద్దరి మానసిక సంఘర్షణను కరుణరసస్ఫోరకంగా శరత్ చిత్రించాడు.

ఈ కథావస్తువును వికటంగా విడంబిస్తూ 'శంకు' 1977 లో 'పార్వతి మళ్ళీ పుట్టింది' పేరుతో ఒక పేరడీ కథ రాశాడు 1

ఈ కథ రాసే రోజులో దాసరి నారాయణరావు 'దేవదాసు మళ్ళీ పుట్టాడు' పేరుతో నాగేశ్వరరావు వాణిశ్రీ, జయప్రదలతో ఓ సినిమాను తీశాడు. తీరని కోరికలతో మరణించిన దేవదాసు, పార్వతి, చంద్రముఖి పునర్జన్మ ఎత్తినపుడు ఏ విధంగా ప్రవర్తిస్తారన్న ఊహకు రూపకల్పన ఆ సినిమా. శంకు కూడ ఆ విధంగానే దేవదాసును 'జట్కా వాలా'గా, పార్వతిని 'రిచ్ గాళ్'గా చిత్రిస్తూ మధ్యలో వారిద్దరు కలుసుకోవడం, పార్వతి సమ్మక పోవడం, చంద్రముఖి అనుసంధానం చేయడం. పార్వతి తాగుడుకు అలవాటు పడటం. రాత్రి పదిగంటలకు పార్వతి ఇంట్లో, తోట్లో కలుసుకోవాలని ఏర్పాటు

---

1. 15.9.77 నుండి 24.11.97 వరకు 7 సంచికల్లో ఆంధ్రభూమి వార పత్రికలో ధారావాహికంగా ప్రచురితం.

చేసుకోవడం జరుగుతుంది ఎంతకూ పార్వతి రాకపోయేసరికి దేవదాసు నెమ్మదిగా ఇంట్లో దూరి పార్వతి గదివద్దకు వెళ్తాడు ఆమె సీరియస్‌గా నవల రాస్తూ ఇతన్ని విస్మరిస్తుంది దాంతో అమాంతం దేవదాసు చచ్చిపూరుకుంటాడు.

'పార్వతి మళ్ళీ పుట్టింది'తో మొదలైన శంకు కథ 'దేవదాసు మళ్ళీ చచ్చాడు'తో అంతమవుతుంది శంకు కథ అంతా కార్టూన్లతో, సంభాషణలతో నాటకీయంగా కొనసాగుతుంది

జట్కాలో పోతున్న పార్వతి 'జగమే మాఆయ బ్రతుకే ఏ మా ఆ ఆయ వేదాఆలలో ' అని పాడుతుంటే 'అరే! ఇది దేవదాసులో పాటలా వుందే' అనుకొని జట్కావాలా 'అమ్మాయిగారూ మీరు, పాడేది దేవదాసు పాటలా వుందే, ఆ పాట మీకెలా తెలుసు?' అని అడుగుతాడు

"ఎలా తెలీదవేమిటీ ఆ సినిమా ముప్పైసార్లు పైగా చూశా! విశ్వవిఖ్యాత ప్రణయ సార్వభౌమ ఐన నా దేవదాసును నేనెలా మరువగలను?"

"ఐతే మీరు దేవదాసును పార్వతికన్నా గాఢంగా ప్రేమించారన్నమాట?"

"యు వార్ మిస్టేకేన్! సదరు పార్వతిన్నే నే! విధి బలీయమైన కారణంగా ఆ జన్మలో ఫేలయ్యాను మాది అమరప్రేమ కావడం చేత మళ్ళీ పుట్టాను నా దేవదా నాకు దక్కేవరకు ఇలా పుడుతూనే వుంటాను "




ఈ సంగతి విన్న బండివాడికి కొండంత ఆశ్చర్యం, చెరువంత ఆనందం కలిగి ఒక్కసారిగా బండి దిగుతాడు.

"పార్వతీ! దేవదాకోసం నువ్వింక గాలించనవసరం లేదు. నీ ఎదురుగా వున్నది నీ దేవదాయే! చూడు "

"ఛీ దుర్మార్గుడా! రిచ్ గాళనికదాని మోసగిస్తావా? ఆఫ్ట్రాల్ జట్కా-వాడివి! నువ్వు దేవదాసువెలా కాగలవు! పోలీసుల కప్పగించగలను జాగ్రత్త?"

"నన్నపార్థం చేసుకోకు పారూ! నిజంగా నేను నీ దేవదాసునే! లక్షాధికారిగా పుట్టి నిన్ను పొందలేకపోయినందువల్ల యీసారిలా బీదజన్మ యెత్తాను! కాని నువు రిచ్‌గాళవికావడంతో నా ప్లానంతా తారుమారయిందంతే! నన్ను నమ్ము" అని జట్కా-వాలా ఉరఫ్ దేవదాసు వేడుకొంటాడు. జన్మ వృత్తాంతం సాక్ష్యాధారాలతో ఎలా రుజావు చేయాలో అర్థంగాక మతిపోగొట్టుకొని మళ్ళీ సీసా అందుకుంటాడు.

చంద్రముఖి గూడ మళ్ళీ జన్మ ఎత్తి తిరుగుతూ దేవదాసును కలుస్తుంది. ఆ జన్మలో చేసిన వాగ్దానం ప్రకారం తనను పెళ్ళి చేసుకొమ్మని అర్థిస్తుంది.

"నో! క్షమించు అమ్మీ! నా పార్వతి మళ్ళీ పుట్టింది! అంచేత ఆమె నెలాగైనా ఈసారి నాదాన్ని చేసుకోవాలి! నీకిచ్చిన మాట నేనేజన్మకి మర్చిపోను. అంచేత నామాట పైజన్మలో తీరుస్తా! కావలిస్తే అలా స్టాంప్ పేపరు మీద రాసిస్తా! నన్నపార్థం చేసుకోకు అమ్మీ! నాకు నీ సాయం కావాలి! కాదనకమ్మీ".

చంద్రముఖి కళ్ళనీళ్ళ పర్యంతమై దేవదాసుకు పార్వతిని కట్టబెట్టడమే తన కర్తవ్యమని తలపోసి పార్వతిని కలుస్తుంది. పార్వతి గదిలో ఒక పెద్ద

సీసాను చంద్రముఖి చూసి అది ఏమిటని అడుగుతుంది 'నా దేవదాసు లేని నిస్పృహతో కాలం గడపలేక ఈ మధ్యే దీన్ని ప్రారంభించా' అని చెప్తుంది. చంద్రముఖి దిగ్భ్రాంతిచెంది దేవదాసుతో చెప్తే 'వ్వాట్! పార్వతి తాగడవేవిటి! దట్సింపాజిబుల్. నేన్నమ్మను!! అని కాస్సేపటికి ''నా పార్వతి నేనూహించిన దాని కన్నా చాలా మోడరన్‌గా పుట్టిందన్నమాట- మైగాడ్!!'' అని ఆశ్చర్యపోయి ''ఆమాటే నిజవైతే మా జీవితం ఇంక మూడు విస్కీలు ఆరు బ్రాందీలుగా కళ కళ్ళాడుతూ వుంటుంది'' అని సంతోషపడ్తాడు




తీరా కష్టపడి పార్వతి వద్దకి వెళ్తే ఆమె సరికొత్త నవల 'అంతా బ్రాందీయేనా' రచిస్తూ ఇతడిని మరిచేపోయింది 'నా పారూ రచయిత్రిగా పుట్టిందా? మైగాడ్!' అని ఢాంమ్మని దేవదాసు మళ్ళీ చచ్చిపోతాడు ఇదీ కథ —

# 23. ఫిబ్రవరి 30

ముళ్ళపూడి శైలిని అనుకరిస్తూ శరశ్చంద్ర రాసిన కథ ఇది [1] అప్పారావు సుడిగాలిలా వచ్చేసి, గోపాలానికి టోకరా ఇచ్చి అప్పు పట్టుకెళ్ళడం, రాధమ్మ నవ్వడం ఈ కథలోని ముచ్చట. ముళ్ళపూడి ముద్రను అనుకరించటానికి రచయిత చేసిన ప్రయత్నాలు ఈ కథలో కనిపిస్తాయి

"ఆహా! ఏమి నా భాగ్యం! ఎంత చక్కనిదీ పిల్ల! ఏ జన్మ పుణ్యఫలమో నా భార్య అయింది చివర్లో కాస్తంత వంగి ఆకాశాన్ని చూస్తున్నట్టున్న ఆ ముక్కు- సంపెంగే కదా! అని పదివేలం తొంభై తొమ్మిదోసారి అనుకుంటూ, అరమోడ్పు కన్నులతో పేపర్ చదవడం కూడ మానేసి గోపాలం కూర తరుగుతున్న రాధమ్మ కేసి చూశాడు "

"దూకుడుగా రావడం, బోల్డంత నవ్వేసి, రాధమ్మిచ్చిన కాఫీ త్రాగేసి, శంకరంగాడి బుగ్గమీద రెండు చిటికలేసి, గోపాలం జేబులోనుంచి అందినంత స్వతంత్రంగా పుచ్చేసుకుని, సాయంకాలానికి ఫిరాయించేస్తానంటూ నిమిషాల్లో పిచ్చికలా ఎగిరిపోవడం అతని ప్రత్యేకత."

"ఇది చాలా దా'ఋణ'మోయ్ - ఎన్నిసార్లిట్లా అరిగిపోయిన రికార్డ్ పెడ్తావు చెప్పు. అయినా అదట్లావుంచు - అర్జెంటుగా ఇరవై హాలోలిలాపడేయ్. సికెందుకు, ఫిబ్రవరి 30న నీకు ఫిరాయించెయ్యకపోతే నాపేరు 'వురాప్పాఅ' (అప్పారావు) అని పెట్టేయ్!"

"ఎంత వల్చుకు పోయాడేమిటి?" ముఖం గంటు పెట్టుకుని అడిగింది రాధమ్మ.

---

1 ఆంధ్రజ్యోతి వారపత్రిక 3.3.1989

అబ్బే ఎంత - ఇరవై హాలోలే. అదే - వందరూపాయలే - మళ్ళీ ఈనెల మున్పైకిచ్చేస్తానన్నాడు." అన్నాడు గోపాలం నమ్మకంగా ఆమాటలకు రాధమ్మ త్రుళ్ళి త్రుళ్ళి నవ్వసాగింది."

"హాఁ.. హబ్బే హదికాదని.... మీహిరిచ్చిన డబ్బులు ధ్వామార్పణం - ఏ సంవత్సరంలోనైనా ఫి-ఫిబ్రవరి నెలకు ఇరవైతొమ్మిది రోజులేగా?" అంది రాధమ్మ నవ్వును బిగపట్టలేక అవస్థపడుతూ.

వర్ణనల్లోను, వాక్య నిర్మాణంలోను, ఉచ్చరిస్తున్నట్లుగా పదాలను రాయడంలోను శరత్‌చంద్ర ముళ్ళపూడి శైలిని సమర్థంగా అనుకరించాడు.

# 24. పునరపి జననం పునరపి మరణం

విశ్వనాథ సత్యనారాయణ శైలిని అనుకరిస్తు పి.ఎస్. గోపాలకృష్ణ రాసిన కథ ఇది [1] దీనిలో విశ్వనాథ శైలిని రచనలో అనుకరిస్తూనే విశ్వనాథ భావాలకు పూర్తి సమాంతర ధోరణిని ప్రవేశపెట్టడం గోపాలకృష్ణ ప్రత్యేకత. తెలుగులో వచ్చిన చాలాకొద్ది వస్త్వాశ్రయ పేరడీ (Thematic Parody)లలో అగ్రశ్రేణికి చెందినదిగా దీనిని పరిగణించవచ్చు.

ఈ కథలో విశ్వనాథ రచనల్లో ఉండే తార్కిక బలం, చర్చలు, అనవసర విషయ వివరణలు, చెణుకులు సంపూర్ణంగా ప్రతిఫలించాయి శంకరరావు అను ఒక యువకుడు ఢిల్లీకి ఇంటర్వ్యూ కోసం వచ్చి స్టేషన్లో రైలెక్కుతాడు. ఆ రైలులో 'రత్నం' అని ఒక ముసలి స్త్రీ తారసపడుతుంది ఇరవై ఐదేళ్ళ కింద చనిపోయిన తన భర్త ఇతనేనని రత్నం గుర్తిస్తుంది. అతడూ గుర్తిస్తాడు. గుండాగి చనిపోతాడు ఇదీ కథ

'అది కొత్త ఢిల్లీ రైల్వే స్టేషను దక్షిణ్ ఎక్స్‌ప్రెస్ బయలుదేరుటకు సిద్ధముగా నున్నది. అతని వయ సిరువది నాల్గేండ్లు. ఎం ఎస్సీ పరీక్ష నిచ్చి యుద్యోగము కొరకైన ఇంటర్వ్యూకై ఢిల్లీ వచ్చెను. వచ్చిన పనియైనది. పనియైనదనగా నుద్యోగము వచ్చినదని కాదు. ఇంటర్వ్యూ అయినదనవలెను. అతడు దక్షిణ్ ఎక్స్‌ప్రెస్‌లో హైదరాబాదు వెళ్ళవలెను. అనగా సికిందరాబాద్‌లో దిగవలెను. అది మూడంతస్థుల సౌకర్యముగల రెండవ తరగతి పెట్టె. ఆ రైలు పెట్టెలోని ఒక పడకల వరుసలో క్రింది పడకను శంకరరావుకు కేటాయించిరి.

బండి కదులుటకు రెండు నిముషములున్న దనగా నా బండిలోనికొక ముసలవ్వ యెక్కినది. ఆమె పేరు రత్నమ్మ.

---

1 ఆంధ్రజ్యోతి వారపత్రిక 25-4-1980

రత్నమ్మ యా కాలమున స్కూలు ఫైనలు పరీక్ష నిచ్చినది. ప్యాసు కాలేదు కాని యది యామె పశ్చాత్తాపమున కడ్డము రాలేదు రత్నమ్మ భర్త బ్రతికియున్న దినములలో తెలుగు పండితుడు ఆంగ్ల భాషలోను హిందీలోను రచనలు సాగించినవాడు పూవులను కట్టిన దారమునకు వాసన యబ్బినట్లు రత్నమ్మ భర్తసాంగత్యమున ఆంధ్రాంగ్లహిందీత్యాది భాషలలో ప్రావీణ్యము గడించినది. అదృష్టము బాగుండి యామె రచయిత్రి కాలేదు ఇచట అదృష్టము రత్నమ్మది కాదు - ఆంధ్ర పాఠకులది

రత్నమ్మకు మూడంతస్థుల పడకలలో మీది పడకనిచ్చిరి. రత్నమ్మకు శరీరము లావు మోకాళ్ళు మరియును లావు వాతముచే మోకాళ్ళు వాచినవి. భర్త పోయిన క్రొత్తలలో నేడ్చి యేడ్చి యామె కళ్ళు వాచినవి ఆ భర్త రాలేదు. ఈమెకు ప్రాయము మీదబడినది. ఆ బరువు మోయలేక కాళ్ళువాచినవని పనికి మాలిన కవి యెవడైననున్న వాడనును అట్లనువారున్నారు కాగా పనికిమాలిన రచనలు వచ్చుచున్నవి

రత్నమ్మకు మూడంతస్థుల పడకలలో మీది పడక నిచ్చిరి గదా! ఈమె అపైకెక్కజాలదు.

కండక్టరు చేయునది లేక శంకరరావును లేపెను శంకరరావు విసుగు కొనుచు లేచెను. లేచెననగా వంగి కూర్చొనెను మీద నింకొక పడకయున్నది కదా! కండక్టరు దీపము మీటనొక్కెను దీపము వెలిగెను. రత్నమ్మ శంకర రావును చూచెను శంకరరావు రత్నమ్మను చూచెను అవి చూపులు కావు. ఇరువది యైదేండ్లనాడు మరణించిన భర్త బ్రతికి వచ్చిన యెట్లు చూడవలెను? రత్నమ్మ కండ్లవెంట ధారగా కన్నీళ్ళు స్రవించుచున్నవి శంకరరావు పురుషుడు గనుక మరయును యువకుడు గనుక నేడ్వలేకపోయినాడు అతని మనసేడ్చు చుండెను.

అతడు నెమ్మదిగా 'రత్నం' అని పిలిచెను ఇరువదియైదేండ్ల ముందు తన భర్త యెట్లు పిలిచెడివాడో ఈ శంకరరా వట్లు పిలిచెను రత్నమ్మ గుండె చెరువైనది. ఆమె గుండెపట్టలేక శంకరరావు మీద పడెను. 'ఏమండీ! మీరేనా?'

అనెను. శంకరరావు సంబాళించుకోలేక క్రిందపడెను అతని కంతలో గుండె పోటు వచ్చినట్లయ్యెను. కండక్టరు గొలుసు లాగెను బండి ఆగెను. బండి ఆగుటకు ముందే శంకరరావు గుండె ఆగియుండెను

రత్నమ్మ కంటికి రైలుబండి క్రింద పట్టాల ప్రక్కనున్న కంకటికి నేకధారగా విలపించెను. విలపించుచుండెను 'నాకొక భర్త ఒక జన్మములోనే రెండుమార్లు మరణించెను' అని అనుకొనుచుండెను అది యొక జడోన్మత్త పిశాచావస్థ. మానవ జీవితమింతే! ఎప్పుడేమగునో తెలియదు బండి కదలెను.'

భర్త వయస్సులో ఎంత పెద్దవాడైన సమాజం పెద్దగా పట్టించుకోదు. కాని భార్యయే భర్తకన్నా వయస్సులో పెద్దదైతే మాత్రం భరించలేదు విడ్డూరంగా చెప్పుకొంటారు విశ్వనాథ సత్యనారాయణ పునర్జన్మ నవలలో భార్యగతించి మళ్ళీ జన్మ ఎత్తుతుంది పూర్వజన్మలోని తన భర్తను గుర్తించి అతనికి భార్య అవుతుంది వారి మధ్య వయోభేదం ఎంతున్నా ఎవరూ పట్టించుకోరు. గోపాల కృష్ణ సరిగ్గా దీనికి సమాంతరమైన విషయాన్ని పేరడీలో ప్రవేశపెట్టాడు. పేరడీలో భర్త మరణించాడు మరో జన్మ ఎత్తాడు. పూర్వజన్మలోని భార్యను కలుసుకొన్నాడు ఒకరినొకరు గుర్తించారు భర్తను భార్య మళ్ళీ జన్మ ఎత్తి కలుసుకొంటే సాధారణమనుకొనే (కాకుంటే అసంభవమంటాం అంతే) మనమే భార్యను భర్త మళ్ళీ జన్మ ఎత్తి కలుసుకొనేసరికి అస్వాభావికంగా తలుస్తాం దీంతో ఈ కథ మంచి Thematic Parody గా రూపుదిద్దుకుంది విశ్వనాథ రచనల్లో సాధారణంగా కనిపించే తర్కం, చర్చ, ఛలోక్తులు, విమర్శలు, చిన్న చిన్న పదాలతో వాక్యాలు విడిపోవడం మొ॥ లక్షణాలన్ని గోపాలకృష్ణ పేరడీలోకి తీసుకొనిరావడంలో కృతకృత్యుడయ్యాడు

**

# 25. శీలమా నీ పేరేమిటి?

'అనామకుడు' పేరుతో ఒక అజ్ఞాత రచయిత విశ్వనాథ శైలిలో రాసిన కథ ఇది.[1] రచయిత స్వీకరించిన వస్తువు విశిష్టమైందే కాక విశ్వనాథ భావాలకు వ్యతిరేకమైంది కూడ ఒకసారి స్త్రీ బలాత్కరింపబడితే ఇక ఆమెకు చావే శరణ్యం కావడం లేదా జీవచ్ఛవంలా బతకడం సమాజంలో కనిపిస్తుంది ఎవరూ ఆదరించరు ఎవరూ పెళ్ళి చేసుకోరు ఆమె ప్రమేయం లేకపోయినా ఘోరమైన శిక్షమాత్రం ఆమెకు పడుతుంది.

విశాలాక్షిని విశ్వనాథం అభిమానిస్తుంటాడు పెళ్ళాడాలని అనుకొంటాడు. ఆమె కూడ మాటల్లో చెప్పకున్నా ఆ భావంతోనే ఉంటుంది. ఇద్దరూ గంటల తరబడి రకరకాల సాహిత్య విషయాలను గురించి చర్చిస్తుంటారు. ఒకసారి ఆమె అనుకోని పరిస్థితుల్లో బలాత్కారానికి గురవుతుంది.

''ఒకానొక పురుషుడు బలాత్కారముగా పొందినంత మాత్రమున ఆ స్త్రీ పోగొట్టుకొనునది లే"దనే కథలో విశ్వనాధం తీర్మానం. విశ్వనాథం విశాలక్షిల సంభాషణల్లో రచయిత విశ్వనాధ శైలిని అనుకరించడం కనబడుతుంది. ''బలాత్కారము చెడుదని కాదని నేననను. కాని దానివలన మరేదియో పోయిన దని బాధపడుట కర్థము లేదు దానిని దాచియుండుట కూడా మంచిపని కాదు."

'నలుగురికి తెలిసిన నవ్వులపాలగుదుము కదా!'

మీ యన్నెవరైనా దారిలో కొట్టిన పోలీసులకు తెలుపక మీరూరు ఏందు ? మీ యింట దొంగలుపడి దోచుకున్న మీ ప్రవర్తన ఇట్లుండునా? వాడెవ్వడో నిన్ను బలాత్కరించెను. నలుగురికి తెలిసిన నవ్వేదరా? ఎవరిని చూసి? నిన్ను చూసా? అటుల నవ్విన నీకు పనియేమి? వారు నిన్ను చూసి నవ్వుట కాదు వారిని చూసి అసహ్యించుకొనవలెను.'

---

1 ఆంధ్రజ్యోతి వారపత్రిక 21-6-1985

'సంఘము మీరనుకున్నంత మారలేదు. ప్రగతి సాధించలేదు.'

'సంఘమేది ప్రగతి సాధించుటకు? సాధించునది మనము మనమిటుల కూర్చున్నంత కాలమిది ఇటుల సాగుచునేయుండును కాళ్ళకి ఎత్తుమడమల చెప్పులు, పెదవులకు ఎర్రని రంగులు ప్రగతి కాదు. ప్రగతి ఆలోచనలో రావలెను. నువ్వు భయపడి వానిని బయట పెట్టకున్న వాడు మరికొందరి నిటు లనే చేయును. వానిని చూచిన మరొకొందరికి విచ్చలవిడితనము . వానిని వది లేసి నీ జీవితమున ఒక చెడ్డపని చేయకుము.'

'నన్నెవరు వివాహము ఆడెదరు?'

'నేనెన్నియోసార్లు నిన్నడిగితిని - నన్ను వివాహమాడెదవా అని. మరల అదే ప్రశ్న అడుగుచున్నాను. నీవు [illegible] నేనడుగుచుందును ' విశ్వ నాథము లేవబోయెను

విశాలాక్షి అతని చేతులను తన చేతుల్లోనికి తీసుకొని కళ్ళకద్దుకొనెను.

'ఈ కథ చదివి బలాత్కారింపబడిన స్త్రీ ఎవరో ఒకరైనా తన జీవితం నాశనమయి పోయిందనుకోకుండా జీవిస్తే ఈ కథకు ఫలితముంటు'ందని 'అనా మక' రచయిత కథ చివర పేర్కొన్నాడు.

సాంఘిక సంప్రదాయాల 'చెలియలికట్ట'ను దాటిన 'రత్నావళి' లాంటి స్త్రీలకుగానీ, అనుకోని పరిస్థితుల్లో సామాజిక నియమాల ఉల్లంఘనానికి గురయిన 'ఏకవీర'లాంటి స్త్రీలకు కానీ ప్రాణత్యాగమే శరణమవుతుంది కాని వారు తిరిగి సామాజిక జీవన స్రవంతిలో పూర్వం వలెనే కలిసిపోరు అలా కాకుండా గతాన్ని ఒక పీడకలగా మరిచిపోయి యథావిధిగా ఆనందంగా గడపాలని ప్రయోజనాత్మకమైన ఉత్తమ సందేశాన్ని ఈ కథ అందించడం ముదావహం. తనమీద చేయివేసిన వాడిని శిక్షించాలే కాని ఆ తప్పుకు జీవితాంతం, వాడికి ఊడిగం చేయాలనుకోవడం పిచ్చితనం ఇంతకు ముందు చెప్పబడిన గోపాల కృష్ణకథలో గోచరించినంత గాఢంగా విశ్వనాథముద్ర ఈ కథలో పడకున్నా విశ్వనాథ శైలిని సులభంగానే గుర్తించవచ్చు **

# 26. సంసారంలో సమ్మె ధ్వనులు

వడ్డెంపూడి ఫణిభూషణ్ కథ ఇది[1] కార్మిక సంఘాలు తమ కోరికలు నెరవేరడానికి యజమానులకు సమ్మె నోటీసులివ్వడం పరిపాటి. ఆ నోటీసులో యాజమాన్యం వ్యవహరించే తీరుపై కొంత అసంతృప్తి ప్రకటనం, ప్రాధాన్య క్రమంలో తమ కోర్కెల జాబితా - అవి తీర్చకపోతే తాము సమ్మె ఏ విధంగా చేస్తారో వివరాలుంటాయి. ఇదంతా ఎక్కడైనా ఒక పద్ధతిలోనే జరుగుతుంది. ఈ పద్ధతిని రచయిత సాంసారిక జీవనంలో ప్రవేశపెట్టాడు సంసారంలో ఏ విషయమైనా భార్యా భర్తలు సంప్రదింపులతో పరిష్కరించుకొంటారేగాని విడాకులకు తప్ప మరి దేనికి 'నోటీసు' లిచ్చుకోరు అందులోను చిన్న చిన్న విషయాలమీద అసలే 'నోటీసుల' వరకు వెళ్ళరు

ఈ కథలో పేర్కొన్న కోరికలు అవి - తీరకపోతే తీసుకొనే చర్యలు హాస్యరసవత్తరంగా చిత్రింపబడ్డాయి.

వసుంధర, శేఖర్‌లు భార్యాభర్తలు ఒకరోజు శేఖర్ ఓ కవర్‌ను వసుంధర చేతికిచ్చి ముట్టినట్లుగా సంతకం చేయమంటాడు "నీవు ఆ కవరు తీసుకొని కూడా ఆ తర్వాత ఆ కవరు నీకు ముట్టలేదని బుకాయిస్తే నేనేం చెయ్యాలి? అందుకే రూల్ ప్రకారం ఫాలో అయ్యానన్నమాట!" అని శేఖర్ చెప్పి నిష్క్రమిస్తాడు. వసుంధర చదవడం ఆరంభించింది

'శ్రీమతి వసుంధరాదేవికి,

విషయము అణచివేత, నిర్లక్ష్యం,ఏకపక్ష నిర్ణయాలు మొదలైన ధోరణులకు వ్యతిరేకంగా నిరసన కార్యక్రమం మరియు సమ్మె నోటీసు

ఈ సమాజంలోని అనేక సంసారాల్లో కొనసాగుతున్న అన్యాయపు ధోరణులు మన ఇంట్లోను తలెత్తాయి ఇవి కాలక్రమేణా సమసిపోతాయని ఇన్నాళ్ళు నేను ఉపేక్షిస్తూ వచ్చాను కానీ కాలం గడిచినకొద్ది అటువంటి ధోరణులు

---

1 స్వాతి సపరివార పత్రిక 28.4.1989.

మరింతగా పెరుగుతున్నాయే తప్ప తగ్గడంలేదు. ఈ విషయాలపట్ల అనేకసార్లు నీకు మాట పూర్వకంగా హెచ్చరికలు జారీ చేయడం జరిగింది. కానీ వాటిని నీవు ఖాతరు చేయలేదని తెలియజేసేందుకు చింతిస్తున్నాను

అపరిష్కృతంగానున్న నా డిమాండ్లు ఈ దిగువ వివరంగా తెలియజేస్తున్నాను 'దేవేరి' వారు దయతో సానుభూతితో ఆయా సమస్యలను సత్వరమే పరిష్కరించకుంటే జరుగబోయే తీవ్ర పరిణామాలకు నేనెంత మాత్రమూ బాధ్యుడనుకాను

**డిమాండ్లు :-**

I పాకెట్ మనీ పెంపుదల -మనపెళ్ళయిన కొత్తలో నా సిగరెట్ల మరియు చిల్లర ఖర్చుల నిమిత్తం జీతంలోంచి 200 రు॥లు మినహాయించుకొని మిగతా మొత్తం నీకు అప్పజెప్పాలన్న ద్వైపాక్షిక ఒప్పందం కుదిరింది దాని ప్రకారంగా ఈ ఏడేండ్ల కాలం చేస్తూ వచ్చాను జీతం పెరిగినా, ధరలు రెట్టింపు పెరిగినా నా పాకెట్ మనీ మాత్రం పెరగలేదు కాలం చెల్లిన పాత అగ్రిమెంటు చెల్లదని, ఈ విషయమై కొత్త అగ్రిమెంటు గత సంవత్సరం జనవరి నుంచి అమలులో వుండేలా కుదరాలని, అందుకు సంబంధించిన 'అరియర్స్' ఈ సం॥పు బోనస్‌తో మినహాయించుకొనేందుకు అనుమతివ్వాలని కోరుతున్నాను.

2. నాతో సంప్రదించకుండా పాత పనిమనిషిని పనిలోనుండి ఏకపక్షంగా తీసేయడాన్ని నేను ఖండిస్తున్నాను.

3 ప్రతిరోజూ నీవు రాసే కథలు, కవితలు ఓపిగ్గా వింటున్నందుకు 'హియరింగ్ అలవెన్స్' ఇవ్వాలి.

4 చాల కాపురాల్లో పిల్లలను స్కూలు వద్ద విడిచిపెట్టడం, మార్కెట్‌కి వెళ్ళి కూరగాయలు తేవడం వంటి పనులు శ్రీమతులే చూస్తుంటారు కానీ మన కాపురంలో ఆ రెండు పనులు నేనే చేస్తున్నందున నాకు 'చిల్డ్రిన్ అండ్ మార్కెట్' అలవెన్స్' ఇవ్వాలి.

5. పెళ్ళయిన కొత్తలో మీ నాన్న కలర్ టీ వి. ఇస్తానని చెప్పి ఇంత వరకు ఇవ్వలేదు వెంటనే కలర్ టి వి ని తేవాలని డిమాండ్ చేస్తున్నాను.

ఈ డిమాండ్ల పట్ల శీఘ్రతగా నేటిరాత్రి కల్లా నీవు చర్చలకు ఒప్పుకోనట్లయితే. .రేపటి నుంచి ప్రారంభించి నాలుగురోజుల వరకు నా ఆందోళనా కార్యక్రమం ఈ విధంగా వుంటుంది.

మొదటి రోజు : మౌన ప్రదర్శన - నీతో అసలు ఏమీ మాట్లాడడం జరగదు.
రెండవ రోజు : నల్లాచొక్కా ధరించి ఉదయం ఇంట్లో కాఫీ - టిఫిన్ స్వీకరించడం మానేస్తాను.

అప్పటికీ నీవు కిందికి దిగి రానట్లయితే భవిష్యత్ పోరాట కార్యక్రమాన్ని మరో నోటీసు ద్వారా తెలియజేస్తాను "

ఈ లేఖ చదివి వసుంధర బెంబేలెత్తి పుట్టింటికి వెళ్ళి తండ్రిని సలహా అడిగింది. "అందుకేనమ్మా! ఆ ఎంప్లాయిస్ యూనియన్ లీడర్ శేఖరాన్ని పెళ్ళి చేసుకోవద్దని ఎంత చెప్పినా వినకుండా పెళ్ళి చేసుకొన్నావు, మీ అమ్మనడుగు సలహా చెప్తుందని తండ్రి తప్పుకొన్నాడు.

తల్లి కూతురిని ప్రేమగా తల నిమురుతూ మృదువుగా చెప్పింది: 'అమ్మాయ్! సంసారమన్నాక ఇటువంటి సమస్యలు ఎన్నో వస్తుంటాయి. వాటికి మనం బెదిరిపోకూడదు. ఈ చిన్ని సమ్మె నోటీసు చదివి నీవు జారిపోయావనుకో, ఆ తర్వాత ఇక ప్రతి విషయానికి అతడే నీపై రాజ్యం చేస్తాడు. కాబట్టి నీవు ఈ నోటీసు చదివి ఏమీ పట్టించుకోనట్లుగా నటించు. అతడిని ఆ నాలుగురోజులు తన నిరసన కార్యక్రమం చెయ్యనియ్. అతడు సహాయ నిరాకరణ, పూర్తి రోజు సమ్మె చేసిన తర్వాతనించి అతడ్ని రాత్రిళ్ళు నీ వద్దకు రానివ్వకు. దూరంగా వుంచెయ్. దీనినే 'నోవర్క్-నోపే' అంటారు అప్పటికే అతను నీరసించిపోయి తన డిమాండ్లలో సగానికి సగం తగ్గిస్తాడు. అప్పుడు నీవు చర్చలు జరిపి ఆ తగ్గించిన సగంలో సగానికి అగ్రిమెంటు కుదుర్చుకో ఆ తర్వాత భవిష్యత్తులో అగ్రిమెంటు కుదిరిన సగంలోని సగ భాగాన్ని మాత్రమే అమలుచెయ్. అదీ సంసారాలయినా సంస్థానాలయిన నడిపించుకొనే తీరు!'

ఈ కథలో ఫణిభూషణ్ కార్మికులు కోరికలు కోరే తీరు; దానికి యాజమాన్యం తమ కనుకూలంగా మలచుకోవడానికి చేసే ప్రయత్నం అధిక్షేపాత్మకంగా హాస్య ధోరణిలో వివరించాడు. ఎక్కడో పెద్ద పెద్ద కంపెనీల్లో ఇచ్చే సమ్మె నోటీసు పద్ధతి ఏమాత్రం సామ్యం, సంబంధం లేని సంసారానికి అన్వయించడం వల్ల పేరడీ అయింది.

**

# 27. చీమ కుట్టిన నాటకం

తెలుగు నాటక రంగాన్ని ఒకప్పుడు పౌరాణిక నాటకాలు ఒక ఊపు ఊపాయి. సంగీతం పిచ్చి ముదిరి ఒక నిమిషంలో పద్యం చదివేసి పది నిమిషాల పాటు రాగం సాగదీయడంలో నటులు పోటీ పడసాగారు దురదృష్టవశాత్తు ఏ ప్రేక్షకుడయినా 'వన్స్‌మోర్' అంటే చాలు, పద్యం - రాగం పునరావృతం. ఈ నటుడు రాగాలాపన చేస్తున్నంతసేపు అవతలినటుడు ఎలా? ఏ స్థితిలో నిలుచోవాలి? ఎట్లా నటించాలి? అన్న విషయం ఎవరికీ పట్టేది కాదు. అయినా ఆహార్యం, వాచకం, గాత్రం పురాణ కధలపట్ల ఉండే అనురక్తి పౌరాణిక నాటకాల విజయానికి మూలమయ్యాయి

ఆ తర్వాత చారిత్రక నాటకాల పేరుతో దేశభక్తి ప్రభోధాత్మక రచనలు రాజ్యమేలాయి అనంతరం సాంఘిక నాటకాలు అసలు కన్యాశుల్కమే ప్రథమ ప్రసిద్ధ సాంఘిక నాటకం ఆత్రేయ, డి వి. నరసరాజు, గొల్లపూడి మారుతీ రావు, కొర్రపాటి గంగాధరరావు ప్రభృతులు నాటకాలను ఉత్తమంగా ఉన్నతంగా రచించి అందరి మన్ననలకు పాత్రులయ్యారు

ఒకదశలో నాటక పరిషత్తుల బహుమానాలను దృష్టిలో పెట్టుకొని రాసే నాటకాలు అసంఖ్యాకమయ్యాయి ఒక చౌరస్తాలో పాకవేసి గంధం గిన్నెలను బహుమతులుగా ఇచ్చే పరిషత్తుల నిర్వాహకులెక్కువయ్యారు. ఈ పోటీల వల్ల రచనలు రాసిలో పెరిగినా వాసిలో ప్రగతి సాధించలేకపోయాయి. ఈ ఫలానా ఫలానా అంశాలు ఫలానా ఫలానా పాళ్ళలో కలిపితే నాటకం తయారవుతుందన్న 'దృఢ విశ్వాసం', దానికి బహుమానం కూడ వచ్చి తీరుతుందన్న 'గట్టి నమ్మకం' రచయితలకు వచ్చేసింది

నాటకాంతంలో అవసరమున్నా లేకున్నా ప్రధాన పాత్ర చేత సుదీర్ఘోపన్యాసం చేయించడం, బరువైన వేదాంతం పలికే నౌఖరు ఉండడం, వాడి పేరు ఎప్పుడూ రామయ్యనో రంగయ్యనో అయివుండడం (నిజానికి మన దేశంలో

వ్యవసాయం పనులకు నౌఖర్లుంటారు ఇంట్లో 24 గంటలు పనిచేసే నౌఖరును పెట్టుకోవడం మధ్యతరగతి వారికి అసంభవం. అంతగా పెట్టుకొన్నా పిల్లలను పెట్టుకొంటారు కాని పెద్దవారిని అసలే పెట్టుకోరు.)

ప్రతినాయకుడు ఎప్పుడూ వికటాట్టహాసం చేయడం; కుచ్చుటోపీ-మెళ్ళో రుమాలు ఉండడం - వాడిపేరు ఏ భుజంగమో, నాగభూషణమో మొత్తంపైన సార్పిక (సర్ప సంబంధమైన) నామధేయుడే కావడం, హీరోకు బ్లడ్‌క్యాన్సర్ వస్తే హీరోయిన్ తండ్రికి గుండెజబ్బే రావడం, ఇంకే రోగాలూ రాకపోవడం, హీరోయిన్ తండ్రి ఎప్పుడు ఆదిశేషయ్యలాంటి అయ్యంత నామధేయుడే కావడం; హీరోయిన్ తల్లి చనిపోయి వుండడం, తండ్రి ఆమె ఫోటోతో గంభీరంగా మాటిమాటికి మాట్లాడడం, ఇంట్లో పనిచేసే నౌఖరు ఉన్నట్టుండి సి. ఐ డీగా మారిపోవడం; కమెడియన్ ఎంత ప్రయత్నం చేసినా నవ్వు రాకపోవడం; వ్యభిచారం చేసినా తలవంచుకోకుండా, దాచుకోకుండా బాహాటంగా చెప్పుకోగలిగిన ధైర్యవంతులయిన విచిత్ర యువతులు ఉండడం, నాటకనామం వచ్చే విధంగా ఒక నేపథ్యం పాటను నాలుగయిదుసార్లు వినిపించడంలాంటి వికృతులు గలిగిన మూసకట్టు విధానం ఒకటి నాటకాల్లో స్థిరపడింది

ఏ మాత్రం సృజనాత్మకత, నవ్యత కనిపించక 'ఫార్ములా' ట్రైపులో నాటకం ఘనీభవించేసరికి విమర్శకులకు, నాటకాభిమానులకు చీకాకు, మనస్తాపం కలగడం మొదలుపెట్టింది.

దీనికి కొన్ని హేతువులు లేకపోలేదు. స్వాతంత్ర్యం సిద్ధించేవరకు బ్రిటిషువారిని వెళ్ళగొట్టడమే సర్వరోగ నివారకంగా చాటే నాటకాలను రచయితలు కుప్పతెప్పలుగా రాశారు అప్పటి చారిత్రక పరిస్థితులవల్ల కథా సంవిధానం కన్నా 'వస్తువు'కు ప్రాధాన్యమిచ్చి ప్రజలు ఆదరించారు స్వాతంత్ర్యోదయం వల్ల రచయితలకు ఒక మహా వస్తువును కోల్పోయినట్లయింది. కొత్త వస్తువు వెతుక్కోవలసివచ్చింది దాంతో ఆంగ్ల నాటకరంగం వైపు రచయితలు దృష్టి సారించారు నికొలాయ్ గొగోల్ 'ఇన్‌స్పెక్టర్ జెనరల్'కి ఓ ఐదారు అనువాదాలు; జె.బి ప్రీస్లీ రాసిన 'యాన్ ఇన్‌స్పెక్టర్ కాల్స్'కి మరో అరడజను తెనిగింపులు వచ్చాయి. గాల్స్‌వర్తీ (Galsworthy), అనటోల్ ఫ్రాన్సెస్

(Anatole Francess), షా (Shaw) మొదలైన వారి ఆంగ్ల నాటకాలన్నీ తెలుగు వేషం వేసుకొని తెలుగు గడ్డపై కాలూనాయి. తెలుగు జీవితానికి సంబంధంలేని 'డ్రాయింగ్‌రూం సిస్టం', మేధావియైన నౌఖరు వగైరా అవలక్షణాలన్నీ ప్రవేశించాయి

'ఇవన్నీ విదేశీ ప్రభావం మనకు తెచ్చిపెట్టిన మేళ్ళతోపాటు యిచ్చిపోయిన లొసుగులు, అందంగా కనిపించిన అమ్మాయిలో ఏ అలంకారం ఆకర్షణ నిచ్చిందో తెలియక గుడ్డిగా అన్నింటిని అనుకరించిన ఫలితం ఇది'1 అని నిష్కర్షగా గొల్లపూడి మారుతీరావు చెప్పిన మాటలు అక్షరసత్యాలు

యండమూరి వీరేంద్రనాథ్ 'చీమ కుట్టిన నాటకం' (అను మహోదధిలో తరంగం) పేరుతో ఒక నాటకం రాసి, కరడుగట్టుకొనిపోయిన తెలుగు నాటకాన్ని తీవ్రంగా దుయ్యబట్టాడు.

'ఎన్ని నాటకాలు వ్రాసినా ఒకే మూసలో వ్రాస్తూ, మధ్యలో స్త్రీప్రేక్షకుల కోసం ఉదాత్తంగా నాలుగు డైలాగులు వ్రాసి, చివర్లో నాటకానికి ఏమాత్రం సంబంధం లేని ఒక మహత్తర ఆశయం ఎవరో ఒక పాత్రద్వారా చెప్పించి శక్తివంచన లేకుండా నాటకరంగాన్ని పాడుచేస్తున్న రచయితలూ—

ఎవర్నో ఒక మహానటుడ్ని దృష్టిలో పెట్టుకొని అన్నీ కొలతల ప్రకారం లెక్కచూసుకొని - జడ్జీల్నే ఫేస్ చేస్తూ ఫుట్‌లైట్ల దగ్గర్నుంచి కదలకుండా తమ ధోరణిలోనే నటించుకొంటూపోయే నటులూ - విళ్ళకే బహుమతులనిచ్చే జడ్జీలూ ఈ నాటకం చూసి ఏమాత్రం తమ ధోరణి కొంచెం మార్చుకున్నా మా ఆశయం నెరవేరినట్టే' అని యండమూరి వీరేంద్రనాథ్ పీఠికలో (పుట 8) చెప్పుకొన్నాడు.

మూసకథ, మూసపాత్రలు, మూసడైలాగులు, అవాస్తవికమైన వేదాంతం, అతి నాటకీయత (Melodrama), పేలవమైన హాస్యం; అతి నటన (Over action), దర్శకత్వం లోపాలు - ఇలా నాటకరంగానికి సంబంధించిన ప్రతి అంశాన్నీ యండమూరి వీరేంద్రనాథ్ చీమకుట్టిన నాటకంలో అధిక్షేపాత్మకంగా అనుకరించి అవహేళన చేశాడు.

---

1. దృశ్య, శ్రవ్య నాటకాలు (వ్యాసం) మహతి (1972) పుట 217.

ఈ పేరడీ నాటక రచనంలో వీరేంద్రనాథ్‌కు ఒక సమస్య ఎదురైనట్లు తోస్తుంది. మూస నాటకాలను అధిక్షేపించే ధోరణిలో పేరడీగా రాస్తున్న తన నాటకాన్ని కూడ ప్రేక్షకులు ఒక మూస నాటకంగా తలపోస్తారేమోనని అనుమానించాడు అందుకే ఆ సంశయం రాకుండా ఒక ప్రేక్షకుని పాత్రను కల్పించాడు.

నాటకప్రదర్శనంలో రంగస్థలాన్ని రెండు భాగాలు చేయాలి. ఒక సగభాగం అంతా రంగస్థలం అందులో నాటకం జరుగుతుంది. మరో సగం ప్రేక్షకులు ఉండి చూస్తున్నారని భావించాలి. ప్రేక్షకులు బహుళ సంఖ్యలో కాకుండా ప్రదర్శన సౌలభ్యానికై ఒకడే ఉంటాడు. అతని ముందు ఈ నాటకం నడుస్తుంది అతని ప్రతిస్పందనలన్నీ మామూలుగా ప్రేక్షకులు చేసే వ్యాఖ్యానాలు అంటే నాటకాల పట్ల మన ప్రతిస్పందనలన్నమాట కాని ప్రేక్షకుని పాత్ర విధిగా సగం రంగస్థలం ఆక్రమించేసరికి ప్రదర్శనానుకూల్యం దెబ్బతింటుందన్న భావం కలగక మానదు. అంతేగాక వేదికమీద ప్రేక్షకుని పాత్రలో ఒకడు అంతసేపు కూర్చొని ఉండడాన్ని చూసేవారు భరించలేరు. విసుగు తెప్పిస్తుంది ఇది దృశ్యనాటిక కన్నా శ్రవ్యనాటికగానే రాణిస్తుంది. (ఈ నాటకం రంగస్థలంపై ప్రదర్శితం కూడ.) అయితే ప్రేక్షకుని పాత్ర ఉండడం వల్ల, మధ్య మధ్య వ్యాఖ్యానించడం వల్ల నాటక రచనలలోని దృక్పథం ప్రేక్షకులకు అవగతమవుతుంది.

ప్రదర్శనలో భాగం కాకుండా బ్రాకెట్లు పెట్టి పాఠకుల కోసం కొన్ని మాటలు రచయిత రాశాడు ఈ బ్రాకెట్లలోని మార్పులు, ప్రేక్షకుని వేషంలో రచయిత వ్యాఖ్యలు నాటక సమాజాలను, నటులను, నాటకాలను తీవ్రంగా అధిక్షేపిస్తుంటాయి.

'అతిసహజంగా - అందులో చిత్రమేమీ లేకుండా అరగంట ఆలస్యంగా తెరలేచిం'దన్న మొదటి వాక్యమే కాలనియమం పాటించని నాటక సమాజాలపై ఒక చురక.

అసలు నాటకం పేరే ఒక పేరడీ. 'మహోదధిలో తరంగం' చాలా బరువైన అనవసరమైన పేరు ఆనంతం, పంజరం, విధివంచితులు, రక్త ప్రవాహం, జలతరంగిణి, జీవన వలయాలు, రాగవీణలు, జీవనసంధ్య, అగ్నిజ్వాల, అకురాలిన వసంతం లాంటి పెద్ద పెద్ద పేర్లు నాటకాలకు సర్వసామాన్యం యని అధిక్షేపించడమే

మూస నాటకాలని వెక్కిరిస్తూ యండమూరి ఈ నాటకంలో కూర్చిన కథ చూద్దాం.

కథానాయిక పద్మ తల్లిలేని పిల్ల. ఆమె తండ్రి ఆదిశేషయ్య. వాళ్ళింట్లో నౌఖరు రామయ్య. వేదాంతసారాన్ని బరువైన డైలాగుల్లో వల్లించే ముసలివాడు. రిక్షా తొక్కి బియ్యే ఉత్తీర్ణుడయిన అందమైన పేరున్న శేఖరును పద్మ ప్రేమిస్తుంది. ఆస్తి అయిశ్వర్యం ఉన్న పద్మ తండ్రి ఆదిశేషయ్యకు ఇష్టం ఉండదు మేనల్లుడు నాగభూషణం ఏమడిగినా కాదనని చెల్లెలు చనిపోయే టప్పుడు ఆదిశేషయ్య వాగ్దానం చేశాడట శేఖర్‌ను మరిచిపొమ్మనీ, నాగభూష ణాన్ని పెళ్ళి చేసుకొమ్మని పద్మకు ఆదిశేషయ్య చెప్తాడు పద్మ వినదు ఎంత దబ్బైనా ఇస్తాను. తన కూతురు నుంచి దూరంగా వెళ్ళిపొమ్మని ఆదిశేషయ్య శేఖర్‌ను ప్రలోభ పెడ్తాడు మూడుసార్లు "ఆదిశేషయ్యా" అని బరువుగా పలికి - కూటికేగాని కులానికి పేదలం కాదని ఒక 'స్టాక్ డైలాగ్' పలుకుతాడు శేఖర్. దాంతో ఆదిశేషయ్యకు గుండెపోటు వచ్చి మరణిస్తాడు శేఖర్ తనకు బ్లడ్ క్యాన్సర్ ఉందనీ నాగభూషణాన్నే పెళ్ళి చేసుకొమ్మని పద్మకు సలహా ఇస్తాడు. నాగభూషణం వచ్చి వికటాట్టహాసంతో పద్మను బలాత్కరించబోగా చేయి కొరికి తప్పించుకొంటుంది

తండ్రి కంఠం, రామయ్య కంఠం, శేఖర్ కంఠం, భూషణం కంఠం స్టేజి మీద ఒక్కతే ఉన్న పద్మని సంఘర్షణకులోను చేస్తాయి. చివరికి పద్మ ఆ బావగాణ్ణే పెళ్ళి చేసుకోవడానికి నిర్ణయించుకుంటుంది

ఇంతలో కథ అనూహ్యమైన మలుపు తిరుగుతుంది. పద్మ ఆదిశేషయ్య కూతురు కాదనీ, నౌఖరు రామయ్య కూతురనీ, ఆస్తికి వారసుడు నాగభూషణమని తెలుస్తుంది ఇప్పుడు పద్మ బీదది కావడంతో నాగభూషణం నిరాకరిస్తాడు. భూషణానికి ఆస్తిరాదనీ, పద్మకే చెందేలా ఆదిశేషయ్య వీలునామా రాశాడనీ రామయ్య చెప్తాడు భూషణం దౌర్జన్యం చేయబోగా రామయ్య 'పిస్టల్' తీసి కాలుస్తాడు ఆయన సి ఐ డి రాంసింగ్ అట! ఆయన కొడుకు పి కె. రావు సి.ఐ డి. భీంసింగ్ అట! నాగభూషణం అరెస్టవుతాడు పద్మ, శేఖర్ ఒకటవు తారు- ఇదీ కథ.

అంతంత డైలాగులు పలికేవాడు నౌఖరుగా ఎలా ఉండగలిగాడు? అసలు వాణ్ణి సలహా అడిగేవాడెవడు? ఈ దిక్కుమాలిన కథకు ఒక సి ఐ డి ఎందుకు? వాడి అవసరమేమిటి ఇత్యాద్యనేకం ప్రశ్నలు తలెత్తకమానవు వాటికి జవాబులు ఉండవు అవి అంతే.

ఇక సంభాషణల్లోని మూసకట్టు విధానాన్ని పరిశీలిద్దాం దీనిలోని సంభాషణలన్నీ పేరడీకి నిదర్శనాలే.

పద్మ : కళకళలాడే ఇంటినంతా ఒక్క క్షణంలో శ్మశానం చేసి వెళ్ళిపోయింది అమ్మ.

రామయ్య · ఎంత కర్కశమైందమ్మా విధి? (వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు, భుజం మీద తుండుగుడ్డ నోటికి అడ్డం పెట్టుకొని మరీ)

ప్రేక్షకుడు : (ఆడియన్స్ వైపు తిరిగి) మొ. . ద లు

రామయ్య : అయినా . .అయినా (బీడీల కాలెండర్ దగ్గరికి వెళ్ళాడు) మమ్మల్నందర్నీ యీ పెనుతుఫాన్లో దీపాల్లా వదిలేసి వెళ్ళిపోయేవు. మేమందరం ఏం అయిపోతాం అనుకున్నావ్ తల్లీ!

ఆదిశేషయ్య . మన జీవితాలు మహోదధిలో తరంగాలు రామయ్యా! ఒకరికోసం ఇంకొకరు ఆగరు. (పుటలు 13, 14)

విధిని ఉపాలంభించడం, నాటకనామం వచ్చేలా డైలాగ్ పలకడం అంతా మూసకట్టు పద్ధతికి దృష్టాంతాలేనని ప్రత్యేకించి చెప్పే పని లేదు

రామయ్య పద్మని ఓదారుస్తు 'అమ్మగారూ! మీరు బాధపడకండి చీకటి వెలుగుల కలయికే జీవితం సోఫాలో నల్లులున్నాయని కర్రతో కొడితే దెబ్బ తగిలేది సోఫాకేగా? జీవితమూ అంతేనమ్మా! ఒకరి ఆత్మ సంతృప్తికోసం మనం చేసే త్యాగమే మనకు తృప్తినిస్తుంది '

'తన మట్టిం పున్న చీకటిని తనలో దాచుకొని తనలోని వెలుగును అందరికీ పంచగలిగే మనిషి ధన్యుడు తల్లీ! ' (పుట 16)

నౌకరు స్థాయికి తగిన సంభాషణలేనా ఇవి? యజమానికన్నా తెలివయిన వాడన్నమాట. అసహజమూ అవాస్తవికమూ అయిన పాత్ర తెలుగునాటకాల్లో నౌకరుపాత్ర - చాలా నాటకాల్లో ఆ నౌకరు టన్నులకొద్దీ బరువున్న గంభీర

భావాలను ఎంతో తేలిగ్గా చెప్తాడు ఉన్నతోద్యోగి ఉన్నత విద్యావంతుడూ అయిన హీరోయిన్ తండ్రి, హీరోయిన్ గంగిరెద్దులా తలలూపుతూ వుంటారు. తెలుగు నాటకాల్లోని ఈ నౌఖరు పాత్రకు మూలం Inevitable Jeirvos; **Oscar Wild** నాటకాల్లోని బట్లర్లు (ఉదా॥ The importance of being Eeornesh లో బట్లరు మెర్రిమాన్), Shaw నాటకాల్లోని నౌఖర్లు (ఉదా॥ The Doctor's Dielama) అని గొల్లపూడి మారుతీరావు లాంటివారి అభిప్రాయం 1

మధ్యలో పరంధామయ్య పాత్ర ఒకటి ప్రవేశిస్తుంది దాని మీద రచయితయే బ్రాకెట్లు పెట్టి వ్యాఖ్యానించాడు. పరంధామయ్య ప్రవేశం - అసలీ పాత్ర ఎందు కొచ్చిందో నాటికకి ఈ పాత్రకే ఏం సంబంధమో ఎవరికీ తెలీదు. 'తన సమాజంలో నటులందరికీ పాత్రలు సృష్టించవలసిన' రచయితకి ఈ బాధ తప్పదు. (పుట 17) అని యండమూరి వ్యాఖ్యానం.

పరంధామయ్య మాటలు కూడ గగన విహారమే చేస్తుంటాయి. 'ఏ పద్మానికైనా కావాల్సింది రంగులు కాదమ్మా - తుమ్మెద ఆశ్రయం. ఈ నిజం తెలుసుకో తల్లీ!' . . . 'ఇది వయసమ్మా ఆలోచన్ల గొలుసు ఉరుసులా తిరుగుతూ అలుసు తీసుకొని మనసుని తొలిచేస్తుందమ్మా!' (పుట 18) ఈ మాటల అర్థం ఏమిటి? అవసరం, ఔచిత్యం ఏమిటి? అన్న విషయం రచయితకూ పట్టదు, నిర్వాహకులకూ నటులకూ పట్టదు అక్షర పునరావృత్తికి మైమరచిపోయిన ప్రేక్షకుడు 'వన్స్‌మోర్' అంటాడు. కాని ఏమాత్రం విజ్ఞతతో ఆలోచించడు.

ఇక విలన్ నాగభూషణం చదువుసంధ్యలు ఏమిటో ఎక్కడా తెలియదు 'రౌడీషైప్' అన్నది చూడగానే తెలుస్తుంది. అతడు పద్మను పెళ్ళాడా లను కొంటాడు. ఆమెపట్ల కవిత్వం కూడా చెప్తాడు

'ఆహా పద్మా! ఏమి నీ రూపలావణ్యము! ఈ త్రిజగన్మోహనాకృతిని చూచి నిమేషత్వమే లేని సాలంభంజికయేమోనని భ్రమపడితినే పద్మా! నీవే పద్మానివైతే - భాసుర పుష్పగుచ్ఛ స్రవన్మధుర మధురసాస్వాదనార్థ సంభ్రమద్భ్రమరము కానే నేను?' (పుట 16) ఈ మాటలు విన్న పద్మ 'ఛీ నీచుడా! అలా మాట్లాడ్డానికి సిగ్గులేదూ?' అంటుంది అసలు అత డన్న మాటలు తిట్లో, ప్రశంసలో ఒక నిఘంటువు పట్టుకొనివచ్చి వెతికి అర్థ నిర్ణయం చేస్తే తప్ప తేలనంత స్థాయి డైలాగులు ఇవి. రచయిత పాండిత్యానికి నిదర్శనాలుగా

1 దృశ్యశ్రవ్య నాటికలు (వ్యాసం) మహతి (1972) పుట 21.

ఈ సంభాషణలు నిలుస్తాయేమోగాని సముచిత పాత్ర చిత్రణకు లక్ష్యంగా నిలవవు ఇలాంటి స్థాయిమీరిన సంభాషణలు చాల నాటకాల్లో కనిపిస్తుంటాయని యండమూరి చురక అంటించాడు ఇక 'హాస్యం' విషయానికి వద్దాం ఈ నాటకంలో హాస్యపాత్ర పి.కె రావు. తాగినట్లు ఒకచోట నటిస్తాడు 'అవునమ్మగారూ, నటిస్తున్నాను నా మనసులోని బాధల్ని నాలో దాచుకొని మీ కోసం మీ అందరికీ నవ్వుతూ కనిపిస్తాను. ఇలా కనిపించినందుకు నా కందరూ ఇచ్చే బిరుదేమిటో తెలుసా అమ్మగారూ? (వెర్రిగా) కమెడియన్ అమ్మగారూ, బెస్ట్ కమెడియన్.' (జడ్జీలని చూసి వెళ్ళిపోయేడు ) [పుట 23.]

మధ్యలో ఒక పేరడీ కథ చెప్తాడు. వెనుకటికి ఒకడు ఏడు నాటకాలు రాశాడట. ''ఇంకా రాసేవాడే గానీ అందరూ కలిసి అతనికి నాటక నియంత్రణ ఆపరేషను చేసేసేరుట. సరే - యింకేం చేస్తాడు? రాసిన ఏడు నాటకాలూ ప్రపంచం మీదికి వదిలి పెట్టేట్ట. అన్నీ తిరిగి వచ్చేసేయట. ఒక్కటిమాత్రం రాలేదు. అడిగాడట-

'నాటకమా నాటకమా - ఎందుకు రాలేదూ?' అని. 'సమాజాలు పట్టేసుకున్నాయ్' అందట ఆ నాటకం. 'సమాజమా సమాజమా ఎందుకు పట్టుకున్నావ్?'

'పరిషత్తులో ప్రైజులిస్తున్నారు కాబట్టి '
'పరిషత్తూ పరిషత్తూ ఏందుకు ప్రైజులిస్తున్నావ్?'
'నా బంగారుపరిషత్తులో ఎంట్రీ ఇస్తే ప్రైజులివ్వానా?' అందట."

(పుట 31)

చివరికి ఈ హాస్యనటుడు సి ఐ డీ భీంసింగ్ అని తేలుతుంది. కమెడియన్ పాత్రవల్ల ఏమాత్రం నవ్వు రాదు ఒకవేళ నవ్వు వచ్చినా అది వెకిలితనం వల్ల వచ్చిందే అయివుంటుంది, కాని సముచితమైన హాస్యపోషణం వల్ల సిద్ధించింది కాదు.

ఇరవయ్యవ శతాబ్దంలో జీవిస్తున్న కథానాయిక పద్మ నోటినుండి వెలువడుతున్న ఆణిముత్యాలు ఎలాంటివో చూద్దాం - 'మాది పవిత్రమైన ప్రేమ. ఈ ప్రేమకు అంతస్థు లడ్డురావు పవిత్ర భారతదేశంలో పుట్టిన స్త్రీ ఒక్కసారే ప్రేమిస్తుంది ఎన్ని అడ్డంకులు వచ్చినా తన పాతివ్రత్య బలంతో తన ప్రేమని

రక్షించుకొంటుంది. ఈ ప్రేమ ఎంత విలువైనదో నీలాంటి తుచ్ఛులకు చచ్చినా అర్థం కాదు.' (పుట 19).

ఆర్థిక స్వాతంత్ర్యం లేని వీళ్ళకు 'ప్రేమ' లేమిటీ? పెళ్ళికాని నాయికకు పాతివ్రత్యమేమిటీ? దానికొక బలమేమిటీ? ఇలాంటి ఏ ధర్మ సందేహమూ రచయితల నడగడానికి వీల్లేదు రచయితలు రాస్తారు నటులు నటిస్తారు న్యాయమూర్తులు ఉత్తమ నాటకం (కాలు)గా బహూమతులిస్తారు 'ఆలోచన' గలిగిన తెలుగు ప్రేక్షకుని గతి మాత్రమే అయోమయం. ఆలోచించని ప్రేక్షకులు ఎట్లాగు సంతోషిస్తారు. వారిని గురించి మనం ఆలోచించవలసిన పనేలేదు.

మధ్య మధ్యలో నాటకం పేరు ఎక్కడ మరిచిపోతారో అన్నట్లు-

"ఓమహోదధిలో తరంగమా!

ఎచ్చటికమ్మా నీ పయనం?' అని తెరవెనుక నుంచి నేపథ్య గాయకుడు అత్యంత బాధాతప్తమయిన కంఠంతో పాడుతుంటాడు.

బరువైన డైలాగులకు ఒక నిదర్శనం చూద్దాం.

రామయ్య : కష్టసుఖాలు, సుఖదుఃఖాలూ వెలుగునీడలు తల్లీ!

పద్మ : కానీ జీవితంలో నీడే మిగిల్తే ఇక బ్రతుకు లక్ష్యం ఏమిటి రామయ్యా?

రామయ్య జీవితసారం బ్రతుకుకు అన్వయించుకొని బ్రతుకుని పూలబాట చేసుకోవాలి అమ్మగారూ!

పద్మ గమ్యంలేని బ్రతుకు జీవితం పూలబాట కాదు రామయ్యా!

రామయ్య · బ్రతుకు జీవితం, జీవితం బ్రతుకు అమ్మగారూ!

పద్మ · బ్రతుకుబాట జీవితగమ్యం అయినప్పుడు బ్రతుకుజీవితం జీవితం బ్రతుకు ఎలా అవుతుంది రామయ్యా (పుట 35-36).

ఈ డైలాగుల కన్వయమేమిటి? ఇస్తున్న భావమేమిటి? అన్న ఆలోచన రచయితకు ఏమాత్రం పట్టదు నాటకాన్ని చూస్తున్న ప్రేక్షకపాత్ర వెంటనే 'రేయ్ ఏమిట్రా యిది - బ్రతుకు జీవితం, జీవితం బ్రతుకు ఏమిట్రా? ఎవ ద్రా నేద్రా యిది? అని అధిక్షేపిస్తే, బ్రాకెట్లలో రచయిత వీరేంద్రనాథ్ 'స్త్రిప్టు ప్రైజ్ కోసం రచయితలు పడే బాధ యిది' అని విమర్శించాడు

నాటకమన్నాక ఒక సందేశం లాంటి డైలాగ్స్ ఉండాలి. లేకపోతే పరిషత్తుల బహుమానాలకు పాత్రం కాదన్న భావం రచయితల్లో ఉంటుంది అవ

సరమా? అనవసరమా? అన్నది చూసుకోకుండా ఎక్కడో ఓ చోట ఓ సందేశం వినిపించే యత్నం చేస్తారు శేఖర్ రిక్షాతొక్కయినా పద్మను పోషిస్తాననే సందర్భంలో హాస్యనటుడి ద్వారా వినిపించిన సందేశం:

'అక్ఖర్లేదు ఈ నవీన భారతదేశంలో బియ్యే ఫస్టుక్లాస్‌లో ప్యాసయిన వాళ్ళు ఇక రిక్షా తొక్కక్ఖర్లేదు విప్లవం వస్తోంది సమ సమాజ నిర్మాణం జరుగుతోంది ఇక భావి భారత ప్రగతికి ఈ శేఖర్, పద్మల లాంటి వాళ్ళే నడుము కట్టి ముందుకు దూకాలి . శేఖర్! నవ భారత నిర్మాణంలో నీకు మా పద్మ సహాయం ఎప్పుడూ వుంటుంది ఈ వర్గపోరాటంలో అంతిమ విజయం మీదే!' (పుట. 40)

ఈ నాటకంలో దీనంత దిక్కుమాలిన వాక్యం మరొకటిలేదు ఒక సందర్భౌచిత్యం లేదు నాయికా నాయకులిద్దరి ప్రేమకు నవభారత నిర్మాణానికి సంబంధమేమిటి? పద్మ, శేఖర్ నడుంకట్టి ఏం చేయాలి? వాళ్ళే ఎందుకు నడుం కట్టాలో తెలియదు 'వర్గపోరాటం' అనే పదం ఎక్కణ్ణించి వచ్చి పడిందో తెలియదు. దీనికి ప్రేక్షకపాత్ర 'ఈ నీతికీ, నాటకానికీ సంబంధం ఏమిటండీ' అని ప్రశ్నిస్తే, వీరేంద్రనాథ్ 'రచయితలు క్షమించాలి' అని ఊరుకున్నాడు. ప్రేక్షక పాత్రధారి విసురుగా లేచి మైకు ముందుకు వచ్చి 'చెప్పండి ఫ్రండ్స్- ఇలాంటి నాటకాలు- ఇలాంటి రచయితలు దర్శకులూ- మన ఆంధ్రనాటకరంగం భవిష్యత్తేమిటి? తెలుగు ప్రేక్షకుల గతి ఏమిటి?' అనడంతో నాటకానికి తెర పడుతుంది.

నాటకాలకు పేర్లు పెట్టడం, ఔచిత్య పాటించని సన్నివేశాలు కల్పించడం; స్థాయిమీరిన సంభాషణలు రాయడం, అనువుగానిచోట సందేశాలు విన్పించడం దర్శకత్వ లోపాలు; నటనలో లోపాలు; సంభాషణలు మరచిపోవడం మొదలైన అనేక అంశాలతో తెలుగు నాటకాన్ని ఎంత అసహజంగా రచయితలు తీర్చి దిద్దుతున్నారో యండమూరి వీరేంద్రనాథ్ ఎత్తిచూపాడు తెలుగు నాటకరంగాన్ని గురించిన ఈ పేరడీ ఆవేదన నుండి, అభిమానం నుండి సంస్కరణోద్దేశపూర్వకంగా ధార్మికాగ్రహంతో వెలువడింది.

**

# 28. జానపద గేయాలలో పేరడీ

పేరడీ లిఖిత సారస్వతానికే పరిమితం కాదు. మౌఖిక వాఙ్మయమైన జానపద సాహిత్యంలో కూడా సముచితంగానే చోటు చేసుకొంది. పేరడీ స్వభావం హాస్యపూరితానుకరణం. ఇది సాహిత్యానికే సీమితమైన అంశంకాదు. హాస్యపూరితంగా అనుకరించి ఆనందించడం జీవితంలో ఒక భాగం. అందుకే పేరడీ ఏ ఒక్క విభాగానికి కట్టుబడిపోకుండా అన్నిరంగాల్లోను సునాయాసంగా ప్రవేశించింది జానపద గీతం ఒకటి విన్నపుడు అది అనకరణమా? కాదా? అయితే దేనికి అనుకరణం? దాని స్వరూపమేమిటి? అన్న విషయం నిర్ధారించుకోవడం చాల కష్టమైన పని. స్పష్టమయిన కర్తృకాల నిర్ణయాలు జానపద గీతాలకు చేయలేకపోవడం ఇందుకు ప్రధాన ప్రతిబంధకం

జానపద సాహిత్యంలో హాస్యం ప్రత్యేకంగా పరిశోధించ వలసిన అంశం. బావమరదుల వికటాలు, వదిన మరదళ్ళ వేళాకోళాలు, ఇంట్లో సరాగాలు, సీలాటి రేవులోపరాచకాలు, నలుగుల పాటలు, నాగవల్లి పాటలు, అల్లుడిమీద పాటలు, అత్తగారిమీద పాటలు, అలకపాన్పు దగ్గర పాటలు, తలుపు దగ్గర పాటలు, తగువుల పాటలు, వియ్యపురాలిమీద పాటలు, విందుల పాటలు మొదలైన వెన్నో జానపదుల హాస్యపు పాటలు.[1] సహజమైన హాస్యం పాటలు కొంచెం హేళన అధిక్షేపం, విమర్శ లేకుండారావు. కనుక వాటిని గురించి పరిశీలించ వలసిన అవసరం లేదు. మాతృకయే హాస్య సంబంధి అయితే దానిమూలంగా వచ్చిన పేరడీకి స్ఫుటమైన రూపురేఖలుండవు, ఏమాత్రం హాస్యానికి తావులేని గంభీరమైన కరుణ, భక్తి భావాలతో కూడిన పాటల్లో 'వికృతి' ప్రవేశించినపుడే పేరడీ ప్రకాశిస్తుంది

ప్రాణాలు పణంగా పెట్టి కని, పెంచి, విద్యాబుద్ధులు గరిపి, చివరకు ఓ వరునికి కూతురునిచ్చి పెళ్ళిచేసి అప్పగింతలు పెడుతున్నప్పుడు ఆ తల్లి

---

1 ముట్నూరి సంగమేశం తెలుగుహాస్యం (1953) పుటలు 53-65

దండ్రుల స్థితి, బాధ వర్ణనాతీతం అప్పగింతల సమయంలో ఏ మాత్రం హాస్యానికి, హేళనకు తావుండదు కరుణరసావిష్కరణకు ఉదాత్తమైన సన్ని వేశం అది 'తత్రాపి శ్లోక చతుష్టయం'గా మన్ననలందిన కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలం చతుర్థాంకంలోని నాలుగు శ్లోకాలు కణ్వుడు శకుంతలను అత్త వారింటికి పంపుతూ చేసిన ఉపదేశమే 'అప్పగింతల సన్నివేశం' అంటే దాని గొప్పదనం వెల్లడవుతుంది.

ఈ మహోన్నతమైన భావాన్ని ఒక అప్పగింతల పాట ఎలా అకటా వికటం గావించిందో గమనించండి.

> అత్త మామలుగాని ఆడు బొట్టెలుగాని లేరమ్మ నీ దెంత పుణ్యమోగాని
> మగడొక్కడేగాన మనసు కెక్కినయట్లు - మర్దించి నీ వశముచేసికోవమ్మా
> నీ మాట వినబడ్డ నిమిషంబునందు- అడలిపోయేటట్లు అతని భయపెట్టు
> పతి కోపపడినపుడు పడియుండబోక- అంతకు పదిరెట్లు అతని మర్దించు
> ఇరుగు పొరుగువారలేమైన అంటే- యేద్వక వేయి రెట్లు దుమ్మెత్తిపోయి
> భర్తను వంచుకోగల భార్య గౌరవమెన్న- రారాజునకునైన రమణిరో లేదు
> ఇవి యెల్ల మరువక ఏమాత్ర మలియక - సుఖపడుచుండుమో సొగసు పూదీవ 1

ఈ గేయం కాళిదాసు శ్లోకానికి పేరడీ కాదు లభిస్తున్న ఏదో ఒక 'ప్రత్యేక' జానపద గేయానికీ పేరడీ కాదు. పెద్దలపట్ల సేవాభావం; పిన్నలపట్ల ఆదరం; పనివాళ్ళపట్ల దాక్షిణ్యం, భర్తయెడ అనురాగం; ఓర్పు,నేర్పు, శాంతం నీతి, నియమం, పాతివ్రత్యం మొ॥ కలిగి ఉండడం, అసూయ, కోపం, గర్వం లేకపోవడం మొ॥వి అప్పగింతల వేళ వధువుకు తల్లిదండ్రులు, బంధువులు ఉప దేశిస్తారు. పరంపరాగతమైన సాంప్రదాయికమైన ఆ భావాలున్న కనిపించని ఓ మంచి గేయానికి చేసిన వికటీకరణం ఇది.

1 బి రామరాజు - తెలుగు జానపద గేయ సాహిత్యము (1958) పుటలు 681 - 682.

జోల పాటల్లో సాధారణంగా దైవసంకీర్తనమో లేదా పుట్టింటి వారిని గురించో, మెట్టింటి వారిని గురించో ఉంటుంది. 'జో అచ్యుతానంద! జోజో ముకుందా లాలి పరమానంద రామగోపాల!'అనే జోలపాట అన్నమయ్య కీర్తనం అని తెలికపోయినా ఎందరిండ్లల్లోనో మోగుతుంటుంది. ఓ జవ్వని తన కుమారుని లాలిస్తూ 'తనకు-మారుడైన బాలయ్యతో సంగమించడానికి వెళ్తాను. నీవు పడుకో' అని జోకొట్టే విపరీతపు పాట చూద్దాం.

జోజో నా తండ్రి జోజో తండ్రీ జోజో
జోడుగుర్రాల సార్టుపై వస్తాడు మామ జోజో
పాలు పెరుగుపోసి పడి పెంచినాను
వీలుగాదంటాడు పెంకి నీ తండ్రి జోజో
పనిలేక పొరుగిండ్ల కనయంబు బోవ
ఘనమైన ముచ్చట గలుగునుర తండ్రీ జోజో
పాలు త్రాగి నీవు పడియున్న యెడల
బాలయ్యతోబోయి మాట్లాడివస్తా జోజో
కలకాల మొక యింట కాపురముసేయ
కలుగుట కష్టముర కన్న నా తండ్రి జోజో
పైడాబులే కాని పలుకు పసలేదు
చూడరా నీ తండ్రి వింతహాయలెల్ల జోజో
ధనము కొరకై నేను తారాడుచుంటి
అదియున్న నీ తండ్రి నవల కంపింతు జోజో[1]

'ధన మూల మిదం జగత్'-డబ్బులేనివాడు డుబ్బుకు కొఱగాడు ధనమే ఉంటే భర్తను ఇంట్లోంచి గెంటివేయడానికి సిద్ధపడిన ఈ భార్యామణి పనిలేక పొరుగిండ్లకు పోయే పడుచుల ఘనమైన ముచ్చటలు ఈ జోలపాటలో వర్ణించింది. ఈ గేయం అచ్చమైన జానపద గేయం కాక కొంత నాగరక స్పర్శ కలిగినట్టిది.

---

1 బి రామరాజు, తెలుగు జానపద గేయ సాహిత్యము (1958), పుటలు 681-682

చిక్కుడు చెట్టుకు తీగలందమ్మ
శ్రీకృష్ణ తమ్ముడికి తిరుమణందమ్మ
బీరయ్య పాదులకు పూవులందమ్మ
పణతికి పదినెలల బాలుడందమ్మ
కాకర తీగకు కాయలందమ్మ
కన్న తల్లెట్టిన సొమ్ములందమ్మ[1]

అనే అందమైన పాటకు మరింత అందమైన పేరడీ గేయం వచ్చింది. ఈ గేయాన్ని అనుసరించే పేరడీ గేయం వచ్చిందని నిర్ధారణగా చెప్పలేం హాస్యగేయం నుండే ఇది వచ్చిందని కూడా 'వాదం' కోసం వాదించుకొనవచ్చు

సువ్వి సువ్వన్న సొగసు మల్లన్న - సువ్వి సువ్వన్న సొగసు మల్లన్న
బీరపాదుకి పిందెలందమ్మ - మావారి ముక్కుకు పక్కులందమ్మ
పొట్లపాదుకి పూవులందమ్మ - కాట్లకుక్క మగడు కాంతకందమ్మ
తోటకూర కంబమూ దొడ్డి కందమ్మ - మావారి పొగచుట్ట
నాకు నందమ్మ
వెనుక దిక్కు లేకుంటె వెలది కందమ్మ - మస్తుగ తిండేనే
మగువ కందమ్మ
అత్తమామలు చస్తే అతివ కందమ్మ - దొంగదూడకు
గుదికఱ్ఱ యందమ్మ
దొంగ మగనికి పెంకి పెండ్లామందమ్మ . . .... ....[2]

ఇలా వినోదభరితంగా ఈ దంపుళ్ళపాట సాగిపోతుంది.

జానపద సాహిత్యంలో పేరడీని గురించి పరిశీలిస్తున్నపుడు ముఖ్యంగా చెప్పుకోదగింది భామాకలాపం. భామాకలాపం ఎంతో శిష్టంగా సాగిన రచనే అయినా 'నోళ్ళు' మారుతున్నపుడు భిన్న భిన్న పాఠాంతరాలు ఏర్పడి 'పోబో నీళ్ళకున్ పలుచనై 'పోయిన రచన

1 & 2 అందే-పుట 681-682.

రాధను శ్రీకృష్ణునికి అప్పగింతలు పెడుతున్నపుడు హాస్యగాడు పాడే పాట ఇంతకుముందు పేర్కొన్న అప్పగింతల పాటలాగే నడుస్తుంది. 'హాస్యగాడు' ఎన్ని రకాల మార్గాలలోనైనా హాస్యసృష్టికి యత్నించవచ్చు. అలా యత్నించే మార్గాలలో పూర్వ రచనలను వికటంగా అనుకరించడం కూడ ఒకటి. అప్పుడది 'పేరడీ' అవుతుంది. హాస్యగాడికి తాను పేరడీ చేస్తున్నానన్న జ్ఞానం తప్పనిసరిగా ఉండవలసిన అవసరమేమీ లేదు.

అగ్నిసాక్షిగ దీని పెండ్లాడినావు। అవని భారంబు నీ భారమయ్యా
హితవుగా మగడు చనువిచ్చి పిలిచినవేళ। మురిపించగాబోకు
                                        ముదిత నా తల్లి
చీకటికి చిత్రాంగి వెన్నెలకు పిరికి। గాదయ్య యీ కన్నె గజకన్నకత్తె
ఇరుగు పొరుగుల్లార ఓ యింతులారా। కంచాలు ముంతల్లు
                                        కనిపెట్టుకొండి
చాలచిన్నదిగాని సోలమింగింది। సోధించి చూడుడీ ఆ చోద్యమంతా

బావమరదులు నిన్ను ఎవ్వరేమన్నా। కదురెర్రగా కాల్చి
                                        కంట్లోను పెట్టూ
తోటికోడలు బిడ్డ కూటికేడుస్తే। పిట చెక్కతోను పెణతూడ గొట్టూ
ఇరుగు పొరుగులవారు నిన్నేమియన్నా। యిల్లు శగలబెట్టి మళ్ళిరావమ్మా
బుద్ధులెరుగదు బాల ముద్దులేకాని! బుద్ధులొచ్చేదాక దిద్దుకోవయ్యా.[1]

కుటుంబ సభ్యులందరినీ బాగా చూసుకో! ఒద్దికగా నడుచుకో అని హితోపదేశం చేస్తే నవ్వురాదు. సాధారణమవుతుంది 'వికృతి' హాస్యానికి ఆలంబనం, ఆ వికృతత్వం వల్లనే పై అప్పగింతలపాట చూసినా, మరొకటి చూసినా హాస్యభాజనమవుతుంది

1 మట్టూ సంగమేశం తెలుగు మహాత్మ్యం (1953) పుట. 53-65

భామా కలాపంలో రాధను వర్ణించేటప్పుడు వేసిన ఉపమానాలు, చంద్ర రేఖా విలాపం, అభాగ్యోపాఖ్యానం లాంటి కావ్యాల్లో లాగా హాస్య ప్రదోపమానాలై (**Laughable comparisons**) ప్రేక్షకుల నాకర్షిస్తాయి.

'అప్పడూ! యీ చిన్నదాని సౌందర్యం ఎలా ఉన్నదో చూస్తివా, ఎలాగున ఉన్నదంటే కందిరీగల వంటి కొప్పు, కట్లపీటవంటి ముఖం, కవ్వం గుత్తి వంటి నాసిక, నూగు బెండకాయ వంటి కనుబొమలు, నూతన తింత్రిణీ దళముల వంటి నేత్రములు, రాచిప్పల వంటి చెక్కిళ్ళు, రావన్న గువ్వల వంటి పలువరుస, ఆర్పివేసిన నిప్పువంటి అధరోష్ఠం, దొప్పల వంటి చెవులు, బాన వంటి కడుపూ .. '1

ఈ ఒక్క వర్ణనే కాదు. భామాకలాపంలో ఎన్నో చమత్కారాలున్నాయి ప్రార్థనాశ్లోకాలు కూడ హాస్య భాజనాలే:

గణానాం గణనాధశ్చ గణపాత్ర స్తథైవ చ
కాట్రా కాశీ కొంకినక్కా గార్ధభాయ నమోనమః
అక్కలమ్మా మహామారీ మాతంగీ పరమేశ్వరీ
ఎన్నెమ్మాయ నమస్తుభ్యం అశిరమ్మాయ నమోనమః
కామితీ చైవ గాంధారీ లంఖిణీ చైవ తాటకీ
భూతప్రేత నివాశించ బూర్లెగంపాయతే నమః'2

వేదోక్తమైన గణపతి స్తుతికి పట్టిన గతి ఇది. ఇంకా సోమయాజులు పాత్ర చదివే శ్లోకాలు గమనించండి

అంబలి ముఖ్యాత్వలంకారం కంబళి ముఖ్యంతు భోజనం
రాట్టం ముఖ్యంతు నారీణాం దుక్కి ముఖ్యంతు బ్రాహ్మణం
బాకీసార్లా సుమనసా సర్వాదాయం యథాక్రమం

1 & 2 అందే.

తిన్నట్టే తినకున్నట్టే ఉన్నవారికి మాడడం
మాట మాట ప్రసంగేన దబ్బ దిబ్బ స్తథైవచ
పాదరక్ష ప్రయోగేన శరీరం పీడవర్జయేత్.[1]

వేదం పనసలు చదివినట్లుగానే ఉదాత్తానుదాత్తాది స్వరాలను మేళవించి సంప్రదాయబద్ధంగా వీటిని చదివితే వేదమంత్రాలేనన్నంతగా భ్రమ కలుగుతుంది.

కాచీ కాచీ ములక్కాయ కాయవే పొట్టికాకరీ
కాయానాం వంగపింజానాం కూరానాం గుజ్జుపచ్చడీ.[2]

ఈ విధంగా వేద మంత్రాలకు, అమరకోశానికి, తద్దినం మంత్రాలకు పేరడీలెన్నో కనిపిస్తాయి.

భోజనం మిత్ర సంకీర్ణం - బంధు సంకీర్ణమందిరమ్
శయనం సుతసంకీర్ణం - దేహిమే మధుసూదన[3]
అనే పాండవ గీతలోని శ్లోకానికి -
భోజనం ఈగ సంకీర్ణం - దోమ సంకీర్ణ మందిరమ్।
శయనం తల్లి సంకీర్ణం - దేహిమే కుంటి కూనయా।[4]

అని పేరడీ కట్టాడొక హాస్య ప్రియుడు.

పత్యాసుప్తే చెనకి పలికెన్ నన్ను సారంతు కామా
నిద్రాంకితే అదివిని ఒసే కానిబాలే త్వమంటిన్
భీతా భీతా కమలరుచినా పాణినా నోరుమూసెన్
మందం మందం మధుర వచసా చాఉవాలిత్యవోచత్[5]
అంబలి ద్వేషిణం వందే - చింతకాయకృతాదరమ్
కూరగాయ కృతాతానం పాలనేతి ప్రియాంగవామ్.[6]

---

1 & 2 అందే
3. వేటూరి ప్రభాకరశాస్త్రి 'చాటువులు' ఆంధ్రవారపత్రిక 15-7-1942 (మణిమంజరి ఫిబ్రవరి 1934).
4, 5, 6 అందే

ఇట్లా మణి ప్రవాళాత్మకంగా చెప్పే పేరడీలు కూడ ఎన్నో చూడవచ్చు. ఇవన్నీ పేరడి 'లక్షణ పరామర్శ'లో చెప్పిన ధ్వన్యాశ్రయ (స్వరాశ్రయ) పేరడీకి నిదర్శనలు.

గజ్జెల మల్లారెడ్డి లేఖిని జానపద గీతాల శైలిని రాజకీయ నాయకులను అధిక్షేపించడానికి వాడుకొంది విదూషకునిగా బోళాశంకరునిగా గణితికెక్కిన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అంజయ్య 23 2-1980 న ఢిల్లీ పెద్దలచే 'పాలేరు కన్న హీనంగా' పదవినుండి గెంటివేయబడ్డప్పుడు మల్లారెడ్డి స్పందన చూద్దాం:

ఎన్నాళ్ళుండెద వధికారంలో
కొన్నాళ్ళేగద మనసా!
వెళ్ళేనాడు ఫైళ్ళు కూడ
వెంబడి రావే మనసా
పదవి పదవన్నావు
పరవళ్ళు తొక్కావు
ఆ పదవి ఏమాయె చిలకా!
మూన్నాళ్ళ ముచ్చటకు
మురిశావు కులికావు
ముందుగతి కనలేద చిలకా[1]

అని చెప్తూ మల్లారెడ్డి 'అధికారాంతమునందు చూడవలెరా అంజయ్య సౌభాగ్యముల్' అని కూడ ఓ ప్రసిద్ధ పద్యపాదాన్ని పేరడీకరించాడు.

ఈ విధంగా జానపద సాహిత్యంలో కరుణభరితమైన అప్పగింతల పాటలకు, భక్తిభరితమైన మంగళహారతి పాటలకు, సుప్రభాతాలకు, స్తోత్రాలకు, భాషా సాంకర్యంతో వేదమంత్రాలకు, ఇతర గీతాలకు పేరడీలెన్నో వచ్చాయి.

**

1. 14-2-82 ఈనాడు.

# 29. చిలకమర్తి లక్ష్మీనరసింహం

చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు చేతిలో పేరడీ వీరవిహారం చేసింది. పురాణ కథల శైలికి, వ్రతకథల రీతికి, భగవద్గీత భావాలకు, యాజ్ఞవల్క్యాది స్మృతుల సరళికి హాస్యాన్విత అనుకరణ చేశాడు పంచాంగ ఫలితాలను ఆటపట్టించాడు ఔషధాల, గ్రంథాల అమ్మకాల ప్రకటనల ఆంతర్యాలను అవహేళన చేశాడు. తోకచుక్కల, సప్తగ్రహ కూటముల రాకలకు ఆందోళన పడవలసిన పనిలేదని ప్రబోధించాడు. ఓట్లకోసం పడేపాట్లను చిత్రించాడు. వీలునామాల విధానాన్ని, వినతిపత్రాల విన్యాసాలను ప్రదర్శించాడు. ప్రశ్నాపత్రాల పద్ధతిని పరామర్శించాడు

చిలకమర్తి ప్రహసనాల్లోను ఈ పేరడీల్లోను ఆయనలో ఉండే సహజ హాస్య మనస్తత్వానికి తోడు కందుకూరి ప్రభావంతో అబ్బిన సంస్కరణ దృక్పథం గోచరిస్తుంది.వీటిలో వినోదాత్మకంగా నవ్విస్తూనే మూఢనమ్మకాలను, అర్థంలేని ఆచారాలను మృదువుగా నొచ్చుకోని రీతిలో విమర్శించే పద్ధతి కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది ఈ ప్రహసనాలన్నీ గ్రంధరూపంలో సంకలనమయ్యాయి చిలకమర్తి చెసిన వివిధ రకాల పేరడీలను ఇప్పుడు చూద్దాం.

## చాకలి పురాణం :

"నైమిశారణ్యమునందు శౌనకాది మహామునులు పండ్రెండు సంవత్సరములు సత్రయాగము చేయుచుండగా నచ్చోటికి సకల పురాణములు, సకలేతిహాసములు, సకల ధర్మములు, సకల శాస్త్రములు, సకల విద్యలు నేర్చిన సూతుడు వచ్చెను మహామును లాతనిని గౌరవించి మంచి పీఠముమీద గూర్చుండబెట్టి, 'మహానుభావా' ఇదివరకు లోకములో నెన్నడు నెవ్వరు విననిది కననిది కొత్తది చెవులకింపయినది అగు నొక్క యితిహాసమును సెలవిచ్చి మమ్మందరను ధన్యులను జేయవలసిన'దని వినయపూర్వకముగా ప్రార్థింపగా సూతుడు వారియందు దయగలవాడై మిక్కిలి యాదరముతో నిట్లనియె" అని పేరడీ కథ ప్రారంభమవుతుంది (పుటలు 486 - 488 )

పురాణాల్లోని కథలు చాలవరకు నైమిశారణ్యంలో శౌనకాది మునులకు సూతుడు చెప్పినవేనన్న సంగతిని చిలకమర్తి ఇక్కడ స్ఫురింప చేస్తున్నాడు. వసుచరిత్ర భాగవత తదితర ప్రఖ్యాత కావ్యాలెన్నింటినో ఇందుకు నిదర్శనంగా చెప్పవచ్చు. పూర్వమాకథను ఎవరెవరు ఎవరెవరికి విన్పించారో చెప్పి ప్రస్తుతం నీకు నేను చెప్తున్నానన్నట్లు చెప్పడం సంప్రదాయం. దాన్ని అనుసరించే ఈ "చాకలిపురాణాన్ని" పూర్వం శని విఘ్నేశ్వరుని అడిగినట్లు, ఆయన చెప్పినట్లు చిలకమర్తి కల్పించడం హాస్యం కోసమే. శనైశ్చరుడు విఘ్నేశ్వరుని ఇలా అడిగాడట. విష్ణుమూర్తి పాముమీద పడుకోవటానికి పీతాంబరాలు దాల్చడానికి, సాంబమూర్తి దిగంబరుడు కావడానికి కారణమేమిటి? వినాయకు డిలా సమాధానమిస్తాడు· దుప్పట్లు మాసినపుడు వాని నుదికించుకోవాలి. వేళకు చాకలి వారు తీసుకొనిరారు. తెచ్చినా చింపుకొని తెస్తారు ఈ చాకలి వాళ్ళతో వేగలేక దుప్పట్లక్కరలేకుండా ఉతకనక్కర లేకుండా పాముమీద పండుకొన్నాడు నూలు బట్టలు ధరించకుండా బంగారపు బట్టలు కట్టుకొన్నాడు.

శివుడికి చిల్లిగవ్వలేదు. ఇల్లులేదు పుట్టలో భోజనం. బట్టలుదికించుకోవడానికి డబ్బెక్కడినుండి వస్తుంది? ఏవో రెండు బట్టలతో కాలక్షేపం చేద్దామన్నా చాకలి వాళ్ళు త్వరగా ఉతకరు అందుకే ఆయన దిగంబరుడైనాడు ఎవరైనా పెద్ద లాయన దర్శనానికి వస్తే సిగ్గువేత బొత్తిగా బాగుండదని ఏ పులిచర్మమో, ఏనుగు చర్మమో ధరిస్తాడు ఈ చాకలివాళ్ళ మీదున్న కోపం వల్లనే ఆయన నూలుబట్ట కట్టుకోనని శపథం చేశాడు రకరకాల రంగుల పాములను తలపాగలుగా, యజ్ఞోపవీతాలుగా ధరిస్తాడు విష్ణువు శివుడే ఎందుకు, మహర్షులు సైతం నారచీరలు కట్టడానికి కారణం ఈ చాకలి వాళ్ళతో బాధలు పడలేకనే! చిలకమర్తి చెప్పిన ఈ పేరడీ కథకు మూలం ఒక ప్రసిద్ధమైన చాటువు

చాకి వాని తోడ జగడాలు పడలేక
సిరిగలాడు పట్టుచీరగట్టె,
శివుడు తోలుగప్పె, ఛీయని మదిరోసి
భైరవుడు చీర పారవేసె.

ఈ పురాణాన్ని విన్పించాక ఎవరికీ చెప్పవద్దనే చివరి మాటలు పురాణ సంప్రదాయంలోని ముగింపు మాటలకు హాస్యానుకరణం. 'ఈ యితిహాసము

మిక్కిలి కొత్తది. ఇది వరకెవరును విననిది - కననిది. ఇది పరమ గోప్యముగా నుంచవలసినది దేవేంద్రాదు లీ పురాణము విని మిక్కిలి ధన్యులైరి.' ఇట్లు విఘ్నేశ్వరుడు శనైశ్చరునకు జెప్పిన ఈ చాకలి పురాణమును సూతుడు శౌనకాది మహామునులకు జెప్పి వారిని సంతుష్టాంతరంగుల జేసెను

## మారీచ స్మృతి :

స్మృతులు మానవుడు ఆచరించవలసినవీ, ఆచరించకూడనివీ చెప్పే గ్రంథాలు మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, నారదస్మృతి మొ॥వి చాలప్రసిద్ధి పొందినవి. వీటిలో మానవుని జీవితాన్ని క్రమబద్ధీకరించే అంశాలుంటాయి. ఫలానా ఫలానా పనులు చేయాలి, అవి చేయక విరుద్ధంగా వ్యవహరిస్తే ఫలానా తీరుగా ప్రాయశ్చిత్తం చేసుకోవాలి - అనే నిర్దేశాలుంటాయి.

చిలకమర్తి "మారీచ స్మృతి" అనే వ్యాసంలో స్మృతులలోని అంశాలను పేరడీ చేశాడు. మొదట మారీచుని పరిచయం, దానికి వచ్చిన వ్యాఖ్యానాలు, ఆ స్మృతి చిలకమర్తికి లభ్యమైన విధం వివరించి ఆచారకాండ, ప్రాయశ్చిత్త కాండ, వ్యవహారకాండ అను మూడు అధ్యాయాల్లో మారీచుడు చెప్పిన అంశాలు వ్యాఖ్యానాల్లోని విశేషాలు చెప్పాడు

రావణుడు సీతాపహరణం వేళ లేడి వేషం దాల్చి శ్రీరాముని దూరంగా కొనిపోయిన రాక్షసుడే మారీచుడు. ఆయన "మారీచస్మృతి" పేర రాసిన ధర్మ శాస్త్రానికి కాలనేమి, మాల్యవంతుడు అనే ఇద్దరు రాక్షసులు వ్యాఖ్యానాలు రాశారట. వాల్మీకి మహాముని రామాయణంలో వ్రాసిన తప్పుడు రాతలు తప్ప మారీచుని గురించి ఇతర వివరణ లేవీ దొరకలేదు. తామ్రశిలా శాసనాలేవీ ఇప్పటి వరకు లభించలేదు.

దేవతలు ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని గుర్తించి తెమ్మని కుబేర సేవకుడైన పుష్పదంతుని పంపారట అతడు పందికొక్కు అవతారమెత్తి పుస్తకమెత్తుకు పోతుంటే మాల్యవంతుడు శునకావతారమెత్తి పందికొక్కుతో ఘోర యుద్ధం చేసి సంహరించాడట. విష్ణువు సోమకాసురుణ్ణి చంపి వేదాలు రక్షించినట్లుగా మారీచస్మృతిని మాల్యవంతుడు రక్షించాడనడం హాస్యసృష్టిలో భాగమే

ఈ అభినవ స్మృతి ఈతాకుల మీద రాయబడింది. ఈతాకులన్నీ చెద పురుగులు తినివేసినా అక్షరాలు మాత్రం స్పష్టంగా కనిపిస్తున్నాయి ఈ పుస్తకం మిక్కిలి బరువుగా రెండు గాడిదల మీద మోయించినా అవి మోయలేక టకటకలాడినవి - అని చెప్పడం భారతి పత్రికలో అముద్రిత, అజ్ఞాత గ్రంథాల గూర్చి వచ్చే వ్యాసాల శైలిని అనుకరించడమే.

**ఆచార కాండ :**

1. సూత్రము · స్నానము ప్రాణాపాయము

కాలనేమి వ్యాఖ్యానము : ప్రతి రోజూ స్నానం చేయడం వల్ల శరీరం త్వరగా నశించును. నూతులు వద్ద స్నానం చేసిన నీళ్ళు తోడుకొనలేక జబ్బులు నొప్పి పుట్టును ఒకప్పుడు నూతులలో నీళ్ళు తాగుటకే చాలకపోవచ్చు స్నానం కూడ చేసిన పక్షంలో తాగుటకు లేక మనుషులు, పశువులు చచ్చిపోవచ్చు కనుక సర్వ విధముల మనుష్యుడు స్నానం చేయకూడదు. మాల్యవంతుని వ్యాఖ్యానంలో తల్లిదండ్రులు చనిపోయినప్పుడు తప్ప ఇతర సమయములందు స్నానం చేయకూడదు.

2. సూత్రము · 1) ఆలస్యంగా రాత్రి నిద్రించాలి. 2) ప్రొద్దెక్కి లేవాలి. 3) దంత ధావనం చేయనక్కరలేదు 4) పగటి నిద్ర ప్రశస్తం. 5) కల్లు సారాలు తాగాలి. 6) ఆడపిల్లల నమ్ముకోవడం శ్రేయస్కరం.

ఇలా సూత్రాలు, వాటికి కాలనేమి మాల్యవంతుల వివరణలు సాగుతుంటాయి.

పాపాత్ముల పంక్తిని భోజనము చేయకూడదని సూత్రించి సత్యం పలికే వారు, పరకాంతలను తల్లులుగా భావించేవారు, దొంగతనం చేయనివారు, చేయ గూడదనేవారు, ఉదయాన్నే స్నానం చేసేవారు, దానాలు చేసేవారు, తాగని వారు, జూదమాడనివారు- వీరంతా పంక్తి బాహ్యులనడం హాస్యం కోసమేనని వేరుగా చెప్పవలసిన పనిలేదు

ప్రాయశ్చిత్తకాండలో రసిక దూషకులు భోగచంద్రాయణవ్రతం చేయా లట ఒక వేశ్యను మూడేళ్ళపాటు ఉంచుకోవాలి లేదా వేశ్యలను స్తోత్రం గచంద్రాయణ వ్రతమంటారట. మూడు సం॥లు కల్లు అమ్మితే

కల్లు విక్రయాన్ని, తాగడాన్ని విమర్శించిన పాపం పోతుందట. అతి ప్రాచీనా లైన జ్వాలాజిహ్వా స్మృతిలోను హిరణ్యాక్ష స్మృతిలోను నముచి స్మృతిలోను శతబాహు స్మృతిలోను పదేళ్ళ సురదూషకుడు కల్లు అమ్మాలని ఉందట. సురాపానం సర్వరోగ నివారణోపాయం అని మరో సూత్రం ఇక వ్యవహార కాండ గమనిద్దాం.

సోదరులకు భాగం పంచిపెట్టకూడదు లంచం తీసుకోవచ్చు. వ్యాపారాల్లో వడ్డీ శ్రేష్టం- ఈ తీరుగా సాగుతుంది లోకమంతా లంచంతోనే వుంది దేవతలందు కూడ కలదు నైవేద్యాలే లంచాలు. పరమేశ్వరుడు లంచం కోరుతాడు ప్రార్ధనలు, భజనలు, కీర్తనలు, స్మరణలు, దానములు, పూజలు పరమేశ్వరునకు లంచములు గురువు లంచం కోరతాడు. వినయం, శుశ్రూష వానికి లంచాలు తల్లిదండ్రులు కోరే లంచాన్ని పితృభక్తి అంటారు కనుక లంచం తీసుకోవడం స్వాభావికం లంచం పుచ్చుకొన్నవానిఇంటిలో మహాలక్ష్మి అందెలు ఘల్లు ఘల్లుమంటే, తీసుకోని వానిల్లు శ్మశానంవలె అమంగళమై ఉంటుంది.

దొంగలను దండింపగూడదు దొంగలకు బహుమానాలీయాలి. జారత్వం గూడ దండింపదగిన నేరం కాదు అప్పులెగబెట్టడం తప్పుగాదు ఇటువంటి దివ్యమైన అభివృద్ధిదాయకమైన సూత్రాలెన్నో ఈ మారీచస్మృతిలో ఉంటాయి.

## దివాలాదేవి వ్రతకల్పము :

సత్యనారాయణ వ్రతం ఆంధ్రదేశమంతటా బాగా ప్రచారంలో ఉన్నదే. అట్లే సంతోషిమాత పూజలు, శ్రావణమాసం నోములు సరేసరి వ్రతం చేసినందుకు కలిగే ఫలాన్ని గూర్చి "ఫలశ్రుతి"గా కథ విని వ్రతాలకు ఉద్యాపన చేస్తారు "దివాలాదేవి వ్రతకల్పం" పేరుతో చిలకపర్తి వ్రతకథలను ఆట పట్టించాడు వ్రతాలు చేయించె పురోహితుడు చదివే (చెప్పే) తీరుగా ఈ పేరడీ కథ చదివి (చెప్పి) నపుడు మరింత ఆనందించగలుతాము

నారదుడు "బ్రహ్మతో మహాత్మా, బ్రహ్మదేవుడా! భూలోకంలో మానవులు ధనంలేక ఇబ్బందిపడుతున్నారు కొందరు ఐశ్వర్యంతో తులదూగుచున్నారు. పేదవారు కష్టపడకుండా ధనవంతులగుటకు ఏదైన ఉపాయ ముందేమో అన తీయండి అని అడుగుతాడు

"ఓయి నారదా! నీ వడిగిన ప్రశ్న మిక్కిలి మంచిది. దానికి ఉపాయ ముంది ఇది పరమరహస్యం మితంగా ధనం వాడుకొనేవారికి, గౌరవం కొరకు దేవులాడువారికి, జాలిగలవారికి చెప్పరాదు" అని బ్రహ్మ కధ మొదలు పెట్టాడు

"ఓయి నారదా! నీవడిగిన ప్రశ్నకు జవాబు శ్రద్ధగా వినుము 'దివాలా దేవివ్రత'మనే పేర ఒక వ్రతముంది ఇది గొప్ప వ్రతం "దానికి నారదుడు''దేవా! ఈ వ్రతం అపూర్వమైందిగా తెలుస్తుంది ఇది ఏ పురాణంలోనిది? ఈ దివాలా దేవి ఎక్కడుంది? ఆమె పూజ ఎప్పుడు ఏ విధంగా చేయాలి? ఎటువంటి నిష్ఠ కలిగి ఉండాలి? ఎటువంటి నైవేద్యం పెట్టాలి? ఈ వ్రతం లోకోపకారమైంది. కాబట్టి దీనిని మీరు సమగ్రంగా నా కెరిగించాలి '' అని నారదుడడుగగా బ్రహ్మ ఇలా వివరించాడు·

"నారదా! దీనిని చేయు విధానం స్వల్పం మడీ స్నానం అక్కరలేదు. బ్రాహ్మణులు వచ్చి సంకల్పం చెప్పనక్కరలేదు. ఇది రహస్యంగా ఆచరించాలి. ఈ వ్రతం కలి పురాణంలో చెప్పబడింది దివాలాదేవి అనే దేవత కలిపురుషుని మూడవ కూతురు. కలిపురుషుడు కక్కుర్తి అనే మహాదేవిని పెండ్లియాడగా వారిద్దరికీ ఈ దివాలాదేవి జన్మించింది ఈ దివాలాదేవికి లోభుడు, ద్రోహుడు అని ఇద్దరు తమ్ములున్నారు. ఈమె ఉన్నచోటనే వారూ ఉందురు ఫలసిద్ధి వరకు ఈమెను కొలుస్తున్నట్లు భార్యకుగాని మరెవరికి గాని తెలియరాదు తెలిస్తే ఫలమీయకపోను మీదు మిక్కిలి నెత్తి నణుచును

ఈ దేవి నారాధించి భాగ్యవంతుడు కాదలచినవాడు కష్టపడరాదు. నౌకరీ చేయరాదు. వేషం ఎంత డాబుసరిగా ఉంటే దేవతకంత ఆనందం. లోకు లందరు ఇచ్చే వడ్డీకన్నా ఎక్కువ వడ్డీకి అప్పులు విశేషంగా తేవలెను. దానితో తక్కువ వడ్డీకిచ్చినవారు తమ సొమ్ము తెచ్చి ఈయనకిస్తారు. కొన్ని నెలలపాటు క్రమం తప్పకుండా వడ్డీలు వారింటికే వెళ్ళి చెల్లించాలి. నమ్మకం కుదిరాక సరిగా ఇవ్వనక్కర్లేదు ఈ లోపుగా భూములు ఇండ్లుకొని భార్యాబిడ్డల పేరు మీద రాయించాలి సొమ్మునంత నగల రూపంలో భార్యాబిడ్డలమీదికి చేర్చాలి. కొట్టులో సరుకు తక్కువుండాలి వ్యాపారం క్షీణిస్తున్నకొలది డాబుదర్పం హెచ్చుగా ప్రదర్శించాలి. పూజలు పునస్కారాలు అధికంగా చేయించాలి.

ఇట్లుండగా ఊళ్ళో అతడు దివాలా తీసినట్లు ప్రవాదం బయలుదేరుతుంది. అప్పులవాళ్లు అందరు ఇంటిమీదకు వస్తే సిగ్గుపడకుండా 'నాయనా! దైవవశంచేత ఇలా నష్టం వచ్చింది. ఈ సరుకునంత మీరు పంచుకోండి' అని సరుకులు చూపాలి వారు ఒప్పుకోకుంటే కోర్టుకు వెళ్ళి ఇన్సాల్వెన్సీ పిటీషన్ దాఖలు చేయాలి ఇది దివాలాదేవి మాహాత్మ్యము.రామబాణంవలె అమోఘమైంది. సిగ్గు బిడియం ముందుగానే విడిచి పెట్టాలి దొంగ ఏడ్పులు ఏడ్వాలి ఇవి చేతగాని ఇంట దివాలాదేవి అడుగు పెట్టదు (మరి మనం కూడా ప్రయత్నించి చూస్తే )

## కలిగీత :

భారతీయ ధార్మిక వాఙ్మయంలో భగవద్గీతది అగ్రస్థానం భగవద్గీతా ప్రాశస్త్యాన్ని కొత్తగా చెప్పడం అనవసరం కార్పణ్య దోషోపహతుడైన అర్జునుణ్ణి తిరిగి కర్తవ్య నిర్వహణం వైపు మరలించే నెపంతో శ్రీకృష్ణుడు మానవజాతికి అనుగ్రహించిన దివ్య సందేశం భగవద్గీత

సంస్కృతంలో 18 అధ్యాయాలతో భగవద్గీత వెలిస్తే చిలకమర్తి "కలి గీత ' 15 అధ్యాయాలతో తెలుగు వచనంలో వచ్చింది కలి పురుషుని సారథిగా చేసుకొని సోదరులైన వివేకాదుల పైకి అహంకారుడు యుద్ధానికి వచ్చి చతికిల పడిపోతాడు అప్పుడు కలి చేసిన హితోపదేశమే ఈ "కలిగీత." అహంకారుని విషాదయోగం తర్వాత వరుసగా లోకాయిత యోగం నాస్తిక యోగం. కలి ప్రభావయోగం, విశ్వరూప ప్రదర్శన యోగం, ఆనంద యోగం, ధన యోగం, శ్రాద్ధ యోగం, వర్ణాశ్రమధర్మ యోగం, పిశాచ యోగం, సాయుజ్యయోగం, సదసద్వివేక యోగం, విశ్వరూప దర్శనం, జన్మాంతర యోగాలు కాగా చరమాధ్యాయం కలుపుకొని మొత్తం 15 అధ్యాయాలున్నాయి.

గొంతులు కోసైనా, మోసం చేసైనా, విషం పెట్టైనాసరే శత్రువులను చంపినవాడే ప్రయోజకుడు. భక్తులు, తపశ్శాలులు, బ్రాహ్మణులు, మునులు, యోగులు, సన్యాసులు మొదలైన వారంతా అప్రయోజకులలో మొదటి రకంవారు. వీళ్ళకు పొట్ట గడవదు కావున ధనం, అధికారం సంపాదించాలి (పుట 540).

"ఓయీ మూర్ఖుడా! అహంకారుడా! నీవు నా ప్రియిశిష్యులలో ఒకడవైనా దురాత్మురాలైన జ్ఞానదేవత మధ్య మధ్య నిన్నావహించి పాడుచేయుచుండటం చేత నీవు నా మాటలు విశ్వసింపకపోవుచున్నావు" అని కలి పురుషుడు అహం కారునకు బోధిస్తుంటాడు "నేనే లోకేశ్వరుడను, సర్వశక్తుడను, సర్వ వ్యాపకుడను . కొందరు మూర్ఖులు మాయచేత భ్రమపడి వివేకమనేది మనుష లలో కలదంటారు. కాని అది ప్రమాదం" (పుట 544) అని కలి బోధించి, తనను ఆశ్రయించినవాడికి ధనధాన్యాలు, సుఖభోగాలు, వస్తు వైభవాలు సిద్ధిస్తాయని, నీతి నిజాయితి అని మడిగట్టుకోవడం వ్యర్థమని హితోపదేశం చేస్తాడు.

"వృక్షములలో గంజాయి మొక్కను నేను నల్లమందు మొక్కను నేను. జంతువులలో పెద్దపులిని నేను. చిరుత పులిని నేను ప్రాకెడి పురుగులలో పామును నేను తేలును నేను. పశువులలో పాలియ్యని పోట్లగొడ్డును నేను పుస్తకములలో కొక్కోకమును నేను లంచమును నేను లంచము ఇచ్చిన సొమ్ము నేను లంచము తెచ్చిన రాయబారిని నేను అబద్ధమాడునట్టి మనుషుడను నేను నాలుకను అబద్ధమును నేను గృహమందలి దోమలు నేను నల్లులు నేను, .. వేయేల - సమస్తం నేను" అని కలి అనడంతో కలి ప్రభావ యోగం ముగుస్తుంది

భగవద్గీతలో విభూతియోగంలో భగవంతుడు సృష్టిలోని సర్వోత్తమ వస్తుజాలమంతా నేనేనని చెప్పే ఘట్టానికి చిలకమర్తిచేసిన హాస్యానుకరణం ఇది. "సర్వభూతాల హృదయాల్లోను నేను అంతరాత్మనై ఉన్నాను భూతాలకన్నింటికి ఆది మధ్యావసానాలు నేనే అవి నా వల్లనే నాయందే కలుగుతున్నాయి అని చెప్తూ శ్రీకృష్ణుడు ద్వాదశాదిత్యుల్లో విష్ణువును నేను సూర్యుని, చంద్రుని నేనే. అని భగవద్గీతలో చెప్తాడు

వేదానాం సామవేదోస్మి దేవానామస్మి వాసవః
ఇంద్రియాణా మనశ్చాస్మి భూతానా మస్మి చేతనా

వేదాల్లో సామం, దేవతల్లో ఇంద్రుడు, ఇంద్రియాల్లో మనస్సు భూతాల్లో చైతన్య శక్తిని నేనే మాసానాం మార్గశీర్షోహం, ఋతూనాం కుసుమాకరః ఇత్యాదిగా సాగే శ్లోక భావాలకు అనుకరణమిది.

అట్లాగే "ధనయోగం" అనే అధ్యాయంలో దారులు కొట్టి ఐనా, తాగించైనా, ప్రాణాలు తీసి అయినా ధనార్జనం చేయాలన్న దివ్య సందేశాన్ని కలి పురుషుడు ఇస్తాడు. సన్యసించి పీఠాధిపతులైనవారు అకారణంగా ప్రజలను బహిష్కరించి వారినుండి వందల కొలది ధనం లాగి ఆ ధనాన్ని వెచ్చించి పూర్వాశ్రమంలో కలిగిన కొడుకులకు, బిడ్డలకు మేడలు, మిద్దెలు కట్టించడం శిష్టాచారసమ్మతమైన పని- అంటూ నవ్విస్తూనే నాటి సామాజిక పరిస్థితులపట్ల మెత్తని చురక లేస్తున్నాడు చిలకమర్తి. ఈ విధంగా తక్కిన అధ్యాయాలు వికటరీతిలో సాగుతాయి ప్రతి అధ్యాయం ప్రత్యక్షరం పేరడీగా తలపోయరాదు.

## పంచాంగ ఫలితాలు :

చిలకమర్తి లక్ష్మీనరసింహం "పంచాంగ ఫలితాలను" పేరడీ చేసి చూపించాడు. గ్రామాలలోని దేవాలయ ప్రాంగణంలో ప్రతి సంవత్సరం ఉగాది నాడు ఆ ఏడు పంటలు, ధరలు, అదృష్టాలు, ఆదాయవ్యయాలు, లాభనష్టాలు, వృద్ధిక్షయం పురోహితుడు చెప్పడం పరిపాటి గ్రహసంచారాలను వాటి స్థితినిబట్టి గణించి పంచాంగాలను తజ్ఞులు తయారుచేస్తారు చిలకమర్తి ప్రహసనాలు విరివిగా రాస్తున్న కాలంలోవచ్చిన సాధారణ, ప్రమాదీచ, రాక్షస నామ సంవత్స రాలకు వరుసగా పేరడీ ఫలితాలను రచించాడు కోవెలలో దైవ సన్నిధిలో పంచాంగ పఠనం, శ్రవణం జరగడం మామూలు సంగతి మరి ఇది ఎక్కడ జరిగిందో చూద్దాం.

సంవత్సరాదినాడు అల్లిబిల్లి పట్టణంలో చేపల బజారులో జరిగిందట. ఇక ఫలితాలను గమనిద్దాం గంభీరంగా గహనమైన విషయాలు చెప్పుతున్నట్లు చిలకమర్తి భ్రమగొల్పుతారు తీరాచూస్తే అవి సామాన్య విషయాలు.

'ఈ సంవత్సరం చంద్రగ్రహణములు పున్నమినాడు రాత్రియందును సూర్యగ్రహణములు అమావాస్యనాటి పగటియందును పట్టుచుండును ఆషాఢ మాసమందును పుష్యమాసమందును వివాహాది శుభ కార్యములకు లగ్నము లుండవు (చంద్ర గ్రహణము పున్నమినాడు. సూర్య గ్రహణం అమావాస్యనాడు రావడమనే సంగతి, ఆషాఢ పుష్య మాసాల్లో వివాహాది ముహూర్తాలు లేక పోవడం అనేది అందరికి తెలిసిన సాధారణాంశాలు) 'గర్భిణీ స్త్రీలలో కొందరి

కాడశిశువులు, కొందరికి మగ శిశువులు కలుగుదురు' (ఈ సంగతి ఎవరికి తెలియదు?) 'వేసవి కాలంలో కొందరికి తేళ్ళు కుట్టును, చైత్ర వైశాఖ మాస ములలో కొన్ని గ్రామములలో ఇండ్లు కాలిపోవును విదేశీ వస్తువులు తెచ్చి స్వదేశీ వస్తువులేనని దొంగపేరు పెట్టి అమ్ముట గత నాలుగు సం॥లలో నున్నట్లే ఉండును ' (ఈ సరదా మాటలో నాటి సామాజిక పరిస్థితి తెలుస్తుంది. ఆనాడు విదేశీ సరకును స్వదేశీగా అమ్మడం మోసంగా భావించేవారన్నమాట. నేడు భారతదేశంలో తయారైన వస్తువునే Made in China. Made in Japan అని ముద్రలు వేసి అమ్మడం, జనం ఎగబడి కొనడం చూస్తున్నాం మొత్తం మీద ఈ సంవత్సరమందు పోయిన వాళ్ళు పోగా మిగిలిన వాళ్ళు అయువున్నంతవరకు బ్రతుకుదురు - అని పేరడీ పంచాంగ శ్రవణం ముగు స్తుంది. వృద్ధి క్షయాల పట్టిక ఈ విధంగా ఉంటుంది. వృద్ధి క్షయాల్లో ఆ సం॥ర మందు అరిషడ్వర్గాల, పశు పక్షుల చాతుర్వర్ణ్యజనాల, జంతువుల, లోహాల, పంటల వృద్ధి వాటి క్షయం ఎన్నెన్ని పాళ్ళల్లో ఉంటుందో పంచాంగాల్లో చెప్పబడు తుంది. ఈ పేరడీ పంచాంగంలో కాఫీకొట్ల వృద్ధి 35 పాళ్ళు కిరసనాయిల్‌లో నీళ్ళు 10 పాళ్ళు. బియ్యంలో రాళ్ళు 10 పాళ్ళు, ధర్మోపన్యాసములు 70 పాళ్ళు, దాని ప్రకారం ఆచరణం $1\frac{1}{2}/2$ పాలు, లంచములు 70 పాళ్ళు, దాని నాశనము 3 పాళ్ళు, అత్తా కోడళ్ళ వైరం 50 పాళ్ళు, దాని నాశనం 6 పాళ్ళు, సన్యాసులు కొడుకులకు ఆస్తు లిచ్చుట 75 పాళ్లు. ఇలా సాగుతుంది. సర్వ సంగ పరిత్యాగులం, దేశోద్ధారకులం అని చెప్పి బోధగురువులు బాధ గురువులుగా మారి, ధనానికై శిష్యుల పీడించటం పూర్వాశ్రమం(?)లోని కొడుకులకు, భార. లకు పంపించడం పారమార్థిక కాంక్షలకన్నా పరమ ఆర్థిక కాంక్షలు అధి కంగా ఉన్న దొంగ సన్యాసులు చిలకమర్తికి పూర్వమూ ఉన్నారు, ఇప్పుడూ ఉన్నారు. ఇప్పటి "సన్యాసులు" ఏకంగా పార్లమెంటు సభ్యులుగా, అసెంబ్లీ సభ్యులుగానే ఎన్నికల్లో గెలుస్తున్నారు.

అట్లాగే ప్రమాదీచ సం॥ర పంచాంగాన్ని చిలకమర్తి ఏవిధంగా పేరడీ కరించాలో చూద్దాం. ఒక సంవత్సర పంచాంగానికి ఇంకో సంవత్సర పంచాం గానికి శైలిలో మార్పేమీ ఉండదు. విషయంలో మార్పుంటుంది. పాళ్ళల్లో హెచ్చు తగ్గులు ఉంటాయి

ఈ సంవత్సర ఫలము మిక్కిలి చిత్రమైనది. అదృష్టహీనుల కోరిక నిష్ఫలము, అదృష్టవంతుల కోరిక సఫలము. (ఇందులో చిత్రమేముందిట?) వేసవిలో చూత ఫలము, వర్షాకాలములో జంబూ ఫలము, శీతాకాలములో సీతా ఫలము మాత్రము నిశ్చయములు. ఈ సంవత్సరాది పాడ్యమి మొదలుకొని మృగశీర్షా ప్రవేశము వరకు పగలెండలు మిక్కుటముగా నుండును. జోడులేని వాళ్ళ కాళ్ళు కాలును. గొడుగు లేనివారి నెత్తి మాడును ఈ సం॥రము చైత్ర వైశాఖ జ్యేష్ఠ మాసములలో విసనకర్ర లెక్కువగా ఖర్చగును. లావుశరీరముల వారికి చెమట లెక్కువొచ్చును. వైశాఖ మాసములో కొన్ని రాత్రుల యందు గాలి వీయక జనులు తహతహలాడుదురు (ఎండాకాలంలో అందరికీ కలిగే మామూలు అనుభవమే తప్ప విశేష మేమీ కాదుగదా! విశేష మేమీ కాకపోవడంలోనే పేరడీ ఉంది ) వైద్యుల వృద్ధి 50 పాళ్ళు, రోగముల వృద్ధి 90 పాళ్ళు, అప్పులు పుచ్చుకొన్నవారికి ఇవ్వవలెను అను బుద్ధి 40 పాళ్ళు, ఎగబెట్టవలెనను బుద్ధి 60 పాళ్ళు, ఉద్యోగస్థులకు తొందర 70 పాళ్ళు(ఆ కాలంలోనే ఉద్యోగస్థులస్థితి అలా ఉంటే నేటికది మరింత ఎక్కువే అయింది ఇది సామాజికాంశం), జరిగిన చర్య కొంచమైనను వృత్తాంత పత్రిక ఎక్కువ వ్ర[illegible] [illegible] ఆసక్తి 70 పాళ్ళు, నిజ వర్ణనము 30 పాళ్ళు, (ఇది దిన పత్రికలమీద చురక ఏ కొంచెమో జరిగిన దానికి విలేఖర్లు, సబ్ఎడిటర్లు తమ పైత్యమంతా కలిపి "వార్తాకథ" రాయడం అన్ని పత్రికల్లో గమనించేదే), అల్లుళ్ళ అలకలు 53 పాళ్ళు (ఇది మరింత పెంచినా తప్పేమీకాదు) సాధారణ సం॥ర పంచాంగంలో ఆంగ్లం అంకెలు వేశాడు సాధారణంగా పంచాంగాలలో తెలుగు అంకెలుంటాయని గమనించారో ఏమో- ఈ పంచాంగంలో పాళ్ళు వేసే సందర్భంలో తెలుగు అంకెలే వాడాడు. రాక్షస నామ సంవత్సర పంచాంగం కూడా ఈ ధోరణిలోనే సాగుతుంది

ప్రమాదీచ సం॥రం తర్వాత ఆనంద నామ పంచాంగ ఫలితాలు చిలకమర్తి వారెందుకో రాయలేదు. రాసినా ప్రహసనాల సంకలనంలో చేరలేదేమో! కాని, ఆనంద తర్వాత వచ్చే రాక్షస సంవత్సర ఫలితాలు రాశాడు రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్న రోజులు కావడంవల్ల ఫలితాల్లో యుద్ధాంశాలు కూడా చోటు చేసుకున్నాయి.

'ఆనంద సంవత్సర మంతరించినది. అందరి ఆనందం 'గోవింద' అయినది రాక్షస ప్రవేశించినది. రాక్షస ప్రవేశించకమునుపే జర్మనీ రాక్షసులు, ఆస్ట్రియా రాక్షసులు ఫ్రాన్సు, బెల్జియం మీద ప్రవేశించినారు. యుద్ధమునకు వెళ్ళిన సైనికులలో చాలమంది తుపాకి గుండ్లు, ఫిరంగి గుండ్లు తగిలి కిక్కురుమనకుండా చచ్చిపోదురు. ఈ సంవత్సరము (కూడా) సంగీత సభలలోకి వెళ్ళిన మనుష్యులు లోకాభిరామాయణములు, పుక్కిటి పురాణములు, ఇష్టాగోష్టులు, పిచ్చాపాటి, మాటామంతి చెప్పకొనుట ఎక్కువగా నుండును. పాట వినుట తక్కువగా ఉండును. (చిలకమర్తి సంగీత కచ్చేరి అన్నాడు. కాని సాహిత్య సభలు, పుస్తకావిష్కరణ సభలు అని అంటే మరెంతో సాభిప్రాయంగా ఉండేది. మిత్రులు కలుస్తారని పుస్తకావిష్కరణ సభలకు వెళ్ళడమే తప్ప విజ్ఞానం ఏదో తెలియనిదాన్ని నేర్చుకుంటామని కాదు. ఆహా ఓహోలు వేదిక మీద ఉన్న పెద్దల పరస్పర స్వోత్కర్షలు శాబ్దిక చమత్కారాలు ధ్వని కాలుష్యం- ఇంతేగా హైద్రాబాదులోని పుస్తకావిష్కరణ సభలు), ఈ సంవత్సరము రెండే గ్రహణములు పట్టును ధన గ్రహణము, కాంత గ్రహణము. ఒకటి పగలు, ఒకటి రాత్రి పట్టుచుండును (సూర్య చంద్ర గ్రహణములు కావన్న మాట!) పేద బ్రాహ్మణులకు దానగ్రహణము సంభవించుచుండును. అందుచేత గ్రహణములు మూడని చెప్పవచ్చును కొన్ని పాణిగ్రహణములు కూడ జరుగును గాన 4 గ్రహణములు పట్టునని కొందరు సిద్ధాంతుల అభిప్రాయము (ఇతర పంచాంగ గణకుల అభిప్రాయాన్ని ఉల్లేఖించడాన్ని ఇక్కడ గమనించవచ్చును.)

మంచి కవిత్వము ½ పాళ్ళు, తుక్కు పుస్తకముల వృద్ధి 98½, నిజమైన దాతృత్వం 1, డాబుల దాతృత్వం 99, బిరుదుల దాతృత్వము 76, మొగమాట దాతృత్వము 24, ఆసుపత్రులలో ఆదరణ 15, నిరాదరణ 85 (నిజాం ఆర్థోపెడిక్స్, ఉస్మానియా జనరల్ హాస్పిటల్ లాంటి ఆసుపత్రుల కెక్కడికెళ్ళినా ఇది అనుభవానికి వస్తుంది రాజకీయ నాయకులో, స్థానిక డాక్టర్లో తెలియకపోతే ఇంతే సంగతులు) ఉపన్యాసములు 97 ఆచరణ 3, పాఠశాలల వృద్ధి 75 విద్యాభివృద్ధి 25 పాళ్ళు (ఊరూరా పాఠశాలలు, జిల్లా జిల్లాల్లో [illegible] పుట్టుకొస్తున్నా అవకాశాలు, ఆర్థిక సహకారాలు అందుతున్నా ప్రాథమికాంశాలు సైతం తెలియని పోస్టుగ్రాడ్యుయేట్లు, డాక్టర్లు తయారు కావడం గమనిస్తూనే ఉన్నాంగదా!)

ఈ విధంగా చిలకమర్తి సామాజిక పరిస్థితులను అధిక్షేపాత్మకంగా పంచాంగ ఫలితాలలో చొప్పించి మంచి పేరడీలు సృష్టించాడు.

## యక్ష ప్రశ్నలు :

భారతంలో ఆరణ్యపర్వంలో యక్ష ప్రశ్నల ఘట్టం వస్తుంది. యముడు అడిగిన ప్రశ్నలకు ధర్మరాజు జవాబులిస్తాడు. "కలియుగ యక్ష ప్రశ్నలు" పేర చిలకమర్తి పేరడీ రాశాడు ఇక్కడ యక్షుడు, ధర్మరాజు ఉండరు. చిక్కయ్య అనే అర్చకుడు అడగ్గా నారాయణప్ప అనే ఇంకో అర్చకుడు జవాబులు చెప్తాడు.

చిక్కయ్య : మగవాళ్ళలో ఆడవాళ్లు,ఆడవాళ్ళలో మగవాళ్ల ఉన్నారని విన్నాం-ఇదెట్లా?

నారాయణప్ప : ఉన్నారు ఆడవాళ్ళ మాటలు విని చీటికి మాటికి కయ్యాలకు దిగే మగవాళ్ళు ఆడవాళ్ళే. తక్కిన ఆడవాళ్ళ వలె వ్యర్థ ప్రసంగాలు చేయక కలహాలాడక సత్కాలక్షేపం చేసే ఆడవాళ్ళే మగవాళ్లు.

చిక్కయ్య : మగవాడికి మగడెవ్వడు?

నారాయణప్ప : చెప్పినట్లు వినని భార్య.

చిక్కయ్య : ఆడదానికి పెండ్లామెవరు?

నారాయణప్ప : అప్రయోజకుడైన మగడు

అని వినోదాత్మకంగా చిలకమర్తి పేరడీ సాగుతుంది. (పుటలు 118-120)

## వ్యాపార ప్రకటన :

చిలమర్తి వ్యాపార ప్రకటనల శైలిని అనుకరించి చూపాడు. సాధారణంగా వ్యాపార ప్రకటనల్లో వస్తువు నాణ్యతను గొప్పగా వర్ణించడం. దానివల్ల ప్రయోజనాలు చెప్పడం; ఒక తేది వరకు కొంటే ధర తగ్గింపు అని ప్రకటించడం కనిపిస్తాయి ఇవన్నీ చిలకమర్తి పేరడీలో సంపూర్ణంగా ప్రతిఫలించాయి.

**మొదటిరకం దోమలు** : ఇవి పల్లెటూళ్ళకు ఎగుమతి చేయడానికి పెంచుతున్నాము. చిల్లరగా కొనేవారికి పుట్టి 5 రూ॥లకు: టోకుగా కొనేవారికి పుట్టి

రూ॥ 4, డిసంబరు 15 వ తేది లోపున దరఖాస్తులు పంపిన వారికి రు. 2-8 అణాలు. మూడు మార్లు అన్నం తిని ఏ పనీ లేక నిద్రపోవువారి నిద్ర ఆపుటకు ఈ దోమలు శ్రేష్టమైన విరుగుడు పరీక్షలకు ప్రతి విద్యార్థి వద్ద ఈ దోమలు అరడజను ఉండి తీరాలి ఇవి చదువుకుంటుంటే నిద్ర రానీవు. బీటు తిరుగక నిద్రపోయే పోలీసు భటులు వీటిని కొనుకొన్న పక్షంలో వారికే ప్రమాదం రాదు తెల్లవారగట్ల స్నానానికి వెళ్ళదలచిన వితంతువులు తమను వేరే లేపెడివారక్కర లేకుండా వీటిని పెంచుకోవచ్చు డజనుల లెక్కను పుచ్చుకున్న పక్షమున డజను అణాకిస్తాము కావలసిన వారు ఈ కింద సంతకము చేసినవారికి దరఖాస్తులు పంపాలి రెండు డజన్లు ఏకంగా కొన్నవారికి మూడింటిని కమీషనుగా ఇస్తాము

దోమ అండు కో, మురికి కుంటల వీధి,
రుద్రపురం.

## ఔషధ ప్రకటనలు :

తమ మందులు బాగా అమ్ముడు పోయి లాభాలు రావాలని ఆశించే డాక్టర్లు లేదా మందుల వ్యాపారులు ఆ మందు గొప్పతనాన్ని హృదయంగమంగా వర్ణిస్తూ, ఎంతెంత పెద్దవారు వాడి స్వస్థులయిందీ తెలుపుతూ; తమకెన్ని సన్మానాలు జరిగాయో వివరిస్తూ కరపత్రాలను విడుదల చేయటం గమనిస్తుంటాం. పత్రికల్లో ప్రకటించటం చూస్తూంటాం. చిలకమర్తి వీటికి పేరడీలు రాశాడు.

'అనేక వృత్తులు చేసి ఏ వృత్తియందు తమ పొట్ట గడవకపోవుట చేత తుదకు వైద్యమారంభించిన ఒక మనుష్యుడు తన మందులను ఈ విధంగా ప్రకటించెను.

"శ్రీ బరోడా మహారాజుగారు, మైసూరు మహారాజుగారు, నేపాళ చక్రవర్తిగారు, హైదరాబాదు మహారాజుగారు, తిరువాన్కూరు నవాబుగారు, జయపురం సుల్తానుగారు నా వద్ద లక్షల కొలది, కోట్ల కొలది విలువగల మందులు ఖరీదు చేసి తమ రోగములన్నిటిని బోగొట్టుకుని "కలియుగ ధన్వంతరి" అనే బిరుదునిచ్చినారు (ఈ విధంగా స్వోత్కర్ష కొనసాగుతుంది).. వైద్యము మా కుటుంబంలో ఇరవై తరముల నుంచి ఉన్నది. పైగా హస్త విశేషము మాది మిక్కిలి మంచిది. (ఈ విధంగా తనను పరిచయం చేసుకుని మందులు వివరాలు ఇస్తాడు)

**జ్వర మూషిక మార్జాలం :** ఈ మందు హిమవత్పర్వతముమీది ఓషధులు 100, మేరు పర్వతము మీద ధాతువులు 32, మానస సరోవరములోని కలువ దుంపలు 56, ద్వైపాయ హ్రదములోని నాచుపీశెడు మొదలైన వస్తువులు పడినవి. ఈ మందు తయారు చేయుటకు 30 సం॥లు పట్టినది. ఈ మందు ఒక్కసారి పుచ్చుకొన్న మనుష్యునికి మరి ఎన్నడు జ్వరంరాదు. ఇది తులము రు 93-6-0 (అణా పైసలున్న కాలంలోని ప్రకటన ఇది) పథ్యము సులభము. అన్నము, రొట్టె సమస్తమైన కూరలు, సమస్తమైన పండ్లు, పాలు పెరుగు, ఉప్పు పులుసు, పిండి వంటలు మంచినీళ్ళు విసర్జింపవలయు తక్కినవన్నియు పుచ్చుకొన వచ్చును. (ఇంకేమి మిగులును తినడానికి?)

**అకాల మరణ జంబాల మార్తాండము :** ఈ మందు పుచ్చుకొన్నవారు నూట యేబది యేండ్లు బ్రతుకుదురు అలాగున బ్రతికియున్నవారు ఇప్పుడు అనేకులున్నారు ఇందులో నల్లి నెత్తురు సేరు దోమ మూత్రము కుంచెడు, పేను గుండెకాయలు పదలం, సంజీవి వేళ్ళు యెత్తెడు, తలుపు కిరకిర వీశెడు, హంస చేదుకట్లు పది పడినవి ఇది పుచ్చుకొన్న వారికి చావులేదు. ఇది తులం రూ 610 (ఇవేవి దొరకనివి, పనికిరానివి అని ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు. వకాలున నవ్వుకోడానికి తప్ప మరెందుకూ పనికిరావు )

ఇలా మరికొన్ని వైద్య ప్రకటనలుంటాయి. వీటిని నమ్మడం కోసం కొంతమంది పెద్దల, బాగుపడిన వారి యోగ్యతా పత్రాలు (లేఖలను) కూడ జతపరచడం సహజం. ఏ దినపత్రికనో వారపత్రికనో తిరగేస్తే చాలు - ఫలానా మందులు వాడి సంతానం పొందామని, మూతి మీద వెంట్రుకలు పోయాయని ప్రకటనలుండటం చూడవచ్చు. అతిశయోక్తులతో, పొగడ్తలతో ఈ యోగ్య పత్రికలు ఉంటాయి . . . అజీర్ణము వల్ల ఒక్క మెతుకైన తినలేక చిక్కి శల్యమై కండ్లలో ప్రాణములు పెట్టుకుని ఉన్నవాడు మా మందు మూడు పూటలు సేవించగానే ఎక్కడలేని ఆకలి పుట్టుకుని వచ్చి, ఇప్పుడు పూటకు మూడు సేర్ల బియ్యపు అన్నం తినుచున్నాడు ... ఆదివరకు పూచిక పుల్ల ఎత్త లేనివాడు ఈ మధ్య గడ్డపార వంచి మూడు ముక్కలు చేసినాడు.... ఇది భూలోకపారిజాతము, రోగుల పాలిట కామధేనువు.

ఇట్లు తమ విధేయుడు
తంటికొండ పుల్లేశ్వరరావు

ఇంకొక యోగ్యతా పత్రిక గమనిద్దాం.

భిషగ్మణీ, మీరు పంపిన విరేచన మరమే కను పేరుగల భేదీ వజ్ర కవాట మందినది ఈ మందుతో విరేచనము కట్టుట అటుండగా మేము ఒక కుండ నిండ నీళ్ళు పోసి దానికి చిల్లిపొడిచి మీ మాత్ర కుండలో వేయగా చిల్లివెంబడి నీరు కారుడు కట్టిపోయింది ఇక విరేచనములు కట్టుట ఏమి ఆశ్చర్యము? మీరు పెట్టిన ఖరీదుకంటె నూరు రెట్లెక్కువ ఖరీదు ఇచ్చినను మీ ఈ ఋణము తీరదు.

ఇట్లు మీ ఆప్తమిత్రుడు
కూచిపూడి కోనప్ప సిద్దేశ్వరరావు
దుమ్ముగూడెం.

మనిషి వేసుకునే మాత్రను చిల్లికుండకు వేశామని చెప్పడం హాస్యాన్ని, హేళనను తారస్థాయికి తీసుకుని పోవడమే.

## గోసాయి చిట్కాలు :

ఆయుర్వేదం పుస్తకాల్లో వివిధ రోగాలకు చిట్కాలుంటాయి. అవి ఒక్కోసారి ఇంటిలో సొంతంగా చేసుకోవడానికి వీలుగా ఉంటాయి. అట్లాగే ఆ మందులను ఫార్మసీ నుండి పోస్టు ద్వారా తెప్పించుకోవచ్చు ఏ యే వ్యాధులకు ఏ యే నివారణోపాయాలో గమనిద్దాం. (పుట - 317)

చిడుముకు చిట్కా : చిడుము రోగమునకు ఇటువంటి ఔషధము లోకములో లేదు పూర్వము భేతాళునకు శరీరము నందు జిల పుట్టినప్పుడు ధన్వంతరి ఈ చిట్కానే ప్రయోగించెను ధన్వంతరి చరకునకు, చరకుడు శుశ్రుతునకు, శుశ్రుతుడు వాగ్భటునకును, అతడు మా యోగికిని క్రమముగా నుపదేశించిన చిట్కా ఇదియే దీనికి పత్యము - సిగ్గు విడుచుట సభలోనైనా సందేహింపక గోకుట దీనికుపశాంతి కాని పక్షమున అనగా అది తామర కింద తేలిన పక్షమున ..... హంసపాదు కాగితంతో శాంతి చేసుకొనవచ్చును. అదియు దొరకనపుడు పెద్దతాటి నాశ్రయింపవలెను. గచ్చు గోడలు బొత్తిగా పనికిరావు.

ఇట్లు
కోతల కోనయ్య

మెలగజ్జి మూలయ్యగారి పై విలాసము చిత్రగించి కోతల జంగయ్య గారి కుమారుడు కోనయ్యగార్కి ఇప్పించవలెను — దురదలూరు (పోష్టు). గోకవరం.

ఈ మందు వాడిన ఒకడు ప్రశంసిస్తూ ఇలా లేఖ రాశాడట:

మహారాజశ్రీ కోతల కోనయ్యగారి దివ్యపాదారవింద సన్నిధికి - మీరు ప్రకటించిన దివ్యౌషధమును గూర్చి నేను చదువుకొని సంతోషించి దానిని ప్రయోగించి చూచితిని. నా శరీరము మీద చిడుము గాని తామర గాని లేని స్థలము ఒక అంగుళమైనా లేదు . సాధారణముగా గోళ్ళు తీయుంచుకొను నలవాటు నాకు లేనందున నా గోళ్ళన్నియు పారల వలె పదునై పొడుగుగా నున్నవి మీ ఔషధమును గురించి చదువగానే నేను సలసలలాడునట్లు నీళ్ళు కాపించి యధావిధిగా మీరు చెప్పినట్లు చేసితిని ఆహాహా! ఆ సౌఖ్య మేమని చెప్పుదును. బ్రహ్మానందమనగా అదియే బ్రహ్మానందము. కాని స్నానమైన తరువాత రక్తము కాలువలు కట్టినది శరీరమంతట భగ్గున మంట బయలు దేరినది ఈ మంట లేకుండా మీరేమైనా సాధనము నాలోచించిన పక్షమున మీ మందువంటి మందు లేదు, కాబట్టి మా యందనుగ్రహించి తక్కిన గోసాయి చిట్కాలు కూడా ప్రకటింపవలెనని కోరుచున్నాను.

చిత్తగించవలెను
గేది తామర కిచ్చయ్య
బరుకులపాలెం.

మరో చిట్కా గమనిద్దాం :

**నల్లుల నాశని :** ఈ మందు కూడ సకల జనులకు అత్యావసరమే (నల్లుల నాశని) మత్కుణమారి అని మేమొక అరఖు (Tonic) తయారు చేసితిమి. మంచము మీద నున్న ప్రతి నల్లిని పట్టుకని దాని నోరు పగల తీసి సూది మొనతో అరఖు రెండు చుక్కలు దాని నోటిలో వేసిన ఎడల అది తక్షణమే చచ్చిపోవును. చావకపోయిన ఎడల ఒక చుక్క అయిన ఖర్చు పెట్టకుండా మా మందు మాకు పంపిస్తే బుడ్డి ఖరీదు ఎనిమిదణాలు తిరిగి మికిచ్చి వేయుదుము.

ఈ బుడ్డి పోస్టులో వచ్చునపుడు మందు [illegible], బుడ్డి పగిలిపోయినను నష్టము మీరే ఇచ్చుకొనవలెను.

ఇట్లు
కోతల కోనయ్య,
దురదలూరు; గోకవరం (పోస్టు)
తామరాడ (తాలూకా).

## పుస్తక ప్రకటనలు :

తమ గ్రంథాలను కొనేలా, చదివేలా ఆకర్షణీయమైన శైలిలో ప్రకటనలు చేయడం రచయితలకు, ప్రచురణకర్తలకు అలవాటు. విషయం గొప్పతనం, రచయిత గొప్పతనం పేర్కొంటూ ఆ గ్రంథముపై విద్వాంసుల అభిప్రాయములు పొందుపరుస్తూ ప్రకటనలు విడుదల చేస్తారు పుస్తకాల కేటలాగుల్లోను గ్రంథాల చివరి అట్టమీదను ఈ ప్రకటనలు ఉంటాయి. (పుటలు 263-266 )

చూడుడు చూడుడు
చదువుడు చదువుడు

ఈ పుస్తకము కొనని వారి డబ్బు వ్యర్థము చదువని వారి బ్రతుకు వృథా. విననివారి చెవులు దొప్పలుగాని చెవులు కావు.

**వెఱ్ఱి పప్పీయము :** ఇది 93 ఆశ్వాసముల మహాప్రబంధము. ఇందలి కథానాయకుడగు వెఱ్ఱి పప్పగార్కి పోలేరుదేవి మీద మోహము గలిగినపుడు వర్ణింపబడిన శృంగార రసము రుచి వారంతటి వారే కాని సామాన్యులు గ్రహింపజాలరు ఈ శృంగార రసము చదివిన వారికి పిచ్చి ఎత్తక మానదు. ఇందలి జాలి రసము విన్నవారు ఇంటివారి మీదను పొరుగువారి మీదను పడి గోలుగోలున ఏడవగలరు. వీర రసము యొక్క వర్ణన చదివినపుడు మనుష్యులావేశము గలవారై శత్రువులెవరు కనిపించనపుడు ఇంటివారిపైపడి మర్దింతురు. ఇది ప్రతి గృహమందుండదగిన పుస్తకము శైలి మిక్కిలి సులభమై, మృదువై, లలితమై, సరసమై, శ్రావ్యమై, గంభీరమై, భీకరమై, భయంకరమై యుండును. ఇది ప్రస్తుతము యక్షిణీముద్రాక్షరశాలలో ముద్రణమగుచున్నది. రాక్షస సం॥ అషాఢద అమావాస్య కొత్త మంగళవారము లోపున కొనదలచిన వారికి దీని ఖరీదు

6 పైసలు ఈ సొమ్ము మని ఆర్డరుగా పంపింపవచ్చును. ఆ తారీఖు దాటిన తరువాత కొనదలచిన వారికి ఖరీదు రు 9-4-0

ఈ గ్రంధము రచించిన మహాకవిగారు వెక్కిరింతల వెంగళప్ప గారు. ఈయన మహాకవీశ్వరుడు, సార్వభౌమశిఖామణి చక్రవర్తి. ఈయన నిమిషమునకు 732 పద్యముల చొ॥న ఆశుధారా కవిత్వము చెప్పగల మహాసమర్థులు.

మహామహోపాధ్యాయ కొంకనక్క గురులింగశాస్త్రి గారిట్లు రాసినారు: మీ వెట్టిపప్పీయమును నేను సమగ్రముగా జూచితిని కాళిదాస భవభూతి మాఘ మయూర వ్యాస వాల్మీకుల కవిత్వముల కంటె ఇందలి కవిత్వము వేయి రెట్లధికంగా బాగున్నది గారెముక్కల వలె ఇందలి పద్యములు ఎంతో రుచిగా ఉన్నాయి. దీనికి అల్లపు పచ్చడివలె చిన్న వ్యాఖ్యానమును గ్రంథకర్తగారు రచించియుప్నందున సర్వజన గ్రాహ్యమైయున్నది.

ఎమ్.ఎ డి. బి ఏ డి, ఎస్ ఏ.డి, పి.ఏ.డి, మొ॥ గొప్ప పరీక్షల నిచ్చి ఉద్యోగము చేయుచున్న సీరసాల సీలాచలం గారిట్లు అభిప్రాయపడిరి:

వెంగళప్పగారు దయతో పంపిన వెట్టిపప్పీయమును వందనపూర్వకముగ నందుకొంటిని ఈ గ్రంధకర్త గారు మన పూర్వుల వలె అవకతవక ప్రబంధములు, పుక్కిటి పురాణములు వ్రాయక వెట్టిపప్పగారి చరిత్రమును రసవంతముగ రాసి ఈ దేశమునకు పరదేశమునకు కూడా మహోపకారము చేసినారు గనుక దేశస్థులు పరదేశస్థులు ఈ లోకము వారు పరలోకము వారు కూడా వారి యెడల కృతజ్ఞులై ఉండవలెను ఇంకను నిట్టి అభిప్రాయములు లక్షలకొలది యున్నవి. కాని గ్రంథవిస్తరభీతిచే ప్రకటింపబడలేదు పైగ్రంథము కావలసినవారు ఈ క్రింది అడ్రసుకు వ్రాయవలెను .

మేనేజరు,
చామలమ్మ డిపో,
దయ్యాలపేట, ప్రేతపురం
(263 - 66)

## తోకచుక్కలు :

తోకచుక్కలు కనిపించడం అరిష్టదాయకం అని ఓ నమ్మకం. నాయకులు చనిపోవడమో కరువు కాటకాలు రావడమో సంభవిస్తాయని చెప్తుంటారు ఆధునికులు దీనిని కొట్టివేయడం కూడ గమనిస్తాం

అరుదుగా మిను చప్పరంబున
చొప్పు తెలియని వింత పొడమగ
చన్నకాలపు చిన్న బుద్ధులు
చెదిరి యెంచిరి కీడుగా

. . . . . . .

తెగులు కిరవని కతల పన్నుచు
దిగులు జెందు టదేటి కార్యము
తలతు నేనిది సంఘ సంస్కర
ణ ప్రయాణ పతాకగాన్[1]

అని గురజాడ భావించడం అందరికీ తెలిసిందే తోకచుక్కవల్ల కలిగిన అద్భుతాలు అని చిలకమర్తి కొన్ని వివరించాడు.

అప్రయోజకులైన పెండ్లికొడుకులు గూడ 1116 రూ॥లు వరదక్షిణ అడుగుట, ఓటర్లుగా నుండదగినవారి పేర్లు జాబితాలలో లోపించుట, ఏవిధముగ ఓటర్లు కాగూడని వారి పేర్లు వాటిలో నగుపడుట, నాలుగేండ్ల క్రిందట చచ్చిపోయినవారు కొత్తగా ఈ సం॥ము ఓటర్లగుట బహిరంగంగా కలహములాడుకొని పాదరక్ష ప్రయోగములు చేసుకొన్నవారు ఆప్యాయముగా నొకరి నొకరు కౌగిలించుకుని ప్రాణస్నేహితులగుట ఈ విచిత్రములు పొడగట్టుటకు కారణములేమని యడుగగా అనేకులనేక విధముల చెప్పినారు ముహూర్తములు పెట్టుటలో అసమాన పండిత శిఖామణి అయిన భాస్కర సిద్ధాంతి భట్టాచారుల వారు ఆయన దగ్గరనున్న పంచాంగపు కట్టలన్నియు తిరుగవేసి బోర్లవేసి పైకి క్రిందికి యెగాదిగా జూచి వేళ్లు మడిచి లెక్కపెట్టి నోరు మెదిపి కొంచెమాలోచించి ఈ క్రింది కారణము సెలవిచ్చినారు. తోకచుక్క ఈ సం॥ మున్సిపల్ ఆఫీసుల మీదుగా వెళ్ళినది. ఓటర్ల జాబితాలు ఓట్లు వేసే పెట్టెలు తోకచుక్క యొక్క

---

1 గురజాడ రచనలు కవితల సంపుటి (ముత్యాల సరాలు) పుట - 4.

తోక చివరిలో పడినవి కనబడకపోయిన ఓటర్ల పేర్లు తోకనంటుకొని పోయినవి తోకచుక్కయొక్క తల ఓటర్ల (పేర్లు) తలకాయల మీదుగా పోయి, అక్కడి నుండి అయిమూలగా దిరగి కొంతసేపు రోడ్డుమీద ప్రయాణించి పోయినది. అందుచేత విడ్డూరములు కలిగినవి. (పుటలు 161 - 162).

ఈ విధంగా చిలకమర్తి తోకచుక్క ఫలితాల పేరుతో నవ్విస్తూనే మున్సిపలు ఆఫీసులలోనుండే అవినీతిని అధిక్షేపిస్తున్నాడు.

## వీలునామా :

వీలునామాలకు ఒక ప్రత్యేకమైన శైలి ఉంటుంది. అందులో తన ఆస్తిపాస్తులు ఎవరెవరికి ఎంతెంత చెందాలో వివరిస్తూ తాను సంపూర్ణారోగ్యంతో ఇష్టపూర్తిగా రాస్తున్నానని స్పష్టం చేయాలి సాక్షులుండాలి. వీలునామాకు కావలసినది ఆస్తి. ఆస్తి ఉన్నవాడే వీలునామా రాయించగలడు. ఏ ఆస్తిపాస్తులు లేనివానికి వీలునామాతో, రాతకోతలతో పనిలేదు.

ఒక సన్యాసి తనకున్న స్వల్పమైన ఆస్తి - అవి ఒక కమండలం, ఒక కృష్ణాజినం, రెండు సాలగ్రామాలు మొ॥ వీలునామా రాయించాడట వీలునామా శైలికి చిలకమర్తి చేసిన ఈ పేరడీ గమనిద్దాం. (పుటలు 163 - 165)

శ్రీ మత్సకలలోక పూజితుడగు విశ్వేశ్వరస్వామి వారికి నిలయమైన శ్రీ రాశీ నగరమున వర్తమాన వ్యవహారిక చంద్రమానమున ప్రభవనామ సం॥ర శ్రావణ శుద్ధ దశమీ శనివారంనాడు పగలు మూడు జాములు దిరగిన తరువాత నాలుగవ జాము యొక్క ప్రథమభాగమున భూమ్యాకాశంబులు, సూర్యచంద్రులు, సమస్త దేవతలు సాక్షులుగ వేదాంత తీర్థులని లోకమందు వ్యవహరింపబడుచు అరువది మూడు సం॥ల పదకొండు మాసముల ఇరువై ఆరు దినముల వయస్సుగల నేను ఈ మరణశాసనము వ్రాయుచున్నాను నా అనంతరమందు నా యావదాస్తి నేనీ క్రింద నేర్పాటు చేసిన ప్రకారము పంపకము జరుగవలయును నేను జీవించి యుంటినా, నా యాస్తి పంపకము యీ మరణశాసనము ప్రకారము జరుగక, నా స్వాధీనములోనే యుండవలయును. సాలగ్రామాల రెండింటిలో చిన్నది పూర్వాశ్రమమునందు నా మూడవ మేనత్త యొక్క సవతి కుమారుడైన నారాయణశర్మకు మేనల్లుడైన గోవిందశర్మ యొక్క రెండవ యల్లునితమ్ముడు కేశభట్టునకు చెందవలయును. (ఇక) పెద్దది, ఈ ఆశ్రమమందు

నా ప్రియ శిష్యుడు శంకరానందునకు చెందవలయునేకాని మరెవ్వరికిని చెంద గూడదు

నాకు చిరకాలము నుండి చల్లని నీరు దాహము తీర్చుచున్నట్టిదియు, నా హస్తమున కలంకారమైనట్టిదియు, మూడుసారులు నా చేతిలో నుండి నేల బడినను పగిలిపోక యుండినదియునగు మట్టి కమండలము, క్రొత్తగా నా వలన ఉపదేశము పొందిన బాలభారతికి చెందవలయును. కృష్ణాజినము, గయలో నేనున్న కాలమున నా శరీరములో మిక్కిలి జబ్బుచేయగా మందులిప్పించి, సకలోపచారములు చేసిన వామనశర్మ కీయవలయును. నేను సిద్ధిపొందిన యనంతరమున నా కళేబరమును నాలుగు కుండలు గట్టి పడవ మీద గంగా ప్రవాహము యొక్క మధ్యకు తీసుకొనిపోయి అక్కడ ఏటిలో ముంచి వదిలి వేయవలెను.

ఇట్లు నా ఇష్టప్రకారము నా యాస్తి వారు పంచిపెట్టకపోయినను వారందరు దేవాలయము లేని యూరిలో నున్నవారు, రజస్వలయైన పిదప కూతురికి వివాహము చేసిన వారు, గోమాయువు నిందించినవారు, పాండురోగిని జూచినవారు పోయిన నరకమునకు పోదురు ఇది నా సమ్మతిని వ్రాయించిన మరణశాసనము

—వేదాంత తీర్థస్వామివారు

## అర్జీలు :

కార్యాలయాలకు అభ్యర్థనలు పంపుకొనే శైలికి చిలకమర్తి మంచి పేరడీచేసి చూపించాడు. బతుకున్నవారు కాకుండా చనిపోయినవారు మున్సిపల్ అధికారులకు శ్మశానంలో తమ సౌకర్యాలనిమిత్తం అర్జీ పెట్టుకొన్నారనడం చిలకమర్తిలోని హాస్యశీలానికి నిదర్శనము (పుట 431)

మ॥ రా॥ రా॥ శ్రీ విష్ణువర్ధనపురము మునిసిపల్ అధికారుల దివ్య సుఖ మునకు—

విష్ణువర్ధనపురమందు కొంతకాలము కాపురముండి అక్కడనే చచ్చిపోయి ప్రస్తుతము పితృదేవతలమైయున్న సమస్త వర్ణములవారియొక్కయు మహా జరర్జీ విన్నపము,

మాలో స్త్రీ పురుషుల మందరము ఈ మహజరర్జీలో వ్రాలు చేయుచున్నాము మాలో మైనర్లు కూడా కొందరున్నందున వారి పక్షమున మాలో పెద్దలమయిన వారందరం సంరక్షకులగా నుండి ఈ అర్జీలో వ్రాలు చేయుచున్నాము.

మేము చనిపోయినప్పుడు మమ్మ మోసుకునివచ్చినవారును, మా వెంట వచ్చినవారును ఇసుక తిప్పలలో ఎండకాలములో నెత్తిమాడుచు ఎండలో, వాన కాలంలో హోరున కురుముచున్న వానలో నిలచియుండవలయును. బ్రతికి యున్న ప్రజలు ఎన్నివిధముల మొరలు పెట్టుకొన్నను నాలుగు పందిళ్ళు శ్మశానంలో వేయించలేకపోయినారు "దూషణ భూషణ తిరస్కారంబులు దేహంబునకుగాని పరమాత్మకు గావు" అను సిద్ధాంతము నమ్మిన వేదాంతులా మీరూ? లేక బుద్ధి గడ్డితిని మిమ్మ అధికారములోనికి తీసుకొనివచ్చినందుకు ప్రజలీ విధముగా కష్టములనుభవించవలసినదే? యను సిద్ధాంతములో చేరిన వారా? . నదుపాయము(లు) చేయలేని మీరు ఎందు కధికారము వహించవలెను? కుర్చీలలంకరించుటకా? కుర్చీలను నల్లులాశ్రయించియున్నవి మీరును ఆశ్రయించియున్నారు. భేదమేమి? ఈ ఆర్జీదారులలో మీ బంధువులనేకులున్నారు.

మా అర్జీ ప్రకారము వెంటనే శ్మశానభూములలో మంచి పందిళ్ళు వేయించిరాసరే, అట్లు వేయించకపోతే ఆ పక్షమున మేమందరము గోతులలోనుండి, కాష్టములలోనుండి, నదులలోనుండి, నరకమునుండి, స్వర్గమునుండి ఒక్క పెట్టున వేలకొలది దండెత్తి మీ పట్టణము ముట్టడిచేసి ఈ పని మీచేత చేయించెదము జాగ్రత్త!

చచ్చిపోయి మీ కంటి కగుపడుటకు వీలులేక ప్రజలకే యుపకారములు చేయలేక మేమే యవస్థలో ఉన్నామో బ్రతికి అధికారములోనుండి చిన్న ఉపకారము చేయలేక మీరును ఆ యవస్థలో నున్నారు.

ఒకసారి శ్మశాన భూములలోకి షికారుగా పగలు 10 గంటలప్పుడు గొడుగు, జోడు లేకుండా దయజేసి, అక్కడి జనులుపడు యవస్థ స్వయంగా తాము తెలుసుకుని పందిళ్ళువేయుటకై యుపక్రమింతురని ప్రార్థించుచున్నాము.

ఇట్లు
ఇసుక తిప్పనివాసులు, పితృ దేవతలు
రాక్షసనామ సం॥, పూర్వాషాఢ మాస
సప్తమీ శనివారము
విష్ణువర్ధనపురం మాకాం
ఇసుకతిప్ప రెల్లుదిబ్బల (పోస్టు)

## ఎన్నికల విజ్ఞప్తులు :

ఎన్నికల్లో తమకే ఓటు వేయవలసినదిగా అర్థిస్తూ అభ్యర్థులు కరపత్రాలు పంచడం అందరికీ తెలిసిందే. అందులో తామేమేమి చేసింది, ఇకముందు చేయబోతుంది వివరిస్తారు అది చదివిన ఓటరు అతనికేఓటు వేసేలా ఆకట్టుకొనే విధంగా ఉంటుంది కరపత్రం

మున్సిపల్ కౌన్సిలర్ పదవికి పోటీచేస్తున్న ఒక అభ్యర్థి విజ్ఞప్తి ఇలా ఉందని చిలకమర్తిగారు పేరడీ చేసి చూపించాడు (పుటలు 157 - 160) :

నన్ను మీ వార్డుకు కౌన్సిలర్‌గా ఏర్పర్చుకున్న పక్షమున ఈ ఎలక్షను సమయంలోనే తప్ప మరెన్నడు మీ వార్డులోకి రాను అని ఒట్టు పెట్టుకుంటున్నాను మీ ఇండ్లలోనుండి మురికి నీరు ఎన్నిసార్లు వీధిలోనికి వచ్చినను మీకు ప్రాసి క్యూషను అన్న మాట లేకుండా చేసెదను. మీ రెప్పుడైనా మున్సిపల్ స్థలము కలుపుకోవలసిన అవసరము వచ్చినప్పుడు నేను మీ పక్షముననే ఉండి, రాత్రికి రాత్రి ఆ స్థలము మీకు కలిపి గోడ కట్టించి మీతో కలిసి "ఈ గోడ వీరిదే. 25 సం॥ల నుండి నేనెరుగుదును" అని గట్టిగా వాదము చేతును

కాంట్రాక్టర్లు రోడ్డుమీద ఎంత పనికిమాలిన కంకర తెచ్చిపోసినా అది మొదటి రకం కంకరని వాదించి చెల్లునట్లు చేసెదను రోడ్డువేయుట కెంతకాల మాలస్యమైనను అతనికే విధమయిన ఇబ్బంది రానీయను . . నేను చేసిన ఉపకారములకు ఓటర్లు కంట్రాక్టర్లుగాని తక్కిన వార్డులలోనుండి జనులుగాని సంతోషించి నాకు ఇటుక, సున్నం లేక రొక్కము బహుమానములుగా నియ్యదలచిన పక్షాన కొందరు అవకతవక కౌన్సిలర్లవలె "నాకు లంచమిస్తావా? నేను లంచము పుచ్చుకుంటూనా?" అని బడాయి మాటలు చెప్పక, తెగనీలగక ఓటర్ల మనసులకు

సంతోషము కలిగించుటకై వారు తెచ్చిన బహుమానమును శిరసావహించి నేను పుచ్చుకొందును ..

ఆ పక్షము వారెవరయినను కౌన్సిలరుగా వచ్చిన పక్షమున మీ కర్మము కాలినదన్నమాటే ఏమనగా, వీధులు శుభ్రంగా నుండవలెనని పిచ్చివారలవలె కేకవేయుచు ప్రతిదినము వార్డులలో రెండు మూడుసార్లు తిరిగి మీ తూములలో నుండి ఒక్క నీళ్ళ చుక్కయైనా వీధులలోకి రానీయరు. ఒక్క జానెడు స్థలము కలుపుకొనుటకు వీలులేదు. ఒక్క అరుగు పెంచుటకు వీలులేదు.

కాబట్టి పై సంగతులన్ని మీ మనస్సులో చక్కగా ఆలోచించుకుని మనుషుల కుపకారమును చేయుటకు కంకణము కట్టుకున్న మా పక్షము వారినే నమ్ముకొని నాకు మీ ఓట్లు ఇయ్యవలసినదని ఇందుమూలంగా మరీ మరీ కోరుచున్నాను.

1937 సం॥ మార్చి నెల 33 వ తేది — చిత్తగించవలెను.
రాహువారం. భగ్గేశ్వరం — ఇట్లు తమ విధేయుడు
జంబుకేశ్వరరావు,

## పరీక్షపత్రాలు :

విద్యార్థుల పరీక్షా పత్రాలకు ఒక ప్రత్యేకమైన రూపకల్పన ఉంటుంది. విశ్వవిద్యాలయం పేరు, పరీక్షలకు కేటాయించిన సమయం, మార్కులు, విషయం, ఎన్ని ప్రశ్నలకు సమాధానాలు ఎంతలో రాయాలి మొదలైన వివరాలు పరీక్షపత్రాల్లో మొదట సూచించడం సంప్రదాయం. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు పరీక్షపత్రాల పద్ధతిని వినోదాత్మకంగా అనుసరించాడు.

**ఆకాశ విశ్వవిద్యాలయం :** ఇంద్రవారము, 37 వ డిశంబరు 19763 సంవత్సరము కాలము అసురసంధ్యవేళ గం॥ 7-5ని॥ మొదలు 7-6ని॥ వఱకు

**విషయం - గణితము :**

1 చెన్నపట్టణము గొల్లవాడొకడు ఇంటింటికి ఆవును దూడను తీసుకుని వచ్చి పాలు పిదకదలచి పాలు చేపుదల నిమిత్తము ప్రతి ఇంటివద్ద దూడను ఒకసారి తల్లితో కలిపి వెంటనే యీవలకీడ్చుచు వచ్చును. అత డా విధముగా ప్రతిదినము 12 ఇళ్ళకూ పాలిచ్చుచూ వచ్చును. (ఎ) ఒక్కొక్క ఇంటివద్ద నొక్క చుక్క పాలు దూడ త్రాగిన పక్షమున వారమున కెన్ని చుక్కల పాలు దూడ త్రాగును? (బి) నూరు చుక్కలు ఒక గిద్దెడుగా లెక్క చూచుకొన్న పక్షమున దూడ కడుపులో సోలెడు పాలు పడునప్పటి కెంతకాలము పట్టుతుంది?

2. రాజమహేంద్రవరములో గోదావరి ఒడ్డున వేసిన గట్టుమీది మెట్ల మీదుగా గోదావరిలోనికి డెబ్బది సంవత్సరముల ముసలమ్మ దిగితే కాలుజారిన పక్షమున ఎన్ని పిల్లిమంత్రములు వేసిన నీళ్ళలో పడును?

ఈ విధముగా ఎనిమిది లెక్కల ప్రశ్నలు (రాసాడు) కొనసాగుతాయి. మచ్చుకివి చాలు ఈ ప్రశ్నపత్రంలో అధిక్షేపం, హేళన లాంటివేమీ లేవు. కేవలం వినోదాత్మకంగా చమత్కారపూరితంగా పరీక్ష పత్రాల రీతిని అనుకరించడమే కనిపిస్తుంది ప్రశ్నపత్రం చివర ప్రశ్నలలో నొకటియైన వ్రాయక యూరికేకూర్చున్న కొందరు పరీక్షల్లో కృతార్థు లగుదురు. వ్రాసినవారు తప్పిపోవుదురు అని కూడా రాయడం శ్రీ చిలకమూర్తి చూపిన ''కొసమెరుపు ''

# 30. ఇవికూడా పేరడీలే

శైలి అనేది స్థూలంగా రెండు రకాలు. ఒకటి రచయిత అభిరుచికీ అలవాటుకూ సంబంధించింది. రెండవది ఒక పద్ధతికి చెందింది. ఒక వ్యక్తి/ రచయిత అభినందన సందేశం పంపినా ప్రేమలేఖ రాసినా పీఠిక రాసినా సమీక్ష చేసినా మరేదిచేసినా దానిలో అతని మనఃప్రవృత్తి, ఆత్మీయత (personality) శైలీగత లక్షణాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి ఇది ఒక రకం, వ్యక్తిని ఆశ్రయించుకొని తయారైన శైలి. ఒక ఋణపత్రం రాసినా, పత్రికలో వార్తరాసినా, కార్యాలయ వ్యవహారాలు నిర్వహించినా, బహిరంగ వేలం ప్రకటనలు చేసినా, పరీక్షపత్రం తయారుచేసినా దానికోసం ప్రత్యేకంగా అంతకుముందే తయారయి ఉన్న మూసనే ఎవరైనా అనుసరించాలి. అంతేకాని, వ్యక్తి తన సహజ ధోరణిలో వ్యవహరించడానికి వీలులేదు ఇది పద్ధతిని ఆశ్రయించిన శైలి తెలుగు రచయితలు రెండు తీరులుగాను పేరడీలు సృష్టించారు

శ్రీరమణ సంకలనం చేసిన 'శ్రీరమణ పేరడీలు' లోనివన్నీ వ్యక్త్యాశ్రయ శైలికి తార్కాణాలే. శ్రీరమణ సుప్రసిద్ధ రచయితల శైలీ విన్యాసాలను అనుకరించి ప్రతిభావంతంగా ప్రదర్శించాడు ఒకే విషయాన్ని వివిధ రచయితలు ఎలా వర్ణిస్తారో వారిలోకి పరకాయ ప్రవేశం చేసి వర్ణించడమనేది శ్రీరమణతోనే ఆరంభమైంది మందడి తిలక్, చందు సుబ్బారావు ప్రభృతులందరికీ శ్రీరమణే గురుప్రాయుడయ్యాడు

రైలులో ఆలోచిస్తూ కూర్చున్న ప్రయాణికుని విశ్వనాథ, సంజీవదేవ్, బుచ్చిబాబు, రావిశాస్త్రి, పురాణం సీత, కొడవటిగంటి, వాకాటి పాండురంగారావు, లత, యద్దనపూడి వర్ణించేతీరును శ్రీరమణ అక్షరబద్ధం చేశాడు అలాగే ఒక భవనాన్ని వర్ణించడం, నెమలిపై కవిత్వం చెప్పడం, పీఠికలు రాయడం, అనువాద నవలల తీరుతెన్నులను వర్ణించడం, ప్రేమలేఖలు రాయడం, చిత్ర సమీక్షలు చేయడం మొ॥ వాటిని వివిధ రచయితల గళాల రూపంలో శ్రీరమణ వినిపించాడు. దీనివల్ల విమర్శకులకు భిన్న భిన్న శైలులను తులనాత్మకంగా పరిశీలించుకోవడం సుకరమవుతుంది.

శ్రీరమణ తన గ్రంథంలో ప్రదర్శించిన కొన్ని వ్యక్త్యాశ్రయ పేరడీలను చూద్దాం.

## ప్రేమలేఖలు :

గేయాన్ని కావ్య సారస్వతం సరసన కూర్చొబెట్టిన ప్రతిభాశాలి డా॥ సి. నారాయణ రెడ్డి అంత్యప్రాసలు, శబ్ద చమత్కారాలు అలవోకగా ఆయన మాటల్లో ప్రవహిస్తాయి. ఆయన 'ప్రేమలేఖ' రాస్తే మాత్రం అవి దొర్ల కుండా ఎలా ఉండగలవు?

మధుర రసైక ధారావాహినీ
నమస్తే! నమస్తే! ప్రియసఖీ!
నేనే నేనే నారాయణ రెడ్డిని
కవిని, రవిని, నినుకోరే ప్రియుణ్ణి
నీ చూపులు వలపు సేతువులు
నీ రూపులు రామప్ప శిల్పాలు
అక్షర వసంత రాయల్ని నేను
నీలో లకుమను చూచాను
మన ఇరువురి అనుబంధం
కావాలి నవనవ్య ప్రణయ ప్రబంధం
మరో హరివిల్లు సృజించాను
విపంచిగా సప్తవర్ణాలు పలికించాను
నారి లేని వెలితి వేధించు నను
వెలదీ! హరి వింటి నారి వీవే (పుట 133)

ఇలా నారాయణరెడ్డి కలం సాగుతుందనడంలో ఆశ్చర్యపోవలసిన పనేమీలేదు. సినారె తరచుగా ఉపయోగించే పదబంధాలను శ్రీరమణ వాడుతూ పేరడీ చేశాడు.

'ముళ్ళపూడి రమణ సాహిత్యం అంతా ఒక ఎత్తు - బుడుగు ఒక్కటీ రెండెత్తులు' అన్నాడు ఎమ్వీయల్. ఆ చిచ్చుల పిడుగు బుడుగు సీగాన పెసూనాంబులుకు ప్రేమలేఖ ఎందుకు రాయకూడదు?

ఇది లౌలెటరు రాస్తున్నానన్నమాట బాబాయి ఇచ్చిరా అంటే 2 జెళ్ళ సీతకి ఇచ్చానే అలాంటిదన్న మాట. బాబాయికి కూడా కొంచెం రాయడం వచ్చనుకో. నేను వచ్చినంత కాదనుకో.

నీ కసలేం రాదు కదా! నీకు బాహారావటం కోసం కుంచెం కుంచెం రాస్తాను. లేకపోతే బోలెడు ఇంకా చాలా రాసేయగలను.

అంమ ఏమీరాయదు. అంమకి పాపం గుడింతాలు కూడా రావు. అందుకని రోజూ నాన్న తలకి బొబ్బర్ల్నానె రాస్తుంది. నేను వద్దన్నా 'ఊహుఁ' వినదు. 'ప్రైవేటు' చెప్పి అయినా రాస్తుంది. పాపం చదువు రాదుకదా, అందుకని నేను వూరుకుంటాను.

బాబాయి కాయితాల మీద రాస్తాడనుకో! నేను పలకమీద గుండ్రంగా రాయాలిట ప్రేమంటా అచ్చంగా యిచ్చెయ్యడంట ఒరొరిగా కాదు నిఝంగా అన్నమాట.' (పుట 143)

ఇహ ప్రైవేటు మాష్టరు వచ్చిన పలక ఉండదన్న మాట అని చిచ్చుల పిడుగు బుడుగు పలక రెండువైపులా నిండిపోయిందోచ్ అని కిసుక్కున నవ్వేయవచ్చు

## అభినందన :

ఎవరికైనా ఏ సందర్భంలోనైనా సన్మానం జరుగుతున్నపుడు ఆ వ్యక్తిని అభినందించడం, నాలుగు మంచి మాటలు చెప్పడం మర్యాద. అతను వంద తప్పులు చేసి వుండవచ్చుగాక! కాని వాటిని అభినందన సమయంలో ప్రస్తావించకపోవడం ఔచిత్యం.

అభినందన సమావేశంలో ప్రసంగించడమైనా, అభినందన సందేశం పంపడంలోనైన రచయితలు తమ జీవగతమైన ప్రవృత్తిని మార్చుకోలేరు. ఎంత మాట్లాడాలి అనేది గమనించకుండా తమ ధోరణిలోనే తాము ప్రసంగిస్తుంటారు ఆ ప్రవృత్తిని పేరడీకర్త గుర్తించి రాసినపుడే విజయం పొందుతాడు.

ఆరుద్ర షష్టిపూర్తి (1985 సెప్టెంబరు 1) నాడు కీ॥శే॥ విశ్వనాథ బతికుంటే ఎలా అభినందించేవాడో శ్రీరమణ చక్కగా పేరడీ చేశాడు [1]

1 1-9-85 ఆంధ్రజ్యోతి దినపత్రిక

''భాగవతుల శంకరశాస్త్రి ఇది కొందరికి తెలియును. కొందరికి తెలియదు. ఆరుద్ర. ఇది మిక్కిలి ప్రసిద్ధము.

ఆరుద్ర అభ్యుదయ వాదినని చెప్పుకొనును అయినచో అయివుండ వచ్చును కాకపోయినచో మాత్రము ప్రమాదమేమి? ఇతడు గడ్డము పెంచును. ఆనాడు జులపాలు పెంచుటను భావకవులు ఆచారము జేసిరి నేను ఏ వాదము నకూ చెందను నా వాదము నాది నచ్చినవారికి యది వేదము. లేనివారికి లేదు వారికి జుత్తు బెంచుట ఆవశ్యకమని తోచినది కవియైనవాడు మేధను బెంచుకొనుట ముఖ్యమని నాకు దోచును ఏది ముఖ్యమో ప్రాజ్ఞులు గ్రహింతురు గాక! ఒకచోట నేనతనికి గురుతుల్యుడనని బేర్కొన్నాడు నా రచనలు కొన్నింటిని చదివి, యెట్లు వ్రాయకూడదో తెలిసికొంటినని చమత్కరించినాడు. ఏమైననేమి? ఆ 'ఎఱుక' యేదో నా వల్లనే కలిగినది కదా? అజ్ఞానము తొల గించినవాడు గురువు సముద్రమున ఆణిముత్తెములు ఉండును నత్తగవ్వలును ఉండును వారి వారి ప్రాప్తము ననుసరించియు వారి వారి పూర్వజన్మ సుకృ తమునుబట్టియు అవియవి వారి వారికి లభించును అతని 'ఊహ' యట్లున్నది అతని కదియే ప్రాప్తమని భావింతును.

ప్రస్తుతాంశము షష్ట్యబ్దిపూర్తి అరువది సం॥ములు నిండుట ఈ వేడుక. అయినచో ఆరుద్రకు అరువది నిండినవా? లేదు భాగవతుల శంకర శాస్త్రికి అరువది నిండియుండవచ్చును ఆరుద్ర పుట్టినది తరువాత గదా! మరి ఆరుద్రకు అరువది యెక్కడివి? కనుక ఈ షష్ట్యబ్ది పూర్తి భాగవతుల శంకరశాస్త్రికే గాని ఆరుద్రకు కాదు ఔను ఇది యొక చమత్కారము ''

విశ్వనాథ ఒక్కోసారి అభినందిస్తున్నాడో అధిక్షేపిస్తున్నాడో కూడ తెలియకుండా చమత్కారంగా తన సందేశాన్ని ఇవ్వగలడు ఎక్కడ ఏ స్థితిలో ఉన్నా తన ధిషణాహంకార సంభార దోహల బ్రాహ్మీమయ మూర్తిమత్వానికి మాత్రం తిరుగులేదు ఆయన స్వాతిశయం ప్రస్ఫుటంగా గోచరిస్తుంది శ్రీరమణ పేరడీలో బాహిరమైన విశ్వనాథ శైలి, అంతరంగికమైన విశ్వనాథ వ్యక్తిత్వం స్ఫుటంగా జాలువారాయి.

ముఖ్యంగా గడ్డం కన్నా మేధ పెంచాలనడంలోను, ఎట్లు రాయకూడదో తెలుసుకోవడానికైనా నా గురుత్వాన్ని అంగీకరించాడనడంలోను, ఆరుద్రకు కాక శంకరశాస్త్రికి షష్ట్యబ్ది అనడంలోను విశ్వనాథ జీవనాడిని శ్రీరమణ పట్టుకో గలిగాడని చెప్పవచ్చు అసలు విశ్వనాదే బ్రతికుంటే ఇంతకన్నా బాగా అభినం దించలేకపోయేవాడేమో!

## అభిప్రాయ ప్రకటనం :

శ్రీశ్రీకి నోబెల్ బహుమతి వస్తే పురిపండా, విశ్వనాథ, తుమ్మల, కరుణశ్రీ, కొడవటిగంటి, బంగోరె, ముళ్ళపూడి ప్రభృతులు ఎలా స్పందిస్తారో చందు సుబ్బారావు ఊహించాడు దానిలో బంగోరెది మాత్రం గమనిద్దాం.

'ఇప్పుడు శ్రీశ్రీకి యీ అవార్డు వచ్చిందీ అని సంబరపడటం కంటె యింతకాలం ఎందుకు రాలేదూ అని ఆలోచించాల ఇందులో సంప్రదాయ పండితుల 'మూగకుట్ర' ఏదైన వున్నదా పరిశోధించి చూడాల్న మన తెలుగు పండితుల వారికిది పట్టదు వేటూరి ప్రభాకర శాస్త్రి చెయ్యి లేకుండా వుంటుందా ఆరుద్రగారి నడిగితే 'వుండి వుండవొచ్చునేమో' అన్నారు. ఏమైనా ఆధారాలు తంజావూరు ఆర్కైవ్స్‌లో దొరకవచ్చునేమో... పరిశోధించి చూడాల '

బంగోరెది రంధ్రాన్వేషణ శైలి అందరూ 'మోసాలు' చేస్తున్నారనే అనుమానం, దాన్ని నిరసించాలనే ఆవేశం ఆయనది. బ్రౌన్‌మీద, కన్యాశుల్కం మీద అనితరసాధ్యమైన కృషిచేసి చూపెట్టాడు. బంగోరె చేసినకృషి బంగారమే అయినా ఆవేశంలో ఉచితానుచితాలు మరిచిపోయి, వ్యక్తిగతంగా దూషించడాలు, కించపరచడాలదాకా వెళ్ళిపోతాడు ఆయన శైలిలో కొంత నెల్లూరు 'యాస' కనిపిస్తుంది. చందు సుబ్బారావు పేరడీలో బంగోరె బాగానే ప్రతిఫలించాడు

## చిత్రసమీక్షలు :

పుస్తకాల పీఠికలకు వర్తించిన సూత్రాలే చిత్రసమీక్షలకు కూడా వర్తిస్తాయి. చిత్ర సమీక్షలు కొంతవరకు చిత్రం జయాపజయాలకు దోహద పడతాయి మంచి చిత్ర సమీక్షకులు కథను, పాత్రపోషణను, సంభాషణ లను, ఫోటోగ్రఫీని- ఒకటేమిటి, సమస్త విషయాలను కూలంకషంగా చర్చించి

---

17-6-88 ఆంధ్రజ్యోతి వారపత్రిక.

ఆ చిత్రం బాగోగుల్ని నిర్ణయిస్తారు. కాని ఒక అభిప్రాయానికి బద్ధులైనవారు, ఒక తరహాలోనే జీవించేవారు అవసరమున్నా లేకున్నా 'తమ దృష్టికోణం, నుండే పరిశీలిస్తారు. తమకు నచ్చిన అంశాలు దానిలో కనబడితే ఆకాశానికెత్తేస్తారు. లేకపోతే పాతాళానికి తొక్కేస్తారు అట్లాగే తమ భావాలకు పూర్తి విరుద్ధమైన సినిమా ఎంతగొప్పగున్నా దుమ్మెత్తి పోస్తారు

ఉషశ్రీ కంఠం తెలుగువారందరికీ ఆకాశవాణి ద్వారా సుపరిచితం. రామాయణ భారత భాగవతాలను గురించి అసంఖ్యాకమైన ప్రసంగాలు చేశాడు. ఆయనకు చలనచిత్రాలకు ఎలాంటి సంబంధం లేదు కాని ఉషశ్రీకి నాస్తిక భావాలతో తీయబడిన సినిమాను సమీక్షించమని కోరితే ఎలా ఉంటుందో మందడి తిలక్ అనుకరించి చూపాడు.[1]

''శతాబ్దములయినవో సహస్రములే సాగినవో దైవభావమావిర్భవించి. మానవకోటి విశిష్టమూ విలక్షణమైన జీవన మార్గాన్ని సృజించుకోవడానికి దోహద మిచ్చిన వాస్తవాన్ని మరచిన కొందరు పెద్దలు దేముడున్నాడా? ఉంటే ఎక్కడ? వగైరా ప్రశ్నలతో తమవంటి మేధావుల మనసుకు ఉల్లాసాన్ని కలిగించే ప్రదర్శనలు కొన్ని జరుపుతున్నారు ఆ కోవలోనిదే ఈ చిత్రం

మానవజాతి గాలి పీలుస్తున్నంత కాలం దైవ నామస్మరణ తప్పదు. అయితే కొందరు భక్తితో చేస్తే, మరి కొందరు ఈ సినిమావారివలె ద్వేషంతో సాగిస్తారు ఎవరికైనా దేముడే ధ్యేయం

మత సాగరంలో మునిగి మణులూ, రత్నాలూ తెచ్చుకునేవారూ ఉన్నారు. నాస్తిక సాగరంలో మునిగి నత్తగుల్లలే ఏరుకుంటామనే ఈ సినిమాలాంటి వారికి దూరంగా నిలిచి నమస్కారం.'

---

1. 18-8-1982 ఆంధ్రప్రభ వారపత్రిక-

హిందూమతం పట్ల విశ్వాస ప్రకటనం; నాస్తికత్వం పట్ల తిరస్కారం విధిగా ఉండే ఉషశ్రీ 'చలనచిత్ర సమీక్ష ఇంతకన్నా వేరుగా ఉండబోదు.

## పీఠికలు :

రచయితకు పాఠకునికి మధ్య పీఠికలు వారధిలాంటివి పుస్తకంలోని విషయానికి సంబంధించి పూర్వాపరాలు చర్చించి, ఆ పుస్తకంలోని బాగోగుల్ని వివరించి, భవిష్యత్తులో జరగాల్సిన దాన్ని ప్రస్తావించి రచయితను అభినందిస్తూ ముగించటం సాధారణంగా ఉంటుంది పీఠికాకర్త తనకు నచ్చిన,తాను మెచ్చిన భావజాలం పుస్తకంలో కనిపిస్తే పొగడడం, లేకుంటే తెగడడం జరుగుతుంది. అంతేగాక,పీఠికాకర్త ఒక విషయంలో అభినివేశం కలవాడైతే అవసరం ఉన్నా లేకపోయినా చాపల్యంతో పీఠిక మొత్తం దానిమీదే కేంద్రీకరిస్తాడు.

పీఠికలు పీఠికాకర్తల శైలికీ అభిప్రాయాలకూ ప్రతిబింబాలే. వారిష్టం వచ్చినట్లు వారు రాయవచ్చు విశ్వనాథ, సంజీవదేవ్, కె.వి రమణారెడ్డి, శ్రీశ్రీ లాంటి కవుల పీఠికలనేకాక, స్థాలీపులాక న్యాయంగా సాగే సాధారణ పీఠికలు, బైబిల్ ధోరణిలో సాగే పీఠికలను రచయితలు పేరడీచేసి చూపారు. ఇప్పుడు ఒకరిద్దరి పేరడీ ధోరణులను పరిశీలిద్దాం.

సంజీవదేవ్ తత్వవేత్త చిత్రకారుడు. కవి ఆయనదొక విచిత్రమైన శైలి. ఆయన పీఠికలు గ్రంథంతో పెద్దగా సంబంధం కలిగి ఉండవు. విడిగా చదివినా సరిపోతాయి ఒక భావమే అటుగా ఇటుగా చెప్పడం, ఏదో తత్త్వాన్వేషణ చేస్తున్నట్లుగా కనిపించడం ఆయన పీఠికల్లో గోచరించే అంశాలు.

'కవిత విన్పిస్తుంది చెవికి
కవిత కన్పిస్తుంది కంటికి
గద్యంలో వుంటవి కొన్ని రచనలు
వుంటాయి కొన్ని రచనలు పద్యంలో'.

కవిత కాని గద్యం వున్నట్లే కవిత కాని పద్యం కూడ వుంటుంది. కవితగల గద్యం వున్నట్లే కవితగల పద్యం కూడా వుంటుంది ఉన్మీలన చేసే స్రష్ట యొక్క అనుభూతికి రసమయ అభివ్యక్తికి భావసామ్యం కుదిరినపుడు రసా

త్మకమైన కావ్యంగా రూపాంతరం చెందుతుంది. అందుకే ప్రసిద్ధ చైనీయదార్శనికుడు - లోఫ్‌చే అంటాడు '1

సంజీవదేవ్ పీఠిక ఇలా సాగుతుందంటాడు శ్రీరమణ

మరికొందరు 'నేతినేతి' వాదాన్ని ఆశ్రయించి పీఠికలు రాస్తారు.

"ఇది కవిత్వమా? కాదు కాదు. ఇది యొక మహాధార ఇది మహాధారయా? కాదు. రసవస్తువులన్నియు కూడిన పులిహోర ఇది కవి గుండెల చప్పుడు కాదు ఇది సమగ్ర విప్లవ ఢంకా మోత కాదు జగత్తు నందలి క్షోభ ఈ కావ్యము నందు ప్రతిబింబించుచున్నది. ఈ కావ్యమొక నిశ్చల సరస్సు కాదు. ఈ కవిత ఒక మహాతపస్సు."2

ఇలా చచ్చినా మెచ్చుకుంటున్నాడా తిడ్తున్నాడా అన్న సంగతి తెలియకుండా కొందరు పీఠికలు సంతరిస్తారని గోపాల చక్రవర్తి ఉదహరించాడు

ఒక క్రైస్తవ మతాచార్యుడిని పీఠిక రాయమంటే ఇలా రాస్తాడంటాడు శ్రీరమణ.

"సహోదరుడైన సర్వశ్రీ గ్రంథము మిక్కిలి కొనియాడ దగినదై యున్నది పాపుల యొక్కయు, జీవితము యొక్కయు దేశము యొక్కయు నిజమైన విషయములు యిందు వ్రాయబడి యున్నవి. ఈ లాగున ఉత్తమ గ్రంథములను రచించుటవలన సహచరులకు మిక్కిలిగా మేలుచేసిన వాడు అగుచున్నాడు మనుష్యుడు తన వివేకము కొలది పొగడబడును నీతిని విత్తువాడు శాశ్వతమైన బహుమానము నొందును ఇట్టి వ్రాతలు వ్రాయువాని తలమీదికి దీవెనలు వచ్చును."3

తెలుగు బైబిలు ఏ పుట తీసి చూసినా చాలు-రేడియోలో క్రైస్తవ ప్రవచనాలు విన్నా చాలు-దీనికి తగిన నమూనాలు లభిస్తాయి. 'నీతిని విత్తుట' అనడంలోను 'తలమీదికి దీవెనలు వచ్చుట' అనడంలోను మరీ స్పష్టంగా కనిపిస్తుంది.

---

1 శ్రీరమణ పేరడీలు- పుట 55

2 గోలాయణం- పుట 54.

3 శ్రీరమణ పేరడీలు పుట 54.

స్వీయశైలి గలిగిన ప్రముఖ రచయితలు ఏ సందర్భంలోనైనా ఎలాంటి సన్నివేశంలోనైనా తమ మనఃప్రవృత్తి, శైలికి సంబంధించిన బలహీనతలు వదులుకోలేరన్న సంగతి నిర్వివాదం ఈ 'మేనరిజమ్స్' పేరడీస్టులకు వర ప్రసాదం లాంటివి రచయితల శైలిని అనుకరించడంలో శ్రీరమణది అందె వేసిన చేయి శ్రీరమణ తర్వాత మందడి తిలక్ పేరడీలో ప్రయత్న పూర్వ కంగా కృషిచేశాడు ఇంకా చందు సుబ్బారావు, గోపాల చక్రవర్తి, సూరం పూడి విశ్వం, విశ్వనాధ పావనిశాస్త్రి మొ॥ వారెందరో అనుకరించి, అందరినీ అలరించారు.

## సత్యాశ్రయ కంద శిలాశాసనం :

ఒక ప్రత్యేకమైన పద్ధతికి చెందిన పేరడీలు రాయడంలో జరుక్‌శాస్త్రియే ఆద్యులు ఆయన రాసిన 'అసలు సత్యాశ్రయ కంద శిలా శాసనం' వ్యాసం ఈ రకం పేరడీలకు ప్రశస్తమైన నిదర్శనం[1] వ్యాసరచన నిజానికి వ్యక్త్యాశ్రయ శైలికి చెందిందే కాని కొన్ని రకాల వ్యాసాల్లో వ్యక్తి అభిరుచుల కన్న వస్తువు దానిని వ్యక్తీకరించే విధానం విలక్షణంగా ఉండి తమ ఆధిక్యతను ప్రదర్శిస్తుం టాయి. శాసన పరిశోధనకు సంబంధించిన వ్యాసాలు భారతి మాసపత్రికలో పుంఖానుపుంఖంగా వచ్చాయి. ఈ వ్యాసాలకు ఒక స్థిరమైన బాణీ ఏర్పడింది శాసనం దృష్టిలోకి వచ్చిన (దొరికిన) విధానం, ఆ లిపి స్వరూపం, కాల నిర్ణయం, భావం, చారిత్రక సమాచారం మొదలైన అంశాలను వివరిస్తూ రాస్తే (ఇంచుమించు) శాసన పరిశోధనాత్మక వ్యాసం అవుతుంది వేటూరి ప్రభాకర శాస్త్రి, మల్లంపల్లి సోమశేఖర శర్మ, జయంతి రామయ్య మొ॥ వారు తెలుగులో శాసన పరిశోధకు లుగా గణుతి కెక్కినారు. ఈ శాసన పరిశోధనం కీకారణ్య సంచారం లాంటిది వాదాలు ప్రతివాదాలు చెలరేగుతాయి అవునన్నది కాదంటారు కాదన్నది అవు నంటారు ఇరుపక్షాలవారూ ఏవో ఉపపత్తులు చూపిస్తూనే ఉంటారు.

ఈ శాసన వ్యాసాల ధోరణిని వినోదాత్మకంగా జరుక్‌శాస్త్రి ఇలా అనుక రించాడు.

---

1. జరుక్‌శాస్త్రి పేరడీలు- పుటలు. 102 - 116.

'యిప్పటి లిపి కానేకాదు. ఎట్టా ఔతుంది. మనం రాశే లిపి వేరు. ఈ లిపి వేరు అక్షరాలు పొంకంగా లేవు ఆరవీటి రాజుల కాలపు పద్ధతి కాదు. రేనాటి శాసనాల పద్ధతికాదు ' గంగ రాజుల పద్ధతీ కాదు. చాళుక్యుల పద్ధతీ కాదు రాష్ట్రకూటుల పద్ధతీ కాదు'.

ఇలా అది కాదు,ఇది కాదు అని ఆర్భాటంగా తర్కించే కన్నా ఎప్పటిదని భావిస్తున్నారో ఒక ముక్కలో చెప్పేస్తే అయిపోతుంది కదా!

'ఐతే ఎప్పటి పద్ధతీ అని రొకాయించకండి నాకు మట్టుకు ఏం తెలుసు? తెలీనే లేదు గనుక ఎంత తెలియదో అంత ప్రాచీనమని వూహిస్తున్నాను.'

ఇదీ జరుక్ శాస్త్రి తేల్చింది.

'ఉర్దూ భాషయేమో అనీ, బ్రాహ్మీలిపి అనేమో అనీ అప్పుడు కించ పడ్డాను గానండి, చిట్ట చివరకు ఖరోష్టిలిపి అని, తెలుగు భాష అని నిశ్చయం చేసుకున్నాను' అనడం గేలిచేయడానికే

ఇది 'కంద' శాసనం. మీద చెయ్యేయ్యగానే చెయ్యి చెయ్యంతా వాచే దురద. తప్పకుండా 'కంద' ఐతీరాలి.కంద పద్యాలతో ఉన్న శాసన మనడానికి, దురద పెట్టే కంద దుంపకు లంకె కలిపాడు.

ఇలా సాగించి.. . సాగించి చివరకు ఆ బండమీద నిత్యమూ బట్టలుతికే చాకలిది_

'యెక్కడి గుడ్డి మారాజువయ్యా? నాకు గ్యానం వొచ్చిన కాణ్ణుంచీ ఇది చాకలి రాయేగాని చదువులరాయి కాదయ్యా, యేం తంటాలు పడతావయ్యా బ్యాంబడా' అందట.

ఈ సుదీర్ఘ వ్యాసంలో జరుక్‌శాస్త్రి శాసన పరిశోధకులపట్ల భక్తి అను రక్తి చూపిస్తూనే, వినోదాత్మకంగా చురకలు కూడ అంటించాడు.

## కచేరీ కథనం :

మాచిరాజు దేవీప్రసాద్ రాసిన ఒక ప్రత్యేక శైలికి చెందిన పేరడీలల్లో 'కచేరీకథనం తెనుగులో నడిస్తే' 'కచేరీ కథనం' (కాగితాల పొదువు) 'కవి దినోత్సవం', 'సంపాదకుని లేఖలు' చెప్పకోదగినవి. వీటన్నింటిలోను అధి క్షేపం, హేళన, సంస్కరణోద్దేశం అడుగడుగున కనిపిస్తాయి.

ప్రభుత్వ వ్యవహారాలు పూర్తిగా తెలుగులో నడిస్తే ఎన్నెన్ని చిత్ర విచిత్రాలు, అనర్థాలు, అసందర్భాలు, వక్రీకరణలు సంభవిస్తాయో సోదాహరణంగా 'కచేరీ కథనం'లో మాచిరాజు దేవీప్రసాద్ చూపించాడు.

కోకిల కూతలు ప్రభుత్వ వ్యవహారాలకు ఇబ్బంది కలిగిస్తున్నాయని, వాటిమీద తగిన చర్య తీసుకోమని ఒక సబ్ ఇన్‌స్పెక్టరు పై అధికారికి ఎలా ఉత్తరం రాస్తున్నాడో గమనించండి

ఉపసూపరెంటు వసంతపుంత

అఖండపురి గార్కి ఆషాఢ బహుళ చవితి

అయ్యా

విషయము : కచేరి కాగితాల కలాపం - కాలహరణం - సంజాయిషి - వివరణ.

సందర్భము : పూర్ణానుస్వారాంచిత త్వదీయ సంజాయిషీ

పత్రం : ఆఫీసు పనికి అంతరాయము కల్పించు అవరోధములు ఇచట ఆదివారములు కాక మరి రెండు కలవు అవి:

1. చెదలు 2 కోకిలలు

అందు ద్వితీయం గురించి చెప్పవలసినది మెండు. ఈ స్టేషను పుంత మధ్యలో నిర్మింపబడి యుండుట చేత యిచటనున్న గున్నమామిడి చెట్లపై సదరు పేర్కొన్నవి మిక్కుటము పైపెచ్చు పై నెలలు చైత్ర, వైశాఖ మాసములు. చెట్లు చిగిర్చి పూలు పూయును. ఆ చిగురుటాకులపై చేరి యివి చేయు కూజితములు గానస్పందనోన్ముఖమైన నా హృదయమునకు దుర్భరములు. 'కపిలవాయి' పాత రికార్డే నన్ను ఉన్మత్తుని జేయు యిక పిక సంచయ పంచమము చెప్పనేల? అపుడు చేయి ఆడదు సరిగదా, పులి ఆఫీసులోనికి వచ్చి ననూ కాలు కదలదు. వేయేల, ఆ వేళల ఒక్క వీనులు తప్ప తక్కిన పంచేంద్రియములు పరాధీనములు ఇక ఆఫీసు పని దైవాధీనము.

కనుక ఆఫీసు పనికి అంతరాయము కల్పించు జవాబుదారీ కేవలము కోకిళ్ళది. వీటిపై పై అధికారులు తగుచర్య తీసుకొనవలసినదిగా ప్రార్థన.

సబ్ యిన్‌స్పెక్టరు
వసంతపుంత.

కోకిల అంటే ఏమిటి? స్త్రీయా? పురుషుడా? చెట్టుకొమ్మలమీద ఉంటా యంటే కొమ్మలు కొట్టాలా? చెట్లు కొట్టాలా? వాని ఆదాయాలేమిటి? వ్యయ మేమిటి? ఏ శాఖ భరించాలి? అయ్యే ఖర్చెంత? ఇలా రకరకాల అనవసర ప్రశ్నలు, సందేహాలు, నివేదికలు, పునర్నివేదికలతో స్థానిక సంస్థలనుండి, రాష్ట్ర ప్రభుత్వంనుండి కేంద్ర ప్రభుత్వందాక 'ఫైలు' నడుస్తుంది చివరికి కేంద్ర ప్రభుత్వ కార్యదర్శి, శబ్దాతీతుడైన ఒక చెమిటి సబ్ఇన్స్పెక్టరును శాశ్వతంగా వసంతపుంతకు బదిలీ చేసెద'నని ఆర్డర్ వేయడంతో వ్యవహారం ముగుస్తుంది

ఇదే ధోరణిలో- అంటే కార్యాలయ్యాల ఉత్తరాల తీరులో పాలకోడేటి సత్యనారాయణరావు ఓ పేరడీ కథ రాశాడు.[1]

పొదుపు ఉద్యమం పేరిట 'కాగితాల పొదుపు' చేయబోయి ఎంత వృధా చేస్తారో మాచిరాజు దేవీప్రసాద్ రూపకల్పనచేసి చూపాడు.

కవిత్వ ధోరణి ఉన్నవారు, గ్రాంథికభాషలో రాసేవారు, తెలుగు సాహిత్యంతో కాస్తో కూస్తో పరిచయం ఉన్నవారు కార్యాలయాల్లో ఉద్యోగులయితే వారు రాసే ఆఫీసు కాగితాల్లో భాషాపరంగా భావపరంగా ఎన్నెన్ని వింతలు విడ్డూరాలు చోటు చేసుకుంటాయో మాచిరాజు దేవీప్రసాద్ నిరూపించాడు.

సాధారణంగా పత్రికల్లో కనిపించే వ్యాపార ప్రకటనలకు, వేలంపాటలకు, ప్రశ్నలు జవాబులకు, ఉత్తరాలకు, వార్తలకు- ఇలా ప్రతిదానికి పేరడీలు కట్టి రచయితలు ఆనందించారు

## వైద్యవ్యాపార ప్రకటనలు :

వైద్య వృత్తిలో ప్రచారం నిషిద్ధం. కాని ప్రస్తుతం అన్ని రంగాలు వ్యాపారమయమై పోతున్నాయి నిబంధనలకు, నైతిక విలువలకు తిలోదకాలిచ్చి వైద్య వ్యాపార ప్రకటనలు వచ్చినా ఆశ్చర్యపోవలసిన పనిలేదంటున్నాడు డా॥ బలరామకృష్ణమూర్తి [2] సరదాగా నవ్వుకోవడానికి వైద్యవ్యాపార ప్రకటనలు

1. చెట్లు ఎండాయి, నోట్లు పండాయి- విజయ మాసపత్రిక, నవంబర్' 79.
2 స్వాతి మాసపత్రిక, మే 1988.

ఎలా ఉండవచ్చునో ఊహిస్తున్నాడాయన ప్రకటనల్లో ఆకర్షించే గుణం మౌలికంగా ఉండాలి అంత్యప్రాసలు భాషాపరంగా ఆకర్షిస్తే, డిస్కౌంట్లు, ఉచిత బహుమానాలు మనిషిని ప్రలోభపెట్టి వస్తువును కొనేలా చేస్తాయి మచ్చుకు పేపరులో. రేడియోలో వైద్య వ్యాపార ప్రకటనలు వస్తే ఎలా ఉంటాయో గమనించండి

'ఆంధ్రా ఆర్థొపెడిక్ హోమ్
మీ కాలు విరిగిందా?
లేక చేయి విరిగిందా?
ఏది విరిగినా మీకెందుకు చింత?
ఆర్థోపెడిక్ హోమ్ ఉండగా మీ చెంత!

ఒక కాలు విరిగితే దానితోపాటు విరిగిన మరోవేలుకు చికిత్స ఉచితం

త్వరపడండి!
ఈ సౌకర్యం నెల మాత్రమే.
డా॥ అతుకులరావు ఎమ్ ఎస్
అరటి తొక్కల వీధి జారుడు బజార్, విరుగుళ్ళపాడు '
'ప్రముఖ సినీనటి ఏమంటున్నారో వినండి!

'నేను మీ అభిమాన నటిని కావడాన్కి ఒకే కారణం నా అందం - నేను అందంగా ఉండడానికి కారణం- నేనెప్పుడు ఆపరేషను చేయించుకోకపోవడమే. నేను ఆపరేషన్ అవసరం లేకుండా లేసర్ క్లినిక్‌లో ట్రీట్‌మెంట్ పొందుతుంటాను అబార్షన్లుకూడా. మీరుకూడా లేసర్ క్లినిక్‌లో ట్రీట్‌మెంట్ పొందండి.

గమనిక :- ఒక అబార్షను చేయించుకొన్నవారికి ఒక లూపు ఉచితం '

ఈ ప్రకటనలో అంత్య ప్రాసలు, డిస్కౌంట్లు, అన్నీ చూడవచ్చు. ఈ సౌకర్యం నెల మాత్రమే నని కాలపరిమితి విధించడంతో ప్రకటన చూసిన వ్యక్తి తొందరపడతాడు ప్రకటన చదివాక వ్యక్తి తీరికగా ఆలోచించకుండా వెంటనే ఆ వస్తువు కొనేసెయ్యాలి ఎప్పుడైతే తీరికగా ఆలోచించాడో అప్పుడు రకరకాల సందేహాలు తలెత్తుతాయి అత్యవసరమా అని ఆలోచిస్తాడు ఇతర ఖర్చులు, తన స్తోమత మొదలైన అంశాలన్నీ పరిగణనలోనికి తీసుకొంటాడు

దాంతో ఆ వస్తువు కొనడాన్ని వాయిదావేసుకోవడమో లేక మానుకోవడమో జరిగే అవకాశముంటుంది ప్రముఖ సినీ నటీనటులను, క్రీడాకారులను ప్రకటనల్లో ఉపయోగించుకోవడానికి కారణం వారిమీద జనాలకున్న 'పిచ్చి' వ్యామోహాన్ని డబ్బు చేసుకోవడమే.

## చిట్కా వైద్యం :

* ఎప్పుడు పడితే అప్పుడు గోళ్ళు తీసుకోకండి. పనిలేనప్పుడే తీసుకోండి.
* భావకవి సమ్మేళనంతో అలసట చెందినప్పుడు ఒక తెల్లకాగితం నమిలి, చెవిలో రెండు సిరా చుక్కలు వేసుకుంటే వెంటనే ఉపశమనం కలుగుతుంది [1]

## వార్తలు :

ఊరూరా ఊరగాయలకు సింగిల్ విండో వర్తింపు.
(మా ప్రతినిధి)
విజయవాడ. మే, 30.

ఆవకాయ, గోంగూర, చింతకాయ, మాగాయ పచ్చడి తెలుగువారి అస్తిత్వ నిధాన విధానానికి ప్రధాన ఆధారాలనీ, తెలుగు గడ్డపై ఊరగాయల వెల్లువ రావాలనీ, ఇకపై తెలుగు ఆడపడుచులు సంబరాల కోసం గడప గడపా తిరిగే ప్రసక్తి లేదనీ– అన్నీ ఏక ప్రాంగణంలో దొరికేలా చెయ్యడానికి ప్రభుత్వం దృఢ చిత్తంతో వుందని చెప్పారు అంకిత భావంతో, అకుంఠిత దీక్షతో తర తరాల తెలుగు సంస్కృతిని జాడీలకు గుచ్చెత్తే తెలుగు మహిళలకు ఊరగాయల తరుణంలో రాష్ట్రప్రభుత్వం ఇస్తున్న కానుకగా దీనిని పేర్కొన్నారు. . ...

ఉచిత ఊరగాయ ఫలహార పంపిణీ పథకం ప్రతిపాదనలో ఉందన్నారు . అవసరమైతే అంగన్వాడీలు, ఇతర స్వచ్ఛంద సంస్థల సహాయాన్ని అర్థిస్తామని చెప్పారు. ఇంటిల్లిపాదికీ ఏడాది పొడుగున ప్రధాన ఆధారంగా ఉండే ఈ ఊరగాయలను బీమా చేయడానికి వీలు కల్పిస్తామని కూడా చెప్పారు.[2]

---

1. ఆంధ్రజ్యోతి వారపత్రిక 29-7-1988 రచయిత పేరు లేదు.
2 ఆంధ్రజ్యోతి వారపత్రిక 29-7-1988 రచయిత పేరులేదు.

ప్రభుత్వ పథకాలకు సంబంధించిన వార్తలకు పేరడీ ఇది. ఇక స్థానిక వార్తలకో నిదర్శనం.

'సుప్రసిద్ధ వైద్య శిఖామణి యని పేరు వడిసిన డాక్టరు కె. ఆనందరావు యం బి బి యస్. గారి దగ్గరకు ఈ సంవత్సరము మొత్తం మీద 22 మనుష్యులు శస్త్ర చికిత్సకై వెళ్ళియుండిరనియూ, సదరు డాక్టరుగారు చాక చక్యముతో ఇరవై మందికి మాత్రము శస్త్రముచేసి తక్కిన యిరువురిని శస్త్రము చేయకయే పంపివేసిరనియూ, అందులో శస్త్రము చేయబడక పంపివేయబడిన యిరువురు మాత్రం యిప్పుడు సజీవులైయున్నట్లున్నూ తెలియవచ్చుచున్నది. ఈ సందర్భమున పుర ప్రముఖులు మొన్న ఆదివారమునాడు సమావేశమై శ్రీ ఆనంద రావుగారు మిక్కిలి తెలివితేటలతోనూ దూరదృష్టితోనూ బ్రతికియున్న ఆ యిరువురికే శస్త్రము చేయక పంపివేసి ప్రాణములు రక్షించినందులకు వారిని కొనియాడుచు తీర్మానము నొక దానిని ఏకగ్రీవముగా నామోదించిరి.'

ఇది నందివాడ చిదంబరం 'సికింద్రీ పత్రిక' పేరుతో 15-2-1930 న రాయగా అక్టోబరు 30 భారతి మాస పత్రికలో వచ్చింది అప్పటికి ఆంధ్రపత్రిక తప్ప మరే తెలుగు దిన పత్రిక లేదు ఆనాటి వ్యవహార భాష గ్రాంథిక భాషయే కావడంవల్ల ఈ వార్త అంతా గ్రంథికంలోనే కొనసాగింది శస్త్ర చికిత్స (Operation) ను అప్పుడు 'శస్త్ర'మని వ్యవహరిస్తుండేవారు. ఈ పేరడీలో కించిత్ అధిక్షేపం, దాని ఫలితంగా కలిగిన హాస్యం పరితను ఆకట్టుకుంటాయి.

## బహిరంగ వేలం ప్రకటన :

పేరడీకి గురికాని వస్తువు వుండదేమో! బహిరంగ వేలం ప్రకటనలు ఏ పత్రికలోనైన గమనిస్తుంటాం. ఒక హాస్యప్రియుడు దీనిని పేరడీ చేశాడు

### బహిరంగవేలం ప్రకటన

ఉన్నది ఉన్నట్టుగా వున్నచోట షరతుపై ఈ దిగువ ఉదాహరింపబడిన సరుకు బహిరంగ వేలమునకు సిద్ధముగా నున్నది.

| వరుస సంఖ్య | సరుకు వివరం ఐటంవారీగా | బరువు కేజీలలో | దరావత్తు రూ లలో |
|---|---|---|---|
| 1 | వివిధ పత్రికల నుండి తిరిగి రాబడిన నవల వ్రాతప్రతులు (200 పేజీలు మరియు ఆపైన) | 480 | 200 |
| 2 | అసంపూర్తి నవలలు, నవలికలు వ్రాతప్రతులు చిత్తుదశలో | 260 | 100 |
| 3 | వివిధ పత్రికలు, ఆకాశవాణి, టి వి.నుండి తిరిగి వచ్చిన కథలు (10 పేజీలు మరియు ఆపైన) | 186 | 150 |
| 4 | ఇతరేతర సాహిత్యోత్పత్తులు మరియు చిల్లర ఐటమ్స్ (వంటలూ వార్పులూ చేతిపనులు అనుభవాలూ ప్రయాణాలూ, చిట్కాలు విమర్శలూ పిల్లల పెంపకం వగైరా) | 194 | 100 |

ఈ ప్రకటన వెలువడిన వారంలోగా ఉదయం 10 గం సాయంత్రం 5 గం లోగా మా సొంత గోదాములో సరుకు తనిఖీ చేసుకోవచ్చు పాడదలచిన వారు ఒక ఐటమ్‌ని పూర్తిగా పాడాల్సి వుంటుంది. సదరు వేలందార్లు పాట ఖరారు కాగానే వేలం సొమ్ము చెల్లించి సరుకు ఎత్తవలెను పై సర్కు (ఆక్టు 84 బి, ప్రకారం) అమ్మకం పన్ను మినహాయింపు కలదు

అనుమతిన సం॥

## సన్మానపత్రం :

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ చట్టచివరి నవల 'నందిగ్రామ రాజ్యం.' ఇది ఒక పౌరాణిక వ్యంగ్య నవల రావణవధానంతరం శ్రీరాముడు భరతుడు ఉన్న నందిగ్రామానికి తిరిగి వస్తాడు రాముడు అయోధ్యకు రాజుగా పట్టాభిషేకం చేసుకోవాలి. డబ్బుల్లేవు విజ్ఞాపనలు చేయడం, అర్జీలు పెట్టడం, అధికారులు కొంత కొంత కొంత డబ్బు వాయిదాలుగా ఇవ్వడం, దరఖాస్తు అంచెలంచెలుగా పై అధికారిదాక వెళ్ళి కిందివాడిదాక రావడం మన ప్రజా స్వామ్య ప్రభుత్వ పరిపాలనలో ముఖ్యమంత్రులు, మంత్రులు, అధికారులు ఎలా ఎలా పనులు చేస్తారో వ్యగ్యంగా విమర్శిస్తుంది ఈ నవల

---

29-7-88 ఆంధ్రజ్యోతి వారపత్రిక.

సుగ్రీవునికి సన్మానంచేసి 'మనీపర్స్'బహూకరిస్తే కొంత నిధి సమకూరు తుంది దాంతో శ్రీరాముని పట్టాభిషేకానికి ఆర్థిక వనరులు చేకూరుతాయన్నది ఎవరో చెప్పిన ఆలోచన సుగ్రీవునికి సన్మాన సందర్భంలో సమర్పించిన సన్మాన పత్రం ఇప్పుడు సమర్పిస్తున్న సన్మానపత్రాలను తలపింపచేస్తుంది భాగ్య నగరంలోనైనా మరెక్కడైనా సరే - రచయితలకు మంత్రులకు కళాకారు లకు ఏదో ఒక నెపంతో సన్మానం చేయడం, ఆ సన్మానంలో అతన్ని దివ్య మంగళ విగ్రహుడనీ, మనిషికాదు మనీషి అనీ విద్వాంసుడనీ నడిచే విజ్ఞాన సర్వస్వమనీ వ్యవహారదక్షుడనీ వారు వ్యక్తికాదు శక్తిఅనీ ఆకాశానికెత్తేస్తూ ఆయనకు సన్మానం అక్కరలేదు, ఆయనకు సన్మానం అంటే మనకు మనం సన్మానం చేసుకోవడం అయినా చంద్రునికో నూలుపోగులా ఈ సన్మానం అని పొగడుతూ అందంగా రాయించి ఇస్తారు 'కళాసేవ' పేరుతో హైదరాబాదులో కొన్ని సన్మానాల కంపెనీలు బాగా లాభాలు ఆర్జిస్తున్నాయి కూడ అసలు సన్మానితులే డబ్బులిచ్చి సన్మానం చేయించుకొంటారు కొన్ని సార్లన్నది కూడ వింటున్నదే గదా!

## శ్రీరాముల వారి పట్టాభిషేక మంత్రి సుగ్రీవునికి సమర్పించు సన్మాన పత్రం

**ఓ సుగ్రీవా!**

నీవు వానర రాజ్యానికి పాలకుడవు. మహావీరుడవు వానర సేనను తరలించుకొని పోయి రాముడు రాక్షస సంహారం చేయుటకు సహాయపడినావు.

**ఓయి సౌందర్య పిపాసీ!**

నీవు వాలిని గెల్చి నీ భార్యను నీవు తెచ్చుకొనటమే కాకుండా తారను కూడ తీసుకొని వచ్చావు. ఇద్దరు భార్యలను చక్కగా యేలుకుంటున్నావు

**ఓయి సుగ్రీవా!**

నీవు సంఘ సంస్కారివి. వాలి భార్యను విధవగా వుంచకుండా ఆవిడను కూడా రాణిని చేసి సంఘమునకెంతో మేలు చేశావు

**ఓయీ సూర్యసుతా!**

నీకు సూర్యుడు తండ్రి సూర్యుడిలో యెంత తేజస్సు ఉన్నదో నీలో అంత తేజస్సు వున్నది. నీ తేజస్సుతో మా సభ ధగ ధగలాడిపోతున్నది

---

నంది గ్రామరాజ్యం (1981) పుట 63.

**ఓ కపిలోక నాయకా!**

నీకు సన్మానం చేయటం మాకు మేము సన్మానం చేసుకోవటమే. నీకు నిజానికి సన్మానాలక్కరలేదు నీవంత గొప్పవాడవు.

ఇట్లు
సుగ్రీవుని సన్మాన సంఘం.

## స్వీయచరిత్ర :

జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రి 'దేవయ్య స్వీయచరిత్ర' రాశాడని చెప్తారు అది స్వీయచరిత్రలకు పేరడీ అని భావిస్తారు కాని అది అలభ్యం దానితో అందులోని విశేషాలు తెలియకుండా పోయాయి. ఉప్పలూరు వెంకట సుబ్రహ్మణ్యం రచించిన రాసభరావు ఆటోబయోగ్రఫీ (స్వీయచరిత్ర) లభించడంతో స్వీయచరిత్రలకు కూడ పేరడీ దొరికినట్లయింది. రాసభ రావు అంటే గాడిద అని అర్థం ఒక గాడిద తన వంశీకుల పుట్టుపూర్వోత్తరాలను ప్రథమ ప్రకరణంలో చెప్పింది తన తల్లిదండ్రుల పుట్టుక, బాల్యం, విద్యాభ్యాసం, యౌవనం, ఉద్యోగం - వార్ధక్యం వరుసగా నాలుగు ప్రకరణాల్లో వివరించింది. ఈ స్వీయచరిత్రకు ఒక పీఠిక కూడ తానే రాసింది

పూర్వం అష్టాదశ వర్ణనలూ ఉంటేనే కాని ప్రబంధం కానట్టుగా, నేడు పీఠిక ఉంటేనే కాని గ్రంథం కావడంలేదు గనుక ఈ పీఠిక అనే శీర్షిక క్రింద ఏదో కొంత కాగితం నలుపు చేస్తున్నాను గాని, నిజంగానే నేను పీఠికగా నా స్వీయచరిత్రకు వ్రాయవలసిన విషయం ఏమీ లేదు జంతు చండాలు లని ఇందాకా అణగదొక్కబడి ఉన్న మా జాతికి గల గౌరవం వెల్లడివరచడానికే నే నిప్పుడీ స్వీయచరిత్రం వ్రాస్తున్నాను గాని నా ప్రయోజకత్వం వెల్లడించుకోవడానికి గాదు ఈ గ్రంథం వ్రాయడానికి నన్ను ప్రోత్సాహపరచిన స్వజాతి సహోదరులకు దండాలు తండాలు

ఇట్లు
సకల చతుష్పాద జంతు విధేయుడు
గార్దభరావు పంతులు

---

1 ఆనందవాహిని సం. 1 సం. 12, 1930 డిసెంబరు.

ప్రథమ ప్రకరణము
జాతి గౌరవము

మా జాతి పురాణ ప్రసిద్ధమైనది వసుదేవుడు తన ఆపద తీరడం కోసం పూర్వం మా జాతిలో ఒక మహనీయుడి కాళ్ళు పట్టుకొన్నాడట. మా జాతి వారెవ్వరూ అబద్ధాలాడరన్న సంగతి సుప్రసిద్ధము మా పూర్వులొకరు 'గాడిద కొడకా' అని అబద్ధాలాడే మనుష్యు నొకడెవరో తిట్టగా విని విలపించినారట! అది గ్రంథస్థమైంది

క॥ ఆడిన మాటల దప్పెడు
గాడిద కొడకంచు దిట్టగా వినియయ్యో
వీడా నాకుం కొడుకని
గాడిద యేడ్చెంగదన్న ఘన సంపన్నా!

మా వంశం వారు కొండవీటి సీమలో కవీశ్వరులనిపించుకో దగినవారై ఉండే వారట! మా పూర్వీకుణ్ణి ఒకణ్ణి చూచి శ్రీనాధ కవీశ్వరుడు పద్యం చెప్పాడట.

గాడిద నీవునుం కవివి గాదుగదా అనుమానమయ్యెడిన్!

రాజసభలలో గౌరవం పొందుట చేతనే మా పూర్వులకు రాసభనామం వచ్చినట్లు ఆంధ్ర పాణిన్యాచార్యులవారు తమ యాంధ్ర వ్యాకరణ సూత్రాలలో సూత్రించినారని భాష్యకారులవారు వెల్లడించారట.

ఈ విధంగా తక్కిన అధ్యాయాలు సాగుతాయి మచ్చుకు ఇది చాలు.

## వరాన్వేషణ ప్రకటన :

వరకట్నాల వేధింపులు, డిమాండ్ చేయడం ఇప్పుడేకాదు- అర్ధ శతాబ్దం కింద కూడ బాగానే ఉంది. అందుకే 1923 లో కాళ్ళకూరి 'వర విక్రయం' నాటకం వచ్చింది. వరవిక్రయం పేరుతో ఆకాలంలోనే ఐదారు నాటకాలు వచ్చాయి. 1930 జనవరి 'ఆనంద వాహిని' మాసపత్రిక ప్రారంభ సంచికలో వరాన్వేషణ వైభవం పేర ఒక ప్రకటన కానవస్తుంది. అందులో వరుని వర కట్నాల వివరాలు పొందుపరచబడ్డాయి. ఇందులో హాస్యమేకాక కట్నాలు తీసుకోవడంపై అధిక్షేపం కూడా తొంగిచూస్తుంది

'వాయిదా పద్ధతి మీద విక్రయము', ఫోటోలో ఉన్న రూపము, బి.యల్ పరీక్షకు చదువుతున్నాడు. ప్యాసైతే హైకోర్టు జడ్జీ పదవి వరకు లభించవచ్చునని నిరీక్షింప బడుచున్నది. మొట్టమొదట రొక్కముగా అడ్వాన్సు 5000 రూపాయలున్నూ తర్వాత క్రింద కనబరచే వాయిదాల ప్రకారం శ్రావణ పండుగలో రూ1000, దీపావళి కట్నం రూ॥ 1500,ఋతుశాంతి ముహూర్తం రూ. 2500/- యిట్లు వాయిదాల మూలముగా నున్న యితర కానుకలు పుచ్చుకునేందుకు వచ్చేటప్పుడు రెండవ తరగతి రైలు చార్జిన్ని ప్రయాణం ఖర్చులున్ను.

పై ప్రకటనలో స్పష్టంగా పేర్కొన్నవి పదివేలు (5000+1000+1500+2500) కాగా ఇంకా కానుకలు తీసుకోవడానికి వస్తారట దాని రైలు చార్జీలు, ప్రయాణం ఖర్చులు భరించాలట అవన్నీ మరో 5 వేలు వేసిన 15000 రూ॥ అప్పటి కాలం కట్నంగా చెప్పవచ్చు వినోదాత్మకంగా వరకట్న ప్రకటనను అనుకరించినా అప్పటి సాంఘిక స్థితి కట్నాల రేటు తెలుసుకోవడానికి ఈ పేరడీ బాగా ఉపకరిస్తుంది.

## ఎన్నికల ప్రణాళికలు :

రాజకీయ పార్టీలు వివిధ అంశాలపై తమ విధానాలను వివరిస్తూ ఎన్నికల వేళ ప్రణాళిక (Election Manifesto) లను విడుదల చేయడం అందరికీ తెలిసినదే

'ముసగపాటి శేషాచలపతి' అనే రచయితకు గిరీశం అకస్మాత్తుగా విజయవాడ రైల్వేస్టేషన్‌లో కలిశాడు. ఆయన బుచ్చమ్మతో సహా అమెరికా ఇంగ్లాండు మొ॥ దేశాలు పర్యటించి ఆంధ్ర దేశానికి వచ్చాడట ఆ అనుభవంతో 'ప్రజాసేవపార్టీ' స్థాపించినట్లు చెప్పి ఈ వివరాలు చెప్పాడు.[1] ఈ కొత్తపార్టీకి అధ్యక్షుడు గిరీశం, కాగా కేంద్రకార్యవర్గ సభ్యులుగా శ్రీ గిరీశం, శ్రీ బారిష్టర్ పార్వతీశం, శ్రీ నాయుడు బావ, శ్రీమతి కాంతం ఏకగ్రీవంగా నిర్ణయింపబడ్డారు.

---

1 గిరీశంగారి ప్రజాసేవపార్టీ తెలుగు స్వతంత్ర 28 సెప్టెంబరు 1951

గిరీశం తన పార్టీ ప్రణాళికను ఆవిష్కరిస్తూ తమ విధానాలను ఇలా వివరించాడు.

ఇంతవరకు దేశంలో 38 పార్టీలువున్నా ఈ పార్టీ స్థాపనకు కూడ అవకాశం వుందంటె దేశంలో పరిస్థితులు ఏ విధంగా వున్నవో బుద్ధిగల ప్రతి మనిషికి తెలుస్తూనే వుంది శక్తికొలది అన్ని విధాల ప్రజలకు సేవ జేయటమే మా పార్టీ ఆదర్శం ఆంధ్రలో. అప్పుడే వేనకు వేలుగా ఈ పార్టీలో చేరుతున్నారు ఆంధ్రలో అఖండ విజయం ఈ పార్టీకే' అని గిరీశంగారి ఉపోద్ఘాత ప్రసంగం సాగుతోంది. వివిధాంశాల మీద తమ అభిప్రాయాలు ఇలా చెప్తాడు:

**ఆహార సమస్య :** దేశంలో ఈనాడు ముఖ్యంగా ఆహార సమస్యను పరిష్కరించేవి కాఫీ హోటళ్ళు ఒక నాలుగు ఇడ్లీలు, ఒక కప్పు కాఫీ త్రాగితే మనం అన్నం మానివేస్తాం (కనుక) ఒక పూట ఆహారం కాఫీ హోటళ్ళవలన సమకూరుతుంది. ఈ విధంగా చేస్తే ఆహార సమస్య చిటికెలో పరిష్కారమవుతుంది. మిగులు ధాన్యాన్ని విదేశాలకు ఎగుమతిచేసి అధిక ధరలకమ్మి లాభాలు పొందవచ్చు

**వస్త్ర సమస్య :** శ్రీమతులు బుచ్చమ్మ, కాంతం, ఎంకిగారలు ఒక కమిటీగా ఏర్పడి ఈసమస్యను గురించి ఒక సమగ్ర నివేదికను సమర్పించారు. మన స్త్రీ పురుషులకు లాగులు, గౌన్లు, చొక్కాలు నిర్ణయిస్తే గుడ్డ కావలసింది చాల తగ్గుతుంది ఇప్పటి లెక్క ప్రకారం స్త్రీకి ఏడు గజాల చీర కావాలి. లాగుకే అయితే మూడు గజాలు చాలు. అంటే నాలుగు గజాల గుడ్డ ఆదా అన్నమాట. పురుషులకు ఏడు గజాల ధోవతులు కావాలి. లాగు అయితే మూడు గజాలు చాలు అంటే వీరికి గూడ నాలుగు గజాల గుడ్డ ఆదా అన్నమాట

ఈ విధంగా కంట్రోళ్ళు, విదేశాంగ విధానం, దేశ రక్షణ, భూసంస్కరణ సాంఘిక సంస్కరణలు, నాటకాలు, భాషాప్రయుక్తరాష్ట్రాల గురించీ, గిరీశం తన అభిప్రాయాలు వెల్లడించాడు ఇంకా కావలసివస్తే గిరీశనిలయం, పార్వతీశం వీధి, మధురవాణిపురం - 6 కు లేఖ రాయాలట.

**జాతీయాలు :**

నుడికారాలు జాతీయాలు సామెతలు అనేవి ఏ భాషలోనైనా ఉంటాయి అవి ఆ భాషకు నిసర్గరమణీయమైన సౌందర్యాన్ని సహజత్వాన్ని కలుగ చేస్తాయి ఇతర భాషల్లోకి వాటిని అనువదిస్తే ఆ సౌందర్యం ప్రతిఫలించజాలదు అటువంటివాటిని కూడ పేరడీకారులు విడిచిపెట్టలేదు వాటి నిర్మాణ విధానంలో కొత్తవాటిని కల్పించారు నవ్వులు కురిపించారు ఈ రంగంలో శ్రీరమణ, శంకరనారాయణలని అతిముఖ్యులుగా చెప్పుకోవచ్చు శ్రీరమణ 'న్యూనుడులు' పేరుతో ఆంధ్రజ్యోతి వారపత్రికలో కొన్నేళ్ళు రాశాడు. అవన్నీ శ్రీరమణ హాస్యజ్యోతి ద్వితీయభాగంలో సంకలనమయ్యాయి.

ఎంత విట్టు (witt) కి అంత నవ్వు.
కవిగారి కోపం కలానికి చేటు,
కల్లో గంజో మాతో పాటు
కాసింది వెన్నెలంటే కోసి గోడౌన్‌లో పడెయ్యమన్నాట్ట.
కొండంత రచయిత్రికి కొండంత పత్రిక తేగలమా?
తంతే పోయి బారులో పడ్డట్టు
తాజెడ్డ నవల పత్రికంతా చెరచినట్టు.
తిరిగి సబ్ఎడిటరు తిరుగక రిపోర్టరు చెడతారు.
పండిత పుత్రుడు పబ్లిషరు అయినట్టు
పాళీవెళ్ళి కాగితంమీదపడ్డా కాగితం వచ్చి పాళీమీదపడ్డా
ముప్పు పాఠకులకే.
భర్త ఒకటి తలచిన భార్య వేరొకటి తలచును.
మంత్రిగారి మాటలకు అర్థాలే వేరులే.
రాజకీయమంతా విని రాజ్‌నారాయణ ఎవరని అడిగినట్టు
వెయ్యిబార్ల పూజారి

ఇలాంటి వెన్నో శ్రీరమణ సృష్టించాడు హాయిగా చదువుకొని ఆనందించాలే కాని విశ్లేషణలకు పూనుకోరాదు

శంకరనారాయణ, ఆంధ్రప్రభ దినపత్రిక ఆదివారం అనుబంధంలో 'ఫన్‌గన్' శీర్షికను కొన్నేళ్లుగా నడుపుతున్నాడు. అందులో రాజకీయ నాయకుల

ప్రవర్తనపై సుతిమెత్తగా విమర్శలు చేస్తాడు పదాల విరుపులు ఆయన వ్యాసాల్లోని ముఖ్య ప్రత్యేకత అట్లాగే 'ఫన్' పరాగ్ పేరుతో సూక్తిప్రాయాల్లాంటి రెండు మూడు వాక్యాలు ప్రతి ఆదివారం ఆంధ్రప్రభ అనుబంధంలో శంకర నారాయణ ఇస్తాడు ప్రసిద్ధ వాక్యాలను కొంచెం మార్చి విరిచి నూతనార్థం సృష్టిస్తాడు

వరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం
కొత్త జర్నలిస్టుకన్నా పాత పాఠకుడు మేలు.
బారుకు వెళ్ళడమూ 'తీర్థ'యాత్రే.
'కోడలికి చెవులుంటా'యని అత్తగారి భయం
మనిషయినా గోడయినా 'క్రాక్' అయితే కష్టం
డ్రైవర్లు ఆడేవి 'రాష్' క్రీడలు.
ఇపుడు 'యతుల' దర్శనం [illegible]
పోలీసులకు నక్సల్స్‌పై 'గన్నెర్ర'.
బావబంధాల నుంచి బయటపడలేనంటుంది మరదలు పిల్ల.
పోస్టల్ వారిది 'ఈజీ డెలివరీ'

ఈ విధంగా శంకరనారాయణ కొన్ని వందల చమత్కారాల వాక్యాలను పాఠకప్రపంచంపై విసిరి అలరించాడు

ఆంధ్రజ్యోతి వారపత్రికలో ఓ పదేళ్ళక్రితం ఇలాంటి చమత్కారాలు ప్రతి వారం వచ్చేవి

ఓటుకొచ్చి నోటు దాచినట్టు.
బావా బావా బూర్జువా అంటే రావే రావే కామ్రేడ్ అన్నట్టు
చలం పీఠిక అర్థం కానివాడు శ్రీశ్రీ మీద రిసెర్చి చేసినట్లు
చీరకడితే జయప్రద కట్టకపోతే జయమాలిని
క్షుద్రనవల రాసి ఆంజనేయస్వామివారికి అంకితం ఇచ్చినట్లు.
ఒక మందుపార్టీలో ఇద్దరు కవులు ఇమడనట్టు
ఈనాటి ప్రేయసే రేపటి రాక్షసి.

లాంటి వాటెన్నింటినో కోకొల్లలుగా ఉదాహరించవచ్చు

ఈ విధంగా వ్యక్తులు తమ అభిరుచి కొద్దీ అలవాటుకొద్దీ ఒక (ప్రత్యేకమైన) శైలికి కట్టుబడిపోయి రాసేవి, ఒక పద్ధతి, ఒక నిర్మాణ చట్రం స్థిరపడి ఉన్నవాటిని అట్లాగే అనుకరిస్తూ విధిగా రాయవలసి వచ్చేవీ సాహిత్యంలో ఉండక తప్పదు అలా ఉండడం ఎంత సహజమో వాటికి పేరడీలు రావడం కూడ అంతే సహజం. అలా ఉండడం తప్పా ఒప్పా అన్న చర్చకు వీల్లేదు. చర్చ అర్థం లేనిది.

# 31. ఇవి కావు పేరడీలు

ఎట్లాంటి అనుకరణలు పేరడీలు అవుతాయో ఎట్లాంటివి కావో 'లక్షణ పరామర్శ' చేస్తున్నప్పుడే వివరించడమైంది సాహిత్యలోకంలో పేరడీలుగా పేరు పొందినవీ, పేరడీలుగా భ్రమింపచేసేవి కొన్ని గ్రంథాలూ కవితలూ ఉన్నాయి నిజానికి అవి పేరడీలు అనిపించుకోవు. అట్లాంటి వాటిని గూర్చి ఈ అధ్యాయంలో చర్చిద్దాం

## శుక్లపక్షం :

'శుక్లపక్షం' అనంతపంతుల రామలింగస్వామి రచన భావకవిత్వం పట్ల, ముఖ్యంగా దేవులపల్లి 'కృష్ణపక్షం' పట్ల పేరడీగా దీనిని చాలమంది తలపోస్తారు కాని ఇది సరికాదు భావకవిత్వంపై రచయితకుండే అనిష్టాన్ని, అసహిష్ణుతను వెల్లడించే రచన ఇది శుక్లపక్షంలో భావకవిత్వంపై విసుర్లు కనిపిస్తాయి తప్ప పేరడీకి జీవధాతువైన 'హాస్యపూరితానుకరణ' కనిపించదు. ఈ కావ్యం తెనాలి రామకృష్ణునకు అంకితమీయబడింది విఘ్నకవి, కుకవి, వికటవర్తి, కవిరాజు, భావకవిత్వము, భావతురంగము, భావకవి, గణాధిపతి అనే 8 శీర్షికలతో కావ్యం సాగింది 'రసహీనమైన భావకవిత్వమును, భావకవుల శుష్కాడంబరమును వివరించుటలోను, సరసముగా నిరసించుటలోను కవిగారు అద్భుతమైన చమత్కారమును ప్రదర్శించినారు' అని గిడుగు సీతాపతి శుక్లపక్షానికి పీఠికను రాసి రచయితను ప్రోత్సహించారు కూడా.

'భావకవిత్వమట్లు బహుళంగుల దోఁచెడు' వినాయకుని స్తుతిస్తూ, భావకవిత్వాన్ని నిరసిస్తూ శుక్లపక్షం ఆరంభమవుతుంది కావ్యంలో చాల చోట్ల కృష్ణశాస్త్రిని అధిక్షేపించడం గోచరిస్తుంది 'శుక్లపక్షం' అనడంలోనే కృష్ణపక్షానికి ప్రతికృతి అన్నది స్పష్టమవుతుంది.

'కృష్ణపక్షాత్తకాకము' (పుట 51) అనడంలోను, 'విభావరి నా కృతినామం' (పుట 58) అనడంలోను దేవులపల్లిని తలపింపచేస్తుంది.

'అధికమాస' నామంబున నస్మదీయ
ఖండకావ్యాలుఁ గొన్నింటిఁ గడఁగి కూర్చి
యెలమి నా హొత్తమును ప్రచురించినాడ' (పుట 87)

కృష్ణశాస్త్రి పుస్తకం పేరు కృష్ణపక్షం. కనుక అది స్ఫురించేలాగ 'అధికమాసం' అని పేరుపెట్టాడు. కృష్ణశాస్త్రి కృతులు కృష్ణపక్షం, ఊర్వశి,

ప్రవాసం కలిపి కృష్ణపక్షం పేరుతో సంపుటంగా రౌతు బుక్‌డిపో వారు ప్రచురించారు. దాన్ని రచయిత హేళన చేస్తున్నాడు.

'ఎంత విచిత్రపుఁగ్రపనమియ్యది, పద్దెము నెంతగాంచినన్
నుంతయు భావగోచరత చొప్పడ' (పుట 53) దని
దేవులపల్లి కవిత్వాన్ని అధిక్షేపిస్తాడు.

ఇందులో కేవలం కృష్ణశాస్త్రిపట్ల విమర్శనేకాదు - భావకవిత్వం పట్ల, భావకవులు స్థాపించిన సంస్థలపట్ల, పత్రికల పట్ల కూడ విసుర్లు కనిపిస్తాయి

'నా మతము స్వీకరింపక నాదు సమితి
యందు సభ్యుడు గాకుండ' (పుట 81)అన్నది తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి అధ్యక్షంలో నడిచిన 'సాహితి సమితి'ని ఆటపట్టించడమే 'కవితారతి నాబడు మాసపత్రిక' (పుట 84) భావకవుల'సాహితి' మాస పత్రికయే కాని వేరు కాదు.

భావావేశ సమయమున
నేవో వ్రాసినాఁడ నిపుడడుఁగ నే
నేవిధిఁ దెలుపుదు? నీ వా
భావావేశంబు నొంది భావింపఁదగున్ (పుట 84)

అనడంలో భావకవిత్వ రచనపట్ల అధిక్షేపం సుస్పష్టం.

తెనుఁగాడుటను వ్రాయుటను తెలియన్వలె
నాంగ్ల భాషాజ్ఞానమవసరంబు
దేశాటనోత్కటావేశ ముండన్వలె
నుద్యోగమున బుద్ధియుంచరాదు
భావగీతాలను బాడుచుండన్వలెఁ
బూర్వకవులఁ దిట్టిపోయవలయు
స్వేచ్ఛా విహారంబు సేయవలెన్; సభ్య
లోకరినొకరు మెచ్చుచుండవలయు
నప్పకవి సెప్పినది యెల్ల దప్పవలయు
నరయఁగర్ణద్వయముఁ గప్పియాడుకురులఁ
బెంచవలె, నూత్న వేషంబు వేయవలయు
మా సమితి సభ్యులకు నియమంబు లివ్వి (పుట 85)

అని అనడం సాహితీ సమితి సభ్యులను, భావకవుల 'ఫ్యాషన్ల'ను హేళన చేయడమే. అయితే భావకవులు అప్పకవిని అంటే ఛందస్సున్ను తప్పలేదు; తప్పనలేదు.

కొండమీద విన్న గూగూలు!
కొండ క్రింద గన్న వాగూలూ!
అప్పన్న చెవినున్న పోగూలు!
అనవేమారెడ్డి యీగూలు! (పుట 39)

అని ఒక భావకవి అనవేమారెడ్డి ఆస్థానంలో చదివి వినిపించినట్లు, దానిని శ్రీనాథుడు వ్యాఖ్యానించినట్లు కల్పించడం భావగీతాలను ఆటపట్టించడానికే

భావకవుల గీతాలను ముఖ్యంగా కృష్ణశాస్త్రిని కృష్ణపక్షాన్ని పనిగట్టుకొని విమర్శించడమే అనంతపంతుల రామలింగస్వామి శుక్లపక్షం ఆంతర్యం ఇది ఎంతమాత్రం పేరడీ కాదు అధిక్షేప రచనగా దీనిని పరిగణించడమే సముచితం.

## కాపుబిడ్డ :

పల్లీయ సౌందర్యాన్ని తెలంగాణా బాషలో వర్ణించిన చక్కని పద్య కావ్యం 'కాపుబిడ్డ.' దీనికర్త గంగుల శాయిరెడ్డి దీనజీవితాలు, కడగండ్లు, పండ్లు ఫలాలు, వ్యవసాయపు పనిముట్లు అనావృష్టి- అతివృష్టి మొదలైనవి నిసర్గ సుందరంగా ఈ కావ్యంలో వర్ణితం

కాను బంధించి జనసేవ బూనదేని
జిహ్వచే నారుపాట్లను జెప్పదేని
యర్థు నిష్పాక్షికంబుగా నమరదేని
పుట్టనేటికి భారమై భూమిపైన - (పద్య సంఖ్య 8)

ఆపన్ననకు నిచ్చు హస్తమే హస్తంబు
పరుల మంచికి దిర్గు పదము పదము
యన్య శుభము జూచు నక్షులే యక్షులు
భువి మేలు వినగోరు చెవులు చెవులు
సర్వదోషము వీడు చర్మమే చర్మంబు
కష్టార్జితము కూడు గంజి గంజి
శ్రమముచే ప్రమాణించు శ్వాసమే శ్వాసంబు
మంది మేలును కోరు మనము మనము

లోక కల్యాణముల గోరి ప్రాకటముగ
దినము-శ్రమించు వారెసో దివ్యులరయ
వారి వారిని జేరిన వారి జేర
కర్షకా! ఘన యఘములు కలకు దొలగు (141)

ధర సేవజేయని తనువు తనువు గాదు
గాలిచే నిండిన గ్రామఫోను
కష్టంబు సేయని కరము కరముగాదు
తోలుబొమ్మకు గల తోలుకేలు
పనిబాట సేయని పదము పదముగాదు
పికిలి గుజ్జమునకు బెట్టుకాలు
జనసేవ సేయని ధనము ధనముగాదు
ఫణులు కావలియున్న మణులమూట

మేక మెడక్రింది చన్నులు లోకమునకు
కర్షకా! యుపయోగంబు గావుగాన
జగతి సేవను జేసిన జన్మ జన్మ
పరులమేలు సహించులే బరము పరము (142)

ఉదాహరించిన మూడు పద్యాలు పోతన భాగవతం పద్యాలకు అనుసరణ న్న సంగతి నిర్వివాదం అనుకరణ ఉన్నంతమాత్రాన 'పేరడీ'లుగా తల యరాదు రచయితకు పేరడీ సృష్టించాలన్న దృష్టి లేదన్నది ఒక అంశం మొత్తం కావ్యం చదువుతున్న అనుభూతిలోనే మధ్యలో వచ్చే ఈ పద్యాలను కూడ పాఠకుడు చదువుతాడు. హాస్య సన్నిహితమైన అనుభూతి ఏదీ పాఠకు కు కలగదు ఈ పద్యాలు కవిమీదనున్న పోతన ప్రభావానికి ప్రతీకలు అంతే ప్రాచీన కావ్యాలకు కూర్చిన పీఠికల్లో 'అనుసరణలు - ప్రభావాలు' అని ఒక ఉపాంశముంటుంది. దానిలో ఆ కవిపైగల పూర్వకవి ప్రభావాలను, అర్వాచీన కవులపై ఆయన చూపిన ప్రభావాలను నిరూపించే పద్యాలను పీఠికా కర్తలు సామాన్యంగా ఉదాహరిస్తుంటారు గంగల శాయిరెడ్డి రాసిన ఈ పద్యాలు కూడ అట్లాంటివే. వీటిని కనుక పేరడీలుగా నిర్ణయిస్తే పైన చెప్పిన ప్రభావాలు, అనుసరణలకు చెందినవన్నిటినీ పేరడీలుగానే భావించవలసి వస్తుంది

## కవన విజయం :

కృష్ణరాయలు 'భువన విజయం'లో అష్టదిగ్గజాలతో సారస్వత గోష్ఠులు జరపడం చారిత్రకాంశం. ఇటీవలి కాలంలో హైదరాబాదులోను; ఆంధ్ర ప్రాంతంలోను విద్వాంసులు కృష్ణరాయల అష్టదిగ్గజాల వేషాలు దాల్చి, 'భువన విజయం' పేరుతో సాహిత్య రూపకం ప్రదర్శించడం బాగా వ్యాప్తిలోకి వచ్చింది. నాగభైరవ కోటేశ్వరరావు ఆధునిక పరిస్థితుల కనుగుణంగా 'కవనవిజయం' రచించాడు. ఇందులో ఆరుద్ర సృష్టించిన క్లర్క్ సూర్యారావు ఆధునిక కృష్ణరాయలు. ఆయన కవన విజయం పేరుతో ఆధునిక భువన విజయాన్ని నిర్వహిస్తాడు. దీనిలో ఒక ప్రబంధకవి (విశ్వనాథ); భావకవి (కృష్ణశాస్త్రి); అభ్యుదయకవి (గజ్జెల మల్లారెడ్డి), దిగంబరకవి (నగ్నముని)); విప్లవకవి (శ్రీశ్రీ, ఆరుద్ర) సినీకవి (సి నారాయణరెడ్డి); హాస్యకవి (జరుక్‌శాస్త్రి) నవలా రచయిత్రి నాంచారమ్మ, (యద్దనపూడి సులోచనరాణి) -ఇట్లా ఏడుమంది కవులు, ఒక రచయిత్రి తమ రచనలను ఈ అభినవ కృష్ణరాయలకు వినిపిస్తారు.

'భువన విజయం' కృష్ణరాయలు - అష్టదిగ్గజాలను వస్తువుగా గ్రహించి నందువల్ల వస్తువుకనుగుణంగా ఆహార్యాదులతో పద్యాలతో కొనసాగుతుంది. కవనవిజయం ఆధునిక అవసరాలకు అనుగుణంగా రూపొందించబడింది. అంతే తప్ప, పేరడీ కాదు భువనవిజయం ప్రేరణలో దానికి సమాంతరంగా నాగ భైరవ 'కవన విజయం' వెలువడిందని చెప్పవచ్చు.

## అకాలజ్ఞాన తత్వాలు :

యెల్దండ రఘుమారెడ్డి శ్రీశ్రీ మహాప్రస్థానానికి ప్రతిస్పర్థతో రాసిన కావ్యం 'అకాలజ్ఞాన తత్వాలు '

ఎముకలు వంగిన
పయస్సు క్రుంగిన
త్రాగుడు మ్రింగిన
సోమరికవులూ చావండి
స్వశక్తి నిండే
సత్తువమండే
స్వయం సేవకులు లేలెండి (పుట 52)

అని శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాన్ని అనుసరిస్తూ 'మహాప్రపంచం' గేయం రాశాడు.

కదిలేది కదిలించేది కమ్మటి సీసాపద్యం
మారేదీ, మార్పించేదీ మారిన రష్యావాదం
శ్రామిక సౌభాగ్యానికి సామ్రాజ్యాధిక దాహం
ఈ దోస్తీ దస్తావేజు ఇవి కాదోయ్ సుస్నేహం
ఏ రాతలు ఎందుకు రాసెనో ఏ రష్యా ఏంజేస్తదో
బలవంతులు బలహీనుల బానిసలను జేస్తారూ
అందుకెరా అష్టాను అట్టడుగున పడుతుంటే
పోలెండు కంపూచియా పాపోసుల కిందుంటే
రష్యా నిర్మాణానికి రాళ్ళెత్తిన కార్మికులెవ్వరు?
(శీర్షిక. దాగని సత్యం, పుట 60)

ఇవన్నీ అనుకరణలే కాని రచయిత దృష్టికోణం విభిన్నం 'మార్క్స్ ఒక సాలెపురుగు ఆ పురుగు మాయాజాలంలో పుటుక్కున జారిపడ్డవాడే శ్రీశ్రీ. ఆయన మహాప్రస్థానం తెలుగు సాహిత్యంలో అనవసర స్థానం' అని యెల్దండ రఘుమారెడ్డి తలపోస్తాడు (భూమిక VI). శ్రీశ్రీ రచనలను పేరడీ చేయడం ఆయన అభిమతం కాదు సైద్ధాంతిక భేదంవల్ల శ్రీశ్రీని తార్కికంగా ఖండించడం (రచయిత దృష్టిలో), శ్రీ శ్రీ కవనాయుధాన్ని లాక్కొని అతనిపైకే ఎక్కుపెట్టడం యెల్దండ రఘుమారెడ్డి అకాలజ్ఞానతత్వాలలో జరిగింది - అంతే.

## మరోప్రస్థానం :

నాదెండ్ల రామకృష్ణశర్మ రాసిన కావ్యం 'మరోప్రస్థానం'. 'శ్రీశ్రీగారి మహాప్రస్థానం ఉండగా నా రచించిన మరోప్రస్థానం ఇంకా- ఇంకా. .. అదే ఒరవడిలో మానవత్వపు విలువలకై ప్లేటో ఆదర్శరాజ్యం కోసమై ఎన్నోఎన్నో మరోప్రస్థానాలు ముగింపు లేకుండా రావడం సహజం కదా! నిజంగా మానవత్వానికి, తద్వికాసానికి ఈ కావ్యం సోపానం కావా'లని రచయిత ఆకాంక్ష. రామకృష్ణశర్మ ఆధ్యాత్మికవాది. షిర్డీసాయిబాబా, సత్యసాయిబాబా, శ్రీరామకృష్ణ పరమహంసలపై రచనలుచేసి 'ఆత్మతృప్తి, దైవప్రీతి, సాయికృప' ఆర్జించాలనుకొనే వ్యక్తి. శ్రీశ్రీ 'మహాప్రస్థానం'లోని మహాప్రస్థానం, సాహసి, గర్జించు రష్యా, ఆః, పరాజితులు మొదలైన గీతాలను అనుకరిస్తూ ఖండికలు రాశాడు

మరో ప్రస్థానం/మరో ప్రస్థానం
మరో ప్రస్థానం చూడండి
వడిగా దూకండి/వడిగా దూసుకుపోండి
అదిగో! అదిగో! మరో ప్రస్థానం
స్వార్థం వీడండి/ఆత్మదర్శనమౌనండి
జ్యోతిరాకాశం ఛేదించండి/దైవదర్శనమౌనండి
కనబడలేదా/మరో ప్రస్థానపు సూక్ష్మరూపం!
పాంచభౌతికశరీరం/కుళ్ళును, చచ్చును, మాడును
"సాయిరాం! సాయిరాం! సాయిరాం!
సాయిరాం! సాయిరాం" అని నడవండి!

శ్రీశ్రీ మహాప్రస్థానగీతానికి ఛాయలో మరో ప్రస్థాన గీతం ఇలా సాగుతుంది:

స్పందించు భారత్/సాధించు భారత్
శాంతిశంఖం పలికించు భారత్
బహుజనస్వామ్యం భాసించు భారత్
జీవించు భారత్/జయించు భారత్

అని సాగుతుంది 'స్పందించు భారత గీతం' ఇది శ్రీశ్రీ 'గర్జించు రష్యా' గేయానికి అనుకృతి. తన ఆధ్యాత్మికతత్వాన్ని వ్యక్తీకరించడానికి ప్రసిద్ధమైన శ్రీశ్రీ కవితల బాణీలను రామకృష్ణశర్మ వినియోగించుకొన్నాడు తప్ప, పేరడీ రాయాలన్న కోర్కె ఆయనకు లేదు

## హాస్యపూర్వహాస్యపరాధ పరిశోధక కథలు :

కొడవటిగంటి కుటుంబరావు, టి వి శంకరం పేరుతో ఒకప్పుడు 'తెలుగు స్వతంత్ర' పత్రికలో సీరియల్‌గా రాసిన కథలివి కె సత్యానందం (డిటెక్టివ్ కె.యస్) బసవాని భద్రయ్య ఉరఫ్ భద్రం ప్రధాన పాత్రలు సత్యానందం విద్యాగంధం ఉన్నవాడేమీ కాదు మొదట చలనచిత్ర నటుడు కావాలని కలలుకన్నాడు అది ఫలించలేదు దాంతో పట్నానికి వెళ్ళి డిటెక్టివ్ కావాలని కలలు కంటాడు రకరకాల వింత అనుభవాలు కలుగుతాయి పాఠకులను కడుపుబ్బ నవ్విస్తాయి కొడవటిగంటి అన్నట్లు 'కె యస్ కు చదువూ సంస్కారమూ లేకపోవచ్చు కాని డిటెక్టివ్ కావాలనే అతని కాంక్షను, తీవ్రమైన ఆవేదనను ఎవరూ కాదనలేరు చివరకు అతను తాను డిటెక్టివ్ అయినట్టు కలలు కూడా కన్నాడు మేలుకొని వున్న సమయాలల్లో

తపస్సు చేశాడు. డిటెక్టివు ఛాన్సుకోసం అతను పడ్డ అగచాట్లు వర్ణనాతీతం! మానవ మాత్రుడు అంతకంటే ఇంకేమీ చెయ్యలేడు!'[1] కేతు విశ్వనాథ రెడ్డిఅన్నట్లు నాసి రకం తెలుగు డిటెక్టివు పుస్తకాలలోని నాసిరకం పరిశోధననూ, నాసిరకం కథా నిర్మాణాలనూ అపహాస్యం చేయడానికి కె. యాస్ వంటి కారికేచర్ సృష్టిని కుటుంబరావు చేశారు. మంచి డిటెక్టివ్ కథలో 'క్లూ' దొరికింపచేయడానికి ఉత్సుకతను పుట్టించే ఘటనల మధ్య ఒక బలమైన తర్కం ఉంటుంది. కె యాస్ కథల్లో తర్కబలం ఉంటుంది [2] కాని అదంతా మిథ్య, అసహజ రీతిలో సాగి నవ్వుల పాలవుతాయి.

ఈ కథల్లో అసంగతంగా, అస్వాభావికంగా పాత్రలను, సంఘటనలను చిత్రీకరించి డిటెక్టివ్ సాహిత్యాన్ని గేలిచేయడం కనిపిస్తుంది.

పేరడీ - అధిక్షేపరచన సన్నిహిత సంబంధం కలిగిన రచనా ప్రక్రియలు అధిక్షేప పరిధి పెద్దది కావడంతో అధిక్షేప రచనలు కూడ పేరడీలుగా తలపింప చేస్తుంటాయి కొడవటిగంటి 'హపరాధ హపూర్వ పరిశోధక కథలు'లో అధిక్షేప హాస్య ధర్మాలే అధికంగా చోటుచేసుకోవడంతో పేరడీ లక్షణాలు మిళితమయ్యేయే కాని పూర్తి పేరడీ రచనలు కాదన్న నిర్ణయానికి రావలసి వచ్చింది అయితే వింత భూకంపం, ఆకాశంలో హక్సిడెంటు కథలు రెండూ పేరడీలు

ఐక్యరాజ్య సమితి అని కూడ సరిగా ఉచ్చరించలేని, 'హోం మంత్రి' పదవి ఐక్యరాజ్య సమితిలో ఉండదని తెలియని ఈ చవట కె యాస్‌కు, ఐక్యరాజ్యసమితి కార్యదర్శి ఫోన్‌చేసి ఆటంబాంబులు ఎత్తుకుపోతున్న వాళ్ళని పట్టుకోమని అర్థిస్తాడు పక్కగదిలోకి వెళ్ళినంత సునాయాసంగా ఈ డిటెక్టివ్ 'సెక్రటీ' ఉండే ఇంట్లోకి పోతాడు గూర్ఖా నవ్వి 'తమ పేరు జగత్ప్రసిద్ధం కాని కాని తమ దర్శనం ఇదే ప్రథమం చాల సంతోషం అని లోపలికి పంపిస్తాడు

---

1 కుటుంబరావు సాహిత్యం - ఆరవ సంపుటం (11989) పీఠికలో

2 కుటుంబరావు సాహిత్యం - ఆరవ సంపుటం 1989 పీఠికలో

బెనిలక్సు ప్రధాని వస్తే, గూర్ఖా గేటువద్దనే ఆపేస్తాడు. అంత గొప్పవాడవు తాడు అన్నమాట కె.యస్.[1]

అట్లాగే వింత భూకంపం[2] కథలో బర్మా మైసూరు బెంగుళూరు ఢిల్లీ ఈ డిటెక్టివ్ వెళ్తాడు. చివరికి పద్మావతిది ఆత్మహత్య అని తేలుస్తాడు. ఈ డిటెక్టివ్ ఎక్కడ వెళ్ళితే అక్కడ ప్రతివారు ఆయన కోసం కాచుకూర్చు న్నట్లు ఉంటారు. హోటల్ మేనేజర్ పద్మావతిని 'పదిహేడేళ్ళ అయిదునెల్ల మూడు రోజుల క్రితం ఈ హోటలుకు వాళ్ళ నాన్నతో వచ్చిన అమ్మాయేగా?' అని అడుగుతారు. ఈ కాల వివరం ఎంత అస్వాభావికంగా ఉందో వేరే చెప్ప వలసిన పనిలేదు.

'కేయాస్ మెదడులో దీపారాధన వెలుగుతున్నది నూనె కెరటాలు మెదడుని అటూ ఇటూ తాకుతున్నాయి' లాంటి వర్ణనాత్మక వాక్యాలు చచ్చు డిటెక్టివ్‌లలో కనిపించే వాక్యాలకు వాతలు.

అవాస్తవికత అసహజాలతో ఉండే డిటెక్టివ్‌లకు కొడవటిగంటి చేసిన పేరడీలివి. ఈ ఒక్కటే కాదు, పేరడీలుగా అందరిచేత ఒప్పుకోబడుతూ పేరడీలుకాని అధిక్షేప రచనలు తెలుగు సాహిత్యంలో చాలానే ఉన్నాయి

పేరడీ ఎప్పుడైనా గంభీరమైన వస్తువునే ఆలంబనగా చేసుకొని పుడుతుంది. మాతృకలో గాంభీర్యం లేకుండా హాస్యలక్షణాలే అధికంగా చోటుచేసుకొన్నపుడు దానికి పేరడీ పుట్టడానికి వీల్లేదు. దానిని మూలాన్ని అనుసరిస్తూ వెలువడిన మరో రచనగా భావించవలసివుంటుంది,

వేమరాజు నరసింహారావు 'రత్నమాల'లో గిరీశం, రామప్ప పంతులు, కాంతం, జంఘాలశాస్త్రిలను [illegible] రచనలు చేశాడు. ముళ్ళపూడి ద్వారా 'గిరీశం లెక్చర్లు' దంచాడు అయల సోమయాజుల నాగేశ్వరరావు 'మరో జంఘాలశాస్త్రి' అయ్యాడు వీటన్నింటిని పేరడీలుగాకాక 'అనుకృత రచనలు' లేదా ఆదర్శానుకరణలు (Ideal imitation) గానే తలపోయడానికి హేతువు మాతృకలు హాస్యప్రధానాలు కావడమే

కన్యాశుల్కానికి పొడిగింపుగా గోవిందరాజుల సుబ్బారావు 'గిరీశం పునరాగమనం', కె నిర్మలాదేవి 'తదనంతరం' (16-5-1986 ఆంధ్రజ్యోతి వారపత్రిక) రాశారు ప్రఖ్యాతమైన ఒక నాటకాన్ని అదే యాసతో పెంచి రాయడమే రచయిత లక్ష్యం కాని, పేరడీ సృష్టించడం వారి అభిమతం కాదు

1. ఆకాశంలో హాక్సిడెంట్ కథ కుటుంబరావు సాహిత్యం - ఆరవ సంపుటం పుట 481
2. వింత భూకంపం ,, పుట 460.

శ్రీశ్రీ, అబ్బూరి వరదరాజేశ్వరరావు, ఆరుద్రలు సంయుక్తంగా 'మేమే' అనే ఒక అర్థంపర్థంలేని సుదీర్ఘ కవిత 1953 లో రాస్తే, 1954 లో ముద్రిత మైంది. శ్రీశ్రీ సాహిత్య సర్వస్వంలో తర్వాత ఈ కవిత 'సిప్రాలి'లో చేర్చ బడింది. దీనిని అనుసరిస్తూ వేమరాజు నరసింహారావు 'మనమే' అనే పేర ఓ ఖండిక రాశాడు దానిని రచయితే పేరడీగా పేర్కొని 'ప్రేమోపహారం' అనే స్వీయ కవితా సంకలనంలో చేర్చాడు.

| మేమే | మనమే |
| --- | --- |
| సిరిసిరిమువ్వలం | నవ్వని పువ్వులం |
| చెరిగిన దవ్వులం | వరమీయని వేలుపులం |
| మృత్యువు పెరట్లో | అణగారని మంటలం |
| మందార పువ్వులం | పొగచూరిన బతుకులం |
| భగవంతుని వితంతువులం | చదవని కావ్యాలం |
| భాషించే జంతువులం | అతకని వాక్యాలం |
| . ... . | ... ... . |
| ... ... | . ... |
| అల్లసాని వాడలం | మృత్యువు అడవిలో |
| చింతాకు పతకాలం | పాడే చెంచులం |
| సిగ్గుమాలిన శతకాలం | భగవంతుని ముద్దాయిలం |
| కుట్టే ఉల్లిపాయలం | ముద్దొచ్చే మొద్దబ్బాయిలం |
| కొండలమధ్య లోయలం | కుళ్ళిపోయిన వంకాయలం |
| .... . . | . .. .. |
| .. . | . . .. |
| చీకటి పిలుపులం | నవ్వని పువ్వులం |
| భగవంతుని ప్యాస్‌పోర్టులం | వరమీయని వేలుపులం |
| నీరజాక్షుల బుగ్గలం | అణగారని మంటలం |
| నోట్లో పిల్లి మొగ్గలం | శృంఖలాబద్ధులం |

ఈ 'మేమే'కు 'మనమే'ను ఏ సూత్రాలుతో పేరడీగా నిర్ణయించగలం? అనుకరణ సమానమే కావచ్చు. మాతృకకు భిన్నమైన అనుభూతిని ఏదీ ఇవ్వడం లేదు కారణం మాతృక గంభీరమైంది కాకపోవడం, నవ్వించేది కావడం. అందు వల్ల 'మనమే'ను పేరడీగా అంగీకరించరాదు

ఈ విధంగా అధిక్షేపాత్మకానుకరణలు, ఆదర్శానుకరణలు, తాత్విక భేదంతో చేసే అనుకరణలు, హాస్య రచనలకు చేసే అనుకరణలు ఎన్నో సాహితీ లోకంలో ఉంటాయి. వాటన్నింటిని శాస్త్రీయంగా చర్చించేటప్పుడు పేరడీలుగా భావించరాదు.

**

# 32. సారాంశం

సాహిత్యంలో అనుకరణం రెండు రకాలు. పూర్వకవుల ప్రతిభకూ, పద్యరచనా నైపుణ్యానికీ పొంగిపోయి వారి రచన లాగే రచన చేయడం, ఒక దృక్పథానికి చెందిన కవి రచనల బాణీలు ప్రసిద్ధమైతే వాటిని తద్భిన్నమైన సిద్ధాంతాల వారు ఉపయోగించుకోవడం ఇవన్నీ ఒకరకమైన ఆదర్శానుకరణలు (Ideal imitations) అలా కాకుండా ఒక రచయిత శైలీ విన్యాసాలను, అభిరుచులను విలోమమార్గంగా విషయాంతరంతో హేళనాత్మకంగా అధిక్షేపాత్మకంగా మాతృక వెంటనే స్ఫురించే విధంగా చేసే ఎకటానుకరణలు (Ridiculas imitations) పేరడీలు

పేరడీకర్త - కావాలని ప్రసిద్ధ పద్యాలనే ఎన్నుకొని ఒకటీ అరా వర్ణాలు, పదాలు మార్చివేసి నూతనార్థం వచ్చేలా పేరడీ సృష్టిస్తాడు దీనిని గ్రంథ చౌర్యంగా తలపోయరాదు

రచయితల్లో మామూలుగా కనిపించే వైయక్తిక వైపరీత్యం (Eccentricity) నమ్మకాలు (Sentimentalism) శబ్దలౌల్యం (Pedantry) నిస్తేజత (Dullness), పటాటోపం (Pompourness) స్వీయోత్కర్ష (Self importence) మొ॥ లక్షణాలు పేరడీ రాయడానికి పురికొల్పుతాయి. మాతృకలోని వస్తువు (content)కు రచనా పద్ధతికి మధ్య ఉండే సమన్వయాన్ని సమతౌల్యాన్ని భగ్నం చేయడం ప్రధానంగా పేరడీలో జరుగుతుంది

పేరడీ రచయిత ఏకకాలంలో పాఠకునిగాను, రచయితగాను దర్శనమిస్తాడు పాఠకుడు ఏకకాలంలో రెండు గ్రంథాలను (Two Text Worlds) చదవగలుగుతాడు ఇది పేరడీ ప్రక్రియ విశిష్ట లక్షణాల్లో ఒకటి

పేరడీకి రకరకాలుగా తెలుగు పేర్లు పెట్టారు. కాని పేరడీ అన్న ఆంగ్ల పదమే సుబోధకంగా ఉండి ప్రచారంలో ఉంది కనక పేరడీ అని వ్యవహరించడమే సముచితం.

పేరడీని 1 ధ్వన్యాశ్రయ (Phonic); 2. సంశ్లిష్ట వర్ణాశ్రయ (Suprasegmental) 3 పదాశ్రయ (Morphological) 4. పాదాశ్రయ, (Syntactical) 5 ప్రక్రియాశ్రయ (Genric) 6. శైలీగత (Stylistic) 7. వైయక్తిక (Individual), వస్త్వాశ్రయ (Thematic), 9. విలోమ (Inverted) పేరడీలని తొమ్మిది భాగాలు చేయవచ్చు.

ధ్వన్యాశ్రయ పేరడీయే మిమిక్రీ కళగా ప్రసిద్ధి గడించింది. మిమిక్రీకి అక్షరరూపం పేరడీ.

భారతీయ సాహిత్యానికైనా, ఆంధ్ర సాహిత్యానికైనా ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ పురుషార్థ సాధనయే గమ్యం. ఉదాత్తత, ఆదర్శవాదం భారతీయ సాహిత్యానికి మూలసూత్రం. ఈ లక్ష్యంతో వెలువడిన సాహిత్యం కావడంతో శృంగార, వీర రసాలకు, భక్తితత్వాలకు సమధిక ప్రాధాన్యం కలగడం సహజం అందువల్లనే పూర్వ సాహిత్యంలో హాస్యరసానికి చోటు లేకపోయింది. ఎక్కడయినా అరకొరగా విదూషకునిలో కనబడుతుందనుకున్నా భోజన ప్రియత్వం, వెకిలిమాటలుతప్ప మరోరకమయిన హాస్యం అంతగా లేదనే చెప్పాలి. హాస్యంలో అంతర్భాగమయిన పేరడీకూడా ప్రాచీన సాహిత్యంలో స్వల్పమే. అట్లాగని పూర్తిగా లేదని చెప్పలేం ఆధునికుల రచనలు 'పేరడీ' రాస్తున్నామనుకుని (Concious గా) రాసేవి కావడంవల్ల పేరడీ లక్షణాలన్నింటికి ఒదిగిపోతాయి ప్రాచీన రచయితలు తమ ధోరణిలో తాము అనుకరించారు హేళన చేశారు. కాని పేరడీకి నిదర్శనంగా తమ రచన నిలవాలన్న తలంపుతో రాసినవారు కాదు మనం మన అవసరంకొద్దీ ప్రాచీన రచనల్లో పేరడీ కానీ పేరడీ సదృశాలు కానీ ఏ విధంగా ఉన్నాయో పరిశీలిస్తున్నామన్న విషయం విస్మరించరాదు క్రీడాభిరామంతో అంకురించి చాటుపద్యాలతో వికసించి చంద్రరేఖా విలాపంతో వృక్షమై ఆధునికుల గద్యపద్య రచనలతో ఫలపుష్ప సమన్వితమై శాఖోపశాఖలుగా పేరడీ విస్తరించింది.

సాంఘిక సంప్రదాయాలను, శ్రీనాథుని రచనలను ఆటపట్టించడానికి క్రీడాభిరామకర్త పేరడీ రూపంలో కొంత ప్రయత్నం చేశాడు. మొల్ల తదితర కవులను పేరడీచేసి స్వాతిశయాన్ని చాటుకొన్న తెనాలి రామకృష్ణుడు

తెలుగులో ప్రథమ పేరడీ కవి అయ్యాడు. స్వాగ్రహోపశమనార్థం ప్రతీకారేచ్ఛతో కూచిమంచి జగ్గకవి పేరడీ చేశాడు. ధార్మికాగ్రహంతో సాహిత్య సంస్కార ణోద్దేశంతో స్వార్థనిరపేక్షకంగా కందుకూరి వీరేశలింగం, విష్ణుభట్ల సుబ్రహ్మ ణేశ్వరకవి ప్రబంధ ప్రక్రియను పేరడీ చేశారు.

పాశ్చాత్య భావజాలం ప్రభావంతో తెలుగు సాహిత్యంలో 'ఆధునికత్వం' చోటు చేసుకొంది. దాంతో రకరకాల ప్రక్రియలు తెలుగులోకి మనకు మొదటి నుండీ ఉన్నా ఆంగ్ల సాహిత్య పరిచయానంతరమే పేరడీ ప్రక్రియరూపంగా స్థిరపడింది. నవల, నాటకం, వ్యాసం, కథ మొ॥ గద్య ప్రక్రియలకన్నా పేరడీ రచయితలను కవిత్వమే బాగా ఆకర్షించింది. కవిత్వానికి త్వరగా ఆకట్టుకొనే లక్షణం ఉండడమే కాక కథ, నవల మొ॥ ప్రక్రియలతో పోలిస్తే ఆకృతిలో చిన్నదిగా ఉండడం కూడా హేతువు జరుక్‌శాస్త్రి, మాచిరాజు దేవీప్రసాద్ పేరడీకి పర్యాయమై నిలిచారు. శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాలు విరివిగా పేరడీకి గురయ్యాయి జరుక్‌శాస్త్రి, మాచిరాజు దేవీప్రసాద్, జొన్నవిత్తుల రామ లింగేశ్వరరావు మొ॥ వారెందరో ఆ గీతాలకు పేరడీలు రాశారు. కాట్రగడ్డ ఏకంగా ఆ గీతాలన్నింటిని పేరడీ చేస్తూ పుస్తకమే ప్రకటించాడు. దీనికి కారణం మహాప్రస్థానంలోని పదగుంఫనం, ఆవేగమేనని చెప్పవచ్చు. సుమతి శతకం, కవి చౌడప్ప శతకం, భాగవతం పద్యాలకు వచ్చిన పేరడీలు కూడా పేర్కొనదగినవి దైవస్తుతికే పరిమితమైన దండకాలు, సుప్రభాతాలకు విలోమ పేరడీలను సృష్టించి కవులు ఆనందించారు పైన పేర్కొన్నవారేగాక శ్రీశ్రీ, అబ్బూరి. దాశరథి, ఆరుద్ర లాంటి సుప్రసిద్ధకవులు కూడ పేరడీపై మక్కువ చూపించారు

యండమూరి వీరేంద్రనాథ్ 'తులసిదళం' నవలకు శ్రీమతి సంగీతారెడ్డి రాసిన 'వేపమండలు' తెలుగులో ప్రక్రియాగతంగాను వస్త్వాశ్రయరీతిలోను వెలువడిన ప్రథమ సమగ్ర పేరడీ నవల కథాకథనంలోను పాత్రల పేర్లలోను చిత్రీకరణలోను శైలీగతమైన 'మేనరిజమ్స్'లోను తులసి దళాన్ని వికటంగా ఓచంబిస్తూ వెలువడిన నవల వేపమండలు 'తులసిదళం' పట్ల సాహిత్య విమ ర్శగా పనిచేయడమే కాకుండా దానిమీద వచ్చిన విమర్శలను తిప్పికొట్టిన బల మైన ప్రతివిమర్శగా కూడ పనిచేయడం గమనార్హం మాతృకా విమర్శకులకు

జవాబుదారిగా పేరడీ ప్రక్రియను ఉపయోగించుకోవడం 'వేపమండలు' ప్రత్యే కత. విశ్వనాథ, అడవి బాపిరాజు మొదలుకొని యద్దనపూడి సులోచనారాణి వరకు నవలా రచనను శ్రీరమణ అనుకరించి చూపాడు. ఒకే అంశాన్ని గ్రహించి దానిని వివిధ రచయితలు ఎలా అనుకరిస్తారో శ్రీరమణ చూపడం వల్ల పాఠకు లకు ఆ రచయితల శైలీభేదాలను పోల్చి చూచుకోవడం; వారి 'మేనరిజమ్స్' గ్రహించడం సుకరమైంది పేరడీలో ఇదొక ప్రయోగం తర్వాత చాలా మంది శ్రీరమణ దారిలో పయనించారు.

తెలుగులో పేరడీ కథలు చాలా తక్కువే కథ నిడివి ఎక్కువ కావడం హేతువు కావచ్చు. మునిమాణిక్యం మామూలు కుటుంబ జీవితాన్ని కైఫి యత్‌ల ధోరణిలో వర్ణించి పేరడీకి బీజాలు వేశాడు ముళ్ళపూడి వెంకట రమ ణకు పేరడీ కథలు రాయడంలో అగ్రతాంబూలం లభిస్తుంది. ముళ్ళపూడి 'ఋణానందలహరి' గ్రంథమే కాదు, గ్రంథ నామం కూడా పేరడీయే. భాగవత పద్యాలకు పేరడీలను ఋణానందలహరికి అవతారికగా కూర్చడమే కాకుండా పదబంధాల్లోను, పదాల విరుపుల్లోను, వాక్చమత్కారాల్లోను, నుడికారాల్లోను, సామెతల్లోను, కథాకల్పనంలోను పేరడీని ప్రయోజనాత్మకంగా ప్రయోగిం చాడు. ముళ్ళపూడి శైలిని అనుకరిస్తూ శరచ్చంద్ర పేరడీ కథ రాశాడు. విశ్వ నాథ గద్యశైలి విశిష్టమైంది. పి. ఎస్. గోపాలకృష్ణ మానవాతీతమైన పునర్జ న్మను వస్తువును చేసి విశ్వనాథ శైలిలో విశ్వనాథకు సమాంతరమైన భావాలను పేరడీలో ప్రవేశపెట్టాడు తెలుగు పేరడీల్లో వస్త్వాశ్రయ పేరడీ (Thematic-Parody)కి చక్కని నిదర్శనం గోపాలకృష్ణ 'పునరపి జననం' కథ. అట్లాగే 'అనామకుడు' రాసిన 'శీలమా నీ పేరేమిటి'? విశ్వనాథ శైలితో విశ్వనాథ భావాలకు విరుద్ధంగా సాగుతూ ఒక సామాజిక సమస్యకు పరిష్కారాన్ని సూచిం చింది. వడ్డెంపూడి ఫణిభూషణ్ సంసారం కూడ కర్మాగారం లాంటిదే, అందు లోను సమ్మెలుంటాయని కుటుంబాన్ని కార్మిక సంఘాలతో ముడిపెట్టి పేరడీ కథలో చమత్కరించాడు.

పత్రికలు దీక్షగా గాలిస్తే మరికొన్ని పేరడీలు దొరకగలవు

తెలుగు నాటక రంగంలో సృజనాత్మకత లోపించి ఒక మూసకథ, మూస పాత్రలు, మూస డైలాగులు, అవాస్తవికమైన వేదాంతం, పేలవమైన హాస్యం, అతినటన దర్శకత్వంలోను, నటనలోను ఎన్నో లోపాలు తలెత్తడం మొదలైంది. నాటక రంగానికి చెందిన అన్ని అంశాలను యండమూరి వీరేంద్రనాథ్ తన 'చీమ కుట్టిన నాటకం'లో అధిక్షేపాత్మకంగా సంస్కరణోద్దేశంతో పేరడీ చేశాడు.

జానపద గేయాల్లోనూ పేరడీ స్వల్పంగా ఉంది. కవిత, నవల, కథ, నాటకం లాంటి ప్రక్రియల్లోనే కాక చిట్టిపొట్టి పేరడీలెన్నోవచ్చాయి. అభినందన లేఖలో, ప్రేమలేఖలో, కార్యాలయ ఉత్తరాలో, ప్రశ్నాపత్రాలో ఇలా రకరకాల రూపాలలో పేరడీలు వచ్చాయి చిలకమర్తి లక్ష్మీనరసింహం పేరడీ అని పేరు పెట్టకుండా పాతికవరకు పేరడీలు సృష్టించాడు.

భావకవిత్వంపై వ్యతిరేకతతో వచ్చిన శుక్లపక్షం; శ్రీ శ్రీ దృక్పథానికి భిన్నంగా శ్రీశ్రీ మార్గంలో వచ్చిన అకాలజ్ఞానతత్వాలు, మరో ప్రస్థానంలాంటి వాటిని పేరడీలుగా చాలమంది తలపోస్తుంటారు. కాని అది సరికాదు.

వివిధ వార పక్ష మాసపత్రికల్లో, ఆంధ్రజ్యోతి వారపత్రికలో పేరడీలు అసంఖ్యాకంగా వచ్చాయి. పేరడీ స్వరూప స్వభావాల విశ్లేషణకు ఇవి ఎంత గానో తోడ్పడతాయి

రచయితల రచనల్లోని ఒక ధోరణిని, తాత్త్విక చిత్తవృత్తిని- వినోదాత్మకంగా అనుకరిస్తూ అధిక్షేపిస్తున్నట్లు కనిపిస్తూనే ప్రశంసించే విచిత్ర కవితా ప్రక్రియ పేరడీ. మాతృకారచయితపట్ల సాహిత్య విమర్శగాను అభిమాన వ్యక్తీకరణంగాను, పాఠకునిపట్ల ఆనందాన్ని పంచే రసవత్కవితగాను ఏకకాలంలో దర్శనమిచ్చే విశిష్ట సాహితీరూపం పేరడీ.

**

# పేరడీ వాఙ్మయ సూచిక

## A. పేరడీ కావ్యాలు - కవితా సంకలనాలు

ఇలిశ్రీ. **కుమతీశతకం** (సుమతీ శతక పద్యాలకు పేరడీలు) **7-1-32/4,** ఫ్లాట్ నం **2,** బేగంపేట, హైద్రాబాదు, **1989.**

కాట్రగడ్డ **మహోగ్రతాపం - గీతాలు** కవితాజ్వాల పబ్లికేషన్స్, అశోక్‌నగర్, ఏలూరు, **1983** (శ్రీశ్రీ మహాప్రస్థానం గీతాలన్నింటికి పేరడీలు)

జగ్గకవి, కూచిమంచి. **చంద్రరేఖా విలాపము,** కామ్యగ్రంథమాల, పుదుచ్చేరి 1912 [ప్రబంధశైలికి పేరడీ.]

రమణారెడ్డి, కె వి. (సం॥) **జరుక్‌శాస్త్రి పేరడీలు - ఇతర కవితలు** నవోదయ పబ్లిషర్స్, విజయవాడ, 1982. (దీనిలో స్వీయ కవితలేకాక శ్రీశ్రీ, మల్లవరపు, నాయని, వేంకట పార్వతీశ్వరకవులు, కృష్ణశాస్త్రి మొదలగు వారి గీతాలకు, రాయప్రోలు, విశ్వనాథల శైలికి పేరడీలున్నాయి )

రాధాకృష్ణ, బూదరాజు (సం॥) **మాచిరాజు దేవీప్రసాద్ పేరడీలు** శ్రీశ్రీ స్మారక సంస్థ, హైదరాబాదు **1986** (దీనిలో స్వీయకవితలేగాక శ్రీశ్రీ, నాయని గీతాలకు, విశ్వనాథ, నాయని, శ్రీశ్రీల శైలికి పేరడీలున్నాయి

వీరేశలింగం, కందుకూరి. **అభాగ్యోపాఖ్యానము,** హితకారిణి సమాజము, రాజమండ్రి. (పబంధ శైలికి పేరడీ.)

వీరరాజు కవి, మానవరం. పాప చిన్నోపాఖ్యానము, **శతకరత్నావళి,** రెంటల **సుబ్బారావు** (సం॥) విక్టోరియా డిపో ప్రచురణలు, మైలాపూరు, మద్రాసు, **1929.**

సుబ్రహ్మణ్యేశ్వర కవి, పిష్ణుభట్ల. **దుర్మార్గ చరిత్ర,** మంజువాణి ముద్రాక్షరశాల, ఏలూరు 1908.

## B. పేరడీ దండకాలు

| దండకం పేరు | రచయిత | మూలగ్రంథం |
|---|---|---|
| కిళ్ళీ దండకం | కలిగొట్ల గోపాలశర్మ | ఆంధ్రజ్యోతి (వార) 29-7-1988 |
| కాఫీ దండకం | కవిసింహకాశీపతి | కవిసింహకాశీపతి |
| సీన్మాతార దండకం | | తమాషా పిట్టకథలు |
| దోమదండకం | భమిడిపాటి కామేశ్వరరావు | అందాల తెలుగు కథ |
| తిట్ల దండకం | పోలిపెద్ది వెంకటరాయకవి | తెలుగులో తిట్టుకవిత్వం |
| వెట్టివాని పాట | సురవరం ప్రతాపరెడ్డి | సురవరం ప్రతాపరెడ్డి జీవితము - రచనలు |
| ఓటు దండకం | ,, | హాస్యతోరణము |
| వత్సలసుప్రభాతం | నాయని సుబ్బారావు | నాయని సుబ్బారావు కృతులు - పరిశీలన |
| లండన్ సంకల్పం | చిలకమర్తి | చిలకమర్తి ప్రహసనాలు |

—ఇలా గాలిస్తే మరెన్ని దొరుకుతాయో!

## C. కవితలు

| క్రమ సంఖ్య | మాతృక కర్త | మాతృక | పేరడీ రచయిత | పేరడీ శీర్షిక | ఆకరం |
|---|---|---|---|---|---|
| 1. | గురజాడ అప్పారావు | దేశభక్తి (ముత్యాల సరాలు) | జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు | యథాశక్తి | 15-2-1985 ఆంధ్ర జ్యోతి (వారపత్రిక) |
| 2. | ,, | ,, | పులికొండ సుబ్బాచారి | 'దేశ' భక్తి | సెప్టెంబరు, అక్టోబరు 1986 సాధన (మాస) |
| 3. | రాయప్రోలు సుబ్బారావు | జన్మభూమి (ఆంధ్రావళి) | ద్వా.నా. శాస్త్రి | లేజి విద్యార్థి | సమాధిలో స్వగతాలు (కవితా సంకలనం) |
| 4 | ,, | ,, | ఎస్వీ సత్యనారాయణ | జన్మభూమి | ఉద్యమం పాటలు |
| 5. | ,, | ,, | అకవులు | ఖర్మభూమి | 18-8-1989 ఆంధ్ర జ్యోతి (వార) |
| 6. | పిఠాపురం యువరాజు | ఆ లోకంనుండి ఆహ్వానంవంటి గీతాలకు | జరుక్ శాస్త్రి | మద్రాసు భావకవి ప్రణయ గీతం | 8-4-83 ఆంధ్రజ్యోతి (వార) |
| 7. | దేవులపల్లి కృష్ణశాస్త్రి | ఏల ప్రేమింతును (కృష్ణపక్షం) | జొన్నవిత్తుల రామలింగేశ్వర రావు | సందియము | 8-4-83 ఆంధ్రజ్యోతి (వార) |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 8. | దేవులపల్లి | ఏల ప్రేమింతును | పార్వతి | విదూషకుని ప్రేమలేఖ | 10.1.88 ఆంధ్రప్రభ (దిన) |
| 9 | శ్రీరంగం నారాయణబాబు | ప్రకృతిలో బీభత్సం (వలపు చెలిమలు) | భాగవతుల సుబ్రహ్మణ్యం | సమీక్షోత్సాహం | 21.7.89 ఆంధ్రపత్రిక (వార) |
| 10 | శ్రీశ్రీ | ఋక్కులు (మహాప్రస్థానం) | విద్యారణ్య కామ్లేకర్ | సినిమామయం | 19.3.82 ఆంధ్రజ్యోతి (వార) |
| 11. | ,, | ,, | వి.వి. సుబ్బారావు | రుక్కులు | 9.3.84 ఆంధ్రజ్యోతి (వార) |
| 12. | ,, | ,, | గూటూరి | చిక్కులు | 21.6.85 ఆంధ్రజ్యోతి (వార) |
| 13. | శ్రీశ్రీ | ఋక్కులు | ఆర్. సుదర్శన్ | ఆరాజకీయ రుక్కులు | 21.12.89 పల్లకి (వార) |
| 14 | ,, | అవతలి గట్టు | అండా రామారావు | అవతలి పార్టీ | 7.1.1983 ఆంధ్ర జ్యోతి (వార) |
| | ,, | | | | |
| 15. | ,, | ,, | బి. విజయశేఖర్ | అవతలి పార్టీ | మార్చి'85 అంకితం (మాస) |
| 16. | ,, | ఐ | ప్రసేన్ | సినిమాటో బయో గ్రపీ | 9.7.86 ఆంధ్రప్రభ (వార) |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 17. | శ్రీశ్రీ | ఏపీతల్లి | శ్రీశ్రీ ఆర్ద్ర | ఏపితల్లీ నిరుడు కురిసిన హిమ సమూహములు | సిప్రాలి |
| 18. | ,, | ,, | | గతజల సేతుబంధనం | కల్పన (కవితా సంకలన) |
| 19. | ,, | ,, | సి హెచ్. చంద్రమౌళి | మూగవోయిన విధానసభ | 16.3.72 ఆంధ్రభూమి. (దిన) |
| 20. | ,, | ,, | అబ్బూరి | ఏపితల్లీ | 28.11.89 ఆంధ్ర భూమి (దిన) |
| 21. | ,, | దేశచరిత్రలు | జాగర్లపూడి సత్యనారాయణ | దేశ(ం)చరిత్రలు | 30.3.89 ఉదయం (వార) |
| 22. | ,, | ,, | పురాణం సీత | సీన్మా చరిత్రలు | జలతరంగిణి (నవల) |
| 23. | ,, | ఆవతారం | జొన్నవిత్తుల | అవసరం | 1.7.83 ఆంధ్రజ్యోతి (వార) |
| 24. | ,, | జయభేరి | ,, | గుండుభేరి | 24.12.82 ఆంధ్ర జ్యోతి (వార) |
| 25 | ,, | ప్రతిజ్ఞ | ,, | ప్రతిష్ఠ | 11.5.84 ఆంధ్రజ్యోతి (వార) |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 26 | శ్రీశ్రీ | మహాప్రస్థానం | జొన్నవిత్తుల | మహాప్రతిష్ఠానం | అక్టోబర్ 84 ఆంధ్ర జ్యోతి వారపత్రిక దీపావళి సంచిక. |
| 26, | శ్రీశ్రీ | మహాప్రస్థానం | కమలారాం | మరో పిశాచం | 5.12.85 పల్లకి (వార) |
| 27 | ,, | ప్రాసక్రీడలు | రమణ | శ్రీశ్రీ ప్రాసక్రీడలకు అనుకరణ | 8.5.88 ఆంధ్రజ్యోతి (వార) |
| 28. | ,, | అల్లాటప్పా | వింజరపు సత్యానంద్ | షోకు | 17.2.84 ఆంధ్రజ్యోతి (వార) |
| 29. | ,, | దేశ చరిత్రలు | అనాన్ | శ్రీ పేరడీ శ్రీ | 29.7.88 ఆంధ్రజ్యోతి (వార) |
| 30. | ,, | — | ఆర్. నరసింహారావు | 'విశ్వ'రూపం | 29.7.88 ఆంధ్రజ్యోతి (వార) |
| 31. | దాశరథి | చంద్రోదయం (అగ్నిధార) | భాగవతుల సుబ్రహ్మణ్యం | ఖూనీకోర్ | 21.7.89 ఆంధ్రపత్రిక (వార) |
| 32. | ఆరుద్ర | నీవు నన్ను ప్రేమిస్తే | జొన్నవిత్తుల | పీ. బూ. దే. | 17.7.83 ఆంధ్రజ్యోతి (వార) |
| 33. | ,, | ఎడబాటు కాటు | భాగవతుల సుబ్రహ్మణ్యం | టెల్గూ సెల్ఫ్ పోర్ట్రయిటు | 21.7.89 ఆంధ్రపత్రిక (వార) |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 34 | దేవరకొండ బాలగంగాధర తిలక్ | అమృతంకురిసినరాత్రి | వీరపల్లె వీణావాణి | ఆకలికరిచినరాత్రి | 30.9.83 ఆంధ్రజ్యోతి (వార) |
| 35. | ,, | ,, | పార్వతి | విదూషకుని ప్రేమలేఖ | 10.1.88 ఆంధ్రప్రభ (దిన) |
| 36 | .. | ప్రార్థన | ద్రాక్షారాం | ప్రార్థన | 2.7.82 ఆంధ్రజ్యోతి (వార) |
| 37 | బైరాగి | నాకొ్రంచెం నమ్మకమివ్వు | వజ్రపాణి | నాకూ్రడా చిరుధాన్నివ్వు | 27.8.88 మయూరి (వార) |
| 38. | ఎల్లోరా | లే! రా! నడు! ఆగు! (నిశ్శబ్ద తరంగాలు) | భాగవతుల సుబ్రహ్మణ్యం | స్టాప్! లుక్ ప్రొసీడ్ | 21.7.89 ఆంధ్రపత్రిక (వార) |
| 39. | కొండేపూడి నిర్మల | వోణీ | ప్రకాశరావు | విప్లవవోణి | 19.5.89 ఆంధ్రజ్యోతి |
| 40. | ,, | ,, | చేరా | కుండ | 2.6.89 ,, |
| 41. | — | చందమామరావే (బాలల గేయం) | ఎన్. రూప | సమకాలీన గేయం | 24.9.82 ఆంధ్రజ్యోతి |
| 42. | పోతన | చేతవెన్న ముద్ద | దేవరాజు మహారాజు | బాల - చిచ్చ | 30.5.86 ,, |
| 43. | పోతన | భాగవతం పద్యాలు | వెలుదండ నిత్యానందరావు | రాజకీయ భాగోతం | 14.12.82 నుండి 6.1.83 వరకు ఆంధ్రప్రభ (దిన) |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 44. | పోతన | ఇంతింతై వటుడింతయై (భాగవత పద్యం) | పాయల సత్యనారాయణ | నేటి మహిళ | 15-1-88 ఆంధ్రజ్యోతి (వార) |
| 45. | ,, | ఎవ్వనిచే జనించు | బంకుపల్లి పార్వతీశ్వర శాస్త్రి | ఋణార్తారావం | 23-4-82 ఆంధ్రజ్యోతి (వార) |
| 46. | అన్నమాచార్య | కొలనుదోపరికి గొబ్బిళ్ళో | ఎ. వి వి యస్ ప్రసాదు | కొత్తపాట | 18-1-85 ఆంధ్రజ్యోతి (వార) |
| 47. | పోలిపెద్ది వెంకటరాయ కవి | తండ్రి మధ్వాచారి .. (వేణుగోపాల శతకం 38 వ పద్యం.) | దాశరథి | పొలిటికేషన్ | డిశంబర్, 84 హాస్యప్రియ మాసపత్రిక |
| 48. | బద్దెన | సుమతీశతకం | పులికొండ సుబ్బాచారి | పేరడీలు | జనవరి, ఫిబ్రవరి, మార్చి, ఏప్రిలు, 86. సాధన (మాస) |
| 49. | ,, | ,, | ఐతా చంద్రయ్య | పేరడీలు | జనవరి 1990 సాధన. |
| 50. | కవి చౌడప్ప | కవి చౌడప్ప శతక పద్యాలు | పులికొండ సుబ్బాచారి | పేరడీ 'క'ందాలు | ఆగష్టు, 89 సాధన (మాస) |

ఇంతకు రెట్టింపు ఉండగలవన్న అంశం విస్మరించవద్దు.

# వచనంలో పేరడీలు

## ఎ. నవల

సంగీతారెడ్డి **వేపమండలు** (యండమూరి వీరేంద్రనాథ్ తులసిదళం నవలకు పేరడీ)
నవభారత్ బుక్ హౌస్, విజయవాడ 1986.

## బి. నాటకాలు

యండమూరి వీరేంద్రనాథ్ **చీమకుట్టిన నాటకం** (సగటు తెలుగు నాటకానికి పేరడీ) శ్రీరామ బుక్ డిపో, విజయవాడ 1978.

## సి. కథలు

అనామకుడు 'శిలమా నీ పేరేమిటి?' ఆంధ్రజ్యోతి వారపత్రిక 21-6-1985.

మునిమాణిక్యం నరసింహరావు **కాంతం క్రైఫీయతు** (క్రైఫీయత్‌లకు) **కోర్టులో కాంతం**(కోర్టు శైలికి) (కాంతం క్రైఫీయత్) 1937 యువకారాలయ ప్రచురణం **దర్బారు** కథ (క్రైఫీయత్‌లకు) మునిమాణిక్యం కథలుశి

కుటుంబరావు, కొడవటిగంటి **వింత భూకంపం, ఆకాశంలో హాక్సిడెంటు** (డిటెక్టివు కథల శైలికి) హపూర్వ హపరాదక పరిశోధక కథలు కుటుంబరావు సాహిత్యం ఆరవ సంపుటం విశాలాంధ్ర 1989.

గోపాలకృష్ణ, పి.ఎస్. **'పునరపి జననం పునరపి మరణం'**(విశ్వనాథ శైలికి) 25-4-80 ఆంధ్రజ్యోతి వారపత్రిక.

**పణిభూషణ్**, వడ్డెంపూడి **'సంసారంలో నమ్మె నోటీసులు'** 28-4-89 స్వాతి వార పత్రిక.

శంకు, **పార్వతి మళ్ళీపుట్టింది** (దేవదాసు కథకు) 15-9-77 నుండి 24-11-77 వరకు 7 సంచికల్లో ఆంధ్రభూమి వారపత్రికలో ధారావాహిక

శరచ్చంద్ర, 'ఫిబ్రవరి 30' (ముళ్ళపూడి శైలికి) 3-3-89 ఆంధ్రజ్యోతి వార పత్రిక.

## డి. సంకనాలు

శ్రీరమణ **శ్రీరమణ పేరడీలు** నవోదయ పబ్లిషర్స్ విజయవాడ 1980.
(దీనిలో వివిధ రచయితల గద్యశైలులు పేరడీ చేయబడ్డాయి.)
దేవీప్రసాద్, మాచిరాజు **తెలుగు పేరడీలు** (బూదరాజు రాధాకృష్ణ సం॥)
నవయుగ బుక్‌హౌస్ హైదరాబాదు 1986.
శ్రీరమణ **హాస్యజ్యోతి** - 2 నవోదయ పబ్లిషర్స్ విజయవాడ 1987.
(న్యూనుడుల పేరుతో నానుడులకు వక్రీకరణలున్నాయి )

## ఇ. పేరడీలు

గోపాలచక్రవర్తి 'రచయిత్రితో ఇంటర్వ్యూ' (ఇంటర్వ్యూల పద్ధతికి)
,, 'వార్తలు చదువుతున్నది' (రేడియో వార్తలకు)
,, 'ఇక్కడ పీరికలు వ్రాయబడును' (విశ్వనాథ, దివాకర్ల మొ॥ పీరికలను)
పై మూడు **గోలాయణం** (1982) ఐ. జె 3, ఎర్రమంజిల్ హైదరాబాదు
చిదంబరము, నందివాడ, సినింద్రీ పత్రిక (పత్రికావార్తలకు) అక్టోబర్ 1930.
భారతి మాసపత్రిక (హాస్యతోరణము - 1982)లో పునర్ముద్రితం ఆం.ప్ర.
సాహిత్య అకాడమి హైదరాబాదు.
తిలక్, మందడి. 'సమీక్ష' [ఉషశ్రీ, లల్లాదేవి, చివుకుల పురుషోత్తం, ఎన్నార్
నంది ప్రభృతులు సినిమాను సమీక్షించే పద్ధతి] 18.8.82 ఆంధ్రప్రభ
తిలక్, మందడి పేరడీతో డిడిక్కులు [దాసరి నారాయణరావు మాలతీ
చందూర్ కాశీపట్నం మొ॥ వారి లేఖా రచనకు] 16 7.82 ఆంధ్రజ్యోతి
వారపత్రిక.
,, 'పేరడీ' [యండమూరి, ముళ్ళపూడి, విశ్వనాథ మొ॥ వారు I A. S.
ఇంటర్వ్యూ నిర్వహించే తీరు] 23.4.82 ఆంధ్రజ్యోతి వారపత్రిక.
ద్వా.నా శాస్త్రి 'సినారెకు జ్ఞానపీఠ్ అవార్డు' [శ్రీశ్రీ, శేషేంద్ర, విశ్వనాథ మొ॥
వారి ప్రతిస్పందన] 13.10.84 ఉదయం వారపత్రిక
నిరంజన్ 'హాస్యరచనలో సాధక బాధకాలు' మార్చి'48 భారతి మాసపత్రిక.
పావనిశాస్త్రి, విశ్వనాథ 'పేరడీ గురించి విశ్వనాథ' [విశ్వనాథ తన ధోరణిలో
పేరడీని వ్యాఖ్యానించడం] 28.5.82 ఆంధ్రజ్యోతి వారపత్రిక.
బలరామమూర్తి 'వైద్యవ్యాపార ప్రకటనలు' మే 1988 స్వాతి మాసపత్రిక.

**లక్ష్మీనరసింహం, చిలకమర్తి** ·

చాకలి పురాణం - పురాణ కథల శైలికి
మారీచస్మృతి - స్మృతుల శైలికి
దివాలాదేవి వ్రతకల్పం - సత్యనారాయణస్వామి వ్రత కథలకు
కలిగీత - భగవద్గీతకు
రాక్షస సాధారణ
ప్రమాదీచ పంచాంగ ఫలితాలు - పంచాంగంలో చెప్పే సం॥ర ఫలితాలకు
యక్షప్రశ్నలు - భారతంలో యక్షుడు ధర్మరాజు నడిగిన ప్రశ్నల శైలికి
వ్యాపార ప్రకటనలు - ఉత్పత్తుల అమ్మకాలకు
ఔషధ ప్రకటనలు - మందుల అమ్మకాలకు
గోసాయి చిట్కాలు - చిట్కామందుల అమ్మకాలకు
పుస్తక ప్రకటన - కావ్యాల అమ్మకాలకు
తోకచుక్కలు - తోకచుక్క రావడంవల్ల కలుగుతాయనిచెప్పే అరిష్టాలకు
సప్తగ్రహ కూటమి - సప్తగ్రహకూటమి రావడంవల్ల కలుగుతాయనిచెప్పే అరిష్టాలకు
పిలునామ - పిలునామాలు రాసే విధానానికి
పితృదేవతల మహజరు - కార్యాలయానికి అర్జీలు పెట్టుకొనే విధానానికి
ఎన్నికలు - తమకే ఓటెయ్యాల్సిందని ఓటర్లను అడిగే విధానానికి
ఆకాశ విశ్వవిద్యాలయం - పరీక్షపత్రాలకు
చిలకమర్తి ప్రహసనములు, కొండపల్లి వీరవెంకయ్య&సన్స్, రాజమండ్రి.

**మూర్తి**, కె ఆర్ 'మహీపాలుని మహాప్రస్థానము' [విశ్వనాథ శైలికి] 14-5-86 ఉదయం దినపత్రిక.

**వెంకట సుబ్రహ్మణ్యము, ఉప్పులూరు** 'రాసభరావు పంతులుగారి ఆటోబయాగ్రఫీ' (గాడిద జీవిత చరిత్ర) ఆనందవాహిని డిసెంబరు 1930

**విశ్వం, సూరంపూడి** అఖిలాంధ్ర హాస్యరచయితల మహాసభ 22-7 88 ఆంధ్రజ్యోతి వారపత్రిక

,, '**పేరడీ**' [ముళ్ళపూడి, యండమూరి ,రావిశాస్త్రి మొ॥వారు దిగులుగా నున్న ఓ యువకుని వర్ణించడం] ఆంధ్రజ్యోతి వారపత్రిక

వెంకటేశ్వర్లు, జీ 'సీత గీత దాటేస్తే' [యండమూరి, చందు సోంబాబు మొ॥ రాముడు లేడిని తీసుకొని రావడానికి అడవికి వెళ్ళగా సీత లక్ష్మణరేఖను దాటిన సన్నివేశాన్ని వర్ణించడం] 22-8-85 పల్లకి వారపత్రిక

శేషాచలపతి, మునగపాటి, 'గిరీశం ప్రజాసేవ పార్టీ' (ఎలక్షను ప్రణాళికల శైలికి) తెలుగు స్వతంత్ర సెప్టెంబరు 28, 1951

సత్యనారాయణరావు, పాలకోడేటి 'చెట్లు ఎండాయి - నోట్లు పండాయి' (కార్యాలయ ఉత్తరాలకు) విజయ మాసపత్రిక నవంబరు 1979.

సత్యనారాయణ, విశ్వనాధ 'సన్మానపత్రం' (నందిగ్రామరాజ్యం) నవల 1981

శ్రీరమణ 'రైలు బండిలో వైతాళికులు' [విశ్వనాథ, కాటూరి, పింగళి, రాయప్రోలు, చలం మొ॥ రైలులో కలిస్తే మాట్లాడుకొనే సన్నివేశం.] 24-1-86 ఆంధ్రజ్యోతి వారపత్రిక.

,, 'బాపుగారికి అభినందన' (విశ్వనాథశైలి) ? ఆంధ్రజ్యోతి వారపత్రిక.

,, 'నారాయణ కల్పవృక్షం [విశ్వనాథ శైలిలో ఆరుద్రను అభినందిస్తూ] 1-9-85 ఆంధ్రజ్యోతి దినపత్రిక.

సుబ్బారావు, చందు, శ్రీశ్రీకి నోబెల్ బహుమతి వస్తే [పురిపండా, విశ్వనాథ, బంగోరె, ఆరుద్ర ప్రభృతుల ప్రతిస్పందన] 17-6-88 ఆంధ్రజ్యోతి వారపత్రిక.

అజ్ఞాత కర్తృకాలు - 'ఊరూరా ఊరగాయలకు సింగిల్‌విండో వర్తింపు' (దినపత్రికల వార్తలకు) 29-7-88 ఆంధ్రజ్యోతి వారపత్రిక

అజ్ఞాత కర్తృకాలు - బహిరంగవేలం ప్రకటన 29-7-88 ఆంధ్రజ్యోతి వారపత్రిక

,, 'అనుశీలన' [బాపును అభినందిస్తూ విశ్వనాథ పేరుతోనే వచ్చింది] 7-1-83 ఆంధ్రజ్యోతి వారపత్రిక.

,, వరాన్వేషణ వైభవము (పెళ్ళికొడుకుల కట్నాల రేట్ల ప్రకటన) ఆనంద వాహిని 1-1 1930.)

వివిధ పత్రికల్లోను, సంకలనాల్లోను ఇలాంటి పేరడీలు కోకొల్లలుగా లభిస్తాయి.

# తోడ్పడిన పుస్తకాలు

అమరేంద్ర, కోత్వాలు **తెలుగులో ప్యారడీ కవిత్వం** [శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం ఎం ఫిల్ సిద్ధాంతవ్యాసం] అముద్రితం.

గోపాలచక్రవర్తి **గోలాయణం** ఐ జె-3, ఎర్రమంజిల్, హైదరాబాదు, 1982

చెన్నకేశవరెడ్డి, జి **ఆధునికాంధ్ర గేయకవిత్వం** జయమిత్ర పబ్లికేషన్స్, MIG II 13-15/F 12, బాగ్‌లింగంపల్లి, హైదరాబాదు, 1989

తాయారమ్మ, వేదవల్లి, **తెలుగు సాహిత్యంలో హాస్యరసము**, అద్దేపల్లి & కో. రాజమహేంద్రవరం, 1968.

దొరసామిశర్మ, రావూరి. **తెలుగులో తిట్టు కవిత్వము** ఎమెస్కో, మద్రాసు, 1968.

నరసింహారావు, మునిమాణిక్యం. **మన హాస్యం**, ఆంధ్ర సారస్వత పరిషత్, హైదరాబాదు, 1968.

నారాయణరెడ్డి, సి **ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు ప్రయోగములు.** విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌజ్, హైదరాబాదు, 1989 (తృతీయ ముద్రణ)

బాలగంగాధర తిలక్, దేవరకొండ **అమృతం కురిసిన రాత్రి.** విశాలాంధ్ర, పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1972.

భూమయ్య, అనుమాండ్ల. **నాయని సుబ్బారావు కృతులు - పరిశీలన.** ఏ లక్ష్మి, 5 8-56 లష్కర్‌బజార్, హనుమకొండ, 1981.

మాధవరావు, రామగిరి **మునిమాణిక్య దీధితులు.** ఆర్ మాధవరావు, 3-4-15 లింగంపల్లి, హైదనాబాదు - 27

ముద్దుకృష్ణ. **వైతాళికులు** విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ (4 వ ముద్రణ) హైద్రాబాద్ 1957.

రఘుమారెడ్డి, యెల్దండ **అకాలజ్ఞాన తత్వాలు** గురుకులపీఠం ప్రచురణలు, యెల్దండ, మ నగర్ జిల్లా, 1982.

రామకృష్ణశర్మ, నాదెండ్ల **మరో ప్రస్థానం** 2-1-332/1/7, నల్లకుంట, హైదరాబాదు, 1989

రామలింగస్వామి, అనంతపంతుల **శుక్లపక్షం.** రాజన్ ఎలక్ట్రిక్ ప్రెస్, రాజమహేంద్రవరం, 1932

రామారావు ఎస్ వి 'రమణీయహాస్యం' **అన్వీక్షణం** 6-3-23/2, న్యూబోయి గూడ, సికింద్రాబాదు 1984.

రామిరెడ్డి, ముద్దసాని **సురవరం ప్రతాపరెడ్డి జీవితము, రచనలు** ఆంధ్ర సారస్వత పరిషత్, హైద్రాబాదు 1974.

లక్ష్మీకాంతం, పింగళి **ఆంధ్ర సాహిత్య చరిత్ర,** ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, 1970

వరద రాజేశ్వరరావు **కవనకుతూహలం,** 1989.

వల్లభరాయడు, వినుకొండ **క్రీడాభిరామము,** ఎమెస్కో ప్రచురణ, సికింద్రాబాదు, 1976

విశ్వనాథరెడ్డి, కేతు (సం॥) **కుటుంబరావు సాహిత్యం,** ఆరవసంపుటం విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైద్రాబాదు, 1989.

వీరేంద్రనాథ్, యండమూరి **తులసిదళం** నవభారత్ బుక్‌హౌస్, విజయవాడ, 1981

వెంకటరమణ, ముళ్ళపూడి **ఋణానందలహరి,** నవోదయ పబ్లిషర్స్, విజయవాడ 1986

వెంకటరమణ, ముళ్ళపూడి, **జనతా ఎక్స్‌ప్రెస్,** నవోదయ పబ్లిషర్స్, విజయవాడ, 1979.

వెంకటరమణ, ముళ్ళపూడి. **రాజకీయ భేతాళ పంచవింశతిక,** నవోదయ పబ్లిషర్స్, విజయవాడ, 1975

వెంకటరమణ, ముళ్ళపూడి, **సీతాకళ్యాణం,** నవోదయ పబ్లిషర్స్, విజయవాడ, 1982.

శాయిరెడ్డి, గంగుల, **కాపుబిడ్డ,** రాజశ్రీ కళాపీఠం, సికింద్రాబాదు 1950.

శేషగిరిరావు, ఆంధ్ర 'ఆంధ్ర సారస్వతము - హాస్య రసము' **ఆంధ్ర సారస్వత వ్యాసావళి**, ఆంధ్రభూమి బుక్ డిపో, వేపేరి, మదరాసు 1952.
శేషేంద్ర శర్మ, గుంటూరు 'ఆంధ్రసాహిత్యంలో హాస్యరసం' **సాహిత్యకౌముది** ఆంధ్రసారస్వత పరిషత్, హైద్రాబాదు 1968
శ్రీనివాసాచార్యులు, బొమ్మకంటి మొ॥. (సం॥) **తెలుగు చాటువు** కళ్యాణి ప్రచురణలు 33, గజపతిలాలాలేన్ మద్రాసు, 1983.
శ్రీ శ్రీ, **మహాప్రస్థానం** విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, హైదరాబాదు, 1975
శ్రీ శ్రీ సిప్రాలి విరసం ప్రచురణలు 1987
సంగమేశం, ముట్నూరు, **తెలుగు హాస్యం** ఆంధ్ర సారస్వత పరిషత్ హైదరాబాదు, 1954
సత్యనారాయణ, పి **ఆంధ్రప్రదేశ్ ఎన్నికలు.** (1956 - 1983) సౌత్ఇండియా పబ్లికేషన్స్, C-10/1, కాకతీయ నగర్, హైదరాబాదు, 1984
సత్యనారాయణ శాస్త్రి, వేదుల **దీపావళి** ఎమెస్కో పబ్లికేషన్స్, సికింద్రాబాదు, 1974.
సుధ, సూరంపూడి, **జరుక్ శాస్త్రి పేరడీలు - ఒక పరిశీలన.** 10-5-7/7, మాసబ్ టాంక్, హైద్రాబాదు-28 1989.
సుబ్రహ్మణ్యం, జి వి మొ॥ (సం). **మహతి** యువభారతి, కింగ్స్‌వే,సికింద్రాబాదు, 1972

ప్రాసంగికంగా అనేక ప్రాచీన ఆధునిక కావ్యాల నుండి పద్యాలెన్నో ఉదాహరింపబడ్డాయి ఆ గ్రంథాలేవీ పేరడీకి నేరుగా ఉపయోగింపబడేవి కావు కనుక వాటిని ఇక్కడ పేర్కొనలేదు. అట్లాగే 'వాఙ్మయ సూచిక'లో చేరిన గ్రంథాలను కూడ ఇక్కడ చేర్చలేదు.

## వ్యాసాలు

అం సూ తొలినాటి తెలుగు కవితలో హాస్యం, ఆంధ్రజ్యోతి వారపత్రిక, 29-1-1988

అమరేంద్ర, వికటకవి జరుక్ శాస్త్రి, ఆంధ్రప్రభ దినపత్రిక, 5-3-1981,

అమరేంద్ర, కోత్వాలు పేరడీ కవిత్వంలో సామాజిక దృక్పథం, ఆంధ్రపత్రిక దినపత్రిక 14; 21, 28-8-1989

ఆంధ్రప్రభ ప్రతినిధి శ్రీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి ఆకస్మిక మృతి, ఆంధ్రప్రభ దినపత్రిక 21-7-1968

కనక్ ప్రవాసి సుప్రసిద్ధ కథకులు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి పేరడీశాస్త్రి జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి లేఖలు భారతి మాసపత్రిక జూన్, 1982.

కుటుంబరావు, బొడ్డపాటి, వ్యంగ్యము : అర్వాచీనాంధ్రము, సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం 1971

కోటిరెడ్డి, బత్తుల తెలుగులో ప్యారడీ కవిత్వం, స్రవంతి మాసపత్రిక జులై 1973

తిరుమలరావు, సర్దేశాయి 'తెలుగులో పేరడీ కవిత్వం వ్రాసిన కవి ఎవరు?' ఆంధ్రపత్రిక దినపత్రిక, 21-8-1988.

,, పేరడీ కావ్య మీమాంస, ఆంధ్రపత్రిక దినపత్రిక 11-9-89

దేవీప్రసాదు, మాచిరాజు వికటత్వం (Parody) ప్రతిభ నవమ వార్షికోత్సవ సంచిక ఏప్రిలు, 1943.

నమశ్శివాయ. మాయమర్మం ఎరుగని స్నేహపాత్రుడు జలసూత్రం. ఆంధ్రప్రభ దినపత్రిక 24-7-1968

సిత్యానందరావు, వెలుదండ పేరడీల వీరుడు జరుక్ శాస్త్రి, ఆంధ్రప్రభ దినపత్రిక 18-7-1982.

,, జరుక్ శాస్త్రి పేరడీ - ఒక విశ్లేషణ, ఉదయం దినపత్రిక 7-8-1989

,, పేరడీమేస్త్రి - జరుక్ శాస్త్రి. వివేచన ఉస్మానియా విశ్వవిద్యాలయం, తెలుగుశాఖ పదమూడవ సంచిక 1988-89

ప్రసాదరాయ కులపతి, కవితా మహేంద్రజాలం, ఆంధ్రప్రభ వారపత్రిక, 5-4-89.

రంగనాథరావు, పన్యాల, పేరడీ కథా కమామిషు, ఆంధ్రప్రభ వారపత్రిక 13-1-1982

వరదరాజేశ్వరరావు, అబ్బూరి జరుక్‌శాస్త్రి. ఆంధ్రప్రభ వారపత్రిక, 1 10-12 1980

విశ్వనాథరెడ్డి, కేతు. రహదార్లు (మాచిరాజు దేవీప్రసాద్ శ్రీశ్రీ 'దేశచరిత్ర'లకు రాసిన పేరడీని విశ్లేషిస్తు కూర్చిన పాఠం) బియ్యే ద్వితీయ సం॥రం తెలుగు పాఠ్యగ్రంథం, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైద్రాబాదు 1986

వెంకట సత్యనారాయణరావు, రావూరి. వంద చందమామలు, శ్రీనివాస సాహితీ సమితి, హైదరాబాదు (1982)

వెంకట రామకృష్ణ కవులు ఆంధ్రకవుల అపరాధములు ఆంధ్ర పత్రిక స్వర్ణోత్సవ సంచిక, 1965.

వేంకటేశ్వరరావు, రెంటాల. పేరడీ రచనలు-ఒక పరిశీలన ఆంధ్రజ్యోతి దినపత్రిక, 31-8-1987

,, అధిక్షేపం తెలుగు మాసపత్రిక నవంబర్ 1990.

,, ఆధునిక తెలుగు సాహిత్యంలో అధిక్షేపధోరణులు - కందుకూరి తెలుగు మాసపత్రిక ఫిబ్రవరి 1993.

,, ఏది పేరడీ? ఏదీ నిర్వచనం? ఆంధ్రప్రభ దినపత్రిక 4-10-1993

,, మరుగున పడిన మంచి పేరడీలు - విశాలాంధ్ర దినపత్రిక 17-12-92.

,, అనుదాత్తీకరణ,బర్‌లెస్క్ అధిక్షేపం-తెలుగు మాసపత్రిక ఏప్రిలు 1993

శివప్రసాద్, ముదిగొండ, పారడీతో సాహిత్యాన్ని ప్లావితం చేసిన జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి కృష్ణాపత్రిక వారపత్రిక, 3-8-1968

శివరామారావు, వింజమూరి, పారడీలో పాతకొత్తలు మేళవించిన జరుక్. ఆంధ్రప్రభ దినపత్రిక, 21-7-1968

సత్యనారాయణ, విశ్వనాథ. 'జరుక్‌శాస్త్రి మరణానికి శ్రద్ధాంజలి ఘటిస్తూ ఇచ్చిన సందేశం' వాణి ఆకాశవాణి మాసపత్రిక ఆగష్టు, 1968.

సుబ్బరామశాస్త్రి, పైడిపాటి, ప్రతిభాశాలి జలసూత్రం, ఆంధ్రప్రభ దినపత్రిక 24-7-1968.

# ENGLISH

1 Abrahams M H (1983) **A Glossary of Literary terms**. Macmillan, p p 17-19

2 Dane Joseph A (1980) "Parody and Satire A Theoritical Model" **Genre** 13, 145-59

3 Hutcheon, Linda (1984) **A Theory of Parody**. London· Methuen

4 Kiremidjian, G D. (1969) "The Aesthetics of Parody" **Journal of Aesthatics and Art criticism, 20.** p p. 231-42

5. Nash Walter, (1987) "Allusion and Parody", **The Language of Humor** England, Longman Group, UK Ltd p p 74-102.

6 Poirier, Richard (1968) "The Politics of Self Parody" **Partisan Review,** 35, 339-53

7. Preminger Alex (Ed) (1975) **Princeton Encyclope– dia of Poetry and Poetics,** London· The Macmillan Press Ltd. p p 88, 89 & 600 to 602

8 Rose, Margaret (1979) **Parody/Metafiction**. London: Croom Helm.

9. Sternerg S. H (19 ) **Cassells Encyclopadia of Literature** p p 405-407

10 Wells, C (1919) **A Parody Anthology** Newyork, Sereber.

11 —— (1929) The Encyclopadia of Britanica Vol. 17, 14 Edition, pp. 333-400.

